

ఖుజారాకడనున్న జైయిను దేవాలయము.

ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురములు. 12.

# అశోకుని చరిత్రము.

స్కూళ్ల సూపరువయిజరుపని చేసి ఉపకార
వేతనమును బుచ్చుకొనుచున్న,
చేతపూడి లక్ష్మీకాంతరావుగారిచే
రచియింపఁబడి

ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము
(లిమిటెడ్) వారిచే
ప్రకటింపఁబడి

చెన్నపురి:
శ్రీ "వైజయంతీ" ముద్రాశాలయందు
ముద్రింపఁబడినది.

1910.

కాపిరైట్. దీని వెల రు. 1-4-0.

# ఉపోద్ఘాతము.

—•—

## గ్రంథవిషయౌత్కృష్ట్యము.

శ్రీ సంశోభితులు, సకలగుణగణాలంకరిష్ణులు, లోకోపకారకార్య నిర్వహణపరాయణులు, స్వప్రయోజనపరత్వశూన్యులు, నై యా చంద్రతారార్కంబగు కీర్తింగాంచి, సర్వదేశ సర్వకాల సర్వసజ్జన సంస్తోత్రపాత్రులయిన మహాపురుషుల జీవితంబులు, సర్వకాల సర్వావస్థలయందు, స్పృహణీయంబులు, శ్రవణీయంబులు, మఱి పఠనీయంబులగుఁ గాదా; ఇట్టి మహానుభావులలో, మహాపురుషులలోఁ గీర్తిశేషులలో నశోక ధరణీధవుం డగ్రగణ్యుండగు. ఈ చక్రవర్తి కీర్తితూర్పున పసిఫిక్ మహాసముద్రమునుండి, పశ్చిమమున నట్లాంటిక్ మహాసముద్రముదనుక వ్యాపించి యున్నదనిన నీతని యుత్కృష్ట గుణగరిమ వేఱుగఁ జెప్పవలసియుండదు. అశోకమహారాజు 22, 23 వందల సం॥ వత్సరములక్రిందట మనభరతఖండముం బరిపాలించెను. ఇన్నిశతాబ్దములు గడచినను, నీతఁడు నేఁడు తమతోడ వసించుచున్నట్లె జను లీతనిం బ్రీతిమెయి సంస్మరియించుచున్నవారు. ఇట్లన్నికాలములందు నన్నిదేశంబులందును నఖండ యశోలక్ష్మిం జూరఁగొనఁ గల్గిన యసమాన పూరుషరత్నంబులుండు టరుదుగదా.

అశోకునిఁగూర్చిన గ్రంథము లాంగ్లేయ భాషయందుఁ బెక్కులు వ్రాయఁబడినవి. జర్మనీభాషయందుఁ గూడ విపులముగ నీతని చారిత్రము వర్ణింపఁబడియున్న యది. జపాన్ చీనా భాషలలో విరచింపఁబడిన యీతని చారిత్రములం గుఱించి వేరుగఁజెప్ప నక్కఱలేదుగదా. ఇట్లితరదేశ భాషలలో నశోక భూరమణునింగూర్చి యనేకోద్గ్రంథములున్నను మనోహరంబగు మన యాంధ్రభాషయందుమాత్ర మీ మహానుభావుని చారిత్ర మామూలాగ్రముగఁ దెల్పఁగల్గు కావ్యమొక్కండును లేకుండు టెంత విచారకరమో పాఠకులూహించెదరుగాక. ఇది యే మనయజ్ఞానస్థితిని, మనహీనదశను, సూచించుచున్న యది. మన భాషయందలి యీగొప్పలోపముం బరిహరించి, తమదేశములోఁ బుట్టిపెరిగి, తమ దేశోద్ధరణార్థము తమ జీవితకాలమునుగడపి, మానవలోకములో నెల్లఁదాము సంస్మరణీయులగు నట్లొనర్చిన మహాపురుషుల విమలచారిత్రామృతం బాస్వాదించి యానందించు భాగ్యమాంధ్రమహాజనుల కొసంగినందుల కాంధ్రభాషాభివర్ధనీసంఘమువారియెడ నాంధ్రలోకంబు కృతజ్ఞతకలదియై యుండనగు.

మూలగ్రంథములు.

ఈగ్రంథమును విరచించుటయందు గ్రంథకర్తగారికి:—

ర్స్ డేవిడ్సు (Rhys Davids) గారి బౌద్ధహిందూదేశము (Budd-

hist India) ను గ్రంథమును, విన్సెంట్, ఎ, స్మిత్ (Vincent A. Smith) గారి హిందూదేశ బౌద్ధ చక్రవర్తియగు నశోకుఁడు (Asoka, the Buddhist Emperor) అను గ్రంథమును, ప్రొఫెసర్ లక్ష్మీనరసు నాయఁడుగారి బౌద్ధమతసారము (Essence of Buddhism) అను గ్రంథమును చాలసాయ మొసంగిన యవి. నానాగ్రంథ శోధన మొనర్చి, తత్సార మెల్ల సంగ్రహించి, సంక్షేపముగ వ్రాయఁబడిన దగుటచే నీకావ్యము చిన్నదైనను ననేక గ్రంథకర్తల యభిప్రాయములం బెక్కువిషయ సందర్భముల యందుఁ గలిగియున్న యది. అశోకభూజానింగూర్చి పుక్కిటి పురాణములు, చిత్రకల్పితకథలు చాలగలవు; వానిలో సత్యములని గ్రహింపవలసిన విట్టివనియు, నవిశ్వసనీయంబు లివి యనియు విమర్శించి, యిట్టి చరిత్రగ్రంథమును వ్రాయుట యందుఁగల కష్టములు కృతికర్తలకుఁ దెలియని విషయము గాదు. ఈ కావ్యవిషయమునకు, మెగాస్తనీసు, ఆరియన్ అను వారువ్రాసిన చరిత్రాంశములటుండ, ప్రబలాధారములయినవి, అశోకుఁడు చెక్కించిన శిలాశాసనములు, కొండలమీఁదను, జాతి కంబములమీఁదను, రెండువేలసంవత్సరముల క్రిందటఁ జెక్కింపఁబడిన యక్కరములే యశోకునికీర్తిలతకాలవాలములయి, యయ్యది మనుష్యలోకమంతయు వ్యాపింపఁగల్గు నట్లు చేసినవి. కావున నీకావ్యమున ౮,౯-వ యధ్యాయములందు 90 పుటలవఱకు నీవిషయమే విశేషముగ వర్ణింపఁబడినది. విష

య ప్రాముఖ్యతం దలంచి, గ్రంథవిస్తరతంగూర్చి పాఠకులు శంకింపకుండెదరు గాక.

## బౌద్ధమతము.

సర్వమత మర్మవిభేదకంబగు నీ బౌద్ధమతధర్మ వ్యాపకమే యశోకమహారాజు నింతఁగఁ బరిగణించుటకుఁ గారణమైనది; కాఁబట్టి యీ కావ్యమున బౌద్ధమతసిద్ధాంతములంగూర్చి గ్రంథకర్త చర్చింపవలసివచ్చెను. అయిన బౌద్ధమతమొక యద్భుతమతముగ భావింపవలసిన యక్కఱలేదు. కారణకార్యముల విచారణ యటు నిల్పి యున్నవస్తువులున్నట్లుచూచి పర్యాలోచించినచో హిందూమత నీతిసారమే బౌద్ధమతముఖ్య స్వరూపమని యెవ్వరైన నొప్పుకొనక తప్పదు. సమస్తదేశ విద్వాంస శిరోవేష్ట నాగ్రభాగ స్థవిమలాలంకారపూజ్యస్థితింగాంచిన భగవద్గీతయందలి వాక్యములును, బౌద్ధమత నీతివాక్యములు ననేక సందర్భములందు సామాన్యభావంబుఁ గాంచియుండుటను మనము చూడవచ్చు. కావుననె బౌద్ధమత మన్యదేశ పండిత జనాదరణీయంబయ్యె. ఇట్టిమతవ్యాపకమునఁ దన జీవితకాలము గడపి లక్షలకొలఁది జనుల హృదయములనా నందోదధి నోలలాడించిన యశోకుం డెవ్వారికి స్మరణీయుండుగాకుండు. అశోకుని చరిత్రంగూరిచి, సమగ్రముగ విరచింపఁ బూనినచో నిట్టిపాత్రములు పదియైనఁ జాలకుండు.

అయినను, గ్రంథకర్త ముఖ్యాంశములను విడువక సంగ్రహముగ నైన నందుండువాని సూచించియుండుట తెల్లంబ.

శైలి.

ఇక్కావ్యం బాంధ్రభాషయందనర్గళ కవితాధారగల యొక పండితునిచే రచియింపంబడినకతంబున నందందు భావగౌరవ శోభితంబులగు కఠిన పదప్రయోగములు పాఠకులకు దృగ్గోచరమగు టొక యచ్చెరువుకాదు. పరమగుణ శోభితుండగు నశోకావనీంద్రు నుత్కృష్ట చరితంబునుజదివి యాంధ్ర మహాజనులెల్ల రానందింతురు గాత.

క. భాస్కరరావు. బి., యే.

# కృతి.

ఉ. శ్రీకి నివాసమై, బుధనిషేవ్యమునై, మహనీయధర్మర।
త్నాకరమై, యశేష విషయాధికకీర్తి విభాసితంబునై।
ప్రాకట సర్వసస్య జనరంజకమై, వరభూమిజా నిర।
శ్శోకలితంబు నా భరతఖండము, నంచదభిజ్ఞధామమున్.

సీ. ఎవ్వాఁడు సద్ధర్మ-నృపవర్య కరణీయ
పంచ యజ్ఞోదార-పటిమ నేలె
ఎవ్వాఁడు కరుణామ-యేచ్ఛా పురస్కృత
సకలజీవావన-శక్తిఁగాంచె
ఎవ్వాఁడు బౌద్ధధ-ర్మైద్య స్వవర్తన
నయమార్గగతజనా-నందుఁడయ్యె।
ఎవ్వాఁడు భాస్వరత్-పృథుశైల ఖచితాత్మ
వృత్తాంతలోక సం-వేద్యుఁడయ్యె.

గీ. నమ్మహాత్ముఁ డశోక ధ-రాధినాథుఁ।
డతులితామేయ సత్వగుణాఢ్యుఁడగుచు।
నమలనిజకీర్తి ధవళితా శాంతుఁడగుచు।
నతని కాతఁడె యుపమానమనఁగ నెగడె.

ఉ. భూజనులెందఱో వినుతి-పొల్పుగఁజేసెడి యాయశోకునిన్
రాజకులావతంసుఁ డన-రాదె? తదీయచరిత్రరత్నమే
యోజ మనుష్యమాత్రునకు-నొప్పుగ నర్పణసేయఁ జెల్లు? నా
రాజకళా వతంసునకె-రంజిల నంకిత మే నొనర్చెదన్.

శ్రీసాంబశివాయనమః.

# ఇష్టదేవతాస్తుత్యాదికము.



## శివస్తుతి.

శా. శ్రీకంఠంబున లోకరక్షణకళా చిత్రప్రవీణత్వము।
స్తోకస్ఫూర్తి నెవండు తెల్పునో, మునిస్తోమప్రహర్షప్రదా।
లోకస్థితు డెవండొ, భక్తజనహృల్లోలాత్మకుం డెవ్వఁడో।
యాకైలాసపతిన్ భజించెద మదీయానూన గోత్రేశ్వరున్॥

## ఆంజనేయస్తుతి.

మ. ఒకనాఁ డెవ్వఁడు స్వప్నకాలమున దీప్త్యోదంచితాంగుండునై।
వికచాబ్జాననుఁడై, నిజాశ్రితలసద్బృందానుషంగాత్ముఁడై।
ప్రకటానందముతోఁ ప దర్శనము శుంభద్వృత్తినా కిచ్చి, దా।
నుకవిత్వప్రతిభన్ ఘటించెనో, మరుత్సూతిం బ్రశంసించెదన్॥

## కవిప్రశంస.

చ. సలలితకల్పనాది విలసద్వరసాంస్కృతి కాంధ్రకావ్యభూ।
షలఁదగఁగావ్యకన్యకకు సమ్మదమిచ్చిన కావ్యకర్తలం।
దెలతును, దోషసంస్కరణధీయొకయింతయు లేక పైఁగనో।
ప్పుల మతి తప్పులంచను ప్రబుద్ధుల దుష్కవులం దలంపఁబోన్॥

## వంశవర్ణన.

సీ. శ్రీబేతపూడి ప్రసిద్ధవంశ్యులు గల
రార్వేలవారు నయాదియుతులు।
శ్రీవత్సగోత్రజుల్ శివమతస్థులు నందు
మాన్యుఁడు, మల్లన-మంత్రి మత్పి।

తామహుండాయన దత్తపుత్రుఁడు లక్ష్మి
నారాయణుఁడు మజ్జనకుఁడు ఘనుఁడు।
అశ్రాంత పరమేశ్వరారాధనపరుండు
తగ లక్ష్మమాంబిక ధర్మపత్ని।
కాఁగఁదులలేని దాంపత్యకలితుఁడగుచు।
సంతతపరోపకార నుస్వాంతుఁడగుచుఁ।
బడసె నొగినల్వురను దనూభవుల నెలమిఁ।
బార్వతీనాథ సత్కృపాబలిమిఁజేసి॥

సీ. ఆనలువురిలోన- నగ్రజన్ముఁడను ల
క్ష్మీకాంతుఁడను పేరఁ-జెలగువాఁడ।
నాంధ్రగీర్వాణ పురా-ణాది విద్యలయందుఁ
గించిత్ప్రవేశ స-మంచితుండ।
సర్వేశ్వరుఁడు వైద్యశాస్త్రసారా భిజ్ఞుఁ
డగు నాదుప్ర ప్రథ-మానుజుండు।
పరపరబ్రహ్మంబు - పరతత్త్వవేదియై
పరగు ద్వితీయసో-దరుఁడుగాను।
మనుసంభవాది-సంభావ్య నానా గ్రంథ
కర్తయై విఖ్యాతిఁ-గాంచియున్న॥

గీ. యతఁడు, భగవంతరావు నా-కగుఁగనిష్ఠ
సోదరుఁడు, గాన విద్యామహోదరుండు।
నిట్లు విద్యలయం దంతొ-యింతొ మాకు
నభినివేశము కలిగె శి-వాదరమున॥

సీ. ప్రీతితో గౌరీ ప-రిణయమం చేఁటి
చిన్న పొత్తంబు ర-చించినాఁడ।

శివమహిమ్నస్తోత్ర-శ్రీకరశ్లోకము
లాంధ్రీకరించి నే-నలరినాఁడ।
చతురతరశ్లోక- సమితికిఁ బద్యాళి,
నలిచాటుపద్యాల్, పొ-నర్చినాఁడ।
దేవతాస్తోత్ర సం-దీపిత గ్రంథంబు,
నాటకం బొండు నే- నవ్యముగను॥
గీ. బొసఁగఁగూర్చితి; సరసులు-పొ్పంగు నట్టు
లాంధ్రభాషాభివర్ధని-యనెడి సంఘ।
మునకు * మూఁడుచరిత్రంబు-లను రచించి
యున్నవాఁడను బుధకృపఁ-గన్నవాఁడ॥

---

* 1. అశోకమహారాజచరిత్ర, 2. చీనాదేశచరిత్ర, 3. సిక్కులచరిత్ర.



# పీ ఠి క.

## 1. చరిత్రనాయకమహిమ.

శ్రీమన్మహీకాంతా కంఠహార తరళాయమానంబుగ నున్న యీభరతఖండమును బహుపూర్వకాలమునుండి 1. ఉత్తములు, 2. ఉత్తమోత్తములు నగు కొందఱురాజులు దైవానుగ్రహంబుచేఁ బరిపాలించిరి. ఏరాజులు తమకు విధ్యుక్తములైన పంచయజ్ఞంబులను *సమగ్రంబుగ నెఱవేర్చిరో వా రుత్తమ రాజులు; ఏరాజులా పంచయజ్ఞాచరణంబే కాక పరోపకారార్థమిదంశరీ రమ్మనుచుఁ దద్ధర్మానుష్ఠాన పరాయణులై పరోపకృతికై తమశరీరంబునైన నర్పింప సాహసించుచు స్వప్రయోజనో దాసీనులై స్వప్రజాభిమానులై వర్తించిన వారుత్తమోత్తమరాజులు. ఈ కడపటివర్గంబులోనివారైన మాంధాత, శిబి, భగీరథా

---

* పంచయజ్ఞము లనఁగా 1. దుష్టులను దండించుట, 2. సుజనులను బూజించుట, 3. న్యాయవిధిని బొక్కసము వృద్ధి చేయుట, 4. అర్థిజనులను యథాయోగ్యముగఁ బాక్షీకరించుట, 5. రాజ్యరక్షణము. శ్లో॥ దుష్టస్యదండస్సుజనస్యపూజా। న్యాయేన కోశస్యచ సంప్రవృద్ధిః। సుపక్షపాతోర్థిషు రాజ్యరక్షా। పంచైవయజ్ఞాః కథితానృపాణాం.

దులు కీర్తికాయులై భరతఖండవాసులచే నేఁటి కాలంబుదనుకఁ బొగడ్త నొందుచుండిరి. ఈ చరిత్రనలంకరించు నశోకచక్రవర్తి యీ వర్గంబులోనె చేరఁదగినవాఁడని యాయన యుదంతం బాద్యంతంబు చదువువారు వచింపకమానరు. మఱియు నా మహారాజు తన ప్రజలందఱు తన కుటుంబమేయని త్రికరణశుద్ధిగ వచించి వారిని నీతిపరులఁజేయఁ దనయావచ్ఛక్తిని ధారవోసెను. ఈచరిత్రాంతమందనఁగా 13-వ యధ్యాయములో ఆయన యుపకారకృత్యంబులు సంగ్రహముగా నుడువఁబడినవి. ఇది యునుంగాక యీ చరిత్రయొక్క 7-వ యధ్యాయాంతమందు లిఖింపఁబడిన పద్యం బశోకమహారాజుయొక్క యుత్తమకార్యం బులకు ముకురంబువలె నుండునుగానఁ జదువరులకు సుగమంబుగ నుండునని యీసందర్భమున మరలనిచట లిఖింపఁబడుచున్నది.

ఉ. రాజ్యముచేసె సర్వజనరంజకమాగతి స్వీయసంపదన్।
భోజ్యముచేసె భిక్షులకు, భూమిసురాళికి, నర్థికోటికిం।
ద్యాజ్యముచేసె దుర్నయము నందఱకున్ మహనీయధర్మముం।
బూజ్యముచేసె సత్వగుణభూమి యశోకుఁడు మోక్షకాముఁడై॥

## 2. చరిత్రమహిమ.

పైనిఁ జెప్పఁబడిన మంధాతాది ప్రభువుల కృత్యంబులు కవిజనాతిశయోక్త్యాది మిళితంబులైయున్నవి. అదిగాక యుత్కృష్టకార్య ధురంధరులయిన వారియందు దైవమహిమలుండు నని కవులు ప్రాయికంబుగ వచించుటయుఁ గలదు. అట్టివి పురాణమాత్ర శోభితంబు లైయుండు. చరిత్రలన్ననో యథార్థ

కథన దక్షంబులై ప్రత్యక్షాను మానప్రమాణ కలితంబు లై యుండును. అట్లుండుటం జేసి యవి విస్రంభ పాత్రంబులగును. ఈ యశోకుని వృత్తాంతముకూడఁ బురాణకల్పనలలోఁబడి యసంగ తాంశ దూషితంబుకాఁగా శిలాశాసనాది దృష్టాంతముల సంగ్ర హించి పరస్పర విరుద్ధాంశములును, అతిశయోక్త్యాదులు ననఁ బడు కలుపుమొక్కలఁ దొలఁగించి మనోహర పుష్పారామంబుగ నొనర్చి చదువరుల కానందజనకంబుగ నిప్పటి చరిత్రకారు లెం తయు శ్రమపడి లిఖించిరి. ఈచరిత్ర కనుబంధములుగా నున్న హిందూసింహళ పురాణంబులఁజూచిన నట్టి విరుద్ధాంశములు తేటపడఁ గలవు. కావున నీయశోకుని వృత్తాంతంబు సలక్షణం బగు చరిత్రయే యగును.

### 3. చరిత్రవలని ప్రయోజనములు

మతోద్ధారకులు, మతసంస్కర్తలు, రాజ్యకర్తలు, రాజ్యో ద్ధారకులు, రాజోత్తములు, వీరాగ్రేసరులు, పరోపకారకంక ణులు, దేశాభిమాన విశిష్టులు నిట్టివారు మహాపురుషులె కాని సామాన్యులు కారని యెల్లరకును దెల్లంబుగఁ దెలిసిన విష యమే గదా. అట్టివారు తా మవలంబించిన మహాకార్యంబుల నెఱవేర్చుట కెంతప్రయాసము పడిరో, ప్రజాసామాన్యమున కెట్లుపకరించిరో యని తెలిసికొనుట బుద్ధిశాలుల కావశ్యక మని నుడువవలయునా? మన దేశమందువలెనే విదేశముల

యందును వన్నెకెక్కినవారు పలువురు కలరు. కావున స్వదేశ చరిత్రలంబలె విదేశచరిత్రలును బఠనీయంబులే యగుచున్నవి.

చ. జనులను నీతివర్తనులఁ జక్కఁగఁజేయఁగఁ జాలి, స్వక్రియా।
జనితఫలాభిలాషులయి సౌమ్యముగా మనువారిజేసి, యే।
జను లెటుహానివృద్ధులను జాలగనొందిరొ వానిఁదెల్పు సా।
ధనములు సచ్చరిత్రములె; దందన లన్యకథా ప్రసంగముల్॥

కావునఁ జరిత్రంబులు చదువరులకు సుజ్ఞానదాయకంబులై, వ్యవహార నైపుణ్యబోధకంబులై, పౌరుషేయాది సత్కృత్య సాధకంబులై భాసిల్లుననుట సర్వవిదితంబ. అది యటుండ నీ చరిత్రం బిప్పటికి 22, 23 వందల సం॥ల క్రిందట నీభరతఖండము యొక్క నాగరికాది వృత్తాంతమును, దత్కాలప్రభువైన యశోక మహారాజుయొక్క సుగుణసంపదను, బరిపాలనా సామర్థ్యమును దెల్పునుగాన నిదిమఱియుఁ బఠనీయంబని చదువరులె భావింపఁ గలరు.

4. గ్రంథకరణ ప్రోత్సాహకులు.

ఆంధ్ర దేశీయులైన కొందఱు విద్యావంతులును, ధనికులును, జమీన్దారులును, మొదలయిన ప్రముఖులు సంఘీభవించి ““ఆంధ్రభాషాభివర్ధనీ సంఘ”” మనెడినామధేయంబు వహించి పైని నుడువఁబడిన చరిత్ర ప్రయోజనంబులారసి, చరిత్రలచే సామాన్యజనులకు జ్ఞానాభివృద్ధి నొనర్చుటకై భాషాభివృద్ధి యావశ్యకమనితలఁచి, యా రెండుప్రయోజనము లేక కాలమందే సమకూడునట్లు కొంత కాలమునుండిచరిత్రలరచియింపించి

ప్రకటించుచుండిరి. తత్సంఘ కార్యదర్శిగారైన మ-రా-రా-శ్రీ, వేమవరపు - రామదాసు పంతులుగారు. బి. యె., బి. ఎల్.

మ. ప్రభు విద్యాపరిశోభితుండగుచు, సంపద్యుక్తుఁడై, యంతకుం।
బ్రభఁగూర్పన్ బహుళాంధ్ర సంస్కృతల సద్భాషాపరిజ్ఞా-నియై।
సభలం దప్రతిమాన వాగ్విభవుఁడై, సౌజన్యసన్మాన్యుఁడై।
యిభరాడ్రక్షక సత్కృపాకలనభాసిల్లున్ మదీయాప్తుఁడై॥

నేను లోకల్ పండు డిపార్టుమెంటులో నుపాధ్యాయుఁడుగాను, స్కూళ్లసూపరు వైజరుగాను, ఆ॥ సబుఅశిష్టాంటు ఇన్స్పెక్టరుగాను బనిచేసి భరణముపొంది 1908-వ సంవత్సరములో విరామము చెందిన స్థితియందాయనతో నొకదినంబున ముచ్చటింపఁ బోఁగా

గీ. ఆంధ్రగీర్వాణ హూణ భాషాదులందు।
నాంధ్రభాషా కవిత్వమం, దార్య, మీకు।
సరసమయినట్టి యభినివేశంబు కలిమి।
యే నెఱుంగుదుఁ, గాన వాంఛింతు నొకటి॥

మ. ధరనుశ్లోకుఁ డశోకుఁడాయనచరిత్రన్ మీరువ్రాయంగ బం।
గరు తావిన్ మతి గాంచినట్లగును, విన్నాణంబులౌ శాసనాల్।
సరసంబౌగతిఁ దెల్లుసేయఁదగు, భాషాస్ఫూర్తియో యందురేఁ।
బరువుం దేలికగాని రీతినొనరింపన్ యోగ్యమై తోఁచెడిన్॥

అని వాక్రుచ్చెను.

అది యటుండ నీభరతఖండవాసులలోఁ గొందఱు నావికా యాత్రలుచేసి విదేశంబులకుంబోవఁ గులాచార నియమంబులచే బాధితులగుచుండిరి. శేషించినవారైనఁ దమదేశదైన్యమును బాపుట కుత్సాహితులు కాకుండిరి.

ఉ. ధీరతఁబూని, పెంపుగ విదేశపుయాత్రలుసేసి, యందు వ్యా।
పార పరిశ్రమాదులును, భాగ్యము, భోగ్యము, లెట్టులున్నవో।
యారసి, తా మెఱుంగని వియాదట నేటెచి, కాదె లోకులీ।
ధారుణి వన్నెవాసి గనితారు సుఖించుట కల్గునెందునన్॥

అనితలఁచుచు మహాపురుషచరిత్రలను, విదేశచరిత్రలను ఆంధ్రలోకోపకారార్థము తెలుంగుబాసలో వ్రాయ నుద్యమించుచున్నవాఁడ నగుటచే ఆ కార్యదర్శిగారి కోరికి ప్రకార మీ యశోకచరిత్రను రచించినాఁడ.

5. సహాయగ్రంథములు.

ఈచరిత్ర వ్రాయుటలో.

1. విన్సెంటు, ఎ, స్మిత్ (Vincent, A. Smith) గారి హిందూదేశ బౌద్ధ చక్రవర్తియగు నశోకుఁడు (Asoka, the Buddhists Emperor) అను గ్రంథమును,
2. రిస్ డేవిడ్సు (Rhys Davids) గారి బౌద్ధ హిందూదేశము (Buddhist India) అనుగ్రంథమును,
3. ప్రొఫెస్సరు లక్ష్మీనర్సునాయఁడు గారి బౌద్ధమతసారము (Essence of Buddhism) అను గ్రంథమును,

జాలసాయముగఁ గైకొంటి. ఆంగ్లేయ భాషలోనున్న యాగ్రంథములఁ జదివి ముఖ్యాంశంబులశోధించి సంగ్రహముగ నీచరిత్ర వ్రాయుటలోఁ గలిగిన శ్రమంబు సంగ్రహ గ్రంథకర్తలకుఁ దెలియని విషయముకాదు. ఇది సంగ్రహ గ్రంథమగుటచేఁ జిన్నదిగ నున్నను బెక్కు విషయంబులిందు సందర్భాను సారముగ వ్రాయుట కలిగినది. మఱియు నశోకుఁడు బౌద్ధమతా

వలంబియై తన్మతవ్యాపక మొనర్చుటచే ఆమతమును గూర్చి యావశ్యకమయిన మేరకు వ్రాయఁబడినది. ఈచరిత్రను విపులంబుగ వ్రాసినయెడ నిట్టిపొత్తములు పదియైనను జాలకుండును.

## 6. గ్రంథ గ్రాహ్యాగ్రాహ్యావిచారణ.

బౌద్ధమతమం దీశ్వరుఁడు కలఁడా లేఁడాయను విచారణ పెట్టుకొనక, వేదంబు లప్రమాణంబులనుటచే, ఆమతము నాస్తిక మతమేయని యార్యు లభిప్రాయపడుచు,

ఉ. నాస్తికుఁడా నశోక నరనాయకుఁడెంతయు ధర్మమూర్తిగా।
నిస్తులకీర్తిశాలిగను, నిత్యపరార్థనుదత్తచిత్తుగాఁ।
బ్రస్తుతిసేయఁ దచ్చరిత పాత్యము పాణ్యము నావచింప వ్య।
త్యస్తముగాను దోఁచునని యాస్తికు లేమయినం దలంచినన్॥

దేహాత్మవాదులైన చార్వాకులకును బ్రహ్మము శాశ్వత పదార్థమనెడి యార్యులకును, తన సిద్ధాంతము మధ్యస్థముగ నుండునని బుద్ధుఁడు చెప్పెనేకాని తాను కేవలము నాస్తికుఁడనని ప్రకటించుకొనలేదు. ఆసిద్ధాంతము దుష్టమా నిర్దుష్టమా యని విచారించుట యీచరిత్రకుం బ్రాముఖ్యంబుకాదు. అట్టి మత మవలంబించినను బరమత సహనము కలవాఁడై,

మ. తన విశ్వాసమదెట్టులున్న నరులన్ ధర్మైక నిత్యప్రవ।
ర్తనులంజేయ నమేయయత్నము లొనర్పంబూనె; నాధర్మమా।
ర్య నిషేవ్యరిబుగనుండె, దైవభజనం బొఁగాదు నాఁబల్కఁడ।
య్యెను, బూజ్యుండగుఁగాక నింద్యుఁడె ధరత్రీశుం డశోకుండిలన్॥

## 6. గ్రంథశైలి.

భాషాసామాన్యులకుఁగూడ సుగమంబుగ నుండునట్లీ

చరిత్ర రచింపఁబడినది. కారణ మేమనఁగా ఆంధ్రభాషాయోష యికాలంబున శుష్కించి యుండెననుటకు నీ సంఘాభిధానమే ప్రబలసాక్ష్యంబు. దానికిఁ అది యటుండ శైలివిషయమై.

చ. యమకములుండరాదు, బహుళార్థపదంబులు నుండరాదు, శ।
బ్దములరుదైనవై సులభవశ్యముకానివి యుండరాదు, భా।
వము కడుగూఢమై చదువువారిని సంకటపెట్టరాదు, కా।
వ్యము సరసంబుచుక్కనయి హాయి నొసంగుటె మంచిశైలిగా।
శ్రమపడలేక యెందఱో ప్రశంసయొనర్తురు నేటి పాఠకుల్॥

అయినను సంఘనామము సార్థీకరించుటకై యచ్చ టచ్చట నసాధారణపదంబులును, యమకాదులును, రసపోషణకై కించిత్తుగ నలంకారములును, బ్రయోగింపఁబడినని. అరసున్న లును శకటరేఫములును బ్రాయికముగా నుపయోగింపఁబడినవి.

8. ఆంధ్రభాషాభివర్ధనీసంఘయోగ్యత.

ఇట్టులే నొనర్చిన చరిత్రంబు నంగీకరించి వ్యయప్రయా సంబులతో సంఘమువారు ముద్రితంబు చేసిరి. ఆంధ్రభాషలో మహాపురుషచరిత్రంబులును, విదేశచరిత్రములును లేవనెడి లోపమును నివారించి స్వదేశాభిమానులై, స్వదేశోపకారులై యింతగ శ్రమపడెడి యీసాంఘికుల కాంధ్రదేశీయు లెంతయు గృతజ్ఞతం జూపఁ దగు. ఈసంఘమువారల మహోద్యమ మాచంద్రార్కముగ వెలయుఁగాక.

ఇట్లు విన్నవించు
సుజనవిధేయుఁడు,
బేతపూడి లక్ష్మీకాంతరావు.

# విషయసూచిక.

## 1-వ అధ్యాయము.

ఫుట.

## 2-వ అధ్యాయము.

3-వ అధ్యాయము.

4-వ అధ్యాయము.

5-వ అధ్యాయము.

## 6-వ అధ్యాయము.

## 7-వ అధ్యాయము.

## 8-వ అధ్యాయము.

## 9-వ అధ్యాయము.

## 10-వ అధ్యాయము.

## 11-వ అధ్యాయము.

## 12-వ అధ్యాయము.

## 13-వ అధ్యాయము.



సాంచిస్తూపముయొక్క దక్షిణ ద్వారబంధము
130 వ పుట చూడుము.

# అశోక మహారాజ చరిత్ర.

## 1-టి అధ్యాయము.

### మౌర్యరాజ్య నిర్మాణము, చంద్రగుప్తుఁడు.

శ్రీమదఖండభూమండలమండనాయమానం బగుభరతఖండము యొక్క పూర్వచరిత్రం దెలిసికొనుటకు గ్రంథసామగ్రి సమగ్రంబుగ లేకున్నను జరిత్రకారులు వేదశాస్త్రపురాణేతిహాసంబులను శిలాశాసనాదులను బహుళ ప్రయాసపడి పరిశీలించి యిప్పటికి రమారమి 4000 సంవత్సరంబుల నాఁటనుండి యీదేశచరిత్రంబును సహేతుకంబుగ లిఖించియుండిరి. తత్క్రమంబైన కాలవిభాగ మీక్రిందఁ బ్రదర్శింపఁబడును.

| | | | సం॥ మొదలు. | సం॥ వఱకు. |
|---|---|---|---|---|
| 1. | ఋగ్వేద యుగము | క్రీస్తుపుట్టకపూర్వము | 2000 | 1400 |
| 2. | క్షాత్ర యుగము | డిటో | 1400 | 1000 |
| 3. | సూత్ర యుగము | డిటో | 1000 | 500 |
| 4. | బౌద్ధ యుగము | డిటో | 500 క్రీ. వె. | 500 |
| 5. | పౌరాణిక యుగము | క్రీస్తుపుట్టినవెనుక | 500 క్రీ. వె. | 1200 |
| 6. | మహమ్మదీయ యుగము | డిటో | 1201 క్రీ. వె. | 1576 |
| 7. | బ్రిటిషు యుగము | డిటో | 1577 | |

ఈ వ్రాయంబూనిన చరిత్ర బౌద్ధ యుగంబునకు సంబంధించి యుండును. మఱియు వసుంధరకు రత్నగర్భాభిధానంబును సార్థకం బొనరించు నీ భరత

**గ్రంథప్రయోజనము**

ఖండంబును న్యాయంబుగను, ధర్మంబుగను బరిపాలించి ప్రజానురాగంబు వడసి కీర్తిశేషులైన రాజశిరోమణులయొక్కఁగాని సుగుణగణాలంకారులున్ను,జగదుపకారులును, స్వదేశాభిమానులును, సత్యపరాయణులు నైన మహాపురుషులయొక్కఁ గాని చరిత్రలం బ్రకటించినయెడల నవి చదువరులకు నమందానంద దాయకంబు లయ్యెడును.

**చంద్రగుప్తుని చరిత్ర.**

ఈ కథానాయకుఁ డైన యశోక చక్రవర్తి కీ భరతఖండరాజ్య మీయన పితామహుండగు చంద్రగుప్తమహారాజు నుండి పరంపరాగత మై యుండె. చంద్రగుప్తుం డశోకునకు వంశ మూలపురుషుండును రాజ్యనిర్మాణకర్తయుఁ గానఁ బ్రప్రథమమున నీచంద్రగుప్తుని చరిత్ర సంగ్రహముగా నుడువఁబడును.

**మహా అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తి వచ్చుట.**

గ్రీసుదేశపు రాజయిన మహా అలెగ్జాండరు క్రీ. పూ. 327 సం॥లో భరతఖండముపై దండెత్తి వచ్చి సింధునదీ ప్రాంతదేశములను జయించి పదంపడి భరతఖండము నంతను జయింపవలెనని యధిక తృష్ణం గలిగి యుండియుఁ గొన్ని యసందర్భంబులచే మరలిపోవుచు జయించిన ప్రదేశముల యందుఁ దన ప్రతినిధులను ససైన్యంబుగ నియమించెను. ఆయన బాబిలను పట్నమున క్రీ. పూ. * 323 సం॥లోఁ గాలధర్మంబు నొందఁగా నాయన ముఖ్యోద్యోగు లాయన

**సెల్యూకసు.**

* క్రీ. పూ. యనిన క్రీస్తు (ఏసు) పుట్టుటకు పూర్వము అని యర్థము. క్రీస్తు పుట్టిన వెనుక 1908 సంవత్సరములు గడచినవి. క్రీ. పూ. 323 సం॥లో యనిన నిప్పటికి 2231 సంవత్సరముల క్రిందట అని యర్థము.

రాజ్యంబు విభాగించుకొనిరి. అపుడు భరతఖండమం దాయన జయించిన దేశములు సెల్యూకసు అను పేరుగల యాయన సేనాని వంతునకు లభించెను.

చంద్రగుప్తుఁడు మగధరాజ్యమునుండి వెడలఁగొట్టఁబడుట.

అన్యదేశీయు లయిన యాగ్రీకువారి పాలన యందుండుటకు పంజాబు దేశవాసులు విగతాభిలాషులై మఱియు వారికి ద్వేషులై తమ స్వాతంత్ర్యమును మరలం బడయఁ గలహోన్ముఖులుగా నుండిరి. ఏతత్కాలంబున మగధరాజ్యంబు మహోన్నత దశం గలిగి మహాపద్మనందుని పాలనంబునం దుండెను. తద్రాజ్యంబున చంద్రగుప్తుండను నాతఁడు యిరువదివత్సరంబుల ప్రాయముమాత్రమె కలిగియున్నను శౌర్యధైర్య సాహసాది గుణోపేతుండై దేశాభిమాన ధూర్వహుండై ప్రజలకు లక్ష్యస్థానమం దుండెను. ఇట్టి వీరాగ్రేసరుఁడు తనరాజ్యమందుండినచోఁ దనకు నపాయం బొనర్పఁగలఁ డని శంకించి మగధరాజ్యాధిపతి తనరాజ్యమునుండి యాతని బహిష్కృతుంజేసె.

చంద్రగుప్తుఁడు మగధ రాజ్యాధిపతి యగుట.

చంద్రగుప్తుఁడు మగధరాజునకు శూద్రస్త్రీవలన జన్మించె నని కిం వదంతి యొకటి యుండినను, అది చంద్రునికి గళంకము వంటి దని యితని చరిత్ర యే నిరూపింపఁ గలదు. ఇతని తల్లి పేరు "ముర" కావున నితడు మౌర్యుఁ డయ్యెను. వంశము మౌర్య వంశము. ఇతఁడు మగధరాజుచే బహిష్కృతుఁ డై యేకాకి గాఁ బ్రవాసము చేయుచుఁ బంజాబు దేశమునకుఁ బోయి యచ్చటి సాహసికులను, దేశాభిమానులను స్వాతంత్ర్యము గోరువారినిఁ గొందఱిని జేర్చుకొని ప్రబలుఁడై గ్రీకులతోఁ బోరి వారిం బారదోలి తద్దేశాధిపతి యయ్యె. అక్కాలంబుననె మగధ భూపాలుఁడు ప్రజానురాగ రహితుండై యుండుట చంద్ర

గుప్తుం డెత్తిగి యతనిపై దండు వెడలి యాయనను రాజ్యపదభ్రష్టునిఁ జేసి రాజధాని యైన పాటలీపుత్ర మందు సింహాసనం బధిష్ఠించె.

ఇంతకుఁ బూర్వము చంద్రగుప్తుఁడు జయించి యున్న పంజాబు మొదలయిన భాగములును దీనంజేరుటంజేసి మగధరాజ్య మతి విపులమయ్యె. ఇట్లుండ ఘనతఁ జెందిన అలెగ్జాండరుచేఁ బూర్వము జయింపఁ బడి, కొంత కాలంబు తన స్వాధీన మొనర్చుకోఁబడి, పదంపడి మరలఁ దత్పూర్వదేశ వాసుల వశంబు లయిన, పంజాబు మొదలయిన ప్రదేశంబులఁ దిరిగి జయింప నుద్రేకంబుఁ గలిగి సెల్యూకసు దండెత్తి వచ్చెను. కాని మగధ రాజ్య ప్రాబల్యమును జంద్రగుప్త మహా

సెల్యూకసుచంద్రగుప్తునితో సంధికావించుకొనుట.

రాజ ప్రభుత్వ సామర్థ్యంబును గ్రహించి సంగరోద్యమంబు విరమించి సంధి కావించుకొనిరి. దానంజేసియె యుభయరాజకుటుంబములకు వైవాహికానుబంధంబులు కలిగెను. సెల్యూకసు తన కుమార్తెను చంద్రగుప్తున కిచ్చి వివాహముచేసెను. అలెగ్జాండరు భరతఖండమందు మున్ను జయించియున్న సమస్తప్రదేశములను నిప్పటి అఫ్గనిస్థానమును హిందూకూషు పర్వతముల వఱకుఁ గల ప్రదేశములను జంద్రగుప్తుని కొసంగుట, చంద్రగుప్తుఁడు సెల్యూకసుప్రభువునకు 500 ఏనుఁగుల నిచ్చుటయుఁ గలిగెను. సెల్యూకసు సిరియా రాజ్యమునకుఁ

మెగాస్తినస్ అను రాయబారి.

బ్రభువయ్యె. ఈరాజులిద్దఱును సంధ్యనంతరము పరస్పరానురాగంబుఁ గలవారయి యుండుటంజేసియె సెల్యూకసు ప్రభువు "మెగాస్తినిస్" అను బుద్ధిశాలిని బాటలీపుత్రమునందు రాయబారిగా నుంచెను.

ఈ రాయబారి పాటలీపుత్రమందుఁ గొన్ని సంవత్సరము లుండెను. అతఁడు మగధరాజ్యవిశేషంబుల నశేషంబుగ లిఖించి తదనంతర చరిత్ర

కారులకు భరతఖండ ప్రాచీన వృత్తాంతసామగ్రి నొసంగినవాఁడయ్యె.

**మెగాస్తినసు వ్రాసిన మగధరాజ్యవృత్తాంతము.**

త ల్లిఖితాంశంబుల యందుఁ గొన్ని యసంగతంబులును లోపంబులు నున్నను మహోపకారి యయ్యె ననియె యాయనను జరిత్రకారులు కొనియాడిరి. ఆయన లిఖించిన యంశంబులు సంగ్రహముగా నీక్రింద విశదీకరింపఁ బడుచున్నవి:—

**పాటలీపుత్ర నగర వైశాల్యము,**

(1) రాజధానియగు పాటలీపుత్రము గంగా శోణానదుల సంగమము వల్ల నిర్మితమైన యంతర్వేదిలో శోణకు నుత్తరమున రమారమిగా 10 మైళ్ళ పొడవును, 2 మైళ్లు వెడల్పును గలిగి యుండెను. దీని చుట్టు నొక కందక ముండెను. దాని వెడల్పు 600 అడుగులు. లోతు 30 మూరలు. కుడ్యము పైనిఁ గిరీటంబుల వలె 570 బురుజులును, 64 ద్వారములు నుండెను. పరిఖ యెల్లప్పుడు జలపూరితంబయి యుండెను.• ఈ వృత్తాంతముచే రాజధానియొక్క విస్తీర్ణ మపరిమితమని యెన్నఁదగియున్నది.

**బానిసలు.**

(2). మగధరాజ్యమందు జనులందఱు స్వతంత్రులే గాని వీరిలో బానిసలు లేరని యీ రాయబారి లిఖించెను. ఇతర గ్రంథసాక్ష్యమువల్ల విచారింపఁగా, నాకాలమందు సేవకావృత్తి యతిముఖ్యాంశము గాకున్నను సత్యము గాఁ గలదనియె చరిత్రకారులు తలఁచినారు. మఱియు నాకాలమందు గ్రీసుదేశమునమున్న బానిసవృత్తికంటె నిచ్చట బానిసవృత్తి యొక్క సౌలభ్యమును జూచి బానిసవృత్తియె లేదని యీ రాయబారి యభిప్రాయపడియుండునని చరిత్రకారు లీయనను నిర్దోషిం జేసిరి.

తరగతులు. (3) మగధరాజ్య ప్రజలు 7 తరగతులుగా నుండిరని యాయన లిఖించెను.

1. శాస్త్రవేత్తలు (తత్వజ్ఞులు)
2. వ్యవసాయకులు.
3. గొల్లలు.
4. శిల్పులు.
5. యుద్ధభటులు.
6. చారులు.
7. ఆలోచనసభికులు.

ఈ విభాగము సరిగా లేదనియు నానావృత్తులవారును గలరనియుఁ జరిత్రకారులు వక్కాణించిరి. స్థలాంతరమం దాయావృత్తులవారిం గూర్చి లిఖింపఁబడెను.

(4) రాజకీయోద్యోగస్థులు—

విధులు. (1) కొందఱు భూములను గొలతలువేసి పెద్దకాల్వలనుండి చిన్నకాల్వలకు నీరు పాఱునటులఁ దూముల నేర్పాటుచేసి యందఱికిని మాగాణివ్యవసాయమునకుఁ గావలసినంత నీరు గలుగఁజేసి రాజునకుఁ సంబంధించియుండు మృగయుల (Royal huntsmen) పై విచారణచేసి వారి యర్హతకుఁ దగినట్లుల వారికి బహుమానముల నొసంగుటకును శిక్షించుటకును వా రధికారముఁ గలిగియుండిరి. భూమి పన్నులను రాఁబట్టి భూసంబంధవృత్తికారులయిన చెట్లనఱుకువారు, వడ్రంగులు, కుమ్మరులు, గనులు త్రవ్వువారు ఈ మొదలయిన వారిపై విచారణ చేయుచు, నాయావృత్తుల వల్ల రాజునకుఁ జెందవలసిన కప్పములం గొనుచుండిరి. రాజమార్గముల నేర్పఱిచి చిన్నత్రోవలను దూరమును దెలుపుటకై స్తంభములను బాతించిరి.

పంచాయితులు. (5) రాజధాని సంరక్షకులు—6 పంచాయతులు గాను నొక్కొక్క పంచాయితికి 5-గు రుద్యోగస్థులుగాను నేర్పాటు చేయఁబడిరి. ఇట్లేర్పడిన 30 మంది

యుద్యోగస్థుల సంఘ మిప్పటికి నగర పారిశుద్ధ సంఘముతోఁబోలి యుం డును. ఈ సంఘమువల్ల రాజకీయ వ్యాపారమంతయు సమగ్రముగా నెఱ వేర్పఁబడెనని గణింపవచ్చును. ఈసంఘవివరము ముం దశోక-చరిత్రయందు విశదీకరింపఁబడును.

(6) సైన్యాంగము:—మహాపద్మనందుఁడు(ధననందుడు) పాలించు

సైన్యాంగము.

నప్పుడు మగధరాజ్యము 2,00,000 కాలిబంట్లను, 20,000 గుఱ్ఱపుదళమును, 2,000 రథ సైన్యమును 4,000 గజసైన్యమును గలిగియుం డెను. ఈ రాజ్యమును జంద్రగుప్తుఁడు జయించి పాంచాలమును సింధునదీ ముఖద్వారము వఱకుఁ గల ప్రదేశములను దీనితోఁ జేర్చి వృద్ధిచేసిన యనంతరము సేనాపరిమితి 6,00,000 యుద్ధభటులను 30,000 తురగసైన్యమును 9,000 గజములను 8,000 రథములను గలిగియుండె నని తెలియుచున్నది. మగధరాజ్యమునకుఁ బశ్చిమోత్తర ప్రదేశముల యందు గుఱ్ఱములకును, మగధ యందు నేనుంగులకును, నియమముగా యుద్ధ కౌశలమును గలుగఁ జేయు వాడుక యుండెను. కనుక యీ సేనాబాహుళ్యము విశ్వసింపఁ దగి యున్నదని చరిత్రకారులు తలఁచిరి. ప్రతి యుద్ధభటుఁడు నొకబల్లెము, నొకవింటిని ధరించెను. మనుష్యప్రమాణంబు

ఆయుధాదులు.

గల వింటినుండి విడువఁబడు బాణ మెట్టి డాలునుగాని, కవచమునుగాని, భేదింపఁజాలి యుండెను. గుఱ్ఱపురౌతు రెండుబల్లెములను నొకడాలును గలిగియుండెను. రథంబు రెండుహయంబులచేఁగాని నాలుగుహయంబులచేఁగాని లాగఁ బడెను. దానిపై నొకసారథియు నిద్దఱురథికులు నుండిరి. ఇంతబాహుళ్యసైన్యమును నిరంతరము తనయాజ్ఞానుసారముగ వర్తింపఁజేసి లోపాలోపములను యథాయోగ్యంబుగఁ బరిశీలించి శత్రుపీడారహితంబుగఁ జంద్రగుప్తుండు

రాజ్యరక్షణంబు గావించెను. ఇదియె చంద్రగుప్తుని యసమానపాలనా సామర్థ్యంబును బ్రకటింపంజాలును.

(7) వ్యవసాయాభివృద్ధిని గుఱించి రాజకీయోద్యోగులలోఁ గొందఱిని నియమించిన ట్లిదివఱకె వ్రాయఁబడియున్నది. దానింబట్టి రాజధానికి సమీపమునను దూరముననుండు క్షేత్రంబులకు జలసమృద్ధి సమముగాఁగలిగి, దానిచే మంచిపంటలు పండుటయు, కఱవులు కఱవగుటయు సిద్ధించినందున భూమికిఁ బంటవలంతి యను నామంబు సార్థకంబయ్యె.

పంటలు.

(8) ప్రజాస్థితి—జనులు సత్యసంధులును, దంభ రహితులును, మితవ్యయులగుటంజేసి యథాయోగ్యంబుగ సుఖంబు లనుభవింపుచు నన్యోన్యవిశ్వాసపాత్రులయి వివాదములులేనివారై జీవించిరి.

(9) చారులు—సత్యసంధులును, సూక్ష్మగ్రాహులును, జాగరూకులునయినవారిని చారులనుగా నియమించి వారిమూలకంబుగ రాష్ట్రంబునంతను నిరంతరము చంద్రగుప్తుఁడు చూచుచుండు వాఁడయ్యె. చారులు మృషావార్తలఁ దెల్పువారలు గానందున నీ నియామకంబు ప్రజలకును బ్రభువునకును నానందసంధాయకంబయ్యె.

ఉపయోగములు.

మృగపణంబు లనఁగా గొఱ్ఱెలు, పొట్టేళ్లు, ఆఁబోతులు మొదలయినవానిని బందెములు వేయుటయు, మృగముల వేఁటాడుటయు రాజునకు వినోదకరంబులయి యుండెఁ. మృగయావినోదం బించుకంత వివరింపం దగియున్నది. వేఁటకు మిగుల వైభవముతోఁ బయలుదేరి యున్నత ప్రదేశములయందుఁగాని, గజములమీఁదఁగాని నిల్చి మృగముల వేఁటాడుచుం

రాజవినోదములు.

డిరి. ప్రభువు మృగయార్థము పోయిన దారి కిరుప్రక్కలఁ ద్రాళ్లు కట్టెదరు. ఆత్రాళ్లమధ్యగా నితరులు పోయినయెడల వారికిఁ గఠినశిక్షకలుగును. ఇంకొక విశేషము కలదు. మృగయునిమిత్తముగాని విలాసార్థముగాఁగాని స్థలాంతరములకుఁ బ్రభువు వెడలునప్పుడు యవనదేశస్త్రీలు వెంబడియుందురు.

శిక్షాస్మృతి.

స్వల్పనేరంబులకయినను ఘోరశిక్ష చేయుట కనఁగా మరణదండన విధించుటకుఁ జంద్రగుప్తుఁడు వెనుదీయఁడని చరిత్రకారులు లిఖించియున్నారు.

రాజ్యవిస్తీర్ణము.

భరతఖండములో * బియాస్‌నదివఱకు అలెగ్జాండరు గెల్చియున్నప్రదేశము నెకాక ఆఫ్గనిస్థానములో ఆప్రభువు జయించియున్న ప్రదేశము లనఁగా హిందూకూషు పర్వతములవఱకుఁ గల ప్రదేశములును ఆఫ్గనిస్థానములోఁ బడమటిభాగమునుగూడ సెల్యూకసు చంద్రగుప్తునికి నొసంగెను. కాబూలు, గజినీ, గాంధారము, హీరటు పట్టణము లాయన యొసంగిన ప్రదేశములలోనె యుండెను. మఱియు భరతఖండములో దక్షిణమందున్న స్వతంత్రరాజ్యము లనఁగా పాండ్య, చోళ, కేరళ, రాజ్యములును కళింగ రాజ్యమును దప్ప శేషించిన ఖండమంతయుఁ జంద్రగుప్తుని యేలుబడిలో నుండెను. ఇదియంతయు మగధరాజ్య మను పేరు చేఁ బరగెను. ఈరాజ్యవిస్తీర్ణమున కంతటికిఁ జంద్రగుప్తుఁడె కర్తయనుటకు వలనుపడదు. ఈయన మగధ రాజ్యమును జయించువఱకే యారాజ్యములో కోసలరాజ్యమును జేరి యుండెను. చంద్రగుప్తుఁడు రాజ్యాధిపతి యగుటకుఁ బూర్వమె మగధరాజ్యము సింధునదివఱకు వ్యాపించియెయుండె ననియు, అవంతిరాజ్యమును లోఁబఱచుకొనియుండె ననియుఁ దెలియుచున్నది. పదంపడి పంజాబుదేశమును, సింధు నదీముఖప్రాంతప్రదేశములను, బైనిర్రా

* ఇది పంజాబుదేశమునందలి సింధునదియొక్క యైదుశాఖలలో నొకటి.

సినప్రకారము సెల్యూకసుచే నొసంగఁబడిన దేశములను, చంద్రగుప్తుఁడు మగధరాజ్యములోఁ జేర్చెను.

చంద్రగుప్తునిమరణము.

జన్మప్రాభవంబు లేకున్నను వీరలక్షణోపేతుండై స్వసామర్థ్య సమార్జితంబైన మగధరాజ్యంబు నప్రతిహతశాసనుండై, రాజ్యపరిపాలనదక్షుండై, 25 సంవత్సరములు పాలించెను. తనబుద్ధివైభవంబును బూర్తిగఁ బ్రకటించిన యీచంద్రగుప్తుఁ డుత్తమప్రభుగణపరిగణనార్హుండయి క్రీ. పూ. 323-వ సం॥లోఁగీర్తిశేషుం డయ్యెను.

శా. సామాన్యుండగు చంద్రగుప్తుఁడు విశేషప్రజ్ఞయున్ ధైర్యమున్
భీమాటోపముఁ గల్గి, సాహసికులన్వేఁగూర్చి, పాంచాలమ
న్భూమింగైకొని, నందునింగెలిచి తద్భూపాలుఁడై స్వీయమా
నామంబే భయదంబుగాఁగ ధరవిన్నాణంబుగా నేలెఁగా॥

# 2-వ అధ్యాయము.

## అశోకుఁడు రాజగుట, కళింగరాజ్యసంపాదనము.

---

*బిందుసారుఁడు మగధరాజ్యాధిపతి యగుట.*

చంద్రగుప్తుని యనంతరము మగధమహారాజ్యమునకు క్రీ. పూ. 297 సం॥నం దాయనపుత్రుం డయిన బిందుసారుఁడు నిరాటంకముగాఁ బ్రభు వయ్యెను. ఇతనికి "అమిత్రఘాతుఁ" డని పౌరుషనామంబు కలదు. అనఁగా శత్రువులను సంహరించువాఁ డని యర్థము. దీనం జూడ నర్మదానదికి దక్షిణదేశములఁ గొన్నిటి నీయన జయించియున్న ట్లూహింపఁ దగియున్నది. ఈతనికాలంబున సెల్యూకసు కాలధర్మంబు నొందఁగా నాయనకొమారుఁడు శిరియాదేశమునకు రాజయ్యెను. ఈరాజును, ఈజిప్టుదేశప్రభువును, బిందుసారునితో మైత్రిం బాటించిరి. పాటలీపురమున "మెగాస్తనిసు"నకు మాఱుగా "డీమెకాసు"ను రాయబారిఁగా నాసిరియాదేశపురాజు నేమించెను. ఈవిషయంబు తప్ప బిందుసారుని గుఱించి పురాతనగ్రంథములలో విశేషములు లిఖింపఁబడి యుండలేదు. ఈ భూపతి క్రీ. పూ. 297-272 వఱకు నెమ్మదిగాఁ బాలనఁ జేసెను. ఈ నెమ్మదికిఁ జంద్రగుప్తుని యనివార్యములయిన రాజ్యనిబంధనలె కారణములని నిస్సందేహముగ గ్రహింపఁదగియున్నది. బిందుసారుఁడు జీవించియుండఁగాఁ దదీయపుత్రుండగు నశోకుఁడు యువరాజపదస్థుండై యాయన యాజ్ఞానుసారంబుగ నుజ్జయినీనగరమందు రాజప్రతినిధిగా నుండెను. క్రీ. పూ. 272 సం॥లోఁ దండ్రి మరణింపఁగా ననంతర

అశోకుఁడు ప్రభువగుట.

మశోకుండు మగధరాజ్యాధిపతి యయ్యె. కాని పట్టాభిషేకమహోత్సవము తదనంతరము 3 సం॥ల కనఁగా క్రీ. పూ. 269 సం॥లో జరిగెను.

పట్టాభిషేకకాలయాపన కారణములు.

ఈ కాలయాపనమును గుఱించి హేతుపూర్వకముగానె చరిత్రకారులు భిన్నాభిప్రాయులయిరి. సింహళదేశపు పురాతన చరిత్రలలో నిట్లని లిఖింపఁబడియున్నది. బిందుసారునికిపదునాఱుగురుభార్యలవల్ల నూఱునొకరు పుత్రులు కలిగిరి. వారిలో జ్యేష్ఠుఁడు సుమనాహ్వయుఁడు. కనిష్ఠుఁడు తిస్సనామధేయుఁడు. ఈ కనిష్ఠుని జననికి కొండొక పురుషునివలన నశోకుం డుద్భవించెను. భరతఖండ పశ్చిమప్రదేశములకు రాజప్రతినిధిగా బిందుసారుఁ డశోకుని నియమించెను. తండ్రికి మరణవ్యాధి సంభవించె ననువార్త తనకుఁ దెలియఁగానె యశోకుఁడు ఉజ్జయినినగరమునుండి నిర్గమించి రాజధానియగు

అశోకునకు దుష్టాశోకుఁడని పేరువచ్చెనుట.

పాటలీపుత్రమునకు వెళ్లి తన జ్యేష్ఠసోదరుఁ డయిన సుమనుని గడమసోదరులను దొంబది యెనమండ్రను సంహరించి కనిష్ఠుఁడగు తిస్సనామునిమాత్ర ముపేక్షించి మగధరాజ్యప్రభువనఁగా భరతఖండాధీశ్వరుం డయ్యె. ఇట్లు సోదరుల నిందఱను చంపుటంజేసి దుష్టాశోకుఁ డని యపఖ్యాతిం జెందెననియు లిఖింపఁబడియున్నది.

బౌద్ధకాలహిందూదేశ చరిత్రకారుని యభిప్రాయము.

ఈవిషయమై బుద్ధకాలపు హిందూదేశచరిత్రకారుఁ డిట్లు వ్రాసెను:— “సింహళ పురాణంబులం దసంగతాంశంబు లుండుటంజేసి యవి నిర్దుష్టంబు లనుటకు వలనుపడదు. మఱియు నవి యశోకుని కనంతరము 5 లేక 6 శతాబ్దములు కడచినపిమ్మట వ్రాయఁ

బడినవి. అయినప్పటికి నవి శాసనాదులతోఁ జాలభాగ మేకీభవించుచున్నం దునఁ బూర్వవృత్తాంతములం దెలిసికొనుటకు ముఖ్యాధారము లగుచున్నవి. కాఁబట్టి యుద్ధప్రసక్తిలేకయె యశోకుఁడు మగధరాజ్యసింహాసన మధిష్ఠించియుండఁడు."

అశోక చరిత్రకారుని యభిప్రాయము.

ఇది యిటుండ నశోకుని సోదరసోదరీజనంబు లాయనప్రభుత్వ మధ్యకాలము వఱకు సజీవులయి యుండిరనియు, వారంద అను రాజకుటుంబములోఁ జేరియుండిరనియు నారలయందుఁ బ్రభువునకు నత్యంతాదరము కలదనియు శాసనంబులు ఘోషించుచున్నవి. మఱియుచంద్రగుప్తుండు తన ప్రచండదోర్దండబలంబుచే నార్జించి, యనుపమానంబును నిరాటంకంబు నగు శాసనంబుచేఁ బరిపాలించిన మగధ రాజ్యంబు బిందుసారుని బాహుపీఠియందుఁ బంచవింశతి (25) వత్సరంబు లబాధితంబుగ వసియించె. తదనంతర మారాజ్య మశోకునిపాలనాధీనంబగుటకు ఘోరయుద్ధంబులుగాని, క్రూరహత్యలుగాని, రక్తప్రవాహములుగాని తటస్థించుటకవసరంబుండెనని నుడువుటకుఁ గారణంబుగానరాదనియు, నన్యతేవాదులయిన సన్యాసులచే లిఖింపఁబడిన పూర్వచరిత్రలయందుఁ గల్పితకథలకుఁ గొదువలేదనియు, నశోకచరిత్రకారుఁడయిన విన్సెంట్ ఎ. స్మిత్ సిద్ధాంతీకరించెను.

అశోకుని జన్మవృత్తాంతము.

చంపాగ్రామవాసి యగు బ్రాహ్మణునికూఁతురయిన సుభద్రాంగిని ఆమె జనకుండు పరిణయార్థము బిందుసారునికి సమర్పింప రాజభార్య లామెను దాసింగాఁ జైకొనునట్లు తంత్రముచేసిరి. పదంపడి యామె తన కౌశల్యముచేఁ దాను బ్రాహ్మణ కన్య యగుటను బిందుసారునికి శ్రుతపఱచి నమ్మించి ప్రభువుయొక్క ప్రేమను

బడసెను. అశోకుఁడు, విగతశోకుఁడు అనుపుత్రద్వయంబు బిందుసారునివలన నామెకుఁ గలిగిరని నేపాళదేశమందున్న భరతఖండపూర్వచరిత్రవలనం దెలియవచ్చుచున్నది.

మఱియుఁ దత్పుత్రద్వయంబులో జ్యేష్ఠుఁడైన యశోకునిమీఁదఁ గంటెఁ గడమభార్యలవలనఁ గలిగిన పుత్రసంఘములో జ్యేష్ఠునిమీఁద బిందుసారుని కధికప్రేమ యుండెను.

అశోకునియందు మహావీరలక్షణంబులను గనిపెట్టినను ఆయన దైవబలంబు గలవాఁడని గ్రహించినను దన యవసానకాలంబున సింహాసనారోహణమునకు బిందుసారుఁ డశోకునిం దలఁపక యాపుత్రునె రావించెను. అతనియందుఁ గొన్నికారణంబులచే నమాత్యాదివర్గంబు బద్ధద్వేషంబై కుహకవృత్తిచే నతఁడు మరణించునటులఁ జేసి యశోకునిరాజ్యపదంబు నందునిల్పినటుల హిందూచరిత్రలవల్లఁ దెలియుచున్నది. ఎట్లయిన నశోకుని సింహాసనారోహణము కించిత్కాలహాపురస్సరం బైయున్నటులనె యూహింపఁదగియున్నది. సింహళదేశచరిత్రలును హిందూదేశచరిత్రలు నీచరిత్ర కనుబంధములుగా లిఖింపఁబడును. కనుక వానివలనఁ దత్కాలస్థితులు సవిస్తరంబుగఁ జదువరులకుఁ దెలియఁగలవు.

వక్ష్యమాణచరిత్రాంశంబులకు నించుకంత సంబంధించియుండుఁ గాన నిం

కొకవిషయం బిచ్చటనె వక్కాణింపఁబడును.

అశోకుఁ డొకవర్తకుని జనక నియామకంబున నశోకుఁ డుజ్జయినియం

కొమరితను వివాహమాడుట. దు రాజప్రతినిధిగ నున్నప్పు డొకవర్తకుని

కొమార్తెను బాణిగ్రహణంబుఁ జేసికొని

యామెవలన మహేంద్రుఁ డనుపుత్రుని సంఘమిత్ర యనుపుత్రికను బడసి తాను పాటలీపుత్రమునకుఁ బోవునపుడు హీనస్త్రీ యనుచు నామెను విడిచి వెళ్లె నని సింహళచరిత్రలయం దున్నది.

అశోకుని ప్రభుత్వకాలముయొక్క యాద్యష్టవర్షముల విశేషంబులను జరిత్రలు గాని శాసనంబులు గాని విశదపఱచి యుండలేదు.

**అశోకుఁడు కళింగరాజ్యమును జయించుట.**

తొమ్మిదవసంవత్సరంబున కళింగ రాజ్యముపై నశోకుండు యుద్ధయాత్రఁ జేసెను. కళింగదేశము బంగాళాఖాత తీరమున మహానది గోదావరి నదులకు నడుము నున్న ప్రదేశము. ఈరాజ్యము నాకాలమం దనఁగా క్రీ. పూ. 262 సంllలోఁ బ్రబలముగానె యుండెను. అది 60,000 కాల్బలమును, 10,000 గుఱ్ఱపు దండును, 700 ఏనుఁగులను గలిగియుండెను. కాళింగులు స్వాతంత్ర్యముం గోరి వీరావేశంబుతోఁ బోరాడిరి. వీరు మగధరాజ్యమునకు నంతవఱకు లోఁబడియున్నట్లు కనుపట్టదు. ఘోర యుద్ధానంతరము దిగంతవిశ్రాంతకీర్తిసమేతయై జయలక్ష్మి యశోకుని భుజదండంబుల నలంకరించెం గాన కళింగరాజ్యము మగధరాజ్యమునకు లోఁబడెను.

**అశోకుని విచారము.**

ఈజయంబును బరరాజ్యసంపాదనంబు నశోకున కానందంబు నొసంగక యెడతెగని విచారంబునకుఁ గారణంబు లయ్యె. మఱియు నీజయశాలి తనవిచారంబును విజితులకష్టంబులను శిలాక్షరంబులతో శాశ్వతవచనంబులఁ జేసె. ఈశాసనగ్రంథంబు నెప్పుడు చదివిన నది చదువరుల డెందంబులను వ్యసనంబుచే నుఱ్ఱూత లూగించుటంజేసి యశోకుని విచారంబు కాలప్రవాహంబుపై ననవరతయాత్రం జేయుచున్నట్లు దోఁచెడు. అది యటుండ నీచింతాబీజంబు అశోకుని హృదయక్షేత్రంబున గాటంబుగ నాటుకొని క్రమక్రమంబుగఁ బ్రవృద్ధంబై ప్రబలవృక్షంబై లోకానందకరంబయినధర్మఫలంబు నుదయింపఁజేసె నని ముందు చెప్పఁబోవువృత్తాంతంబులు విశదీకరింపఁ గలవు. అశోకుండు తాను నిర్మించినశాసనములయందు "ప్రియదర్శి" యనునామాంతరంబు వహించెను. కళింగయుద్ధానంతరము

5 సం॥లకు నిర్మింపఁబడిన పదమూఁడవ శిలాశాసనమునందు నశోకుం డిట్లు లిఖింపఁజేసె.

13-వ శిలాశాసనమం దున్నవిచారవచనములు.

(1) ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు,సింహాసన మెక్కినపదంపడి తొమ్మి దవ వత్సరంబునఁ, గాళిందులను జయించెను.

(2) ఒక లక్ష యేఁబదివేల జనులు చెఱఁబెట్టఁబడిరి. లక్ష సైనికులు హతులైరి. ఇఁక నెందఱో రోగాదులచే నశించిరి.

(3) కళింగరాజ్యసంపాదనము మొదలుకొని ప్రభువు ధర్మసంరక్షణంబుఁ జేయుచు బౌద్ధధర్మావలంబి యై తద్ధర్మశాసనములను బ్రకటించెను.

(4) కళింగరాజ్యము జయించినందుకు రాజు చింతంచుచున్నాఁడు. ఏలయన నూతన రాజ్యసంపాద నేచ్ఛవల్ల హత్య, మరణము, చెఱఁబట్టుట, యిట్టి ఘోర క్రూర కృత్యములు ప్రభువునకు గాఢవిచారకారణంబులు గా నున్నవి.

(5) ఇంతకంటె విచారపడుటకుఁ గొండొక కారణంబు కలదు. ఏమనఁగ నట్టిదేశములయందు బ్రాహ్మణులు, యతులు, నానాజాతులవారు, సంసారులు నుందురు. వీరు మహాజనులకును జననీజనకులకును గురువులకును విధేయులై మిత్రులను బరిచయులను జతకాండ్రను బంధువులను, సేవకులను, యథాన్యాయంబుగ నాదరించుచు దైవభక్తియుతులై యుందురు.

(6) తాదృశులకు బలాత్కారమును, వధయుఁ, బ్రేమాస్పదులనుండి వియోగమును బాటిల్లును.

(7) యుద్ధానంతరము సజీవు లయియున్నవారలు యుద్ధమందు నశించిన తమస్నేహితులను, బంధువులను, బరిచయులను బ్రేమచేఁ దలఁపక మానరు. కావున జీవించియున్నవారికిని నిర్విఘ్నంబుగ ఖేదంబులు కలుగఁజేయఁబడుచున్నది.

(8) ఇట్లు వారల నలముకొనినదుఃఖమంతయు రాజునకు విచారకరం బయియున్నది. ఏలనన బ్రాహ్మణులయొక్కగాని విరాగులయొక్కగాని సంఘములు లేనిదేశమును దమశాఖయందు మాత్రమె యభిమానంబు గలప్రజ లుండుదేశమును లేవు.

(9) కళింగదేశమందు యుద్ధనిహతు లయినవారియొక్కగాని కారాగృహవాసులయొక్కగాని సంఖ్యలో శతాంశమయినను సహస్రాంశమయినను ప్రభువు నయిననాకు సాంద్రదుఃఖవిషయం బయియున్నది.

(10) ఏమానవుఁడు గాని తన కన్యునివలన బాధ కలిగినను సాధ్యమగువఱకు నాబాధను సహింపవలసినదె యని ప్రభు వభిప్రాయపడుచున్నాఁడు.

(11) తనరాజ్యమందున్న యాటవికజనంబుల నన్వేషించి నిర్మూలంబు చేయుమని యమాత్యవర్గంబు హితోపదేశంబుఁ జేయుచున్నను వారిని బాధించుటకుఁ దాను సమర్థుండై యున్నను వారియెడల రాజు కనికరముఁ గలిగియుండును. దుష్టకృత్యములను మానినయెడల వారిని నేను నశింపఁజేయనని వారికిఁ దెలుపుచున్నాను. సమస్తజీవులును సురక్షితముగ నుండి యింద్రియోద్రేకముల నడఁచి చిత్తశాంతిఁ గలిగి సుఖం బుండుట ప్రభువుయొక్క యభిప్రాయము.

(12) ధర్మజయమే జయమని ప్రభువుయొక్క తలంపు.

**బౌద్ధభిక్షువుల కల్పితకథలు.**

అశోకుఁడు బౌద్ధమతావలంబి యై జీవావధిగాఁ దదాచరణంబు స్వయముగా నొనర్చుటకు నిశ్చయము కలవాఁడై సర్వజనులచే నాచరింపఁజేయఁ గుతూహలి యయ్యె నని గ్రహించుటకు నీపదమూఁడవ శిలాశాసన మొక్కటియె ముఖ్యాధారము.

అసంగతములును విపరీతములు నయినకల్పితకథలను వ్రాయుటకు దక్షు

లయినభిక్షువు లీమహాప్రభువు తనమనస్సు నిట్లు ధర్మమార్గానుసారంబుగ మార్చుకొనుటకు కారణంబులం దెల్పునట్టి వేవో కొన్ని కథలు వ్రాసిరి; కాని ప్రభువు స్వయముగా వచించి వివరించిన యంశంబుల కవి యను కూలించియుండనందున విశ్వాసపాత్రములు గాజాలవు. బౌద్ధమతబోధకుం డొకానొకఁ డశోకునికి బౌద్ధమతమును బట్టుదలతో బోధించి హృదయం బున నాటునటులఁ జేసి యుద్ధజనితము లయినఘోరకృత్యములకుఁ బరిత పించులాగున నొనరించియుండవచ్చు ననియు,

ఉపగుప్తుఁ డశోకునికి ధర్మంబు దెల్పెననుట

ఆభిక్షువు ఉపగుప్తుఁ డయియుండె ననియుఁ బూర్వచరిత్రలు కూడఁ దెల్పుచున్నవి.

ఇట్లుండ నశోకుఁడు తాను పరబోధితుండు గాక స్వయంబుగ బౌద్ధమతంబుఁ గైకొని యభివృద్ధిం జెందితి నని నొక్కి వక్కాణించెను. అయినను బరబోధితుం

అశోకుని వచనములు.

డనియె చరిత్రకారు లూహించిరి. ఎట్లయినను గలిగిన జ్ఞానము నిత్యమై సత్యమై లోకోప కారకమై యనేకశాసననిర్మాణమునకును వాని వినియోగమునకును సాధకం బయ్యె. ఇచ్చట నొక్కవిశేషంబును గ్రహిం

చరిత్రకారుల యభిప్రాయము.

పవలసియున్నది. ఈభరతఖండమందుఁ గాని యూరోపుఖండమందుఁ గాని యేరాజయి నను రాజసవృత్తి ప్రధానుఁ డయియుండిజ్ఞాన మార్గావలంబి యగుట చిత్రంబుగఁ దోఁచును. మఱియు నాత్మయందుఁ గాని దైవమందుఁ గాని లక్ష్యానుసంధానము లేకుండ కేవలధర్మానుష్ఠానంబువల్లను ఇంద్రియజయమువల్లను నిర్వాణపదంబు నొందెద నని బౌద్ధధర్మంబునువిశ్వ సించి యట్టిరాజు కడంగుట చిత్రతరంబుగ నున్నది. సామాన్యబుద్ధిశాలి కిది దుస్సాధ్యంబు. కాఁబట్టి యశోకుం డనన్యసామాన్య మగుబుద్ధివికాసం

బును నిశ్చయజ్ఞానంబును గార్యనిర్వాహక సామర్థ్యంబుఁ గలవాఁ డని చరిత్రకారులు పల్కిరి.

తాను స్వయముగానె బౌద్ధమతమం దభివృద్ధి నొందితి ననెడియశోకుని వాక్యంబు లాయన పరిపాలనకు వచ్చినపద కళింగరాజ్యజయానంతరము మూఁడవవత్సరంబునలిఖింపఁబడియె. కడపటి రాజ్యపరిపాలనయం శాసన మిరువదియెనిమిదవవత్సరంబున లిఖిత దశోకునిముఖ్యోద్దేశము. మఱియు. ఈమధ్యకాలమందు లిఖింపఁబడిన యన్ని శాసనములయందు ధర్మమూలక మయిన జయమె జయ మనువాక్యంబునకు నసంగతంబుగ నేమియు నశోకునిచే వ్రాయఁబడలేదు. తనపరిపాలనకాలంబులోఁ దొమ్మిదవవత్సరంబునఁ జేయఁబడినకళింగరాజ్యసంపాదన తప్ప మఱి యేయుద్ధకార్యము నశోకుఁ డొనర్పక తదనంతరము బౌద్ధమతసిద్ధాంతములను బ్రకటించి వ్యాపింపఁజేయుటచేఁ దనప్రజలకును బ్రాంతదేశప్రజలకును సౌఖ్యమును క్షేమమును గలుగజేయు ముఖ్యోద్దేశముతో రాజకీయ వ్యవహారములయం దాయన తనపరిపాలనకాలం బపనయించె. ఆయన పాలనయొక్క పదునాల్గవవత్సరంబునఁ బదియవ శిలాశాసనము వెలయింపంజేసె. వీనియందు ధర్మకీర్తికిని యుద్ధకీర్తికిని గలవ్యత్యయమును ముఖ్యముగాఁ బ్రదర్శించెను.

మ. ఘన మైనట్టికళింగరాజ్యమును సంగ్రామంబునం గెల్చి త
జ్జని తానేకజనప్రణాశమునకుం జాలంగఁ జింతిల్లి తృ
ష్ణను దూషింపుచు, నన్యరాజ్యములకై జన్యంబుఁ జాలింతు నా
కును నారాజ్యము చాలునం చనె, నశోకుం డెంత పుణ్యశ్లోకుఁడో||

## 3-వ అధ్యాయము.

## అశోకుఁడు బౌద్ధభిక్షువై మతవ్యాపకము చేయుట.

---

అశోకునకు అశోకవర్ధనుఁడనియు నామంబు కలదని చరిత్రలవల్లఁ గనుపట్టుచున్నది. ఈప్రభువు పాలనమునకు వచ్చిన

**అశోకుఁడు భిక్షువగుట.**

తొమ్మిదవయేట ననఁగా క్రీ. పూ. 263-వ సంవత్సరములో బుద్ధమతోపాసకుఁ డయినట్లీయన వచనములవల్లనె యగపడుచున్నది. తదనంతరము తన్మతసిద్ధాంతశ్రవణసంజాతోత్సాహియై యాసిద్ధాంతంబులు స్వర్గద్వారకవాటపాటనం బొనర్చి యీజన్మమందును ముందుజన్మమందును మానవకోటికి క్షేమ సుఖదాయకము లగునని భావించి తత్సిద్ధాంతరక్షణవ్యాపకంబులయందుఁ దనజీవితకాలమును రాజ్యసాధనములను నుపయోగించుటకుఁ గృతనిశ్చయుఁడయ్యెను. ఈకారణంబుననె యశోకవర్ధనుఁడు క్రీ. పూ. 263-వ సంవత్సరాంతమందు సప్రమాణంబుగ భిక్షువయి సంఘ

**అష్టాంగమార్గమందు బ్రవేశించుట**

ప్రవేశం బొనరించెను. పిమ్మటఁ బదుమూడవ పాలనా వత్సరములో బౌద్ధమతాంగమార్గమందుఁ బ్రవేశించిన ట్లెనిమిదవశిలాశాసనము ప్రకటించుచున్నది.

మహారాజవైభవానుభవంబందున్న యీ యశోకవర్ధనుఁడు దాని నకారణంబుగఁ ద్యజించి భిక్షువగుటకు సాహసిం

**అశోకుఁడు భిక్షువగుటను గూర్చి పాశ్చాత్యుల యభిప్రాయము.**

చుట వర్తమాన యూరోపుఖండ వాసులకు సంశయాస్పదం బగుటంజేసి మొదటిలఘుశిలాశాసనంబునంగల యశోకునిస్వవచనంబు లనఁ

గా సార్థద్వయ (2½) వత్సరంబులవఱకు నిర్లక్ష్యోపాసకుండనుగా నుంటి నను లిఖితం బాధారంబుఁ జేసికొని యాయన స్వీకరించిన భిక్షుత్వము నేమోరీతిగ వారన్వయింపం దొడంగిరి. అశోకుని వచనంబుల శబ్దార్థానుసారంబుగ నన్వయించి యంగీకరించుటకు సంశయింపఁ దని లేదు. చాళుక్యవంశ ప్రభువయిన కుమారపాలుఁ డను జైనుఁడు తాను బౌద్ధమత సంఘాధిపతినని బిరుదువహించి యీదిగువ నియమంబుల ననుసరించెదనని ప్రమాణంబుల ననేకపర్యాయములు చేసినట్లు బూలరు చరిత్రకారుఁ డుదాహరించి యుండెను.

కూరపాలుఁడను జైన ప్రభువు.

1. ఇంద్రియముల వశపఱచుకొనుట;
2. అన్నపానములయందుఁ బరిమితత్వము;
3. జంతుమాంసవర్జనము;
4. సాంఘికులసొమ్మును ప్రభువు గ్రహింపకుండుట.

తద్విధంబున నె యశోకుండును జేసియుండవచ్చును.

సింహళద్వీపమందును బర్మాయందును సామాన్యజనులు ప్రమాణంబులం చేసి బౌద్ధధర్మం బవలంబించి కొంతకాలం బాచరించి పిమ్మట విరమించుట యిప్పటికిని గలదు. సామాన్యులకె యిట్టి యవకాశం బున్నప్పుడు ప్రభువున కేమిప్రతిబంధకం బుండును? ఇదియునుగాక బుద్ధమతప్రవేశనిబంధన లనివార్యములను జీవితకాల దీక్షఁగలవియుఁ గావు. భిక్షుత్వమునుగూడ స్వనగరియందె రాజు సులభంబుగ నెఱవేర్చుకొనఁగలఁడు. ఇది యిట్లుండ నశోకుని తరువాతే 1000 సంవత్సరములకు నీ దేశమున కేతెంచిన చీనాదేశయాత్రికుఁడు శిలాప్రతిమలయందశోకుఁ డొకవిధమయిన భిక్షువేషము ధరించినట్లుండెనని లిఖించెను. ఈ

పాశ్చాత్యుల సంశయ నివారణ.

కారణంబులం బట్టి యశోకుఁడు భిక్షువగుటకు సందియం బుండదని యశోక చరిత్రకారుఁడైన విన్ సెంట్ ఎం. స్మిత్ సమర్థించియుండెను.

అశోకుఁడు ధర్మోపదేశకులను బంపుట.

బౌద్ధమతరక్షణమునందును వ్యాపకమందును నభిలాష వృద్ధియయిన కొలంది స్వరాజ్యమందు మతాభివృద్ధిఁ జేయుటయే కాక ధర్మోపదేశకుల నన్యరాజ్యములకుఁ బంపుటయను మహోద్యమము నుపక్రమించెను. పదునొకండవ పాలనవత్సరానంతరము రెండు సంవత్సరములలో సింహళమునకును దక్షిణప్రాంతముల నున్న స్వతంత్రరాజ్యములకును, బొంబాయితీరమునకును, మహారాష్ట్ర దేశమునకును, హిమాలయపర్వతములకును, కాశ్మీరదేశమునకును, గాంధారమునకును, పెగోదేశమునకును, ధర్మోపదేశకులను బుత్తెంచెను. ప్రతిదేశమునకు నయిదుగురిని సమూహముగాఁ బంపెను. వారిలో నొకఁడు ప్రధానోపదేశకుఁడు కడమవారు సహాయోపదేశకులు.

కొన్ని దేశములకు ధర్మోపదేశకులను బంపలేదనుట.

సిరియా, ఈజిప్ట్, మాసిడోనియా (Macedonia), ఎపిరసు (Epyrus), కైరీను (Kyrene), దేశములకుఁగూడ ధర్మోపదేశకులను బంపినట్లు పదుమూఁడవశిలాశాసనమందున్నది. పైనుదాహరింపఁబడినవారు గ్రీసు దేశపురాజు లయి యుండిరి. ఆ దేశములకు ధర్మోపదేశకులను బుత్తెంచియుండుట యవాస్తవంబనియుఁ బరదేశాధిపతియు విజాతీయుఁడు నైన ప్రభువు చేయు నుపదేశంబులను విశ్వసించి వారు తమ మతసిద్ధాంతములనుద్యజించియుండరనియుఁ దెల్పుచు, నటుల ధర్మోపదేశకుల నాదేశములకుం బుత్తెంచిన విషయము పురాతనచరిత్రలయందుఁ గానం బడదు. మఱియుఁ బ్రభువు లాత్మస్తవలోలురు. కనుక తద్దోషం బించుకంత యశోకునియందుఁ బొడసూపెనేమొ యని బౌద్ధకాల హిందూదేశచరిత్ర

కారుఁడైన దేవిడ్సుదొర వ్రాసియుండెను. ఇది యల్పవిషయంబని తలఁచి యేమొ దీని నశోకచరిత్ర కారుఁ డుదాహరింప నుపేక్షించెను. ధర్మోప దేశకులు వెళ్లిన ప్రతి ప్రదేశమందును బౌద్ధమత మవలంబింపఁబడిన దని భిక్షులు వ్రాసిన కల్పితకథలను నమ్మఁగూడకున్నను, ఆయా దేశములయందు బౌద్ధమతమునకుఁ బునాదులయిన నేర్పడినట్లు నుడువవచ్చును. సింహళమునం దప్పటినుండి నేఁటివఱకును బౌద్ధమతావలంబన మున్నది.

సింహళద్వీపమునందు బౌద్ధమతస్థాపనవిషయమై కొంతవిశేషంబు కలదు. సింహళద్వీపమునకు బోధి నుండై శాక్యముని విజ్ఞానవంతుం డయ్యె నని బోధగయయం దున్నవృక్షంబుక్రింద నాసీ వృక్షశాఖను గొంపోవుట. తత్వృక్షశాఖను మహావైభవముతో నుత్సవం బొనర్చుచుఁ గొనిపోయి సింహళమందుఁ స్థాపించిరి. ఈవైభవం బంతయు సాంచివనప్రాగ్శిలాద్వారమందుఁ బ్రతిమాకారంబుగాఁ జెక్కఁబడియె. ఈశిలాప్రతిమ లీవిషయమువలనే పురాతనములయియుండెను. దిగువభాగమం దున్న ప్రతిమలలో మధ్యగా బోధివృక్షము చెక్కఁబడినది. ఇట్లె గయయం దున్నబోధివృక్షముచుట్టు నగ మెత్తున నావరణగా నశోకునియాలయ మున్నది. శిలాప్రతిమలలో బోధివృక్షమునకు నిరుప్రక్కల గాయకజన ముండిరి. తూర్పున రాజకీయుఁ డొకఁడు హయావరోహణం బొనర్చుచున్న ట్లున్నది. ఈరాజకీయుం డశోకుం డయియుండును. ఈప్రతిమలలో నుత్తరభాగమం దున్నవానిలో నొకస్తంభమందుఁ జిన్నబోధివృక్షంబు ప్రదర్శింపంబడియె. దానికిఁ బడమరగా గొప్పపరివారమును అనిరుద్ధపురమొ లేక తామరలిప్తినగరమొ చెక్కఁబడెను. ఈయుభయ నగరములలో దేనికో బోధివృక్షమును సింహళమునకుఁ గొనిపోవుటకుఁ బూర్వము తీసికొనిపోయి యుందురు. దిగువభాగమం దొకపార్శ్వంబున మయూరంబులను రెండవపార్శ్వంబున సింహములను జెక్కిరి. ఇంచు

మయూరములు మౌర్యవంశపుగుఱుతులుగను సింహములు సింహళప్రభువుల గుఱుతులుగను నున్నవి. మయూరశబ్దమునుండి కొన్నిమార్పులు పొంది మౌర్యశబ్దము వచ్చియుండును. ఇవియును మఱియు ననేకవిషయంబులును సవిస్తరముగా సింహళచరిత్రలయందున్నవి. తద్విషయంబుల నన్నిటిని జరిత్రకారు లేకగ్రీవముగా విశ్వసింపకున్నను బోధివృక్షము నింతయుత్సవముతోను వైభవంబుతోను గొనిపోవుటమాత్రము సత్యమనియే యెంచవలెను.

సింహళపురాణములవలని యుపకారము.

ఈవిషయమై సింహళచరిత్రలు మనోహరములుగాను జ్ఞానబోధకములుగాను లిఖింపఁబడినవి. తదాదిగ నింతవఱకును బుద్ధమతగ్రంథసామగ్రిని సమృద్ధిగా నుంచి తాత్కాలికపరిజ్ఞానులు తదనంతరసంతతులకుఁ బారంపర్యజ్ఞానఫలదాత లయి చరిత్రకారుల కప్పటిబౌద్ధహిందూమతంబులవివరంబు విశదంబుగఁ దెలియఁజేసిరి. ఇట్లని బౌద్ధకాలహిందూదేశచరిత్రకారుఁడు వ్రాసెను. పైని వ్రాసినప్రకారము ధర్మోపదేశకులను బంపుట మానవచరిత్రలో బహుముఖ్యవిషయమై యున్నది.

అశోకునికిఁ బూర్వమునను దరువాతను బుద్ధమత వ్యాప్తి.

అశోకుఁడు బౌద్ధమతము నవలంబింపకపూర్వ మీమతము రెండువందల యేఁబది సంవత్సరములు గంగానది పల్లపుభూములందు మాత్రమే వ్యాపించియుండెను. ఇంతసంకోచముగా తత్కాలమందున్నమత మీయశోకునికాలమందు బహుదేశమత మగుటంజూడ బౌద్ధమత మనులతను బుద్ధమునిసింహుఁడు తనబోధరసంబుచే వృద్ధిగావించి సంఘమనుపందిలి నేర్పఱచి కొంతవఱకు వ్యాపింపఁజేసె ననియుఁ బదఁపడి 250 సం||లకు నశోకుఁ డనుధర్మక్షేత్రకృషికుఁడు శాసనములను స్తంభంబులను బహుప్రదేశములందు స్థాపించి సంఘ మనుపందిలిని విస్తరించి, తననిర్మలబోధరసంబుచేఁ దన్మతరూపలతను

లెస్సఁగఁ బోషించి, దానిని నిరాతంకముగ వ్యాపింపఁజేసి, యాలతా సంరక్షణార్థము ధర్మోపదేశకులను కావలికొండ్ర నుంచి, నిర్వాణఫలంబుఁ గావించె ననియు వర్ణింపఁదగియున్నది.

బౌద్ధ సన్యాసులు వ్రాసినవింతచరిత్రలయందు నశోకుండు మతాచార్యుల యధీనమం దుండి వారిచేతులలోఁ గీలుబొమ్మవలె నాడుచుండె ననియు ధర్మోపదేశకులను బంపుట యనుమహాత్కార్యవిఖ్యాతి గురువులకే చెందవలయు ననియు వ్రాసిరి; ఇందుకు నిదర్శనముగా సింహళదేశమం దున్నమహావంశచరిత్రలో 12-వ అధ్యాయములో నిట్లు వ్రాయఁబడియున్నది. మొగ్గలిపుత్రుండును

*బౌద్ధసన్యాసుల యధికారము.*

*తిష్యుఁడుధర్మోపదేశకులను బంపుట.*

తిష్య (Tissa)నామధేయుండు నగుబౌద్ధమతసన్యాసి ధర్మోపదేశకుల నీదిగువ నుదాహరింపఁబడిన ప్రకారము పంపెను.

| ఉపదేశకుని పేరు. | ప్రదేశములు. |
|---|---|
| మధ్యాంతిక (Majjhantika) | కాశ్మీరగాంధారములకు. |
| మహాదేవ (Mahadeva) | మైసూరులో నున్నమహిష మండలమునకు. |
| రక్షిత (Rakhsita) | ఉత్తరకన్నడములో నున్న వనవాసికి (Vanavasi) |
| యవనధర్మరక్షిత (Yonadharma Rakshita) | బొంబాయికి నుత్తరముగా సముద్రతీరమందున్న అపరాంతకమునకు. |
| మధ్యమ (Mjjhima) ఈయనసహచరులు కశ్యప (Kasyapa) | హిమాలయ పర్వతములకు. |

| ఉపదేశకుని పేరు. | ప్రదేశములు. |
| --- | --- |
| మాలికాదేవ (Malikadeva)<br>దుంధుభిన్నోస (Dundhubhinno-ssa)<br>సాహసదేవ (Sahasadeva) | హిమాలయ పర్వతములకు. |
| సోనా (Sona)<br>ఉత్తర (Uttara) | స్వర్ణభూమికి (Sovarnnabhumi) (Pegu) |
| మహాధర్మరక్షిత (Mahadharma rakshita) | మహారాష్ట్రదేశమునకు. |
| మహారక్షిత (Maharakshita) | వాయువ్యమూలనున్న యవదేశమునకు. |
| మహామహేంద్ర (Mahamahendra)<br>ఈయనయనుచరులు<br>ఇత్తియ (Ittiya)<br>ఉత్తియ (Uttiya)<br>సంబల (సంబల)<br>భద్రశాల (Bhadrasala)<br>వీరందరును మొగ్గలిపుత్రుఁడైన టిస్స యొక్క శిష్యులు. | సింహళమునకు. |

మధ్యముఁడు కశ్యపుఁడు మొగ్గలిపుత్రుఁడైన టిస్సా వీరలయొక్క యస్థిక లొకపాత్రయం దుంచఁబడి సాంచి (Sanchi) స్తూపమునందు నిక్షిప్తము చేయఁబడినవి. అలాగుననె యచ్చటనె యన్యపాత్రయందు కశ్యపుని యస్థికలు భూస్థాపితము చేయఁబడినవి. ఈపాత్రలయందు వారి

పేళ్లు చెక్కఁబడినవి. మఱియు దుందుభిస్సారునకనంతరము హిమాలయప్రదేశములయందు ధర్మోపదేశకుఁడైనగోటిపుత్రుని (Gotiputta) యస్థికలపాత్రకూడ నక్కడనె యున్నది. దానియందును పేరు చెక్కఁబడియె యున్నది. ఈప్రబలసాక్ష్యములం బట్టి ధర్మోపదేశకులను బంపువిషయము వఱకు మహావంశగ్రంథము విశ్వాసపాత్రం బని వక్కాణించుచు టిస్సావారిని పంపె ననుటను నశోకచరిత్రకారుఁడు సమ్మతింపలేదు.

తత్కీర్తి సర్వంబును స్వార్జితం బని యశోకుఁడు లిఖించియుండెం. విస్తీర్ణరాజ్యంబును బహుకాలంబు పాలించి తన యనన్యసామాన్యప్రజ్ఞావిశేషంబును వెలయింపఁజేసిన యశోకుండు గురువులహస్తంబులలోఁ గీలుబొమ్మవలె నుండె ననుట యసంగతంబు గానఁ దత్కీర్తి నశోకునికె చెందింపఁదగియున్నది.

**అశోకుని ధర్మకార్యములు.**

ఈపుణ్యపురుషుండు తనరాజ్యంబునందు ఛాయాదానఫలప్రదానదక్షంబులగువృక్షంబుల నుద్భవింపఁజేసి, బావులఁద్రవ్వించి బాటసారులకు విశ్రాంతి గృహనిర్మాణంబు గావించి రాజబాటలయం దుచితదూరంబులందు పానీయశాలలఁ జలివేంద్రలఁ బెట్టించెను. వైద్యంబున కనుకూలం బగుమొక్కలను మూలికలను దనరాజ్యమునందె గాక సమీపమందున్నమిత్రస్వతంత్రరాజ్యములయందును గూడ మొలిపించి వినియోగించునటుల నొనర్చె. మఱియు మానవవ్యాధులకే కాక పశువ్యాధులకుఁ గూడ నౌషధశాలల నేర్పఱిచి సౌఖ్యంబుఁ గలుగఁజేసె. ఇవ్విధంబున నశోకుండు మనుష్యులకును బశువులకును సర్వవిధంబుల సౌఖ్యదాయకుం డయ్యె. ప్రజాకుటుంబములఁ దనకుటుంబములుగ భావించి దానంజేసి తాను బహుకుటుంబి ననుకొని తద్బహుకుటుంబరక్షణార్థము బహుళాయాసంబుఁ బడియె.

తనపాలనయొక్క పదమూఁడవవత్సరంబున నిట్లని యాజ్ఞాపించె. ఆయా ప్రదేశాధికారులు పరిషత్తు నేర్పఱిచి యట్టిసభల యందు ధర్మమును జనులకు బోధించి, వివరించి సాధకబాధక విచారణ చేయవలెను. క్రింది తరగతులయుద్యోగస్థులట్టిపరిషత్తులకు విధిగా వచ్చి తమయధికారులవలన బోధల విని పిమ్మట వాని నాచరింపవలయును. ఇట్లు వచ్చుటచే రాజకీయవ్యాపారంబులకు భంగము కలుగఁగూడదు.

ధర్మసభలవిషయమై యశోకునియాజ్ఞ.

ప్రభువే ధర్మబోధనఁ జేయుచుండె నని ప్రజలు గ్రహించుట కిట్టియాజ్ఞ ముఖ్యసాధనంబుగ యోచించెను. బహుప్రదేశములయం దీపరిషత్తు లయిదు వత్సరంబుల కొకసారిగను, పాంచాలదేశములోని తక్షశిలయందును, మధ్యహిందూస్థానములో నుజ్జయినియందు నుండురాజప్రతినిధులు మూఁడు సంవత్సరముల కొకపర్యాయమును జరుపవలయు నని కూడ శాసించెను.

ఇట్లొకవత్సరం బయినపదంపడి తనబోధలు సార్థకంబు లగుటకు రాజకీయోద్యోగులఁ బ్రత్యేకంబుగ నియమించి ధర్మాధికారు లని నామంబిడి యశోకుఁడు వారికి విధించినపను లేమనఁగా.

ధర్మాధికారుల నేర్పఱచుట.

(1) ప్రభువునకు లోఁబడి విశ్వాసపాత్రులుగా నున్నవారికె గాక రాజాజ్ఞానుసారముగ స్వతంత్రపాలనములో నున్న సరిహద్దురాజ్యములయందలి ప్రజలకును బౌద్ధమతమును బోధించి వృద్ధి చేయవలయును.

వారుచేయవలసినపనులు.

(2) అన్నిజాతులప్రజలకు క్షేమసౌఖ్యములు కలుగుటకుఁ దనుశక్తి నంతయు నుపయోగింపవలయును.

(3) దరిద్రులకును వృద్ధులకును గలలోపాలోపములను శ్రద్ధతోఁ గనిపెట్టవలయును.

(4) చెఱసాలయందుఁ బెట్టుట శరీరదండన చేయుట యిట్టిశిక్షల విధించుటయం దక్రమముల నివారింపవలయును.

(5) వృద్ధనేరస్థుఁడు బహుకుటుంబి యయి యాకస్మికదుఃఖములోఁ మునిఁగియున్నప్పుడు శిక్షలను నుపేక్షింపవలయును.

(6) రాజసోదరసోదరీ జనులయొక్క యంతఃపుర స్త్రీపరిజనంబులను గుఱించి రాజధానియందుఁగాని తద్బాహ్యప్రదేశములయందుఁ గాని పైవిచారణఁ జేయుచుండవలయును.

(7) ధర్మకృత్యములనుజేయుప్రజలపై నుపద్రష్టలుగానుండవలయును.

తదనంతరము రాజకీయధర్మప్రవర్తకసంఘము (Royal Almaner's Department) నేర్పాటుచేసెను. ఈసంఘకృత్యములు పైని జెప్పినధర్మాధికారులును గొప్ప రాజకీయోద్యోగులును నెఱవేర్చుచుండిరి. రాజు గాని రాణులు గాని యొసంగు దానములను వీరు సద్వినియోగంబుఁ జేయింపవలయును. రాణిగారిపేరిట నొక ప్రత్యేక శిలాశాసన మిప్పటికిని జెడకుండనున్నది. ఈధర్మప్రవర్తకసంఘమునకు నశోకచక్రవర్తి విధించినయాజ్ఞలు శాసనములయందున్నవి.

**బుద్ధధర్మసంగ్రహము.**

శిలాశాసనములయందును శిలాస్తంభశాసనములయందును బుద్ధధర్మసంగ్రహము లనేకము లున్నవి. ఈయనేక శాసనసంగ్రహసారం బీదిగువ విశదం బొనరింపఁబడుచున్నది.

(1) స్వజనులను నాత్మీయసంతానముగా భావించును గాన వారాయనయెడలఁ బుత్రపుత్రికాయోగ్యమయిన విధేయతం జూపి యాయనవలన జనకయోగ్యం బయినశ్రద్ధాదికమును బడయుట కర్హులయియుందురు.

(2) ప్రతిమనుజుఁడు నింద్రియవశత్వమును, మనశ్శుద్ధియుఁ, గృతజ్ఞతయు, విశ్వాసము, నిట్టిసుగుణములను బ్రయత్నించి పడయుటకువిధింపఁబడు

చున్నాఁడు. మఱియు దురహంకారము, క్రూరత్వము, గర్వము, నసహిష్ణుత్వము నిట్టి దుర్గుణములను ద్యజింపవలయును. ఆత్మశోధనను సత్యసంధత్వమును నభ్యసింపవలయును.

(3) పశుపక్ష్యాదులును బవిత్రంబు లని భావించి వానియెడల దయాళువు లయియుండుట యనివార్య మని తలఁపవలయును.

(4) మాతాపితలయెడల విధేయతఁ జూపుటయు, వృద్ధులను గురువులను బూజించుటయు నవశ్యాచరణీయంబులు.

(5) బంధువులను, యతులను బ్రాహ్మణులను స్నేహితులను బరిచయులను యథాయోగ్యంబుగ గౌరవించి యౌదార్యమును జూపవలయును.

(6) ధర్మముఖ్యాంశంబు లందఱికిని సమ్మతంబె యగుటచేతను మనశ్శుద్ధియు జితేంద్రియత్వము నందఱు నపేక్షించుటంజేసియు బుద్ధధర్మమార్గం బనుసరించువారు ఇతరులమతం బవలంబించుట యెంతమాత్రమును దగదు.

రాజ్యసంబంధంబునఁ గొన్నియుపనిబంధనలఁ జేసె. అవి ఎవ్వి యనిన:

ఉపనిబంధనలు.

(1) పరిశుద్ధమనస్కుఁడగునుద్యోగి యసహిష్ణుత, పారుష్యము, అనుమానము, నివి లేనివాఁడై యుండవలెను. (2) సోమరితనమును, నిరుత్సాహమును నివారించెడి పట్టుదలను, ధృఢనిశ్చయమును గలవాఁడై రాజకీయోద్యోగమందు వన్నె కెక్కవలయు. (3) రాజాజ్ఞల నుల్లంఘించువారు దైవానుగ్రహమునకుఁగాని రాజానుగ్రహమునకుఁగాని పాత్రులుగా నేరరు. కళింగరాజ్యోద్యోగులు తమకు విధింపఁబడినపనులఁ గొంతవఱకె నెఱవేర్చినందుకు నిందింపఁబడిరి.

ధర్మజయబోధక మగు పదుమూఁడవ శిలాశాసనములో మగధరాజ్యప్రాంతదేశవాసు లగునాటవికజనంబుల సంహరించుటకుఁ దన కిష్టము లే

దని యశోకుండు ప్రకటించి యుండెను. ఆజనంబు లిక్కాలంబునను గళింగరాజ్యప్రాంతమందునివసించుచుందురు.

**అశోకుఁ డాటవికజనంబులఁ బాలించిన విధము.**

పదునాల్గవపాలన వత్సరంబున లిఖింపఁబడిన యీశాసనము మిక్కిలిమనోహరాంశంబులం గలిగియుండును. దీనియందు నాటవికజనంబులయెడల నడుచుకొనవలసినవిధుల నాప్రదేశప్రభువునకును దండనాధికారులకును అశోకుఁడు ప్రకటించిన ట్లున్నది. జనులందఱును (అడవిజనులు నయితేను) తనబిడ్డలె యని మఱలఁ బ్రకటించి రాజకీయోద్యోగులు తన యభిప్రాయముమేరకు నడుచుకొనక తప్ప దని యశోకుండు శాసించెను. ఆటవికజనంబులకు సౌఖ్యమె కలుగఁజేయుటభిలాష కలదు. కాని దుఃఖ పెట్టుటయం దభిలాష రాజయినతమ్మునకు లే దనియు వా రట్లు విశ్వసించు నటులఁ జేయవలయు ననియుఁ బైన నుడువఁబడినయధికారులకు నశోకుఁడు ఖండితముగా నాజ్ఞాపించెను. ప్రభువుయొక్కనిష్కపటస్వభావమును వా రెఱింగి నమ్మిరేని వారు కలత నొందక నెమ్మదిగ మెలఁగుదు రని యాయన నొక్కి వక్కాణించెను. ధర్మోపదేశములను త్రికరణశుద్ధిగ వా రభ్యసించి రేని వారియెడల రాజున కనుగ్రహ ముండు ననియు నిహపరలోకంబుల వారికి శుభంబు గలుగు ననియు నమ్మునటుల నడవిజనులను బ్రోత్సాహపఱచ వలయు నని రాజకీయోద్యోగులకు విధించెను. ప్రాంతాధికారులీయాజ్ఞలను సంపూర్ణముగ నెఱవేర్చిరేని యశోకుఁడు కృతార్థుఁ డయ్యె ననియె యెంచ వలెను. కాని యాజ్ఞాఘూపాత్రశాసనము నిప్పటికిని శేషించియున్నప్పటికి నవి చక్కగ నెఱవేఱిన ట్లేమియుఁ దెలియదు.

**జంతుజీవపావనత్వము.**

అశోకునిముఖ్యోపదేశములలో నొకటియైనజంతుజీవపావనత్వమును సప్రయోజకముగఁ జేయుటకుఁ దత్ప్రభుకృతము లయినయనంతరప్రయత్నముల ననేక

శిలాశాసనములు ప్రచురించుచున్నవి. ఆయన పాలనలో మొదటయెనిమిది వర్షంబులయందు జంతుజీవములు పావకము లనియె తలపఁలేదు. ఆకాలమందు రాజభోజనము నిమిత్తము వేలకొలఁది జంతువుల హతముఁ జేయుచుండిరి. 9-వ వత్సరము మొదలుకొని 13-వవత్సరము పర్యంతము దినదినము రెండు నెమళ్లను ఒకలేడిని సువారముకొఱకుఁ జంపుచుండిరి. తదనంతర వత్సరమునుండి శాసనములు నిర్మింపఁబడినవి. కాన నాస్వల్పహత్యయు వారింపఁబడియె. కుక్షింభరత్వమునకు జీవహింసఁ జేయుట యనుచిత మని విరమించుట కశోకుఁడు కృతనిశ్చయుం డయ్యె.

పదునొకండవపాలనావత్సరములో సత్యజ్ఞానమార్గమందుఁ బ్రవేశించెను.

ధర్మయాత్రలఁ జేయుట మే లని దెల్పుట.

మృగయాత్రకుఁ బ్రతిగా ధర్మయాత్రలు సేయుటయు నట్టియాత్రలయందు దానముల నొసంగుటయు ధర్మబోధలఁ గావించుటయు ధర్మవిచారణల నొనర్చుటయు జనులకు నియమించెను.

పదుమూఁడవపాలనవర్షంబులో సువారంబుకొఱకుఁ జేయుజంతుహింసను నివారించుటయె కాక తనరాజధానియందు

జంతుహింస చేయఁగూడదని యాజ్ఞాపించుట.

బలి నిమిత్తము చేయు పశువిశసనముం గూడ నిషేధించెను. ప్రజలందఱంగీకరింపరేమో యని తనరాజ్యమం దంతట నీనిషేధమును వ్యాపింపఁజేయలేదని సులభముగానె గోచరించుచున్నది. జంతువధాచారంబెగలయుత్సవంబులు రాజధానియందు జరుగఁగూడ దని యాజ్ఞాపించెను. ప్రజలు కిమ్మని యనక తనయాజ్ఞలను శిరంబుల ధరియించుటం జూచి యశోకుండు ప్రబలోత్సాహియై జంతుజీవపావనత్వమును గూర్చి తత్తదనుగుణవిషయంబులం జేర్చి యొకస్మృతిం గూర్చెను. జాతిభేదంబు

లను గాని సంఘాచారంబులను గాని మతాభిప్రాయములను గాని వివక్షింపక ప్రజల కందఱికి నాస్మృతిని విధించెను.

ఏజంతువులం జంపుట సూచముట్టుగ నిషేధించెను వాని నామ వివరణ పట్టిక (జాబితా) ప్రచురించెను. ఈసర్వనిషేధము చతుష్పాత్తులయందె వ్యాపించెను.

హింసింపఁగూడనిజంతువుల వివరణ.

ఏజంతువుల కళేబరములు భక్షణమునకుఁగాని తదితర కార్యములకుఁ గాని యనర్హము లయియుండునో వానిం జంపఁగూడ దని నిషేధించెను. ఈశాసనమువల్ల మృగయుల స్వాతంత్ర్యమున కాటంకము కలిగెను. ఏలయన దానిం బట్టి వ్యాఘ్రములనుగాని సింగంబులనుగాని సంహరింపఁగూడదు కదా. భక్షణయోగ్యము లయినజంతువులను గుఱించియు వివిధచిత్రవధ యనఁగా నంగచ్ఛేదము యొక్క నిషేధమును గుఱించియుఁ గొన్ని నిబంధనలు లిఖించెను.

చిత్రవధ.

సంవత్సరములో నేఁబదియాఱు ముఖ్యదివసములయందు మత్స్యగ్రహణవిక్రయంబులు చేయఁగూడ దనియు వేఁటాడి జంతువులం జంపఁగూడ దనియు శాసించెను. పండుగదినములయందును నితరనియమితదినములయందును నెద్దులకుఁగాని యితర చతుష్పాత్తులకుఁగాని విత్తులు తీయఁగూడ దనియు నాజ్ఞాపించెను. సర్వకాలములయందును గుక్కుటములకు విత్తులు తీయఁగూడ దనియు విధించెను. నిరూపింపఁబడిన పంచపక్షములయందు గుఱ్ఱములకును నితరపశువులకును వాతలు వేయుట యధర్మ మని ప్రకటించెను. ఈసూక్ష్మనియమముల నన్నిటిని జరిపించుపని ధర్మోపదేశకులకును దండనాధికారులకు నపరిమితముగ నుండియుండవచ్చును.

జంతుహింసా నిబంధనలు.

అశోకప్రభువు మరణదండనను గొట్టివేసె నని, యనేకకల్పితకథల

మరణదండనానిబంధనలు.

వలెనె, గ్రంథములయందు బౌద్ధమతసన్యాసులు లిఖించియున్నారు. అట్టితలం పాయన కెన్నఁడును బుట్టియుండ దనుట కాచక్రవర్తి నిర్మించినన్యాయచట్టములె తార్కాణంబులు. మరణదండన యనివార్యమనియు నించుకంత సదుపాయముగఁ జేయవచ్చు ననియుఁ జక్రవర్తి యొక్క యభిప్రాయ మయియున్న ట్లాయన వచించినవాక్యలవల్లనె గ్రహింపం దగియున్నది. దండనాధికారులు మరణదండన విధించుట యవసరంబని యభిప్రాయపడుచు నట్టిదండనను క్షమించునధికారమును దనయందె యుంచుకొని యాత్రీయపట్టాభిషేక సంవత్సరోత్సవకాలంబునఁ గారాగృహావాసుల కశోకుఁడు బంధమోక్షం బొసంగెను. మరణదండనకుఁ బాత్రుం డైనప్రతినేరస్థునకును దండనదివసంబునకుఁ బూర్వము లోకాంతరగమనసన్నద్ధుం డగుటకై దినత్రయవిశ్రాంతి యొసఁగవలయు నని యిరువదియేడవపాలనవత్సరంబున విధానం బొనర్చెను. చంద్రగుప్తుని శాసనంబీవిషయమున విపులంబును గఠినంబు నగుటంజేసి యీచక్రవర్తి కొంతసౌలభ్యంబుఁ గలుగఁజేసి వన్నెకెక్కె.

ప్రజలవిన్నపముల వినుటకు కాలము.

రాజద్వారమునకు వచ్చి ప్రజలు తమవిన్నపములను దనతో సర్వకాల సర్వావస్థలయందును మనవిచేసికొనవచ్చునని యీకరుణామయుఁ డైనప్రభువు ప్రజల కిచ్చిన స్వాతంత్ర్యమునుబట్టి న్యాయపరిపాలన యం దీచక్రవర్తికిఁ గలసత్యాభిలాషను వేనోళ్లఁ బొగడఁదగియున్నది. అట్టిమనవులను వ్యావహారిక క్రమచర్యారహితంబుగనె తీర్మానించినను దానిం గణింపక నిరాతంకముగఁ బ్రభువు దర్శనం బిచ్చుటనె భరతఖండవాసులు చేటికిం గొనియాడెదరు. ప్రజల కింతసులభంబుగ దర్శనం బిచ్చియవ్యవధానంబుగఁ యథేచ్ఛగ దీర్మానించుట పాశ్చాత్యుల

పాశ్చాత్యుల యభిప్రాయము.

దృష్టికి నసంగతంబుగను వ్యవహార ధర్మాపే తంబుగను గన్పట్టినను బ్రజానురాగసంపాద కంబయినచర్య నింతకంటె నేభరతఖండప్ర భువును జరుపలేఁడు. ఈ యిచ్చినస్వతం

తదభిప్రాయఖండనము.

త్రం బిట్లుండ నీప్రభువు నొక్క వక్కాణిం చినపలుకులు చూడుఁడు.

"చాలినన్నిప్రయత్నములను నే నొనరించుచున్నా నని కాని చేయవలసినంత వేగముగ వ్యాజ్యెములఁ దీర్మానించుచున్నా నని కాని నేను తృప్తినొందఁజాలను. లోకోపకారార్థము నేను కృషి చేయవలెను. జీవకోటికి నాఋణముఁ దీర్చుకొనుట యనఁగా వారిలోఁ గొందఱికయిన నీలోకంబున సుఖంబుఁ గలుగఁజేసి తన్మూలకమునఁ బరలోకసుఖప్రాప్తులనుగా నొన రించుట నాసర్వప్రయత్నములయొక్క ముఖ్యోద్దేశ మయి యున్నది."

ఇట్టివాక్యంబులం జూచి నీప్రభూద్దేశ మట్టిదయకాక యన్యం బని యె ట్లూహింపవచ్చు? కావున నిశ్శంకముగా నమ్మవలసినదె. బుద్ధునిమతమందు స త్యాభిమానియై తత్ప్రాబల్యమునకై యధికారపురస్సరంబుగ నీప్రభువు చేసిన యత్నములు నిష్ఫలంబులు కాలేదు. ఈయనకుఁ గలయుపదేశకాభిలాషకుఁ బ్రతికూలస్థితియు భంగములును బాటిల్లినను న్యాయంబుగనె యది జయం బొందినది.

బుద్ధమతోపదేశములను దానె యాచరించినయెడలఁ దన్ప్రజలును దన

బౌద్ధధర్మము నశోకుండు స్వయముగానాచరించుట.

రాజ్యప్రాంతజనంబులును తన్మతావలంబు లగుట కుత్సాహంబును విశ్వాసంబును గలవా రగుదు రని తిరంబుగ నమ్మి త్రికరణ

శుద్ధిగఁ దా నాచరించి వారికి బురోగామియయ్యెను. తాను మహాత్కా ర్యంబు లనేకంబుల నొనర్చితి నని శాసనంబులయం దనేకపర్యాయంబులు లిఖించి రాజభక్తు లగుప్రజలు నట్లాచరించుచుండిరని నమ్మెను. ఈవిషయమై యశోకుం డిట్లు లిఖియించె. “ఏయేయుత్కృష్టకార్యంబుల నే నొనరించు చుంటినొ వానిం బ్రజలు గ్రహించి యాచరించుచున్నారు. దీనంజేసి మతం బభివృద్ధి యగుచున్న దని నిశ్చయింపవచ్చును. ఇంక నభివృద్ధియై మాతా పితృభక్తి గురుభక్తి వృద్ధజనారాధనము, బ్రాహ్మణయోగి జనాదరణమును, దరిద్రులను దుఃఖితులను సేవకులనుగూడ దయతో నాదరించుటయు, నిట్టి సుగుణసంపత్తు శీఘ్రకాలంబున నెప్రజలకుఁ గలుగవచ్చును.”

రాష్ట్రాధిపతి యవిలంఘితశాసనుండై సన్మతావలంబియై తదాచరణ శీలుండై ప్రకాశించుచుండఁ బ్రజలును దదనుగుణాచరణపరాయణు లగుట యేమియబ్బురంబు.

అశోకప్రభువు తాను బౌద్ధమతా యత్తచిత్తుండ నయితినని వెల్లడిగా బా బ్రాశిలాశాసనమునందె లిఖింపఁజేసెనుగాని బౌద్ధధర్మమవలంబింపుఁడని యీసంగతి యితరశాసనములయందు లేదు. ప్రజలనునిరోధింపకుండుట. భారతీయులు తమ కనుకూలమయినయెడల బౌద్ధమతబోధల ననుసరింపవచ్చు ననియొ కడమశాసనములయం దున్నది. బౌద్ధమతగురువులకుఁ జెప్పినవచనములె బాబ్రాశాసనమందు లిఖింపంబడినవి. కావున నాశాసనమును దూరస్థ మయినపర్వతమం దున్నయొకమఠమందు స్థాపించిరి కాని యాయంశంబు లను బ్రజల కందఱకుఁ బ్రకటనఁ జేయలేదు. మతమందు వెఱ్ఱియభిమానము కలవాఁడై యామత మవలంబించుటకుఁ బ్రజలను నిర్బంధపెట్టె నని యీ బాబ్రాశాసనమువల్ల నూహింపందగదు. ప్రజలు నీతిమార్గానుసారు లగు మేరకె మతమును రాజకీయంబుగాఁ బ్రదర్శించెను గాని ప్రజలు తన్మతా

వలంబు లయిరో లేదో యనెడుగాఢవిచారణ యశోకుండు పెట్టుకొన లేదు.

ధర్మవిధులు.

జంతుప్రాణరక్షణఁ జేయుటయుఁ గ్రూరహింసలను మాన్పించుటయు నింక ననేకధర్మనియమంబులఁ గావించుటయు నిట్టి సద్విషయంబులంగూర్చి యనేకసూక్ష్మ విధుల లిఖించితి నని తృప్తింజెందెను గాని ప్రజలు ధర్మమార్గపర్యాలోచనులై పరిశుద్ధమనస్కులు కానియెడలఁ దాఁ జేసినవిధు లన్నియు ధర్మంబు నుజ్జీవింపఁ జేయ నేరవని యశోకుండు నిష్కళంకంబుగ భావించెను. సాధారణముగ స్త్రీలొనరించుపుణ్యకర్మలు దూష్యములును నిరర్థకములు నని గణించి వానియం దాదరము లేక యశోకప్రభువు ధర్మావలంబనము, క్షణభంగురము లయినయైహికసుఖంబుల నీఁజాలకున్నను పరలోకానంతపదవి నొసంగఁగల దని యామ్రేడితంబుగ వచించెను.

మృగయాయాత్రలు.

మృగయాయాత్రలను మాఱుగఁ బుణ్యక్షేత్రాలోకన యాత్రలు చేయంబడుట యెనిమిదవ శిలాశాసనమం దున్నట్టు గతంబున విశదీకరింపఁ బడియున్నది. బౌద్ధధర్మ మవలంబింపక పూర్వ మశోకరాజుయొక్క వేఁట వినోదము లీయనపితామహుఁ డైనచంద్రగుప్తునివినోదంబులనె పురడించుచుండెను. ఆవినోదములను మెగాస్తినసు రాయభారి యిట్లు లిఖించి యుండెను.

మృగయాయాత్రవర్ణన.

“రాజధానినుండి ప్రభువు బయలు వెడలుటకు మఱియొక కార్యము దేవతలకు బలియిచ్చుటయె. మూఁడవకార్యము మృగయాయాత్ర యైయుండెను. ఈకృత్యంబునకు నపరిమిత సురాపానవివశాత్ములై ప్రభువును దదనుచరులు నుందురు. ప్రభువు స్త్రీజనంబుచేఁ బరివేష్టింపఁబడియుం

డును. వీరిని జుట్టుకొని యీటెగాం డ్రుందురు. యాత్రామార్గమున కిరు దెసలను త్రాళ్లు కట్టుదురు. అత్రాళ్లనడుమకుఁ బోవుపురుషులుగాని స్త్రీలు గాని మరణదండనకుఁ బాత్రులగుదురు. వాద్యవిశేషంబులతో డంబముగా ముందు కొందఱు నడుచుచుందురు. మృగయార్థము నిర్మింపఁబడినయా వరణలయందు రాజు మృగముల వేటాడి యున్నతప్రదేశమందుండి బాణంబుల విడుచును. ఆయనపార్శ్వమం దాయుధంబు ధరించి యిద్దఱుగాని ముగ్గురుగాని స్త్రీ లుందురు. బహిరంగప్రదేశములయందు వేటాడునేని గజముపైనుండి రాజు శరంబుల సారించును. యువతీజనంబులలోఁ గొంద ఱరదంబు లెక్కుదురు. గొందఱు హయారోహణం బొనరించెదరు. మఱి కొందఱు గజారోహణంబుఁ జేసెదరు. రణరంగయాత్రకుంబలె వా రాయుధ హస్తలై కూడ నుందురు."

యుద్ధశూరత్వము గల స్త్రీలను ముఖ్యముగా (యవన) స్త్రీలను భటులనుగా నుంచుకొనుట భరతఖండరాజులకుఁ బరంపరాగతాచారం బయియున్నది. రాజానగరినుండి వెలువడినప్పు డెల్ల వెంట నీభటు లుండవలసినవారె.

ఉ. తా నొనరించి ధర్మమును దద్గతి స్వీయులుఁ బాలితప్రజ
ల్గానుగఁ జేయ శాసన మమందగతిం బ్రకటించి, తత్క్రియా
నూనప్రవర్తనంబును గనుంగొనఁగా నధికారివర్గముం
బూనికతో నశోకుఁడు ప్రభుప్రవరుం డొనగూర్చె, భక్తుఁడై.

ఉ. రాజవినోదకృన్మృగయ ప్రాణులహింసకు మూలమంచు నీ
రాజు తలంచి, మానుకొని, రాష్ట్రమునందున జంతుహింస నే
యోజ్యనైన నెవ్వఁ డిఁక నొప్పదు చేయఁగ నంచుఁ బల్కి, వి
భ్రాజితశాసనంబుఁ బ్రచు రంబొనరించె నశోకుఁ డొప్పుగన్.

# 4-వ అధ్యాయము.

## అశోకుని తీర్థయాత్ర.

---

గతాధ్యాయాంతమందు వర్ణింపఁబడినవైభవంబుఁ గలమృగయావినోదంబు లటుండ ధర్మయాత్రావిశేషంబులం జూడుఁడు. ఈతీర్థయాత్రలందు బ్రాహ్మణులను, సన్యాసులను దర్శించి దానంబు లొసంగుటయుఁ బెద్దలను సేవించుటయు, దేశమును జనులను బరిశీలించుటయు, బుద్ధధర్మమును బోధించి సాధకబాధకంబుల విచారించుటయు, సువర్ణదానంబులఁ జేయుటయును నిట్టిసత్కృత్యము లాచరింపఁబడె నని యెనిమిదవ శిలాశాసనంబునఁ బ్రకటింపఁబడియున్నది. తత్కాలంబున నట్టిమృగయావినోదంబు లనుభవించినయశోకచక్రవర్తియే తత్కాలంబున ధర్మయాత్రకంటె సంతోషదాయకం బయినది మఱియొకటి లే దని వచించె.

*తీర్థయాత్రావిశేషంబులు.*

అట్టితీర్థయాత్ర నశోకమహారాజు తనపాలనకాలములలో నిరువదియొకటవయేట నొనరించెను. బుద్ధమహాముని తనమరణకాలమునకుఁ గించిత్పూర్వము గమనించినయాత్రామార్గము వెంబడియె యశోకుఁడించుమించుగా వెళ్లినట్లు గనంబడుచున్నది. రాజధాని యగుపాటలీపుత్రమునుండి యాయన నిర్గమించి గంగానదిం దాఁటి వైశాలిదేశముఁ బ్రవేశించెను. దీని నిప్పుడు ముజాఫరుపురము చంపారణ్జిల్లా లందురు. దీనియందు బఖిరా (Bakhira) అను సింహస్తంభ మున్నది. ఈవైశాలిదేశ మిప్పుడు పాడు పడియున్నది. పిమ్మట కేసరియ

*అశోకుఁడు ధర్మయాత్రలు చేయుట.*

*వైశాలిదేశము.*

*బఖిరా సింహస్తంభముఁ జూచెను.*

(Kesariya) స్తూపముఁ జూచెను. (జరిగియున్న గొప్పవిషయమును గాని, గొప్పస్థలమును గాని సూచించుటకు బౌద్ధులు జ్ఞాపకార్థము నిర్మించి పవిత్రము లని భావించెడుకట్టడములను స్తూపము లందురు.) తదనంతర మాయన లారియా అరరాజి (Lauria Araraj) లారియా నందనగర్ (Lauria Nandangarh) అనుసింహ స్తంభములను వీక్షించెను. పదఁపడియశోకుఁడు

కుసినగరమునకు వెళ్లెను.

సింహస్తంభమునుండి రామపర్వకుఁ దూర్పుగా వెళ్లి తరువాతఁగొండకనములదారిని కుసినగరమునకుఁ బోయియుండును. ఈనగరమందె బుద్ధుని నిర్వాణము జరిగియుండెను. అటుల కుసినగరమునకు వెళ్లక పశ్చిమదిశగాఁ బోయి గండకీనదిని దాఁటి (Tarai)

లంబిన్యారామమందు శిలాస్తంభమునుస్థాపించి శాసనముఁజెక్కించెను.

దారిని లంబిన్యారామమున కాయన వెళ్లియుండును. ఈయారామమందె బుద్ధముని జన్మించె నని చెప్పుదురు. ఈపవిత్ర స్థానమందాయన యొకశిలాస్తంభంబు నిర్మించి దాని యగ్రంబున హయ ప్రతిమను నెలకొల్పి యాస్తంభంబుపై జీవాక్షరములతో నీదిగువ నుదాహరింపఁబడునంశముల లిఖింపంజేసె.

శాసనము.

“ఘనతవహించిన ప్రియదర్శిభూపతి తన యిరువదియొకటవ పాలనవత్సరమందు స్వయంబుగ నేతెంచి యీపావనక్షేత్రంబును గౌరవించెను. కారణం బేమి యన శాక్యమునియైనబుద్ధుఁ డీక్షేత్రంబును తనజననంబుచేఁ బవిత్రంబు సేసె; కావున శిలాస్తంభంబు నిర్మింపఁబడి దాని శిఖరంబుగా నొకయశ్వంబు సంఘటింపఁబడియె. ఆయనజన్మకారణంబుచేతనే యీక్షేత్రంబు రాజధర్మపాత్రం బగుటంజేసి దానిని మతాచార్యులకు ధారాదత్తంబుఁ జేసితిని.”

అంతటఁ గొన్నిమైళ్లు పశ్చిమంబుగఁ బోయి శాక్యమునికిం బూర్వబౌద్ధుఁడైన కనకమునియొక్క స్తూపము నశోకుండు సన్మానించె. అక్కడ మఱియొక శిలాస్తంభమును స్థాపించి యాయన తనపదునేనవపాలనవర్షంబున నీస్తూపంబును ద్వితీయపర్యాయ మభివృద్ధి చేసితి నని లిఖింపించె. నేపాలమునం దున్న "లలితా" పట్టణము కొట్టాండు నగరములవఱకును బదంపడి పడమరగా "శ్రావస్తి" నగరము (Sravasti) వఱకును వెళ్లి యీరాజయాత్రికుఁడు పూర్వము శాక్యముని నివసించి బోధించినస్థలములను గౌరవించె ననుటకు సంశయమే లేదు. ప్రతిదియు 70 అడుగులయున్నతముఁ గలస్తంభములను శ్రావస్తియందు నిర్మించె ననియిప్పటికిని జెప్పుకొందురు కాని యవి దృగ్గోచరంబులు కాలేదు. కావున నవియెన్నియో తెలియదు. ఈయాత్రను రుజువుపఱచుటకు రెండువిషయములు మాత్రము ప్రకృతమందు లభించినవి.

కనకమునిస్తూపమును దర్శించెను.

శ్రావస్తినగరమందు శిలాస్తంభమును స్థాపించెను.

ఈయాత్రావిషయ మంతయు నొకయైతిహ్యమం దున్నది. అది యొక యద్భుతకల్పనాకథ. "అశోకావధానము" అనుగ్రంథములో సంస్కృతభాషతో లిఖింపఁబడియున్నది. బుద్ధుని కొకశతాబ్దము తరువాత నశోకప్రభువు పాలించె నని యాగ్రంథమున లిఖింపఁబడియుండుట ప్రత్యక్షముగా నసంగతమైయున్నది. దానిలో వ్రాయఁబడినకడమ విషయములు నమ్మఁదగియుండలేదు కాని టారె (Tarai) యందున్న శాసనము లశోకునిధర్మయాత్రను స్థిరీకరించుచున్నవి.

ఐతిహ్యము.

ఉపగుప్తుఁ డనునామంబుగల బౌద్ధమతాచార్యుని మార్గదర్శిగా నేర్ప

**అశోకుఁడు దర్శించిన పుణ్యక్షేత్రాదులు.**

అచుకొని వరుసగా లంబిన్యారామమును, కపలవస్తును, బుద్ధగయయం దున్న బోధివృక్షమును, వారణాశిని కటంబుననున్న ఋషిపట్టణమును, కుశినగరమును, శ్రావస్తియందున్న జేతవనమఠమును, వక్కులస్తూపమును, ఆనందస్తూపమును, నశోకుండు దర్శించి ప్రతిస్థలమందు నధికముగా సువర్ణదానము చేసినట్లు ముందటి యధ్యాయములోఁ వ్రాయఁబడుకథవలనం దెల్లి

**వక్కులస్తూపము.**

యును. వక్కులస్తూపమందు వక్కులాహ్వాయుం డగుముని ప్రజలకొఱకు శ్రమలుపడి యేమియు నుపకారం బొనర్పలే దని యొక్క-రాగినాణెమును మాత్ర మశోకుఁడు దానముచేసెను.

**బౌద్ధధర్మస్వరూపము.**

వక్కులస్తూపమునందు నెంతమాత్రమును దానముజేయలే దనువిషయము పూర్వచరిత్రలయందు మాత్రము కన్పట్టుచున్నను నటుల దానంబు చేయకుండుట వాస్తవమె యనుకొందము. అయినను శాసనానులయందు వశోకభూపతి ప్రకాశింపఁజేసిన తనయుత్తమగుణంబులకది యనుకూలించియే యున్నది. బుద్ధమతబోధ యెంతపరిశుద్ధమయిన మానవధర్మమొ యెంత యభ్యాససాధ్యమొ యాయాశాసనంబుల శ్రద్ధతో గమనించువారికిఁ గరతలామలకంబుగఁ గన్పట్టు. ఈబోధలయొక్క-చరితార్థమంతయు నరునకును బశువునకును సౌఖ్యం బొసంగుటయే. బౌద్ధధర్మోపదేశకుండు మాతాపితల యెడలఁ బుత్రభక్తి మొదలయిన సుగుణసంపత్తి యిహపరసౌఖ్యదాయకంబని యవితర్కితంబుగ నిర్ధారణంబొనర్చును. సుగుణమార్గము (ఈశ్వరతత్త్వవిచారణ) కాని నిర్గుణమార్గము (పరతత్త్వవిచారణ) కాని బుద్ధమతతత్త్వమున కవసరములేదు. మఱేమనఁగ స్వతస్సిద్ధములును నభ్యాసలభ్యములును నగు

ధర్మములె బౌద్ధులకుఁ బట్టుగొమ్మ లయియున్నవి. కనుకనె నిర్వాణపద ప్రాప్తికై ధర్మాచరణశీలురగుటకు సర్వజనులును బౌద్ధులచే ప్రేరేపింపఁ బడుచున్నారు.

"ఘనతఁజెందిన ప్రియదర్శి మహాప్రభువుయొక్క కృషియంతయుఁ బాప మనెడిగోడవంబడని జన్మాంతరస్థితినిఁ గూర్చియె. అట్టిపాపవిమోచన మల్ప నకుఁగాని యధికునకుఁగాని దృఢమయినస్వయంకృషియు వైరాగ్యమును లేనిచో లభించుట దుర్లభము. ఉన్నతదశయం దున్నవారికి నధికదుర్లభము." (పదుమూఁడవ శిలాశాసనమునం దిట్లున్నది).

బైబిలునకును నశోకుని వచనములకును గల భేదము.

ఈవచనములు నింక ననేకవచనములును బైబిలు (క్రైస్తవవేదగ్రంథము) ను బోలియున్నవి. కాని, యభిప్రాయ భేదంబు పూర్ణముగఁ గలదు. మనుష్యునకును దేవునకును గలసంబంధమును, మనుష్యుఁడు దైవకృపాధీనుం డగుటను, నీరెండువిషయము లను బైబిలుయొక్క ప్రాచీనభాగమును (Old Testament) నవీనభాగమును (New Testament) బూనికతో బోధించుచున్నవి. అశోకుఁడు నాస్తికభావమునుఁ బ్రతిపాదింపకున్నను దేవునిమాటం దలఁపక పాపరహితుండై యిహపరంబులయందు సుఖంబం దుటకు మానవుండు యత్నింపవలయు ననిమాత్రము తనయాచార్యోపదేశాను సరణంబుగ నుపదేశించెను.

జన్మాంతరము.

జన్మాంతరమునుగుఱించి యశోకచక్రవర్తియొక్క నిశ్చయాభిప్రాయ మేమో స్పష్టంబు కాలేదు. భవిష్యజ్జన్మ మని కొన్నిచోట్లను పరలోకమని మఱికొన్నిచో ట్లను వచించియుండెను. ఇది విచారణీయ మయియున్నది. "భవిష్యద్భయము" లనఁబడుగ్రంథమం దిట్లు వ్రాయఁబడి

యున్నది. " వ్యాధి, వన్యమృగబాధ, మొదలయిన దేహోపద్రవములు సన్యాసులకుం గలుగును. తదాపన్నివారణంబుకొఱకు సకాలంబున నూతనయత్నంబులఁ జేయవలయు. బౌద్ధమతసిద్ధాంతమునందును దదాచరణమునందును నపభ్రంశంబు లుండుటయుఁ, దన్మతగ్రంథములయందలి సాహిత్యవిశేషంబులఁ గణింపుచుఁ దత్సారవిముఖు లగుటయు, నశ్రద్ధయు, విషయాభిలాషయు, సంకరజనసహవాసాపేక్షయు, నిత్యాదికములు ధర్మవిరోధములు. కావున సన్యాసి తద్దోషావిష్టుండు గాకుండుటకు జాగరూకుఁడై మెలంగవలయు."
హిందువు లందఱును జన్మాంతరమును విశ్వసించినట్లె యశోకుండు కొంత వఱకు విశ్వసించియుండును. కాని యాయన నుడివినస్వర్గం బీజన్మనుండె సదుపాసనవలనం గలుగుపరిశుద్ధచిత్తావస్థగా నుండవచ్చును. జీవపావనత్వనిశ్చయాభిప్రాయము బుద్ధమతమునకును జైనమతమునకును సామాన్యలక్షణమయియున్నది. ఇది జన్మాంతరసిద్ధాంతమునకుఁ జేరువగానె యున్నది. దీనిచే సమస్తజీవకోటిని నొక్కగొలుసున బంధించినట్లుండును. వీరు జీవాత్మ ప్రత్యేకముగా లేదనియుఁ గాఁబట్టి దానికి జన్మాంతరమును లేదనియుఁ జేయఁబడినపుణ్యపాపకర్మకు జన్మాంతరము కలదనియు వీరిసిద్ధాంతము. దీనిని గూర్చి ముందు బౌద్ధసిద్ధాంతములోఁ గొంత విశదీకరింపఁబడును.

**పరమతసహిష్ణుత.**

పరమతసహన మవశ్యాచరణీయం బని యశోకధరణీవల్లభుఁడు పలుమాఱు పట్టుదలతో నుపదేశించుట మిక్కిలి స్తవనీయముగా నున్నది. కాని భరతఖండంబునఁ దత్కాలంబున విజాతీయమతములు లేవనిమనము తలఁపవలయును. క్రైస్తవమహమ్మదీయజోరోష్టరు (Zoroaster) మతములవా రాకాలమున భరతఖండమందు లేరు. ఆర్యమత మెందు మెండుగ వ్యాపించియుండె. దైవతత్త్వమును గుఱించి గాని యాత్మతత్త్వమును గుఱించి గాని మఱి యేధర్మవిషయమును గూర్చి గాని తమయభిప్రా

యములను బ్రతిపాదించి వాదించి నిరూపించుటకును, అన్యాభిప్రాయములను ఖండించుటకును ఇక్కాలంబునందువలెనె యాకాలంబునందునను ఆర్యులు స్వాతంత్ర్యముఁ గలిగియుండిరి. వారిలోఁ బ్రబలులయినవారియభిప్రాయంబువలన నంతర్భాగము లనేకము లేర్పడెను. ఇందువలన మతభేదంబులకును మతవివాదములకును నార్యమతము పుట్టినిల్లుగ నుండెను. ఈయార్యమతమం దుండువార లొకశాఖను విడిచి మఱియొకశాఖ నవలంబింపవచ్చును. దురన్నమును దినుటయు నుపన్యాసం గొనుటయు మాత్ర మీమతమందు గొప్పనిషేధములు.

బౌద్ధమత జైనమతము లార్యమతమునుండి చీలివచ్చినవే. ఇవి తొలుత హిందూమతసంస్కారులచే నిరూపింపఁబడిన శుద్ధజ్ఞానసంఘము లయియుండియుఁ గాలక్రమంబునఁ బుక్కిటిపురాణములతోఁ గూడియుండెను.

**విజాతీయమతములు.**

పరమతసహానం బవశ్యకర్తవ్యం బని యశోకభూజాని విధించుట సామాన్యవిషములయం దేకీభవించుచుఁ గ్వాచిత్పక్షములయందు భేదించుచుండు హిందూమతశాఖల నుద్దేశించియె కాని కలహోన్ముఖములును నిర్బంధకములును మతాంతరములును అయిన క్రైస్తవ మహమ్మదీయ మతముల నుద్దేశించి కాదు.

**మతశాఖలు.**

పైని నుదాహరింపఁబడిన బౌద్ధమత జైనమతములె కాక యీభరతఖండమం దక్కాలంబున నింక ననేకభేదమతంబులు కలవని చరిత్రలవలనఁ గన్పట్టుచున్నది. ఈ క్రింద నవి విశదీకరింపఁబడుచున్నవి.

**మతాచార్యులు పరివ్రాజకులు.**

పూర్వకాలంబున ననఁగా బౌద్ధయుగమునకుఁ బూర్వమె మతాచార్యులలోఁ గొందఱు మునులుగాను గొందఱు పరివ్రాజకులుగాను నుండిరి. మును లరణ్యములయం దాశ్రమములు కట్టుకొని తమ తమ శాఖా

ధర్మానుసారముగా వేదశాస్త్రాధ్యయనాధ్యాపనాది వైదికకర్మలయందుఁ దమ కాలంబుఁ గడపిరి. పరివ్రాజకులు మతబోధకులుగాఁ గాని మతవాదకులుగాఁ గాని యుండి ప్రతివత్సరంబున

శాస్త్రిబోధ.

నెనిమిది లేక తొమ్మిది మాసములు దేశసంచారము చేసి ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రము, ప్రకృతి శాస్త్రము మొదలయిన శాస్త్రముల యందు శాస్త్రిచర్చలను గావించుటయె ముఖ్యోద్దేశముగాఁ గలవారైయుండిరి. వీరిలోఁ గొందఱు కుతర్కవాదులుగాను బరవంచకులుగాను నుండినను విశేషభాగము లోకాచార్యులుగను లోకోపకారులుగను బ్రవర్తించినందున వీరియందుఁ బ్రజ లధిక గౌరవముఁ గలవారలై వారు మతచర్చలఁ జేసి వారి వారి మతముల సిద్ధాంతీకరించి స్థాపించుటకుఁ

సభామందిరములు.

గొన్ని గ్రామములందు వారికొఱకు సభామందిరములను గట్టించిరి. ఇట్టిమందిరము శ్రావస్తియందొకటి యున్నది. వైశాలినగరసమీపమందున్న మహారణ్యమునందొకటి యున్నది. చంపకవనమందు నొకటి యున్నది. ఇంక నిట్టిమందిరము లనేకము లున్నట్లు గన్పట్టును.

ఏజను లేగురువుయొక్క మత మవలంబించిరో వా రామతసంఘమువారని పిలువఁబడిరి. ఇట్లు బౌద్ధమతావలంబ

సామాజికులు.

కులను శాక్యపుత్రసామాజికులనియు జైనమత మవలంబించినవారిని నిర్గ్రంథు లనియు వారిలోనె కొందఱిని అజీవకు లనియుఁ జేర్కొనిరి. పాణిన్యాచార్యుల వారు చేసినవ్యాకరణముయొక్క భాష్యమందు బ్రాహ్మణులలోఁ గర్మందిను లని పారాశరు లని యిరుతెగలవా రుండినట్లు కన్పట్టును. పైని నుడువఁబడిన మునులలోఁ గాని పరివ్రాజకులలోఁ గాని మతభేదములును నందువలన

సంఘభేదములును గొన్ని కన్పట్టుచున్నవి. కాని వాని నామములు మాత్రమె తెలియుచున్న వని చరిత్రకారులు వ్రాసిరి. అవియెవ్వి యనఁగా—

సంఘభేదముల నామంబులు. (1) ముండీక సేవకులు—వీరు ముండుల (సన్యాసుల)యొక్క శిష్యులు.

(2) జటిలులు—వీరు జడల ధరించెదరు. బ్రాహ్మణు లయినసన్యాసులె జడలు ధరింపవలసిన దని నియమము కలదు. ఇతరులు దాల్చినయెడల వార లాసంఘమువారు కాకపోయిరి.

(3) మగండికులు—వీరిని గుఱించినగ్రంథము లేమియు లేనందున వీరి లక్షణములు బొత్తిగాఁ దెలియవు.

(4) త్రిదండికులు—వీరు త్రిదండమును ధరించిరి. బ్రాహ్మణు లైన పరివ్రాజకులకు బౌద్ధు లీపేరు పెట్టియుందురు. ఈత్రిదండికులు తమమత విధానముల ప్రకారము జటలను ధరింపఁగూడదు. శిరోముండన మయినను జేయించుకొనవలెను. లేక ముందు సిగనుమాత్ర మయిన నుంచుకొనవలెను.

(5) అవిసుద్ధకులు, అనఁగా సర్వమిత్రులు—వీరిని గుఱించి యేమి దెలియదు.

(6) గౌతమికులు—వీరు గౌతమశిష్యులు. వీరిలో విశేషభాగము దేవదత్తుని శిష్యు లయియుండిరి. దేవదత్తుఁడు బుద్ధుని జ్ఞాతి. బుద్ధుఁడు తనమతధర్మముయొక్క నియమములను జనుల కతిసులభముగఁ జేసినాఁడనియు, మునివృత్తికిఁ బ్రత్యర్థిగ నుండె ననియు, ఈతఁడు నూతనసంఘ మేర్పాటుచేసెను.

(7) దేవధార్మికులు—వీరు బహుదేవతారాధనయొ యేకదేవతారాధనయొ చేసిరి. మఱియు నజీవకులయొక్కయు, నిర్గ్రంథులయొక్కయు, నవిరుద్ధకులయొక్కయు, భిక్షువులయొక్కయు లక్షణంబులు తమయందు నుం గలవని పైని నుడువఁబడినసంఘములవారు వాదించిరి.

బౌద్ధమతశాఖా భేదములు.

ఈయంతర్భేదములె కాక బౌద్ధమతారంభమునుండియు దానియందు ననేక భిన్నసంఘము లేర్పడియున్నట్లు చరిత్రలవలన నిస్సంశయముగఁ గన్పట్టుచున్నది. బౌద్ధమతములో నాలుగు శాఖలును బదునెనిమిది యుపశాఖలు నుండెను. ఒక శాఖలోనివారె తమసిద్ధాంతము విషయమై భిన్నాభిప్రాయులుగా నుండిరి. కడమశాఖలవారిసిద్ధాంతములవిషయమై వారెట్లుండిరో వచింపనేల. ఒకరి సాంప్రదాయములను మఱియొకరి సాంప్రదాయములు ప్రతిఘటించుచుండెను. ప్రత్యుపశాఖలో సౌత్రాంతికులు, వైనాయకులు, ఆభిధార్మికులు అను మూఁడు మతసంబంధములైన తెగలుండినవి. ఒక యుపశాఖలోని సౌత్రాంతికులును, ఆభిధార్మికులు నేకాభిప్రాయులుగా నుండరైరి. ఒక శాఖయందలి సౌత్రాంతికులకును బ్రత్యర్థిశాఖయందలి సౌత్రాంతికులకును మతవివాదములుండెను. ఇప్పటికైనను బౌద్ధులను మూఁడుశాఖలుగా విభజింపవచ్చును. ఎట్లనఁగా సింహళము, బర్మా, సయాం, యానాము దేశములవారు దక్షిణశాఖవారనియు; తిబెటు, చీనా, మంచూరియా, మంగోలియా, సైబీరియా యందుండువారు ఉత్తరశాఖవారనియు; జపాను, ఫార్మోజా యందలివారు తూర్పుశాఖవారనియు, మూఁడు శాఖలవారు కలరు. వీరిలో దక్షిణశాఖవార లధమస్థితివారు, అనఁగాఁ గేవలోపాసకులు. వీరిని "శ్రావకయాను" లందురు. ఉత్తరశాఖవారు మధ్యమస్థులు. వీర లర్హాతపదంబు నొందినవారు. వీరిని "ప్రత్యేకబుద్ధయానులు" అందురు. తూర్పుశాఖవార లుత్తమస్థితిం జెందినవారు. వీరిని "బోధిసత్వయానులు" అని పేర్కొనెదరు.

పైని నుదాహరింపఁబడినప్రకార మన్నిమతభేదము లశోకునికాలమందుండినను భరతఖండమందు నానామతశాఖలవారును బ్రధానధర్మములయందు (సత్యవాక్యపరిపాలన మొదలయిన విషయములయందు) ఏకాభిప్రాయు లని

యు, వైరాగ్యమును మనశ్శుద్ధిని నిష్కపటముగ నందఱును గోరువా రనియు నశోకప్రభు వెఱింగియున్నాఁడు. కనుకనే జైనులకును బ్రాహ్మణులకును నానాప్రకారంబుల గౌరవముం జూపుట ధర్మమనియె యాయన యుద్దేశము. బౌద్ధపీఠములకును మఠములకును ముఖ్యముగా ధనవ్యయము కావించునప్పు డాయన బ్రాహ్మణయోగులకొఱకును బర్వతశిలలఁ దొలిపించి విశాలగుహల నిర్మాణంబుచేయించుటకు ధనవ్యయంబొనరించెను. తాదృశధర్మకార్యములను జైనులకొఱకును జేసెను. కాని జైనులకుఁ గట్టించినమఠము లిప్పుడు కాన రాకున్నవి. అశోకప్రభువు నియమించిన ధర్మోపదేశకులు సమభావముతో బౌద్ధులను బ్రాహ్మణులను జైనులను విచారింపవలసినవారైయుండిరి. ఇట్లు మత సహనములె తదనంతర భూపాలురును గమనించిరి. ఇందుకుఁ దార్కాణముగా ఓఢ్రదేశప్రభు వయిన ఖారవిల (Kharivela) తాను నానాహిందూమత శాఖలవారిని గౌరవించితినని యశోకరాజు వచించినట్లె వచించెను.

అన్యమతసహనం బీరీతిగా నశోకభూనాథుఁడు ప్రకటించి యాచరించి

బ్రాహ్మణాధిక్యము నడంచుట.

నను బ్రాహ్మణులు తాము భూలోకదేవతల మని నుడువుట కొడంబడక వారి యౌన్నత్య మును సడలించితి నని యశోకుండు కించిద్గర్వ భూయిష్ఠుండయ్యె ననియు ఆయన యిట్లొన రించియుంటి ననుట దంభవచనం బనియుఁ గొందఱు చరిత్రకారులు వక్కా ణించుటకు సాహసించిరి. అశోకుఁడు బ్రాహ్మణాధిక్యము నోర్వనందునని బ్రాహ్మణులు తమగ్రంథములయం దాతనిమాటయె యుదాహరింపక యొక శాసనమందు మాత్రె మాయనను సూచించియుండుటచే నశోకుఁడు బ్రాహ్మ ణాధిక్యంబు నడంచె ననియెయశోకచరిత్రకారుఁడు సాధించెను.

అశోకధరారమణుఁడు బౌద్ధమతమును వ్యాపింపఁజేయుటయందును దాని యాధిక్యమును స్థిరపఱచుటయందును నుడుగని యత్నంబుల నొనరించె

నని బౌద్ధమతగ్రంథకర్తలె బహుముఖంబులఁ బల్కియుండిరి. కాని యా ప్రభువు పాలనవిషయ మగుచరిత్రను విస్రంభపాత్రములు గానిసంగతులతోను, మతపాక్షికాంశంబులతోను నింపిరి.

బౌద్ధగ్రంథముల విశ్వసనీయములు.

ఈకారణంబుననే యవి స్వతంత్రగ్రంథములు కాఁజాలక యశోకప్రభువుయొక్క నిజవృత్తాంతమునకు వ్యాఖ్యానగ్రంథములు గాఁగాని శేషపూరణగ్రంథములు గాఁగాని యుపచరించుచున్నవి.

అశోకునినామాంతరములు.

అశోకునకు బౌద్ధపురాణములయందు అశోకవర్ధనుఁడనియు రుద్రదామనను శాసనములో అశోకమౌర్యుఁ డనియు నామాంతరములు కలవు. ప్రియదర్శిని యని మఱియొక నామం బున్నట్లు గతంబున లిఖింపఁబడియున్నది. అశోకుఁడె ప్రియదర్శిని యని కొంతకాలమువఱకుఁ జరిత్రకారులు నిర్ణయింపఁజాలకైరి కాని కడకు నీదిగువ నుదాహరింపఁబడుప్రబలాధారమునుబట్టి నిరూపించిరి.

ప్రియదర్శినినామనిష్పాదనము.

బుద్ధుని జన్మస్థాన మయిన లంబినీవనమం దున్నశిలాస్తంభంబు నశోకరాజు స్థాపించినట్లు చీనాదేశపు యాత్రికుఁ డైనహ్యూయెన్‌సియాంగు వ్రాసియున్నాఁడు. ఆస్తంభశాసనమందు ప్రియదర్శిప్రభువు దానిని నిర్మించినట్లు లిఖింపఁబడియున్నది. కానఁ బ్రియదర్శిని యశోకుండె యని నిర్వివాదంబుగ వారు పల్కిరి.

మహేంద్రుఁడును సంఘమిత్రయు సింహళమందు

గతంబున నశోకనరేంద్రుఁడు సింహళద్వీపమునకు ధర్మోపదేశకులను బంపియుండుటనుగూర్చి సవిస్తరంబుగ లిఖింపఁబడియున్నది. కాని యావిషయమై గొప్పవివాదాంశం బొండు కలదు. ఏమనిన నశోక

**బౌద్ధమతమును నెలకొల్పుట.**

ప్రభువుయొక్క జారపుత్రుఁడును జారపుత్రికయు నైన మహేంద్రుఁడు, సంఘమిత్ర యనువారి యద్భుతకృత్యములవల్ల సింహళద్వీపమందు బౌద్ధమతము నెలకొల్పఁబడె నని యించుమించుగఁ దద్ద్వీపవాసులందఱును దన్మతావలంబులయిరనియు సింహళపురాణములు నిశ్శంకముగఁ బ్రతిపాదించుచున్నవి. ఆయావిషయంబులకు సంవత్సరములను గూడ నుదాహరించుచు నీయుపదేశకులనుగూర్చి యాపురాణములయందు లిఖింపఁబడిన వన్నియుఁ గల్పితకథలరాశి యనియు విశ్వసింపఁదగ వనియుఁ జరిత్రకారుఁ డైనఓల్డెన్‌బర్గు పండితుఁడు వానిని ద్యజించెను. విషయోల్బణంబుకొఱకుఁ జొన్పింపఁబడిన దైవమహిమలను నిరాకరించి శేషంబునైనను దత్పురాణంబులనుండి స్వీకరించుట చరిత్రకారుల కుచితంబుగా దని యొకచరిత్రకారుని యభిప్రాయము.

**మహేంద్రసంఘమిత్రల వృత్తాంతము కల్పితమనుట.**

బౌద్ధాచార్యసంఘమునకు మిత్రురాలు అని యన్వయించు సంఘమిత్రనామ ముండుటయె సంశయాస్పదము. ఏతద్విషయికచరిత్ర యంతయుఁ గల్పితం బనుటయె మేలుగా నున్నది. ఇందుకుఁ గారణములు — తనకొడుకును గూతురును నుపదేశకులనుగాఁ బుత్తెంచిన ట్లశోకుం డేశాసనములందును నితరగ్రంథములయందును లిఖించి యుండలేదు. పదుమూఁడవశిలాశాసనమందు చోళపాండ్యరాజ్యములకును సింహళమునకును ఉపదేశకులం బంపిన ట్లున్నది. సింహళము పరరాజ్యములలో నొకటి యనియుఁ దద్రాజ్యమునందు మనుష్యులకును బశువులకును నౌషధంబుల నశోకుఁడు వినియోగించె ననియు రెండవశాసనమందున్నది. సింహళమునుగూర్చి యాయన లిఖించినది యీశాసనద్వయమునందె. అశోకుఁడు సింహళమునకుఁ దనపుత్రునిఁ బుత్రికను నుపదేశకులనుగాఁ బుత్తెంచి

ప్రజల నందఱను బౌద్ధమతావలంబులనుగాఁ జేసినట్లయిన నియ్యది యాయన కీర్తిని నినుమడింపఁగలదు. అట్లుండఁగ నశోకుం డీవిషయము నేల యుదాహరింపక పోయెను? దీనింగూర్చి పండితుఁ డైనఓల్డెన్‌బర్గ (Oldenburg) ఇట్లు వ్రాసెను.

ఓల్డెనుబర్గువ్రాసినది.

"సింహళదేశమం దున్న బౌద్ధదేవాలయ మఠాదులనుగుఱించి బౌద్ధ సన్యాసు లొకచరిత్రం గల్పించి దానిని దన్మత ప్రసిద్ధిప్రవర్తకుఁ డైనయశోకునితో సంబంధపఱచిరి. మఱియును అద్వీపమందు బౌద్ధమతము కాలక్రమమున వ్యాపించియుండఁగా నద్భుతవ్యాపకంబయినట్టు లాచరిత్రకారు లధికవర్ణనలఁ జేసియుండిరి."

సింహళమందు బౌద్ధమతాభివృద్ధికిఁ గారణములు.

చోళరాజ్యమం దొకస్తూపమును పాండ్యరాజ్యమం దొకస్తూపమును అశోకుఁడు కట్టించినట్లు హ్యూయెన్‌సియాంగు (Huen Tsiang) వ్రాసియుండెను. ఇవి స్వతంత్రరాజ్యములయియున్నట్లు శాసనములు తెల్పుచున్నవి. అయినను ఆరాజ్యాధిపతుల యనుకూలముం బడసి యశోకుం డాస్తూపములను నిర్మించియుండును. ఆ రాజ్యములలోనికి బౌద్ధమతము ప్రవేశముఁ గన్న దని యాస్తూపంబులఁబట్టి నిశ్చయింపఁదగియున్నది. ఆరాజ్యములు సింహళద్వీపమునకు సమీపమందుండుటచే దీనికి వానితో నిరంతరసంబంధము కలిగి దీనియందుఁ గాలక్రమమున మతాభివృద్ధియు గ్రంథపౌష్కల్యమును సమకూడియుండును.

కావేరినదికి దక్షిణముగా నున్న పురాతనగృహాదులు.

కావేరినదికిదక్షిణముగా నున్నదేశమం దుండిన పురాతనగృహాదులను గూర్చిస్పష్టముగా హ్యూయెన్‌ట్సియాం గిటు విశదీకరించెను.

"కొందఱు బౌద్ధమతస్థులు, కడమవా రన్యమతస్థులుగా నున్నారు. వారికి విద్యమీఁదఁ గంటె వర్తకమం దెక్కువయభిలాష. కొన్నిమఠములు

పాడుపడినవి, గోడలు మాత్రము కానవచ్చుచున్నవి. మతధర్మాచరణులు లేరనియె చెప్పవచ్చును. అనేకశతముల దేవాలయములు కలవు. నిర్గ్రంథులను తెగలోఁ జేరినవారనేకు లున్నారు.

రాజధానికి సమీపమునఁ దూర్పుగా సంఘారామ మనుమఠ మున్నది. దీని గోడల పునాదులు తప్ప శేషం బగోచరంబుగా నున్నది. ఇది యశోక ప్రభువుయొక్క కనిష్ఠసోదరునివల్ల నిర్మింపఁబడినది.

ఈమఠమునకుఁ బ్రాగ్దిశ నొకస్తూప మున్నది. దీని శిఖరాగ్రము తప్ప శేషించిన దంతయు భూమిలోఁ బూడిపోయినది. దీనికి నిర్మాణకర్త యశోక భూనాథుఁడు "వాణిజ్యలక్ష్మికి నాలయంబుగ నుండు తంజావూరును దాని చుట్టుప్రదేశమును అశోకప్రభువుకాలమందునను, దదనంతరము బహుకాలమువఱకును బుద్ధమతమునకుఁ బ్రధానస్థాన మయియుండెను" నని హ్యూయాన్ సియాంగు వ్రాసినమనోహరవృత్తాంతమువల్ల గ్రహింపఁదగియున్నది.

మహేంద్రుని నిజ వృత్తాంతము.

అశోకుని సోదరుఁ డైనమహేంద్రుఁ డేకాంతవాసమును నెమ్మదిని గోరినవాఁ డని తెలియఁజేయుచు ఆయనను గుఱించికొన్నికథలనుఫాహియాన్(Fahien) రాయబారి వ్రాసెను. హ్యూయాన్‌సియాంగు రాయబారి యంతకంటె విస్పష్టంబుగ నిట్లు వ్రాసెను.

"సింహళరాజ్యమునఁ బూర్వకాలమందు నీతిబాహ్య మయినమతారాధన వ్యాపించియుండెను. బుద్ధుని మరణానంతరము పంచశతాబ్దములు గడచినతరువాత నశోకుని కనిష్ఠసోదరుఁ డైనమహేంద్రుఁడు విషయాభిలాషలకు విముఖుఁడై "అర్హత" పదంబునకై తీవ్రేచ్ఛం గలిగియుండెను. మానుషాతీతశక్తుల నాఱింటిని మోక్షసాధకముల నెనిమిదింటిని సాధించెను. వాయువేగశక్తిచే ఆయన యీదేశమునకు వచ్చి బౌద్ధధర్మముపదేశించి బహుళముగ

వ్యాపింపఁజేసెను. అంతట నీదేశజను లామతమందు దృఢవిశ్వాసముఁ గల వారై 20,000 మతాచార్యులకుఁ దగిన 100 మఠములను గట్టించిరి. వారు మహాయానుల తెగవారియొక్క స్థావిరమార్గప్రకారము బౌద్ధమతబోధల నంగీకరింతురు."

(1) దివ్యదృష్టి, (2) దివ్యశ్రోత్రము, (3) పూర్వనివాసానుస్మృతి, (4) పరచిత్తజ్ఞానము, (5) అప్రత్యక్షవిషయజ్ఞానము, (6) వియద్గమనాగమనవియోగాదిలక్షణమైనబుద్ధి—ఇవి మానుషాతీతశక్తులు.

(1)యమ, (2)నియమ, (3)ఆసన, (4)ప్రాణాయామ, (5)ప్రత్యాహార, (6)ధ్యాన, (7)ధారణ, (8)సమాధు లష్టసాధనములనియుగ్రహింప వచ్చును.

అశోకచరిత్రకారుని యభిప్రాయము.

సింహళదేశమందు బౌద్ధమతప్రదేశవ్యాప్తులను గుఱించి యిట్లు ప్రాప్తించిన ద్వివిధగ్రంథములను బరిశీలించి యశోకచరిత్రకారుఁ డిట్లు తీర్మానించెను. తద్దేశమందుఁ దత్కార్యదక్షుఁడు మహేంద్రుఁడే. ఇతఁ డశోక చక్రవర్తికి సన్నిహితబంధువనియు ఈయన సింహళమునందు మఠములు కట్టించెననియుఁ బురాణంబులందుండుటంబట్టి యీ పేరుగల బౌద్ధమతాచార్యుఁ డెవఁడో వచ్చి కట్టించి యుండు ననియే స్థిరపడును. కావేరీదక్షిణ ప్రదేశమందు శిథిలమైయున్న మఠమువలనఁ దక్కినపురాణకల్పనలెట్లున్నను ఈవిషయముయొక్క వాస్తవము పైనివ్రాసిన ట్లే బోధపడుచున్నది. అశోకుని కనంతరము సింహళమునందుఁ గాలక్రమమున బౌద్ధమత మతిశీఘ్రముగా నభివృద్ధియై యుండును. మహేంద్రుఁ డశోకుని తమ్ముఁ డనియు ఆయనవల్ల బౌద్ధమతవ్యాప్తి సింహళమునందుఁ గలిగె ననియు యాత్రికులు వ్రాసినగ్రంథములు తెలుపుచున్నవి. ఇవి యే కొంతవఱకు విశ్వసింపఁ దగియున్నవి. కాఁబట్టి మహేంద్రుఁ డశోకు నిపుత్రుఁడు కాఁడనియు సంఘమిత్ర యాయన పుత్రిక కాదనియు వారివల్ల

సింహాళమందు బౌద్ధమతప్రవేశాభివృద్ధులు కాలేదనియు నిశ్చయింపవలెను. సింహాళపురాణ మిట్లు విశ్వాసపాత్రము కాదయ్యె. బౌద్ధులకు సంబంధించిన సింహాళహిందూపురాణముల యందలి మఱికొన్ని యసంగతాంశంబులు ముం దధ్యాయములోఁ వివరింపఁబడును.

చ. కరుణ యొకింత లేక జనకంటక మౌ గతి దండయాత్రలం
   బోరిఁ బోరిఁ జేసి, యుద్ధజయమ్ముం బడయక్ రసహీనకృత్యమం
   చరసి, దయాళుపై జనహితార్థముగా వరధర్మయాత్రలం
   బరువడిఁ జేసి, ధర్మజయప్రాప్తి నశోకుఁడు గోరె ధీరుఁడై.

---

# 5-వ అధ్యాయము.

---

శిలా శాసనముల యందును స్తంభ శాసనముల యందు నశోకుని చరిత్ర యనుక్రమముగా లేనందునఁ జరిత్రకారులు ముఖ్యముగా నీ దిగువ పురాణ గ్రంథములను నింక నితరగ్రంథములను సంప్రతించుచు నసంగతములను త్యజించుచు నీచరిత్రను వ్రాసిరి.

(1) బౌద్ధసంస్కృతములో వ్రాయఁబడి నేపాలదేశమందున్న యశోకావధానము.

(2) పాలిభాషలో వ్రాయఁబడి బర్మాదేశమందున్న దీపవంశము.

బౌద్ధమతగ్రంథములు. (3) వినయపేటిక మీఁది వ్యాఖ్యానము బుద్ధఘోషుఁడు వ్రాసినవృత్తాంతము.

(4) పాలిభాషలో వ్రాయఁబడి సింహళద్వీపమందున్న మహావంశ గ్రంథము.

పైని వ్రాయఁబడిన వినయపేటికను గుఱించి తెలిపెడి—

బుద్ధుఁడు నిర్యాణమొందిన సంవత్సరములో ననఁగా క్రీ. పూ. 477 సం॥లో బుద్ధుని యుపదేశములను బౌద్ధమతాచార్యులు పేటికాత్రయంబుగ విభజించిరి.

(1) సూత్రపేటిక:—ఇది యుపదేశకాండ.

(2) వినయపేటిక:—సాంప్రదాయనిబంధనకాండ

(3) అభిధర్మపేటిక:—మతసిద్ధాంతకాండ

గతాధ్యాయములయందు నసంగతంబులను గొన్నిఁటిఁ జర్చించి యథార్థమును

నిరూపించుట కలిగె. మహావంశపురాణముతోఁ జాలభాగము కడమగ్రంథము లనుకూలపడియున్నందున నాగ్రంథాంశములనె చర్చించుట కలుగుచున్నది.

పరిషత్తులను గుఱించియు నశోకుని పాలనకాలనిర్ణయమును గుఱించియుఁ గొంతఁ జర్చింపవలసియున్నది. సింహళపురాణగ్రంథములయం దిట్లువ్రాయఁబడియున్నది.

పరిషత్తులు, అనఁగా మహాజనసభలు.

బుద్ధుని మరణానంతరము మగధరాజ్య రాజధానిగా నుండినరాజగృహ మనుపట్టణమందు జరిగినప్రథమపరిషత్తులో మతాచార్యులచే బుద్ధమతముసంస్కరింపఁబడినది. బుద్ధుని యనంతర మొక శతాబ్దమునకు వైశాలినగరమందు జరిగిన ద్వితీయ పరిషత్తులోఁ గూహకబౌద్ధులు మతమందుఁ జొన్పిన యధర్మనిబంధనలను నిషేధించి బుద్ధమతమును యథాన్యాయముగా శోధించి సిద్ధాంతపఱచిరి. బుద్ధుని నిర్యాణానంతరము 236 సం॥లకు అనఁగా అశోకుఁడు పట్టాభిషిక్తుఁడయిన పదునెనిమిది వత్సరంబులకుఁ బాటలీపుత్రమందుఁ దృతీయపరిషత్తు సమకూర్పఁబడినది. బౌద్ధులమని నటించుచు మతధర్మాచరణములను సప్త వత్సరపర్యంతము భంగపఱచిన కపటబౌద్ధుల నడంచి తద్ధర్మంబును బునస్సంస్కారంబు చేసి వెలయించుటకై యీ మూడవ పరిషత్తు ప్రవర్తకంబయినది. ముద్గలుని పుత్రుండగు టిస్సానాముఁడు (Tissa) తత్పరిషత్తున కధ్యక్షుఁడయి కథావత్తు అనఁబడు గ్రంథమునుదత్కాలంబునఁ బ్రకటించెను.

హిందూకథాసంగ్రహకారుఁడా పరిషత్తుల కాలము నిట్లు విశదీకరించెను —

| | | క్రీ. పూ. |
|---|---|---|
| 1 | పరిషత్తు | ... 477 |
| 2 | ,, | ... 377 |
| 3 | ,, | ... 242 |

ఈపరిషత్తుల విషయమై యశోకచరిత్రకారుఁ డిట్లు చర్చించెను. అశోకమహారాజు యొక్క పదుమూఁడవ పాలనావత్సరంబునకుఁ బూర్వ మనేక ధర్మోపదేశకులను బంపినట్లును, వారివలన ననేకులు బౌద్ధమత మవలంబించినట్లును, శాసనములు నిస్సందేహముగాఁ బ్రకటించుచున్నవి. ఆ ప్రభువు తన యేలుబడికాలములోఁ దొమ్మిదవవత్సరంబున సామాన్యోపాసకుఁడయి 2 సం॥ 6 మాసములు విశేషాభిలాషఁ గలవాఁడుగా నుండలేదని గతంబున లిఖింపఁబడియున్నది. తత్కారణంబుననె తన పాలనయొక్క పదునొకండవయేట బహుజనమును ధర్మోపదేశకులనుగాఁ బంపినట్లనివార్యముగ నూహింపవలసియున్నది. కాఁబట్టి యా ప్రభువుయొక్క పన్రెండవ పాలన సంవత్సరంబులో ననఁగా పదుమూఁడవ వత్సరంబున రెండవ, పదుమూఁడవశిలాశాసనముల స్థాపించుటకుఁ బూర్వము సింహళద్వీపమునకు ధర్మోపదేశకులు పోయియుందురు. ఈయంశంబులం బట్టి విచారింపఁగా నశోకుని పదునెనిమిదవపాలన వత్సరములోఁ దద్ద్వీపమునకు మతబోధకులు వెళ్లిరని యీద్వీప పురాణచరిత్రలు దెల్పుట యసంగతంబుగ నున్నది.

పరిషత్తులనుగూర్చిచర్చ.

అశోకుని యాజ్ఞానుసారముగ పాటలీపుత్రమం దాయన పాలనయొక్క పదునెనిమిదవ యేట ననఁగా బుద్ధుని మరణానంతరము 236 సంవత్సరములకు క్రీ. పూ. 242 సం॥లోఁ దృతీయ పరిషత్తు జరిగెననుట యశంకితంబుగ నున్నది. అశోమకహారాజు పాలనావిశేషములలో నీ పరిషత్తొకటియై యున్నది.

మూఁడవపరిషత్తు.

ఓల్డెన్‌బర్గ్ అను చరిత్రకారుఁడు ప్రథమపరిషత్తు కొంతకాలముక్రిందటి కల్పితవిషయ మనియు, రెండవ పరిషత్తులో మతవిరుద్ధాంశములను బదింటిని నిరాకరించి రనునది వాస్తవమె కాని ధర్మము నంతయు సంస్కరించి రనుట

రిషత్తులను గూర్చి ఓల్డెన బర్గు వ్రాసినది.

యబద్ధమనియు, మూఁడవ పరిషత్తును గూర్చి శంకింపవలసినది లేదని స్పష్టపఱచెను. కాని యీ పరిషత్తును గుఱించి శాసనములయం దశోకుఁ డుదాహరింప కుండుట యేలనో దురవగాహంబుగ నున్నది. ఈపరిషత్తు జరిగినదనుటకు సింహళపురాణములే యాధారములు. వీనిం బోషించునితరగ్రంథము

పురాణములలో వ్రాయఁ బడినది.

లిక్కాలంబునకు సంభవింపలేదు. ఈమూఁడవ పరిషత్తున కధ్యక్షుఁడగు టిస్సా (Tissa) విషయమై చీనా టిబెటు నేపాళ చరిత్రలలో నేమియు గానరాదు. ఈచరిత్రలయందు టిస్సానుఁ బ్రత్యామ్నాయముగా ఉపగుప్త నేర్పఱచిరనియు నీయనయె యశోకుని కుపదేశకుఁ డనియు మతాచార్యుఁ డనియు వ్రాయఁబడియున్నది.

ఈచరిత్ర కనుబంధములుగా ముందు వ్రాయఁబోవు సింహళపురాణంబుల యందును హిందూపురాణముల యందును

పరిషత్తులనుగూర్చి హిందూ సింహళ పురాణములలోని వ్యత్యయములు.

గొన్ని విషయము లుపగుప్తునకును టిస్సాకును సమాసముగా నుండును. మఱియుఁ బ్రథమ ద్వితీయ పరిషత్తులలో జరపఁబడిన చర్యలు మిశ్రము లగునటుల వ్రాయఁబడినవి. తత్పరిషద్ద్వయమునందును బ్రధానపురుషుఁడు వ్యాసుఁ డని (Vyasas) లిఖింపఁ బడి యున్నది. సాంచిస్తూపములో లభించిన యస్థికపాత్రములలో నొక దానియందు నామరహితముగ మొగ్గలియొక్క పుత్రుఁడనిమాత్ర మున్నది. ఈ మొగ్గలి యశోకప్రభువునకు నించుమించుగ సమకాలికుఁడు అయినను రెండు మూఁడు పరిషత్తులలో జరపఁబడిన వని పురాణములు దెల్పెడు చర్యలు విశ్వాసపాత్రములుగా లేవు. ఇది యిట్లుండ సింహళపురాణముల

యం దశోకచక్రవర్తికి జతగా కాలాశోకుని సెుకని సృష్టించినట్లె వా. వముగాఁ బ్రవృత్తమయిన పరిషత్తునకుఁ దోడుగా నింకొకపరిషత్తును గల్పిం రని యూహింపఁదగియున్నది. మఱియు ఈకల్పితపరిష త్తెవరికాలమఁ దెక్కడ జరిగినదియు నిశ్చయింప దుష్కరముగానున్నది.

పరిషత్తులుసంశయ నీయములు.

పురాణంబులు ప్రతిపాదించు మూఁడు పరిషత్తులయందును బ్రవృత్తంబు లయిన విషయంబు లేకవిధంబుగనే యుండు టంజేసియు మతధర్మసంస్కరణమునె తెలు పుటంజేసియు సంశయనీయములగునీపరిషత్తులు చరిత్రకు నర్హమయినవిగా నుండవు. ఏల యనఁగాఁ చరిత్ర యథార్థవిషయములనె బోధింపవలయును. మఱియు క్రీ. శ. 40 వత్సరంబున భరతఖం డోత్తరభాగ చక్రవర్తి యయిన కౌని ష్కుని కాలమం దొక పరిషత్తు జరిగినదని చీనాగ్రంథములయం దున్నది. ఈ విషయము సింహళచరిత్రయందు లేదు, బైబిలులో న్యూటెస్టుమెంటు

కౌనిష్కుని పరిషత్తు విశ్వసనీయము.

వలెనె బుద్ధధర్మమును కాలక్రమమునఁ బ్రజా నుకూలంబుగఁ బెంపుఁజెంది యుండె ననియు బూర్వకాలపు పరిషత్తులవల్ల సంస్కరింపఁబడ లేదనియు నూహింపఁదగియున్నది. కౌనిష్కుని కాలపు పరిషత్తునందుఁ గొన్ని భాష్యములు కూడ లిఖింపఁబడిన వనువృత్తాం తము యథార్థమని నమ్మవచ్చును.

సింహళపురాణమందలి మఱియొక యసంగ తాంశము.

సప్తవత్సరంబులకాలము ప్రజలు బుద్ధమతాచారవంతులుగా నుండనం దున "టిస్సా" యను బౌద్ధమతాచార్యుఁ డా కాలమున వనవాసిగా నుండెనని సింహళ పురాణంబులు పల్కుట యశోకుఁడు బౌద్ధ మతావలంబి యగుటకుఁ బూర్వము దురాచార

*అశోకుఁడు దురాచారవంతుఁడు.*

సంపన్నుఁడనియుఁ దదనంతరము సత్ప్రవర్తనపరుఁడయ్యె ననియుఁ దెల్పుటకై యయియున్నది.

*బుద్ధుని మరణకాలమును గుఱించి భిన్నాభిప్రాయము.*

బుద్ధమరణమునకును అశోకునిపట్టాభిషేకమునకును మధ్య 218 సం॥ లకాలవ్యవధి యయినదనియు బుద్ధుఁడు క్రీ. పూ. 543 సం॥ లో నిర్యాణమును బొందెననియు సింహళపురాణములు ప్రతిపాదించుచున్నవి. చీనారాయబారులు దెల్పినవృత్తాంతములును, ఇతరగ్రంథములును, దద్భిన్నకాలనిరూపణము చేయుచున్నవి.

*కల్పితకాలాశోకుఁడు.*

మఱియు నశోకచక్రవర్తికిఁ బూర్వ మింకొక యశోకుని గల్పించి యాయనకు కాలాశోకనామం బిడి సింహళపురాణముల యందుఁ దండోపతండంబులుగ నశోకుని గుఱించి కన్పట్టు నసంగతంబులకును, నాయా వృత్తాంతములకును సాంప్రదాయిక కాలనిరూపణము చేయుటయందుఁ గనఁబడు పరస్పర విరుద్ధాంశములను సమన్వయము చేయుటకొఱకు నశోకు లిద్దఱని యొకగతిఁబూర్వచరిత్రకారులు కల్పింపవలసివచ్చెనేమో. అయినను బ్రథమాశోకుని వృత్తాంతము వ్రాయుటకు నాధారము లేమియుఁ గన్పట్టవు.

*ఈచరిత్రనాయకుఁడైన యశోకుని పాలనము నిర్వివాదము.*

క్రీ.పూ. మూఁడవశతాబ్దములో 40 సం॥లు పాలనచేసియున్నట్టియు బిందుసారుని పుత్రుఁడును చంద్రగుప్తుని పౌత్రుఁడు నయినట్టియు నశోకచక్రవర్తి యొక్కఁడె చరిత్ర నలంకరించుచున్నాఁడు. అశోకచరిత్రయొక్క కాలనిర్ణయ మొనరించుటకు "జస్టిన్" వ్రాసిన చరిత్రయు, శాసనమును, బ్రబలాధారములు. మహావంశాదిపురాణాంతర్గతకల్పన లీప్రమాణంబులను బ్రతిఘటింపలేవు.

ప్రియదర్శియయిన యశోకుఁడు తన వంశపారంపర్యమును గూర్చి మౌనము వహించినను బుద్ధ, జైన, హిందూ పురాణసాక్ష్యములును రుద్రదామనుశాసనములోఁ గొంతవఱకును దత్ప్రభువు మౌర్యవంశములోఁ దృతీయుఁ డనియుమౌర్యవంశ మూల పురుషుఁడైన చంద్రగుప్తుని మనుమఁ డనియు విశదీకరించుచున్నవి. ఈ చంద్రగుప్తుఁడు సెల్యూకసునకు సమకాలీనుఁ డని గతంబున నుడితంబయియుండె. చంద్రగుప్తుని రాజ్యారంభము క్రీ. పూ. 321 సంవత్సరమని యశోకచరిత్ర కారుఁడు వచించెను. హిందూదేశకథాసంగ్రహమందు క్రీ. పూ. 322 అనియున్నది. ఇది స్వల్పభేదము. 321 సం॥ అగుటకుఁ గారణములు:—

అశోకుని వంశపారంపర్య విచారణ.

మహాఅలెగ్జాండరు క్రీ. పూ. 323 సం॥లో వేసవియందుఁ గాలధర్మము నొందెను. ఆయన సంబంధులయిన యధికారులు వెంటనె పంజాబునకు వచ్చిరి. పిమ్మట నక్కడి ప్రజలు చంద్రగుప్తునిచే నడిపింపఁబడి క్రీ. పూ. 323-322 లో ఆయధికారుల నెదిరించిరి. కాబట్టి క్రీ. పూ. 321 సం॥లోచంద్రగుప్తుఁడు రాజ్యాధిపతి యయ్యెననుట నిర్వివాదముగ నున్నది. ఆయన యిరువదినాల్గు వత్సరంబులు పరిపాలించె నని దీపవంశ మహావంశ గ్రంథము లేకగ్రీవంబుగ నిర్ణయించుచున్నవి.

చంద్రగుప్తుని పరిపాలన కాలనిర్ణయము.

ఇదియు నిర్వివాదంబె బిందుసారుఁ డిరువదియెనిమిది వత్సరంబులు పాలించెనని మహావంశపురాణము పల్కుచున్నను గడమ పురాణంబులు దెల్పు పంచవింశతి (25) వర్షంబుల కాలమె చరిత్రకనుకూలమయి యున్నది. కాన నదియె స్వీకరింపఁబడియె. ఇట్లుతమభయులపరిపాలనకాలము 49వత్సరంబులని తెలుచున్నది. మఱియుఁ

బిందుసారుని పరిపాలన కాల నిర్ణయము.

దత్కాలము తత్కాలీనులైన యన్యదేశరాజుల కాలమున కనుకూలించి యున్నది. కాన చంద్రగుప్తాశోకులయొక్క కాలానుక్రమము తృప్తికరముగా నిశ్చయింపఁ బడుచున్నది. ఎట్లనఁగా చంద్రగుప్తుఁడు క్రీ. పూ. 321 లో రాజ్యమునకువచ్చిన ట్లింతకుఁబూర్వము లిఖింపఁబడియె. తదనంతరము 49 సం॥లకు ననఁగా క్రీ. పూ. 272 సం॥లో నశోకుండు రాజ్యాధిపతియయి యుండవలెను.

చంద్రగుప్తబిందుసారులకాల మందలియన్యదేశరాజులు. పైని లిఖింపఁబడిన యన్యదేశ రాజు లెవరనఁగా:—

(1) సిరియా ప్రభువయిన ఆంటియోకసు.

(2) ఈజిప్తు రాజయిన టాలమిఫిలాడెల్ఫసు.

(3) మేసిడోనియా రాజయిన ఆంటిగోనసు.

(4) ఇపిరసు ప్రభువయిన అలెగ్జాండరు.

(5) సిరీసు ప్రభువయిన మాగాసు.

వీరి పేర్లన్నియుఁ బదుమూఁడవ శిలాశాసనమం దున్నవి. వీరందఱును జీవించిన సమ కాలము క్రీ. పూ. 258. అశోకుని శిలాశాసనములన్నియు ఆయన యొక్క పాలనకాలములోఁ బదుమూఁడవ, పదునాల్గవ వత్సరములయందు నిర్మింపఁబడినవి. అశోకుఁడు క్రీ. పూ. 272 లో రాజ్యాధిపతి యయ్యెననియు, క్రీ. పూ. 269 లో రాజ్యాభిషిక్తుఁడయ్యెననియుఁ దెలిసికొనవలెను. ఇవ్విధముగ విలియంజోన్సు, జేమ్సుప్రిన్సెపు లిఖించిన నిర్వివాద వృత్తాంతములవల్ల నశోకుని పాలనారంభకాలము నిర్ణయింపఁబడినది.

అశోకుని పాలనారంభ కాలనిర్ణయము.

అశోకచరిత్రయందుదాహృత క్రీస్తుపుట్టుకకుఁ బూర్వవత్సరంబులు క్రీస్తుపుట్టువఱకుఁ దగ్గుచుండుననియు క్రీస్తు

| | |
|---|---|
| రింపఁబడిన ప్రసిద్ధవిషయంబులకుఁ గాలానుక్రమణిక. | పుట్టుక సంవత్సరము మొదలుకొని యది హెచ్చుచుండుననియుఁ జదువరుల కందఱకుఁ దెలియకపోవచ్చునని వివరింపఁబడినది. |

## ముఖ్యాంశములయొక్క కాలక్రమవివరణము:—

| క్రీ.పూ. | విషయము. | ఆధారము. |
|---|---|---|
| 327-22 | అలెగ్జాండరు హిందూదేశముపైఁ జేసిన యుద్ధయాత్రలు | ఆరియన్ (Arian &c.) |
| 325 | చంద్రగుప్తుఁడు అలెగ్జాండరును గలిసికొనుట | ప్లూటార్కు. |
| 323-22 | చంద్రగుప్తుని నాయకత్వము క్రిందఁ బంజాబుదేశవాసు లెదరించుట | జస్టిన్. |
| 321 | చంద్రగుప్తుఁడు ఇండియా చక్రవర్తి యగుట | |
| 311-6 | సెల్యూకసు సిరియాదేశములకు జయించుచు ఇండియాకు వచ్చిచంద్రగుప్తునితో సంధిచేసికొనుట | |
| 306 | సెల్యూకసు సిరియాదేశ ప్రభువగుట | |
| 305 | సెల్యూకసు చంద్రగుప్తునికి ఇండియాలోని తనభాగము నిచ్చివేయుట | |
| ,, | మెగాస్తినసు రాయబారిగవచ్చుట. | |
| 297 | బిందుసారుఁడు చక్రవర్తియగుట | |
| 272 | ప్రియదర్శిని యను నామాంతరము గల యశోకుఁడు రాజ్యాధిపతి యగుట | |

| క్రీ.పూ. | | విషయము. | ఆధారము. |
|---|---|---|---|
| 269 | 1 | పాలనవత్సరము అశోకుఁడు రాజ్యాభిషిక్తుఁ డగుట. | |
| 261 | 9 | ,, అశోకుఁడు కళింగదేశమును జయించుట బుద్ధధర్మమం దాయన ప్రవేశించుట | శిలాశాసనము నం 13 రు. |
| 259 | 11 | ,, అశోకుఁడు బుద్ధమతోపాసకుఁ డయి మృగయావినోదమును మాని తీర్థయాత్రఁజేసి ధర్మోపదేశకులను బంపుట | నం 8 రు శిలాశాసనము నం 1 రు లఘుశాసనము నం 13 రు శిలాశాసనము. |
| 257 | 13 | ,, నం 3, 4రుల శిలాశాసనములను అశోకుఁడు నిర్మించుట | నం 3, 4 రుల శిలాశాసనములు. |
| ,, | ,, | ,, బ్రాహ్మణఆజీవకులకొఱకు బరాబరునందు నం 1, 2 రుల గుహలను శాసనసహితములుగ నిర్మించెను | బరాబరు గుహాశాసనము. |
| 257 | 13 | ,, బుద్ధధర్మసంరక్షణకొఱకు 5సం॥ల కొకసారి పరిషత్తు జరుగవలెనని యాజ్ఞాపించుట | నం 3 రు శిలాశాసనము. |
| 256 | 14 | ,, అశోకుఁడు పదునాలుగు శిలాశాసనములను కళింగరాజ్యప్రాంతదేశములకొఱకుఁ బ్రత్యేక శిలాశాసనము నెం 2రును బ్రకటించుట | నం 5 రు శిలాశాసనము ప్రాంతదేశ శిలాశాసనము. |

| క్రీ.పూ. | | | విషయము. | ఆధారము. |
|---|---|---|---|---|
| | | | అశోకుఁడు ధర్మాధికారులను నియమించుట | నం 5 రు శిలాశాసనము ప్రాంతదేశశిలాశాసనము. |
| 255 | 15 | ,, | కపిలవాస్తునగరమందు బుద్ధునిస్తూపమును అశోకుఁడు వృద్ధిచేయించుట | నిగ్లీవా స్తంభశాసనము. |
| 254 | 16 | ,, | అశోకుఁడు కళింగరాజ్యమందుండు నాగరికజనవిషయమై నం 1 'రు ప్రత్యేక శిలాశాసనము ప్రకటించుట. | |
| 252 | 18 | ,, | అశోకుఁడు లఘుశిలాశాసనములను భాబ్రాశాసనమును ప్రకటించుట | నం 1 రు లఘుశాసనము. |
| 250 | 20 | ,, | అశోకుఁడు బ్రాహ్మణాజీవకుల నిమిత్తము బరాబరునందు నం 3 రు గుహను నిర్మించుట. | నం 3 రు బరాబరు శిలాశాసనము. |
| 249 | 21 | ,, | బౌద్ధపుణ్యక్షేత్రములకు నశోకుఁడు వెళ్లి లంబినీవనమునందును కోణకమునిస్తూపమునందును జ్ఞాపకార్థముగా స్తంభములను స్థాపించుట | నిగ్లీవియా రుమ్మింది స్తంభశాసనములు. |
| 243 | 27 | ,, | అశోకుఁడు నం 6 రు స్తంభశిలాశాసనమును నిర్మించుట | నం 6 రు స్తంభశిలాశాసనము. |

| క్రీ.పూ. | | | విషయము. | ఆధారము. |
|---|---|---|---|---|
| 242 | 28 | ,, | అశోకుఁడు సప్తస్తంభశిలాశాసనములను బ్రకటించుట | 7వనం ముస్తంభశిలాశాసనము. |
| 240 | 30 | ,, | అశోకుఁడు పరిశిష్టశిలాస్తంభశాసనములను నిర్మించుట | |
| 232 | 38 | ,, | అశోకుని మరణము | మహావంశపురాణము. |

ఉ. చిత్రవిచిత్రకల్పనల సింహళ హిందు పురాణరాజి ది
జ్మాత్రము నైన సత్యమును గాఢముగా వచియింపఁ జాలమిం
బాత్రములైన శాసనపుఁబల్కుల సచ్చరితాళిఁ జూచి చా
రిత్రము దీనివ్రాసిరి, ధరిత్రి నశోకుని కీర్తి భాసిలన్.

---

# 6-వ అధ్యాయము.

అశోకునికిఁ బూర్వము బౌద్ధమతకాలమందలి రాజ్యాదుల వృత్తాంతము మౌర్యవంశజులలో ప్రథముఁడు చంద్రగుప్తుఁ డనియు, ద్వితీయుఁడు బిందుసారుఁ డనియు, తృతీయుఁ డశోకుం డనియు గతంబున లిఖింపఁబడి యున్నది. చంద్రగుప్తునకుఁ బూర్వము బుద్ధునికాలమం దనఁగా క్రీ. పూ. ౬అవశతాబ్దమందు భరతఖండరాజ్యముయొక్కయుఁ బ్రజలయొక్కయు స్థితులనుగుఱించి కొంతవృత్తాంతము విశదీకరించినయెడల చంద్రగుప్తాశోకుల రాజ్యవ్యాప్తి పాలనవిశేషంబులు చదువరులకు సుగమంబులుగను మనోహారంబులుగ నుండునని, యప్పటిస్థితులు సంగ్రహముగ నీక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నది.

1-వ ప్రకరణము రాజ్యముల వివరము—

బుద్ధమతారంభమునకుఁ గించిత్పూర్వమందుఁ గాని యారంభమందుఁ గాని పదియాఱురాజ్యంబు లున్నట్లు పూర్వచరిత్రంబులయందుఁ బ్రాయికముగ నుడువఁబడినది ఆరాజ్యంబులకు జాత్యభిధానములె కాని స్థలాభిధానంబులు లేవు. ఎట్లనఁగా మాగధజను లుండురాజ్యమునకు మగధరాజ్యమని పేరు. ఈనామము స్థలమును బట్టి వచ్చినది కాదని తెలియుచున్నది.

(1) మగధరాజ్యము. ఇది యిప్పటి బేహారు జిల్లా. అప్పటి దీని యెల్లలు—ఉత్తరమున గంగానది. తూర్పున చంపానది. దక్షిణమున వింధ్యపర్వతములు. పడమట శోణనది. బుద్ధుని కాలములో అంగదేశసహితముగా దీని యందు 8000గ్రామము లుండెను. దీనిచుట్టుకొలత 23వందలమైళ్లుండెను.

(2) కాశిరాజ్యము. ఈరాజ్యప్రజలు కాశీనగరప్రాంతజనంబులె యయియుందురు. బహుపూర్వకాలమునుండి వినుతికెక్కిన యీరాజ్యము కాలక్రమమున నెంతక్షీణదశలోకి వచ్చిన దనిన నీరాజ్యము కోసలమగధ రాజ్యాధిపతులకుఁ గలహామిషం బయ్యె ననఁగా వారిరువురును దమకుఁ దద్రాజ్యము రావలె నని ఘోరయుద్ధములు చేసిరి. తుదకుఁ గోస లాధీశునికే యారాజ్యంబు లభించె. ప్రజలందఱు నిప్పటికి నీరాజ్యమును స్వతంత్రరాజ్య మనియె తలఁచెదరు. కనుక నది యొకప్రత్యేకరాజ్యముగా నిం దెన్నఁబడినది. దీని చుట్టుకొలత రెండువేల మైళ్లని చరిత్రలయం దు న్నది కాని యీరాజ్యము మరల స్వాతంత్ర్యము నొందలేదు. దీనియెల్లలున వగతంబులు కాలేదు.

(3) కోసలరాజ్యము. దీనిని కోసలతెగవారే యేలుచుండిరి. ఇది క్షత్రి యప్రభుత్వకాలమునుండి పురాణప్రసిద్ధం బయినరాజ్యంబు. దీని రాజధాని యప్పటికాలంబున శావస్తి. ఈపట్టణము గోరాక్పురమునకు వాయవ్యమూ లగా 70మైళ్లదూరంబున నుండె. కాశీ, సాకేతనగరములు దీనిలోనె చేరి యున్నవి. ఈరాజ్యమునకు దక్షిణమున గంగానదియుఁ దూర్పున గండకీ తరంగిణియు, నుత్తరమున హిమాచలములు నెల్ల లయియుండెను. క్రీ. పూ. 7-వ శతాబ్దములోనె శాక్యవంశస్థు లీరాజ్యమునకు లోఁబడియుండిరి. ఈరాజ్య మతిశీఘ్రముగాఁ బ్రబలి యవ్యవధిగ మగధరాజ్యమునకు నని వార్యమయిన ప్రత్యర్థియగుటయె బుద్ధకాలరాజ్యవిశేషములలో బహు ముఖ్యవిషయముగ నుండెను. కోసలప్రజ లించుమించుగాఁ బర్వతవాసు లయినకతన వారిని తొలిగుండెఁగలవా రనవచ్చును. వీరు హిమవత్పర్వత ములకును గంగానదికిని నడుమనుండు ప్రదేశవాసులను దమలోనికి నీడ్చు కొనిరి. తూర్పున నుండు తెగలవారు స్వతంత్రు లగుటవల్ల వారుమా త్రము వీరి వలలోఁ జిక్కలేదు. భరతఖండ మంతయు కోసలరాజునకు,

జెందినదా? మగధరాజునకుఁ జెందినదా? యనెడు గొప్ప వివాదాంశముఁ లిచ్ఛవు లనఁబడు ప్రబలమైన తెగవారు మాగధులకుఁ దోడ్పాటొసంగుటచేఁ గట్టకడను మగధరాజ్యపక్ష మాయెను. దర్భసేన, కంసులను రాజులచే నడపింపఁబడి కోసలులు కాశీరాజ్యముపై ననేకపర్యాయములం జయప్రదము లయినదండయాత్రలు బుద్ధుఁడు జన్మించుటకుఁబూర్వము చేసియుండిరి. తుదకు "కాశీరాజ్యజయశాలి" యను శాశ్వతబిరుదు కంసరాజునకే లభించెను. కోసలరాజ్యమును గుఱించి రెండువిశేషంబులు కలవుం. బుద్ధమునికి సమకాలీనుఁడై యీ రాజ్యమును బాలించిన ప్రసన్నధీ యను రాజోత్తముఁడు సార్థకనాముఁడైయుండెను. ఈయన సుగుణవిశేషంబులను సత్ప్రవర్తనను బురాతనచరిత్రలం దధికముగ వర్ణించియుండిరి. వాయవ్యమూలనున్నతక్షశిలానగరపాఠశాలయం దాయన సమగ్రంబుగ విద్యలు నేర్చి రాఁగానె యాయన జనకుండైన మహాకోసలప్రభు వాయనను సింహాసనాసీనునిఁ జేసెను. ఆ ప్రసన్నధీ రాజకీయవ్యవహారములయం దభిలాషియై సజ్జనపక్షపాతియై ప్రభుత్వంబుఁ జేసె. సర్వసుమతసమపక్షత్వము భారతీయలక్షణంబు, కనుక దాని కాభారతీయప్రభువు లక్ష్యంబై పరమతసహిష్ణుతఁ గలవాఁడుగ నుండెను. బుద్ధునితో నొకప్పుడు ప్రసంగించుటచే ఆయన బుద్ధమతానుసారి యయ్యె. అదిమొదలుకొని పరమతసహనమం దాయన యౌదార్యము ప్రబలమయ్యెను. "మహాపండితు లయిన పెద్దలనేకు లుండఁగా. నీవు ఇంతబాల్యమందుండి సూక్ష్మమైన తత్వజ్ఞానమును వారికంటె నధికముగ నెఱుఁగుదునని యెట్లువక్కాణింపఁగలవు?" అని యా ప్రభువొకప్పుడు బుద్ధునిఁ బ్రశ్నించెను. పిన్నచేతిదివ్వె పెద్దగావెలుగదా యని. వేమనమహాయోగి వచించునట్లుగానె బుద్ధముని యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను "బాలుఁ డగుటంజేసి తత్వవేత్త తిరస్కారపాత్రుండు కాఁడు. రాజకుమారుఁడు బాలుఁడనియుఁ, ద్రాచుపాముచిన్నదనియు, నగ్నిస్వల్పమనియు,

నెవఁడునిర్లక్ష్యముఁజేయును. బోధకుని తత్వజ్ఞానమె విచారణీయము కాని ప్రాయంబుకాదు" అని బుద్ధుఁడుచెప్పెను ప్రసన్నధీ యొక్క మేనత్త యీప్రసంగమును విని బౌద్ధమతావలంబనమును దక్షణమె చేయందలఁచి యుఁ గొన్నియాటంకములవల్ల వ్యవధిగా బౌద్ధభిక్షుని యయ్యెను. ఇది యొకవిషయము. మఱియొకవిషయ మేమనఁగా బుద్ధముని శాక్యవంశజుఁడు, కాన న మ్మహనీయుని కతంబున శాక్యవంశంబును బావనంబని యెంచియేమొ ప్రసన్నధీ శాక్యనాయకులలో నొకనిపుత్రికను బరిణయంబుకో అమఁ దన కోసంగుమని యడుగఁగా వారు కోసలులవంశము తమవంశమంత పరువుఁగలది కాదని తలఁచియు రాజునకు వెఱచి దాసీపుత్రిక నొకదానిని తమపిల్లయె యని కపటోపాయంబుగ వివాహంబునకు నొసంగిరి. దానిని బ్రసన్నధీ పెండ్లియాడి దానివలన నొక కొమరునిం బడసి వానికి విద్యుదాభుఁ డని పేరుపెట్టెనఁట. కాలాంతరంబున విద్యుదాభుఁడు శాక్యవంశకృతకపటవిన్యాస మెట్టులనో తనకుఁ గర్ణతాడితంబు కాఁగా దండతాడిత భుజంగంబువలెఁ గోపాటోపపరవశుండయ్యును నసమయంబగుటంజేసి తఱి వేచి యుండి ప్రభుత్వంబు కైవశంబు కాఁగానె యుద్ధసన్నద్ధుఁడై శాక్యనాయఁకులపై వెడలి వారి రాజధానిం బట్టుకొని శాక్యనాయకుల నాబాలవృద్ధంబుగ స్త్రీపురుషవివక్షలేకుండఁ దెగటార్చి పేర్చి పగఁదీర్చుకొని వచ్చెనఁట. ఈ కథాంశంబులు పురాతనచరిత్రలలోఁ గన్పట్టవనియు విద్యుడాభుఁడు శాక్యులను సంహరించినది సత్యమేయనియు, ద్వేషకారణ మేదియొ రాజకీయ వ్యత్యయంబయి యుండును గాని కపటవివాహము కాదనియు ఈ సంహారము బుద్ధుని మరణమునకుఁ బూర్వము 2,సం॥లకు జరిగియుండుననియు బుద్ధకాలహిందూదేశ చరిత్రకారుఁడు వ్రాసెను. బుద్ధుని మరణానంతరమే యీసంహారము జరిగెనని హిందూదేశ కథాసంగ్రహమున నున్నది.

(4) వంశరాజ్యము. దీనియందు వత్సులులను తెగయుండెను. దీనిరాజధానికౌశాంబి. ఈరాజ్యముఅవంతికి నుత్తరముగా యమునానదీతీరముననున్నది.

(5) కురురాజ్యము. కురు తెగవారు దీని నాక్రమించుకొనిరి. దీని రాజధాని యిప్పటి ఢిల్లీపట్టణమునకుఁ జెంగటనుండు ఇంద్రప్రస్థపురము. దీనికిఁ దూర్పున పాంచాలరాజ్యమును దక్షిణమున మత్స్యరాజ్యము నున్నవి. ఈ రాజ్యవిస్తీర్ణము 2000 మైళ్లని పరంపరాగతచరిత్రలవలనం గనృట్టుచున్నది. బుద్ధుని కాలమం దీరాజ్యము ప్రసిద్ధిం గాంచలేదు. ఇచ్చట బుద్ధముని యనేక ధర్మోపదేశములు చేసెను. రటపాలుఁడు తత్కాలప్రభువు.

(6) పాంచాలరాజ్యము. ఇది కురురాజ్యమునకుఁ బ్రాగ్దిశయందును ఆరావళిపర్వతములకు గంగానదికిని నడుమనున్నది. ఇది ఉత్తరపాంచాలమని దక్షిణపాంచాలమని రెండు రాజ్యములు. రాజధానులు కాంపిల్య, కౌశాంబి నగరములు.

(7) మత్స్యరాజ్యము. ఇది కురురాజ్యమునకు దక్షిణముగాను యమునానదికిఁ బడమరగాను నుండెను. దీనికిని దక్షిణపాంచాళమునకును యమునానది నడుమ నున్నది.

(8) శూరసేనరాజ్యము. మత్సరాజ్యమునకు నైరుతీమూలగాను యమునకుఁ బడమరగా నుండెను.

(9) (అశ్వక)రాజ్యము. ఈ రాజ్యపు ప్రజలయిన అశ్వకులు బుద్ధుని కాలమందు గోదావరీ తీరమం దుండిరి. వీరి రాజధాని "పాటాన" లేక "పాటలి" నగరము. మగధరాజ్యముతో అంగరాజ్యము చేరియున్నట్లే అవంతిరాజ్యముతో నిదియుఁ జేరియున్నది. ఇది యవంతి శూరసేన రాజ్యములకు మధ్య నున్నట్లు గనుపట్టుచున్నది. దీనింబట్టి గోదావరీ తీరమందుఁ బిమ్మటఁ గొంతకాలమువఱకు వారు నివాసముచేసిరని యూహింపఁదగియున్నది. ఈ తెగవా రెట్టివారో కూడ బాగుగాఁ దెలియదు.

(10) అవంతిరాజ్యము. దీని రాజధాని ఉజ్జయినీ పట్టణము. ఆకాలమందు దీనిప్రభువు చండప్రద్యోతుఁడు. భయంకరుఁ డగుటంజేసి యీయనకీపేరు వచ్చినది. ఈరాజ్యము మిగుల ఫలవంతమయిన దగుటచే నార్యులు దీనిని జయించియు మఱి యేవిధముననో నివాసభూమిం జేసికొనిరి. దీనినె యేడవ లేక యెనిమిదవ శతాబ్దమునుండి మాళవదేశ మనుచుండిరి.

(11) గాంధారరాజ్యము. దీనికి వర్తమాననామము కాండహారు. దీనియందు అఫ్గనిస్థానము యొక్క తూర్పుభాగమును, పంజాబు యొక్క వాయువ్యమూలప్రదేశమును జేరియుండును. గాంధారరాజయిన "పుక్కుసాతి" బుద్ధునికాలములో మగధదేశాధీశుఁ డైన బింబిసారునియొద్దకు రాయబారులను బంపినట్టు చెప్పుదురు.

(12) కాంభోజరాజ్యము. ఇది వాయువ్యమూలగా గాంధారమునకుఁ బొరుగురాజ్యమయి యున్నది. దీనికి ద్వారకానగరము రాజధాని.

నాయకసత్తాకరాజ్యములు.

(13) శాక్యనాయకులు. వీరిరాజ్యము రాజగృహపట్టణమునకు 450 మైళ్లును వైశాలిపట్టణమునకు 375 మైళ్లును శావస్తినగరమునకు 50 లేక 60 మైళ్లును దూరముననున్నది. బహుశః యిది నేపాళరాజ్యమును ఇంగ్లీషువారి రాజ్యము నానుకొనియుండును. "దేవదాహ" మొదలయిన 8 పట్టణములు వర్తకప్రసిద్ధములయిన వీరిరాజ్యమం దున్నట్లు పురాతనగ్రంథములు దెల్పుచున్నవి. మఱియు బుద్ధునికిఁ దండ్రివైపున 8000 కుటుంబములును దల్లివైపున 8000 కుటుంబములును బంధువులుగా నున్నట్లు బుద్ధఘోషుఁడు పురాతనగ్రంథములో వ్రాసెను. కుటుంబమునకు 6 లేక 7 గురు జనము చొప్పున శాక్యరాజ్యములో లక్షజన ముండియుండవచ్చును. ఈ కారణములను బట్టి శాక్యరాజ్యము విపుల మయియుండెనని యూహింపందగియున్నది. దీని రాజధాని కపిలవాస్తు.

(14) వజ్జియననాయకులు. వీరెనిమిది గోత్రములవారు. ఈ శాఖల వారిలో లిచ్ఛవులును (Licchavis) విదేహులనువారును ముఖ్యులు. విదేహ రాజ్యము పూర్వకాలమందు ప్రత్యేకరాజ్యమని పురాణములలో నున్నది. అప్పుడు దీని విస్తీర్ణము 23 వందల మైళ్లనియు దీని రాజధానియైన మిథిలా నగరము లిచ్ఛవులరాజధానియైన వైశాలినగరమునకు 35 మైళ్ల దూరమున వాయవ్యమూలగా నుండెననియుఁ బూర్వగ్రంథములలో నున్నది. మఱియు బుద్ధమతారంభమునకుఁ గించిత్పూర్వమందు నీ విదేహరాజ్యమును జనకమహా రాజు పాలించియుండెను. తత్కాలమందు మహోన్నతదశం జెందిన యీ విదేహరాజ్యము బౌద్ధయుగమందు నాయకపాలితమైన హీనదశ కేల వచ్చెను యది దురూహ్యంబుగ నున్నది. లిచ్ఛవులరాజధాని వైశాలినగర మయి యుండెను.

(15) మల్లనాయకులు. వీరి ముఖ్యపట్టణములు కుశీనర, పావా, యనునవి. వీరిరాజ్యము చీనాదేశపు యాత్రికులు వ్రాసినప్రకారము చూడఁగా శాక్యరాజ్యమునకుఁ బ్రాగ్దిశను వజ్జియనురాజ్యమునకు నుదగ్దిశ నున్న పర్వత ప్రాంతములయం దుండి యుండును. శాక్యరాజ్యమునకు దక్షిణముగాను "వజ్జియన" రాజ్యమునకుఁ బ్రాగ్దిశను నీరాజ్యముండెనని కొందఱు చెప్పె దరు.

(16) చేదిరాజ్యము. (Cetis or Cedis) వీరి నివాసములు రెండు చోట్లని చెప్పవలెను. ఒకటి నేపాళమందుండు పర్వతప్రదేశములు. రెండవది, కౌశాంబినగరసమీపప్రదేశము. ఇంతవఱకుఁ జెప్పిన పదియాఱు రాజ్యముల లోఁ బంద్రెండింటియందుఁ గుమిందాగా స్వతంత్రరాజ్యములును నాలుగు నాయక పాలితరాజ్యములు నయి యున్నవి. స్వతంత్రరాజ్యములవార లన్యోన్య వివాహసంబంధములఁ గలవారలై వివాహకారణంబులవల్లను, దురహం కార దురభిమానాదులవల్లను కలహంబులయందు లంపటత్వముఁ జెందిన

వారలై యుండిరి. నాయకరాజ్యపరిపాలనంబునఁ గొన్నివిశేషంబు లీదిగు వఁబొందుపఱపబడును.

2-వ ప్రకరణము నాయకరాజ్యవిశేషంబులు—

సంఘవిచారణము.

శాక్యనాయకులలోఁ బిన్నలునుఁ బెద్దలును గపిలవాస్తు(రాజధాని) యందున్న శాంతాగారమను నొకమందిరంబున సంఘీభూతులయి రాజకీయవ్యవహారములను, న్యాయవిచారణకార్యములను నెఱవేర్చుకొనుచుండిరి. కోసలరాజయిన ప్రసన్నధీయను నాతఁడు శాక్యనాయకునికూఁతురిని దనకు వివాహార్థ మొసంగమని కోరియుండెనని యింతకుఁ బూర్వము లిఖింపఁబడియున్నది. ఆవిషయమును శాంతాగారమందు విచారించిరి. ఒకనాయకుని, సంఘమున కధిపతిగా మహాజను లేర్పఱచుకొందురు. ఈయధిపతి సంఘవిచారణ లేనియపుడు రాజ్యవ్యవహారముల గమనించును. ఇతనిని రాజనిరి. బుద్ధుని తండ్రియయిన శుద్ధోదనుఁ డొకప్పుడు రాజుగా నేర్పఱచుకొనఁబడెను.

శాంతాగారమును నిర్మించుట.

బుద్ధుఁడు "మహావన" మనఁబడు నరణ్యములో న్యగ్రోధారామమందుండఁగాఁ గపిలవాస్తునగరమందు శాంతాగారము కట్టఁబడెను. దానియందే యన్నిమతముల భిక్షువులయునికికి వీలు కలుగఁజేసిరి. శాంతాగారగృహప్రవేశోత్సవము తనయాధిపత్యముక్రింద జరుపుమని ప్రజలు కోరినప్రకారము బుద్ధుఁడు జరిపించెను. అచ్చట బుద్ధుఁడును అయన శిష్యులయిన ఆనందుఁడును, మొగ్గలనయు, రాత్రులయందు ధర్మోపన్యాసములను జేసిరి. ఆయుపన్యాసములను ధర్మగ్రంథములయందుఁ దన్మతాచార్యులు సంగ్రహంబుగ లిఖించియుండిరి. ఇట్టి యాగారము లన్యస్థలములయందును నిర్మింపఁబడినట్లు చెప్పుదురు. చుట్టునుగోడలు

లేకుండ పైఁగప్పుమాత్రముఁ గలచావడులె యీయాగారములు. ఇవియె వ్యవహారస్థానములును. గ్రామతోపులయందు కుటుంబాధిపతులుకూడి ప్రతిగ్రామమందును సంఘముగాఁజేరి గ్రామవ్యవహారములు మాట్లాడుకొనిరి.

గ్రామతోపులయందు సంఘవిచారణ.

శాక్యప్రజలకు వరిపొలములును బశువులును జీవనాధారములు. గ్రామములు వరిపొలములచుట్టునుండెను. గ్రామముల నానుకొనియుండు నడవులయందుఁ బశువులు మేయుచుండెను. ఆ యడవు లందఱకును సమిష్టిభోగమందుండును. ప్రతిగ్రామమందును సమర్థులయిన శిల్పులనఁగా వడ్రంగులు కమ్మరులు మొదలగువారు కలరు. వీరికిఁబ్రత్యేకగ్రామము లుండుటయుఁ గలదు. పౌరోహిత్యబ్రాహ్మణులకు నివ్విధమననె యగ్రహారములుండెను. వీరుగ్రామజనులకు హవ్యకవ్యములు చేయించుచుండిరి. పైని జెప్పినచేతిపని వాండ్రు శాక్యవంశజులుకారు. ఖోమదుస్స (Khomadussa) అనుగ్రామము బ్రాహ్మణాగ్రహారమె. సమీపరాజధానులలో నున్నట్లీ శాక్యరాజ్యమందు వర్తకులుగాని సాహుకారులుగాని యున్నట్లు గనుపడదు. బజారులయందుఁ గొన్నియంగళ్లుమాత్ర ముండెనని చెప్పుదురు. గ్రామములు చిట్టడవులచే వేఱుపడియుండెను. ఈయడవులు మహావనమనెడు నరణ్యము యొక్క భాగము లయియుండెను. ఈమహారణ్యము హిమాలయములనుండి గంగానదివఱకు వ్యాపించియుండెను. ఈ నాయఁకరాజ్యములను సమీపరాజ్యములవారు నశింపఁజేసినపదంపడి యీమహారణ్యము నాయకరాజ్యప్రదేశముల నాక్రమించెను.

జీవనవృత్తులు.

ఈయరణ్యము దొంగలకాలయమయి బహుకాలముండెను. అయినను వీరుగాని గ్రామవాసులుగాని నేరములు చేసియున్నట్లు కనుపడదు. గ్రామాభి

నేరములు. మానులై జనులు గ్రామపాలన మొనర్చు కొను నపుడు నేరములెట్లుజరుగును. ఇప్పటివలె న్యాయస్థానములయందు నివాసము చేయుచు జను లెందుకుందురు ప్రత్యేక దుస్తు ధరించెడుపోలీసువా రిప్పటివలెనె తత్కాలమందును రాజులయొద్దను నీనాయకరాజ్యములయందును గలరు. వీరు

పోలీసు. బలాత్కారముగా లంచములు మొదలయినవి ప్రజలవలన గ్రహించెదరని యప్రతిష్ఠం జెందిరి.

దండన విధాయక న్యాయశాస్త్రమును వజ్జియననాయకులు గమనించిన విధ మిట్టిదని యొక పారంపర్య వృత్తాంతము

దండనాధికారము. కలదు. న్యాయకర్తలు, న్యాయవాదులు, ధర్మశాస్త్రవచన పాఠకులు, అష్టగోత్ర ప్రతినిధిసంఘము. సేనాధిపతి, యువరాజు, రాజు, వీరందఱు నప్పటియధికారులు. వీరిలో నెవరైన నిరపరాధిని విడుదలఁజేయఁ గలిగియుండిరి. అపరాధియని తోఁచినప్పు డుత్తరోత్తరాధికారులకు నివేదించిరి. ధర్మశాస్త్రమును సారముగ దండనను విధించుటకు రాజు చరమాధికారి యయి యుండెను. ఇట్టి వ్యవహారధర్మ మల్పగోత్రముల యం దున్నట్లు గన్పట్టను. వజ్జియననాయకుల యందును నీ దుర్ఘటవ్యవహారసరణి యుండె ననుట సందేహాస్పదమని చరిత్రకారులు తలఁచిరి. ఈ నాయకరాజ్యములయందు రాజునకుఁ ప్రభుత్వము పరంపరాగతమై యున్నప్పుడు రాజు

రాజ్యాధిపత్యము. నకుఁ బ్రజలనియామక మవసరములేదు. రాజ్యము స్వాతంత్ర్యము గలదియు నగును. శాక్యరాజ్య ప్రజలవలెనె కడమ నాయకరాజ్యజనులు నించు మించుగా నుండిరని గ్రహింపవలయును.

3-వ ప్రకరణము—

క్రీ. పూ. 7-వ శతాబ్దమందు భరతఖండములోని ప్రసిద్ధపట్టణములు.

(1) అయోధ్య—ఇది కోసలరాజ్యమందు సరయూనదీతీరమందున్న యొకనగరము. రామాయణ చరిత్రకాలమందు నిదియొక ప్రసిద్ధపట్టణమై యున్నట్లా గ్రంథకర్త వ్రాసెను. మహాభారతమందు దీనినిగుఱించి యేమియు నుదాహరింపఁబడి యుండలేదు. బుద్ధుని కాలమం దిది ప్రసిద్ధిలో నెంతమాత్రమును లేదు.

(2) వారణాసి—ఇది గంగానదియు బారణానదియుఁ గలియు చోట నున్నది. గంగా, అసి నదులయొక్క మధ్యప్రదేశమె వారణాసి. కాశీరాజ్యము స్వతంత్రముగా నున్నప్పుడు వారణాసియె రాజధానిపట్టణము. అప్పుడు ప్రాంతప్రదేశములను గల్పుకొని 85 మైళ్లు విస్తీర్ణముఁగలిగి యుండెను. దీనియందు నొక సభామందిర ముండెను. ఈరాజ్యము కోసలరాజ్యాధీనమయి పదంపడి యీసభయందుబుద్ధమతచర్చల నేకముగాజరిగినవి.

(3) చంపానగరము—ఆపేరుగల నదియొడ్డున నె యీ నగర మున్నది భాగల్పురమునకు 24 మైళ్లదూరమునఁ బ్రస్తుతకాలమం దా పేరుగల గ్రామప్రదేశమె యీ నగరప్రదేశమని చరిత్రకారు లూహింపుచున్నారు. దీనియందు గగ్గరా యనఁబడు మనోహరమైన సరస్సున్నది. దీనిని గగ్గరాయను నామంబుగలరాణి నిర్మించెను. దీని గట్లమీఁదఁ జంపక వృక్షము లున్నవి. ఈ చెట్లయొక్క పుష్పములు శ్వేతములును సుగంధకలితములు నయి ప్రసిద్ధిం జెందియుండెను.

(4) కాంపిల్యనగరము—ఇది యుత్తరపాంచాలుల రాజధాని. గంగానదియొక్క యుత్తరపుగట్టున నున్నది. దీని స్థల మిప్పటికిని బాగుగా నిరూపణము కాలేదు.

(5) కౌశాంబినగరము—ఇది వంశరాజుల రాజధాని. ఇది యమునాతీరమందున్నది. దక్షిణమునుండియుఁ బశ్చిమమునుండియు నేతెంచు బాటసా

పులకును సరకులకు నిది కూడ విస్థానమైయుండెను. ఈ నగరముయొక్క ప్రాంతగ్రామములయిన భద్రిక, కుక్కుట, పోషిత ఆమ్ర వనములయందు నాశ్రమములుండెను. వీనియందు బుద్ధుడనేక ధర్మోపన్యాసములను జేసెను.

(6) మధురానగరము—ఇది యమునాతీరమందున్నది. శూరసేనులకు రాజధాని. ఇది యిప్పటి మధురానగర ప్రదేశమునందె యుండి యుండ వచ్చును. బుద్ధుని కాలమందు నీమధురా నగరరాజునకు అవంతీపుత్రుడనియు నామంబుకలదు. అందువలన నీయన ఉజ్జయినీ రాజకుటుంబములో చేరిన వాఁడుగాఁ దోచెడును. ఈ నగరమును దనదర్శనముచే బుద్ధుడు పావనము చేసియుండెను. మఱియు బుద్ధుని ప్రియశిష్యులలో నొకఁడయిన "మహాకంకాణ" యనుభక్తుఁడే నగరవాస్తవ్యుఁడయి యుండెను. ఈయన పాలి భాషావ్యాకరణమును బ్రథమమున సంస్కరించుటచే దానికి నీ యననామము నె పెట్టిరి.

(7) మిధిలానగరము—ఇది తిరహోతుజిల్లాలో నున్నది. దీని విస్తీర్ణ మేఁబదిమైళ్లని ప్రాయికముగా నుడువఁబడెను. ఇది జనక, మాఖదేశమహారాజులకు రాజధానియై వినుతికెక్కెను.

(8) రాజగృహనగరము—ఇది మగధరాజ్యమునకు రాజధాని. దీని ప్రస్తుతనామము రాజగిరి. ఇది రెండు ప్రత్యేకపట్టణములుగా నున్నటు గన్పట్టును. ఒకటి గిరివ్రజమను నామంబుచేఁ బరగెను. ఇది పర్వతదుర్గము. మిక్కిలి ప్రాచీనమైన నగరము. మహాగోవిందుఁడనుశిల్పి దీనిని నిర్మించెను దీనిచుట్టుకొలత $4\frac{1}{2}$మైళ్లు. బుద్ధుని సమకాలీనుఁడైన బింబిసారునిచే రెండవ నగరమయిన రాజగృహమూ పర్వతముక్రిందఁ గట్టింపఁబడెను. ఇది బుద్ధుని కాలమందును బుద్ధునికి ననంతరము కొంతకాలంబు వఱకును మహోన్నతదశ ననుభవించెను. దీని వైశాల్యము 3 మైళ్లు. దీనిని బదంపడి శిశునాగుఁడను నృపాలుఁడు త్యజించి వైశాలినగరమును రాజధానిగాఁ జేసికొనెను. ఈ

యనపుత్రుఁడు కాలాశోకుఁడు ప్రస్తుతపు పాట్నానగర సమీపముగా నున్న పాటలీపుత్రమను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. గిరివ్రజము యొక్క ప్రాతిగోడలకంటె పురాతనములయిన ప్రాతిగోడ లీదేశమున లేవు.

(9) రోరుకనగరము—దీనినె "రోరువ" అనియు నందురు. ఇది సౌవీరప్రభువుయొక్క రాజధాని. ఇప్పుడు సూరత్తను పట్టణనామ, మా రాజనామజనితంబె. ఈ రోరుకనగర మాకాలమందు శేవువర్తకమునకు మిగుల విఖ్యాతిగం జెందెను. సొలోమోను ప్రభువుయొక్క నావలు రోరుక నగరముతో వర్తకవ్యాపారముఁ గలిగియుండెనని హీబ్రూపురాణముల వలనఁ దెలియుచున్నది. ఈ నగరముయొక్క స్థలముస్పష్టముగాఁ దెలియకు న్నను "కచ్చి" సింధు శాఖాతీరమం దుండెనని తోఁచును. దీని వైభవము క్షీణింపఁగా బరోచిపట్టణము ప్రసిద్ధింజెఁదెను.

(10) సాగలానగరము—ఈ పేరుగలవి మూఁడుపట్టణము లున్నవి. వీనిలోముఖ్యమయినది యీ దేశమునకు మిక్కిలి వాయవ్యమూల నున్నది. ఇచ్చటనె యీ దేశవాసులచే అలెగ్జాండరు ఘోరముగ నెదిరింపఁబడెను. మిలాందప్రభువు దీనియందె రాజ్యముచేసెను. దీని ప్రదేశమును నిరూపించు టకు నిప్పటికిని శక్యంబుగాకయె యుండె.

(11) సాకేతనగరము—ఇది శాయినదీ తీరమందు నిప్పటి అయో ధ్యపరగణాలోనున్న "యునాయో" (Unao) జిల్లాలోనున్నది. ఇది కోసలరాజ్యములో పూర్వకాలము ముఖ్యపట్టణముగాను గొంతకాలము దానికి రాజధానిగా నుండెను. బుద్ధుని కాలమందు "శ్రావస్తి"యె రాజ ధాని. సాకేతనగరమును అయోధ్యానగరమును నొకటెయని యనుకొందురు ఈ రెండు నన్యోన్య సన్నిహితనగరములయి యున్నవి. భరతఖండ ప్రసిద్ధ పట్టణషట్కములో సాకేతనగరం బొకటియై యున్నది. కాని యయోధ్య కాదు. సాకేతనగర సమీపమందున్న అంజనారణ్యములో బుద్ధధర్మనూ

త్రము లనేకములు నడుపఁబడినవి. సాకేతనగరమునుండి యుత్తరముగా శ్రావస్తివఱకు 45 మైళ్లు దూరము. ఈ మార్గమందు చోరభయంబు మెండుగా నుండెను.

(12) శ్రావస్తినగరము—ఇది యుత్తరకోసలమునకు రాజధాని. దీనియందుఁ "ప్రసన్నధీ" యేలెను. మఱియు నిది బుద్ధుని కాలమందు ప్రసిద్ధి బొందిన యాఱుపట్టణములలో నొక్కటి. ఇది సాకేతనగరమున కుత్తరముగా 12 మైళ్లు, రాజగృహమునకు వాయవ్యముగా 90 మైళ్లు, సుప్పార్కకు నీశాన్యముగ 200 మైళ్లు, సంకస్సకు 60 మైళ్లుదూరమున అచిరావతి నదిగట్టున నున్నది.

(13) ఉజ్జయినీనగరము—ఇది అవంతికి రాజధాని. బుద్ధుని ముఖ్యశిష్యులలో నొకఁడయిన కంకాణునకును సింహళమునకుఁ బంపఁబడిన ప్రసిద్ధధర్మోపదేశకుండును అశోకచక్రవర్తి కుమారుఁడు నయిన మహేంద్రునకును ఈ నగరము జన్మభూమి. ఈ యవంతిరాజ్యమునకు మాహిష్మతీనగరము పూర్వపురాజధానిగా నుండెను.

(14) వైశాలినగరము—ఇది "లిచ్ఛివులను" నాయకులకు రాజధాని. వీరు తత్కాల మగధరాజులకును మౌర్య, నేపాళరాజులయొక్క పూర్వులకును, గుప్తవంశ్యులకును సన్నిహితబంధువులు. మహాబలశాలులయిన యీ నాయకులు అజాతశత్రుఁడను రాజుచే నోడింపఁబడిరి కాని నిర్మూలము మాత్రము చేయఁబడలేదు. తాత్కాలిక స్వతంత్ర నాయకరాజ్యములలో ఈ నగరము మిగుల మేలుబంతిగా నుండెను. ఈ నాయకరాజ్యములు క్రీ. పూ. 6-వశతాబ్దములో సాంఘిక వ్యావహారిక స్థితులయందుఁ బ్రాముఖ్యతం జెందియుండె. ఈ వైశాలినగరముయొక్క స్థలనిరూపణము నెవ్వరును నింత మట్టుకుఁ జేయలేదు. ఇది తిరుహుతుజిల్లాలో గంగాతరంగిణి కుత్తరముగా 25 మైళ్లును, రాజగృహనగరమునకు 38 మైళ్లును దూరముగా నుండియుం

డును. దీనియందు లిచ్ఛవులను నాయకులు 7707 మంది యుండిగనియు వీరందఱు నీనగరమందున్న యొకపవిత్రసరమునం దుపదేశముల నొంది రనియుఁ దెలియుచున్నది. ఈనగరము వెనుక నున్న మహాజనమను నరణ్యమందు బౌద్ధపీఠస్థు లొకయాశ్రమమును గట్టిరి. ఇచ్చట బుద్ధుఁ డనేక ధర్మోపన్యాసములఁ జేసెను. దీని సమీపప్రదేశమందె జైనమతోద్ధారకుఁడైన మహావీరుఁడు జన్మించెను.

ఇంతవట్టుకు క్రీ.పూ. 6 శతాబ్దంబునందుండిన రాజ్యములు రాజధానులు వాని విశేషంబులు సంగ్రహముగా విశదీకరింపఁబడియె. ఇంకఁ దత్కాలంబున గ్రామపరిపాలనంబును బ్రజలవృత్త్యాదికంబులు నెట్లుండెనో కొంత విమర్శింపఁబడును.

4-వ ప్రకరణము (d) గ్రామలక్షణము—పరిపాలన:—

ఈ కాలంబునందుంబలె నక్కాలంబునను గ్రామప్రజలు తమగృహంబుల నొండొకటికి చేరువుగఁ గట్టుకొనుచుండిరి.

గ్రామస్వరూపము. ఆ యిండ్లనడుమ వీధులవంటి సందులుండెను. గ్రామమున కాశ్రయంబుగ నొకతోపుండును.

పూర్వారణ్యమును ఛేదించి గ్రామసంరక్షణార్థముగఁ బ్రజలిట్టితోపుల నాపుకొనిరి. ఈ తోపులకవ్వల సాగుఁబడి భూమియుండెను. ఇది సాధారణంబుగ వరి పండునదిగానె యుండెను. ప్రతిగ్రామమునకుఁ బశువుల మేతకై బీడు భూమియుండెను. మఱియు వంటచెఱకు మొదలయిన ప్రయోజనములకై గ్రామ సామాన్యముగఁ గొంత

విశాలమ్మయినయడవి. విశాలమైన యడవియుండెను. ప్రతికుటుంబమునకును బశువులుండెను గాని ప్రత్యేకముగాఁ బచ్చికపొలములు లేవు. పంటకోసినతర్వాత పొలములమీఁద బశువులను విడుతురు. పంటకాలమందుఁ బశువులను బశువులకాపరివశంబు చేయఁగా

వాఁడు గ్రామసామాన్యమైన బీడుకుం దోలికొనిపోవును. అప్పటిపశువుల కాపరి లక్షణంబు లిట్లు వర్ణింపఁబడియుండె.

పశువులకాపరి లక్షణంబులు.

(1) తనవశంబున నున్న ప్రతిపశువుయొక్క గుర్తుల నెఱింగియుండును.

(2) పశుచర్మాశ్రియములయిన గోమారులు మొదలయిన కీటకంబులఁ జాటవంబునఁ గీటడంచును. వ్రణంబుల మాన్పును.

(3) ధూమంబుచే మశకంబుల వెడలంగొట్టుటకు నగ్నిని ప్రజ్వలింపుచుండును.

(4) రేవులను పానీయస్థానములను నెఱింగియుండును.

(5) పచ్చికపట్లను నెమకంజాలియుండును.

(6) పాడుగులయందుఁ బాలం బదిలంబుగఁ బొదలఁ జేయును.

పంటకాలువలు. గ్రామజనులు త్రవ్వించుకొను కాలువలకు గ్రామయజమానుఁడు సక్రమంబుగ జలంబును బ్రసరింపఁజేయఁ గేదారంబు (వరిమళ్లు) లన్నియు నొక్కసారిగా నె సాగుచేయఁబడును. ప్రత్యేక వ్యవసాయకునకుఁగాని అగ్రహారికునకుఁగాని తమక్షేత్రంబుల కావరణంబుల నేర్పఱచుకొన నవసరంబులేదు.

ఆవరణములు. పొలముల కన్నిఁటికి నొక్కటె యావరణముండెను. నీఁటికాలువల కట్టలె పొలములను వేఱుపఱచెను.

జిరాయితీహక్కు. కుటుంబయజమానుల సంఖ్యానుసారంబుగ పొలంబులు విభజింపఁబడియుండెను. ప్రతికుటుంబమును దమవంతు పంటను బుచ్చుకొనెను. ఏపొలంబునుగాని స్వీయమనుట కెవనికిని యధికారంబులేదు.

కనుకనే యెవఁడును గ్రామపొలంబు నన్యునకు విక్రయించుటకుఁగాని తాకట్టు పెట్టుటకుఁగాని వలను పడకుండెను. అటుల నొనరించుటకు గ్రామ సభికుల యనుమతిఁ బడయవలసియుండెను.

భూమివిక్రయాదులు. అడవికొట్టి పొలముగాఁ జేసికొనినవాఁడు స్వీయ మనుటయును విక్రయించుటయుఁ గలదు. మఱియుఁ బౌరోహితులకు జీవనార్థంబుగ క్షేత్రంబు నిచ్చుటయుఁ గలదు. కాని "భూదేవి తననిచ్చివేయవలదన్నది" యనుమాటల నట్టి విక్రయపత్రంబులయందు దాన పట్టాలయందును లిఖించిరి.

మరణశాసన పూర్వకముగా నైనఁ దనకుటుంబములో దాయవిభాగంబు చేయుటకు నెవనికిని స్వాతంత్ర్యములేదు.

దాయవిభాగములు. అట్టి దంతయు నాచారానుకూలంబుగాను గ్రామసభాపతుల యభిప్రాయానుసారంబుగాను బరిష్కరింపఁబడెను. ఇందుచే వివాదావేశంబులును న్యాయస్థాన ప్రవేశంబులును ధనగౌరవాది వినాశంబులును నిప్పటివారికివలె నప్పటి వారికి లేవు.

గ్రామసామాన్య భుక్తములో నున్న పచ్చిక నేలలయందుఁగాని, యడవి ప్రదేశములయందుఁ గాని యెవనికిని గ్రయము

గ్రామసామాన్య పొర్డం బోకులు, అడవులు. వల్లను, వారసత్వమువల్లను విశేష స్వాతంత్ర్య ముండదు. గురువులకుఁ బ్రభువు లగ్రహారముల దానంబొసంగునప్పుడైనను దానపత్రికలయందుఁ బైనుదాహరింపఁబడిన గ్రామసామాన్యభుక్త ప్రదేశంబు లివి అని నిరూపించివ్రాసిరి. మఱియు నట్టిగ్రామంబులవల్ల రాజునకు వచ్చునాదాయము మాత్రము దానము చేయఁబడెనని యట్టి దానశాసనము బోధించెను గాని భూమిస్వాతంత్ర్య మొసంగెనని యర్థమీయదయ్యె. వ్యవసాయ

కులకు భూమియందుఁగల భుక్తిస్వాతంత్ర్యమేనిమిత్తంబునను భంగమొందుట లేదు. రాజునకుఁ బ్రజలు భూమిసుంకమును జెల్లించుకారణంబున రాజు వారల మానప్రాణధనంబుల నెల్లప్పుడు కాపాడుచుండెను.

గ్రామాధిపతియొక్క యధికారము.

గ్రామాధికారిమూలమున రాజకీయ వ్యవహారంబంతయు నడిపింపఁబడును. ప్రజలవిషయంబుల నీయనె రాజునకు సమయానుకూలంబుగ నివేదించెను. గ్రామాధికారమునకు నెవరినైనను నియమించుట యిటీవల రాజునందె యున్నట్టు న్యాయచట్టములవల్లఁ గన్పట్టుచున్నను, దత్కాలంబున వారసత్వమువల్లనైనను గ్రామసభవారివల్లనైనను గ్రామాధికారి నియమింపఁబడెను.

జనోపయోగములయిన పనులు.

గ్రామజనులు సంఘీభవించి సభామందిరములను, విశ్రాంతివనములను, జలాధారములను నిర్మించుటయును, తమగ్రామమునకును సమీపగ్రామములకును నడుమనుండు బాటలను (రోడ్లను) బాగుచేసికొనుటయును, నుద్యానవనముల నేర్పఱుచుటయును గలదు. సర్వజనోపయోగములయిన యిట్టి సత్కార్యంబుల నొనర్చుటయందు స్త్రీలును నభిలాషఁగలవారలయి యున్నట్టు గన్పట్టును.

భాగ్యస్థితులు.

గ్రామవాసుల భాగ్యస్థితులును సామాన్యములుగానె యుండెను. ఇప్పటికాలపు భాగ్యవంతులంబోలువార లప్పుడు లేరు. మేడలు మిద్దెలు కట్టవలెనను పెద్దకోరికలు వారికిలేవు. వారి సామాన్యవాంఛలకుం దగినట్లు వారి యాదాయములుండెను. వా రన్యోన్య విశ్వాసపాత్రులుగా నుండిరి. వారు స్వతంత్ర జీవనాపేక్ష కలవారెగాని పరులనాశ్రయించియొ సేవించియొ జీవించుటకు వారి కిష్టములేదు. గ్రామములో నేరములుజరిగినను

బహుస్వల్పముగా జరిగెను. గ్రామజనేతరులవల్ల గ్రామములో దొంగతనము దోపిడి మొదలయిన నేరములు జరుగుచుండెనె కాని గ్రామజనులవలన నట్టి యక్రమములు జరుగుటలేదు. రాష్ట్రాధికారులట్టిబందిపోటు మొదలయిన యక్రమములను నివారించుచుండుటంజేసి గ్రామవాసు లన్యోన్యానురాగంబుఁగలిగి సంతోషభరితులై తమహస్తములయందు శిశువుల నుపలాలింపుచుఁ గవాటంబుల బంధించి నిద్రింపవలెనను

ప్రజాసౌఖ్యము.

నవసరంబు లేకుండిరి. ఇవ్విధంబుగ నిచ్చలు నిచ్చదీఱ నచ్చపుసుఖంబుల ననుభవింపుచు నుండొరులయెడఁ బొరపొచ్చెంబు లేక మచ్చికనుండు గ్రామవాసు లిక్కాలంబునఁ గలికంబునకైనఁ గానరారు కదా.

ఇట్టి సుఖజీవులకు వఱపుచే దానంజేసి కఱవుచే నింటరముకల్గుట యొక్కటి సంభవించుచుండెను. క్రీ. పూ.

క్షామములు.

నాల్గవ శతాబ్దమందు "మెగాస్తినసు" అను రాయబారి పాటలీపుత్రమందుండి తత్కాల స్థితులను విశదీకరించి వ్రాసినగ్రంథములో వ్యవసాయవ్యవస్థ రాష్ట్రాధిపతిచే నిర్దోషంబుగ గమనింపబడుటఁజేసి క్షామంబు లభావంబు లయ్యెనని దృఢంబుగ వక్కాణించె. దీనిని జరిత్రకారులంతగ విశ్వసింపలేను. అయినను క్షామంబు గలుగుట యసంభవము కానికతన సకృత్తుగనైన నదిసంభవించియుండె ననవచ్చు.

అప్పటి ప్రజాసంఖ్యలో నూటికి నెనుబదిమంది వ్యవసాయమువల్లను యితరవృత్తులవల్లను స్వచ్ఛందజీవనము కలవారై యుండిరి. శేషించినవారు గురువులు, రాజులు, రాజకీయులు, గారడివాండ్రు, యుద్ధ

పట్టణములసంఖ్య.

క్షేటులు, పౌరులు, సన్యాసులు మొదలయినవారు. వీరు తమతమ వ్యవహారం

బుల యథాక్రమంబుగఁ జేయుచుండిరి. వర్తమానకాలమున నున్నవాని కంటెఁ దత్కాలంబున గ్రామంబు లెక్కువగను బట్టణంబులు తక్కువగ నుండెను. కనుకనె గాంధారము మొదలుకొని కలకత్తావఱకును హిమాలయ ప్రభృతి కచ్ఛిశాఖాపర్యంతమును గల విస్తీర్ణప్రదేశమునందుఁ బట్టణంబు లిరువదికంటె నధికంబుగ లేవు.

గ్రామాభిమానము, స్వీయాభిమానము.

ఇప్పటి గ్రామవాసులకంటె నప్పటివారు పరువుమర్యాదలయం దధికులైయుండిరి. వారు దురదృష్టదేవతా పీడితులై నప్పుడుతప్ప కూలిచేసికొని జీవించుట మర్యాదహీనమని తలఁచిరి. ప్రతిమనుష్యుఁడు తాను, తనకుటుంబము, తనగ్రామము ఘనమని తలఁచుకొనుచుండెను. వారిగ్రామాధికారులు వారివంశ్యులు కాని వారిగ్రామవాసులు కాని యైయుండిరి. మఱియు నా యధికారులను వారు తమ యాచారములకును నూహలకును దగురీతిని నియమించుకొనిరి.

6-వ ప్రకరణము—

ఈ దిగువ చెప్పంబడు వృత్తులు చేయువాండ్రాకాలమందుండిరి.

వృత్తికారులు జాబితా.

(1) దారుకర్మకారులు (వడ్రంగులు).
(2) లోహకర్మకారులు (కమ్మరులు కంచరులు మొదలగువారు).
(3) శిలాకర్మకారులు (ఱాలంజెక్కు వారు).
(4) తంతువాయులు (సాలెలు).
(5) చర్మకారులు (తోలుతో పనిచేయువారు).
(6) కుంభకారులు (కుమ్మరవాండ్రు).
(7) దంతపుపనివాండ్రు.
(8) వస్త్రములకు రంగువేయువారు.

(9) ఆభరణములు చేయువారు (కంసాలులు).

(10) ధీవరులు (చేపల బట్టువారు).

(11) మాంసవిక్రయకారులు.

(12) మృగయులు (వేటకాండ్రు).

(13) పాకకర్మకారులు (వంటలఁజేయువారు).

(14) అంబష్ఠులు (క్షౌరకులు). అంగమర్దకులు (ఒడలుపట్టువారు.)

(15) పుష్పమాలాకరులు (పూలదండలగట్టువారు). పుష్పవిక్రయులు.

(16) నావికులు.

(17) కటకారులు (మేదరులు).

(18) చిత్రకారులు.

వృత్తికారులసభలు.

ఈ వృత్తులవారు తమతమ వృత్తులయం దతినిపుణులై లోకప్రసిద్ధములైన పనులు చేసినట్లు గన్పట్టును. వీరిలోఁ గొన్ని ముఖ్యవృత్తులవారికి సభలుండెను. సభాధ్యక్షులు బలవంతులును, ధనవంతులును, వ్యవహారదక్షులు నయియుండిరి. ఒక సభవారికిని మఱియొక సభవారికిని వివాదములు కలిగినప్పుడు సభాధిపతులకుఁ బైవిచారణకర్తయగు మహాసభాపతి తద్వివాదములఁ బరిష్కరించెను.

6-వ ప్రకరణము—వాణిజ్యము.

ఎగుమతి దిగుమతులు.

ఇంతవఱకు వ్యవసాయమును వృత్తులును విశదీకరింపఁబడియె. తత్కాల వాణిజ్య విశేషంబులంగూర్చి కొంత వివరింపఁబడును. వర్తకులు తమసరకులను గొప్ప నదులమీఁదఁగాని, సముద్రతీరము వెంబడిఁగాని యెగుమతి దిగుమతులను జేయుచుండిరి. అట్టిసదుపాయము లేనప్పుడు బిడారులు కట్టుకొని బండ్లమీఁదఁ దీసికొనిపోవుచుండిరి. బండ్లను జాల్ప

గాఁ గట్టుకొని సార్థవాహులు వెడలిరి. రాచబాటలుగాని వంతెనలుగాని లేవు. అడవులలో బండ్లబాటవెంబడి యనేక శ్రమలం జెందుచు గంట 1-కి రెండు మైళ్లుచొప్పునం బ్రయాణంబుచేసిరి. క్రొత్తదేశముఁ బ్రవేశింపఁగానె వారు హాశ్శీలుచెల్లించిరి. ఒక దేశమునుండి మఱియొక దేశమునకు నడుమంగల యడవులం దాటుటకు గ్రామపోలీసువారనఁగాఁ గావలివాండ్రు బండ్లవెంట నుండెదరు. వీరు దారిదోపిడి మొదలయిన యపాయముల నొందకుండ బండ్లను గాపాడుదురు. వీరి కధికముగా సొమ్మియ్యవలసియుండెను. ఇందువల్లనె సరకులయొక్క విలువయు నధికమయ్యెను.

ఇప్పటికివలె నప్పుడు సదుపాయంబులైన మార్గంబులు లేమింజేసి వర్తకమువిరివిగా జరిగియుండలేదు. పట్టు, మజ్లిను, సరిగె బుటేదారిసరకులు, పరిమెళములు, మందుదినుసులు, దంతము, దంతపుపనులు, బంగారపునగలు ఇట్టి సరుకులనె వర్తకులు విక్రయార్థ మితరదేశములకుఁ దీసికొని పోవుచుండిరి.

మార్గములు.

క్రీ.పూ. 6-వ శతాబ్దమునకు ముందు సరకులకు సరకులనె వినిమయంబు చేయుచుండిరి. 6-వ శతాబ కాలమునందా పద్ధతి లేశంబును గన్పట్టుటలేదు. మఱియు రాజముద్రాంకితములైన నాణెంబుల వాడుటయు లేదు. 146 గ్రేనులయెత్తుఁగల చదరపురాగి నాణెమువల్ల క్రయ విక్రయంబులఁ జేయుచుండిరి. ఈ నాణెములో అర, పాతికయును గలవు. హుండీలు, ప్రామిస్సరినోట్లు మొదలయిన దస్తావేజులును వర్తకవ్యాపారమందు వినియోగింపఁబడుచుండెను. వడ్డీ 100-కి సంIIనకు 18 చొII నిర్ణయించుకొనినట్లు గానఁబడుచున్నది. బ్యాంకులు లేనందున ధనమును గృహములయందు దాచుకొనుట, ముంతలలోఁబోసి పాతిపెట్టుట, స్నేహి

సరకుల వినిమయము.

తునియొద్ద దాచుకొనుట యిట్టి వాడుకలుండెను. ఈ ప్రకార మొనర్చినపుడు లిఖితపత్రం బుంచుకొనిరి.

తత్కాల ప్రజలయొక్క యధికమధ్యమాధమస్థితులం బరికింప నిట్లు గన్పట్టుచున్నది. పట్టణములయందు దరిద్రు లిప్పటికాలంబునందుఁబలె యక్కాలంబున నల్లాడుట లేదనవచ్చు. స్వతంత్రంబుగఁ బ్రతుకఁదగినవాఁడు కూలిచేసికొని జీవించెనేని వానిని ఘోరదురదృష్టుఁ డనిరి. నివాసదేశములకు సమీపములయందుండు యడవులఁగొట్టి బాగుచేసికొనిన వారి కాభూములు జీవనార్థముగా నుపయోగించెను. సామాన్యజనంబు లెట్టులనైనఁ గష్టించి మర్యాదగ జీవించుటనె కోరియుండిరి.

స్వతంత్రజీవనము.

అప్పటి వ్యవహారస్థితినిబట్టి విచారించినను భాగ్యవంతులసంఖ్య బహుస్వల్పముగా నుండెను. ఇక్కాలపుస్థితింబట్టి చూడ మఱియు నల్పంబగును. కోటీశ్వరులగు వర్తకులు పండ్రెండుగురు తక్షశిల, శ్రావస్తి, కాశి, రాజగృహ, వైశాలి, కౌశాంబి నగరములయం దుండిరనియు, వంతకంటె న్యూనంబుగ నుండు మధ్యస్థులైన వర్తకు లెక్కువసంఖ్యగా నుండిరనియుఁ దెలియవచ్చును. కాఁబట్టి యధికసంఖ్యఁ గలప్రజలు వ్యవసాయమువల్లను గులవృత్తులవల్లను జీవించుచుండిరి.

వర్తకులయొక్క భాగ్యస్థితులు.

వర్తకులు విదేశములకుఁ బోయిన మార్గములుకూడఁ దెలియందగియున్నవి.

వర్తకమార్గములు.

(1) ఉత్తరమునుండి నైఋతీమూలకుఁ ద్రోవ శ్రావస్తినుండి ప్రతిష్ఠానపట్టణమునకు సీదారిని రాకపోకలు చేయుచుండిరి. దారియందు మహిష్మతీ, ఉజ్జైనీ, గోనాధ, విదిశా, కౌశాంబి, సాకేతనగరము లుండెను. ఈ నగరములయందు బాటసారులుగాని వర్తకులుగాని విశ్రాంతి నొందుచుండిరి.

(2) ఉత్తరమునుండి యాగ్నేయమూలకు మార్గము. ఈ మార్గమున శ్రావస్తినుండి రాజగృహమునకుఁ బోయిరి. ఇది సరళమయిన త్రోవ కాదు. చుట్టుదారి. ఈ దారిని విశ్రాంతిస్థలంబులు (మకాంచోట్లు) సేతవ్య, కపిలవస్తు, కుశీనర, పావా, హస్తిగ్రామము, భండగ్రామము, వైశాలి, పాటలీపుత్రము, (పాట్నా), నాలంద, రాజగృహమను నగరంబులు. ఈ మార్గమె గయకుఁ గూడఁబోవును. అక్కడ తామరలిప్తితీరమున కాశీమార్గములోఁ గలియును.

(3) తూర్పునుండి పడమరకుఁ ద్రోవ. ముఖ్యముగా నదులమీఁద నె యీప్రయాణంబు చేసిరి. గంగానదికి నెగువుగా సహజాతివఱకును యమునానదికి నభిముఖముగా (ఎదురుగా) కౌశాంబివఱకును బోయిరి. దిగువగా గంగానది ముఖద్వారమువఱకును నంతటనుండి సముద్రతీరము ననుసరించి బర్మావఱకును బ్రయాణము చేసిరి. చంపానగరమువఱకును దిగువగాఁబోయి యంతటనుండి యెగువగా కౌశాంబి పర్యంతముఁ బోయి దక్షిణమునుండి యక్కడకు వచ్చుసరకులను దీసికొని యంతట యాగ్నేయమునకుఁ గాని వాయవ్యమునకుఁ గాని ప్రయాణము చేసిరి.

ఈ పైచెప్పినత్రోవలె గాక విదేహపట్టణమునుండి గాంధారమునకును, మగధనుండి సౌవీరమునకు, భరుకచ్ఛమునుండి సముద్రతీరము వెంబడి బర్మాదేశమునకును, గాశినుండి గంగాముఖద్వారమువఱకును బిమ్మట బర్మాదేశము పర్యంతమును చంపానగరమునుండి బర్మాదేశమునకును వర్తకులు పోవుచుండిరి. రాజపుత్రస్థానమునకు పశ్చిమంబున నున్నయెడారిలో వర్తకులబిడారు రాత్రులయందుఁ బ్రయాణముచేసెను. నక్షత్రములంబట్టి మార్గముంజూపు మార్గదర్శియొకండు వీరివెంబడి నుండెను. ఇట్లు మార్గదర్శకు లక్కాలంబున నుండుట జగత్ప్రసిద్ధమె. సముద్రముమీఁద బాబిలనగరమునకుఁ గూడ వర్తకులు వెళ్లినట్లు తెలియుచున్నది.

స్వతంత్రరాజ్యములకును నాయకసత్తాకరాజ్యములకును పరిపాలన భేదము.

ఇట్లు క్రీ. పూ. 6, 7 శతాబ్దములయందుఁ గొన్ని స్వతంత్రరాజ్యములును స్వల్పంబుగ నాయఁక సత్తాక రాజ్యంబు లుండెను. నాయఁకరాజ్య పరిపాలనయందు ప్రజలు స్వరాజ్యాభిమానులై సుఖంబుండిరనియు స్వతంత్రరాజ్యముల రాజు లన్యోన్యకలహాశీలురయి యుండిరనియుఁ గన్పట్టును. మఱియు స్వతంత్రరాజులకు నేకచ్ఛత్రాధిపత్యమందు వాంఛయతిశ ంబు. కనుక కాలక్రమంబున నాయఁకరాజ్యముల స్వాధీనంబులుగఁ జేసికొని యుండిరి. మహా అలెగ్జాండరీదేశముపై దండెత్తివచ్చినప్పుడనఁగా క్రీ. పూ. 4-వ శతాబ్దాదిమభాగమందు మగధరాజ్య మున్నతదశయందుండెను. కాని సామంతరాజు లక్కాలంబున నంతఃకలహంబులయందు లంపటులైయుండిరి. మఱియు పంజాబుదేశంబునం దక్కాలంబున ననేక చిన్నరాజ్యము లుండెను.

స్వతంత్రరాజుల దుర్మార్గము.

ఈ రాజ్యాధిపతులు దుర్నయంబున నన్యోన్య వంచనాపరాయణులై యుండుటం జేసివారిలోఁ గొందఱు విదేశప్రభు వగు నలెగ్జాండరునకుఁ దోడ్పాటొసంగి తమ వైరిరాజుల భంగించి తుదకుఁ దాము భంగంబునొందిరి. ఎవఁడయినను మచ్చరంబునఁ దనపొరుగింటికిఁ జిచ్చుఁబెట్టినయోఁ దనయిల్లును బిమ్మటఁ గాలకుండునా? కావున పరస్పరవైరంబు కుటుంబమునకేమి రాష్ట్రమునకేమి యనర్థమూలంబును వినాశకరంబు నగును. ఇందు కడియాలంబుగ ఈ భరతఖండంబున నలెగ్జాండరు జయించినదేశమున కాయనయె యధిపతియయ్యెను.

ఉ. భూపతియౌ నశోకునకుఁ బూర్వము బౌద్ధులకాలమందు ధా
త్రీపతులొండొరుల్గినిస్సి, తేకువలేమిని బోరుచుంటచే

నాపదలయ్యె లోకులకు నప్పటికుండెను నాయకౌఘసం
స్థాపితరాజ్యముల్ జనహితంబు సుఖంబొనఁగూడె నచ్చటన్.

---

# 7-వ అధ్యాయము.

## అశోకుని రాజ్యపరిపాలన.

---

### 1-వ ప్రకరణము.

అశోకుని కాలమం దున్న మౌర్యరాజ్యము.—

మౌర్యరాజ్య విస్తీర్ణము.

ప్రథమాధ్యాయమందు చంద్రగుప్తుని రాజ్యవిస్తీర్ణము వివరింపఁబడి యుండె. తద్రాజ్యం బంతయు ఆయన పుత్రుండగు బిందుసారునికిని తదనంతర మాయన పౌత్రుండగు నశోకచక్రవర్తికిని నిర్వివాదంబుగ స్వాధీనం బయ్యె. అశోకచరిత్రకారుఁడు మౌర్యరాజ్యవిస్తీర్ణ మశోకుని కాలమందు సహేతుకంబుగ నిట్లు నిరూపించెను.

కాశ్మీరదేశము.

(1) కాశ్మీర నేపాళ దేశములు మౌర్యరాజ్యములోఁ జేరియున్నట్లు పురాణంబులవల్లం దెలియుచున్నది. కాశ్మీరమునకు నిప్పటికిని రాజధానియైన శ్రీనగరము నశోకుఁడు ప్రతిష్ఠించెనని చెప్పుదురు. ఇప్పుడు పాడుపడియున్న యనేక కట్టడము లశోకచక్రవర్తియె కట్టించె ననియు, తన పుత్రులలో నొకఁడయిన జలౌక(Jalauka) యనువతని కాశ్మీరదేశ పాలకునిగా నశోకుఁడు నియమించె ననియుఁ గాశ్మీరదేశచరిత్రమం దున్నది. అర్హాతులకొఱకు 500 మఠములు కట్టించి యీ కాశ్మీరదేశమును మతాచార్యుల కశోకుఁడు దానం బొసంగె నని "హ్యూయాన్ సియాంగు" అను చీనాదేశపు యాత్రికుఁడు వ్రాసిన యద్భుతచరిత్ర యొకటికలదు.

(2) నేపాళదేశపు పల్లపుభూము లీ మౌర్యరాజ్యములోఁ జేరియుండు టను నిగ్లివియా (Niglivia) రుమిండె (Ru-mmindei) శిలాశాసనంబులు నిర్వివాదంబుగఁ దెల్పుచున్నవి. అశోకుఁడు మున్ను

నేపాళదేశము.

చేసియున్న తీర్థయాత్రయందు గోరామసాన్ (Goramasan) కనమలమార్గమున నీ పల్లపుదేశములకుఁ బోయియుండెను. ఈ ప్రదేశముల కప్పటిరాజధాని మంజుపట్టణము. ఇది యిప్పటి "ఖాట్మాండు" (Khatmundo) నగర ప్రదేశమందె యుండెను. తన తీర్థయాత్రను బ్రజలు సర్వకాలము జ్ఞాపకముంచుకొనుటకును దన భక్తివిశేషంబును దన దానధర్మములను బ్రకటించుకొఱకును ఘనమయిన గృహములను నిర్మాణం బొనరించి యొక పట్టణంబును నూతనముగాఁ గట్టింపవలెనని యశోకచక్రవర్తి సంకల్పించి యాయన పూర్వపు రాజధానికి నాగ్నేయమూలగా రెండు మైళ్లు మిట్టప్రదేశమునందు నిప్పుడు లాలిపట్నా మనఁబడు పట్టణమును నిర్మించెను. దాని మధ్య నొక దేవాలయమును గట్టించెను. ఇది యిప్పటి రాజభవనమునకు దక్షిణముగా నుండును. ఈ లాలిపట్టణమునకు నాలుగు మూలలయందును నర్ధచంద్రాకృతిగల నాలుగు స్తూపములను గట్టించెను. అవి నేటివఱకును దృశ్యమానములయి యున్నవి. ఈ పట్టణంబున రెండు పీఠములను నొక సమాధినిఁ గూడ నశోకుఁడు కట్టించె నని చెప్పుదురు. అశోకుని కుమారియు దేవపాలుఁడను క్షత్రియుని గృహిణియు నైన చారుమతి తన జనకునితోఁ దీర్థయాత్రఁ జేయుచు బుద్ధమతావలంబిని యై యోగినియై ఖాట్మాండునగరమునకు రెండుమైళ్ల దూరమునఁ బశుపతినాథ మను మఠముఁ గట్టించి దానియందు నివసించుచుండెను. ఈ మఠ మిప్పటికిని నీమె పేరం బరగుచున్నది.

(3) కలకత్తాకు 35 మైళ్ల దూరమున మిధునాపురపు (మిడ్నపూరు) జిల్లాలో నున్నయిప్పటి తాంలూకు (Tamluk) నగరమునప్పుడు తామ్రలిప్త

బంగాళాదేశము. నగరమనిరి. రేవుపట్టణమగుటచే సింహళము నుండి వెడలుబాటసారు లీపట్టణమందుఁ బర వాసము చేసిరి. ఈ నగరము మౌర్యరాజ్యములోనిదె. ఇది బంగాళాదేశమం దున్నది. చంద్రగుప్తుఁడు మగధరాజ్యమును దీసికొనినప్పు డీ బంగాళదేశము దానిలోనే చేరియున్నది.

(4) మహానది మొదలుకొని "పులికాటు" సరస్సువఱకు బంగాళా సముద్రతీరమందున్న కళింగరాజ్యము నశో కళింగదేశము. కుండు తాను ప్రభుత్వమునకు వచ్చిన తొమ్మి దవ వత్సరంబున జయించి తన రాజ్యములోఁ జేర్చుకొనె నని గతంబున లిఖింపఁబడియుండె.

(5) మైసూరునందున్న సిద్ధాపురశాసనములవల్లను దక్షిణమందున్న స్వతంత్రరాజ్యములనుబట్టియు మౌర్యమండల స్వతంత్రరాజ్యములు. మునెుక్క దక్షిణపరిమితి గ్రహింపఁదగి యున్నది. చోళరాజుల కాకాలంబున తిరు చినాపల్లికి సమీపమందుండు ఉరయూరు (Uraiyur) పట్టణము రాజధా నిగా నుండెను. దానికి దక్షిణముగా పాండ్యరాజుల రాజధానియగు మధురానగర ముండెను. పడమటికనుమలకును అరాబియాసముద్రమునకు నడుమగా "కన్యాకుమారి" అగ్రము వఱకును వ్యాపించి కేరళరాజ్యముం డెను. ఈమూఁడురాజ్యములును సింహళమును స్వతంత్రరాజ్యములని యశో కుఁడు ప్రకటించెను.

కాఁబట్టి మౌర్యరాజ్యముయొక్క దక్షిణపుపొలిమేర, తూర్పున పుదు చ్చేరి మొదలుకొని పడమర కన్ననూరు వఱకు మౌర్యరాజ్యముయొక్క దక్షిణపుమేర. రేఖఁ గీసిన ట్లుండెను. ఉత్తరమున హిమా లయపర్వత హిందూకూషుపర్వతముల వఱకు

మౌర్యరాజ్యముయొక్క విస్తీర్ణము. ఈరాజ్యమంతయు అశోకుని స్వంత పాలనమందుఁగాని యాయనకు లోఁబడిన సామంతరాజుల పాలనమందుఁగాని యుండెను. ఈ రాజ్య మంతయు, బర్మాదేశముగాక శేషించినయిప్పటి బ్రిటిషిండియాను మించి యుండెనని శిలాశాసనములవల్లను, అశోక నిర్మిత ములని హ్యుయన్‌శియాంగు పరిగణించిన స్తూపములవల్లను వక్కాణింపఁదగియున్నది.

మౌర్యరాజ్యముయొక్క చతుర్దిశలు.

హిమాలయపల్లపు ప్రదేశములు, బంగాళాఖాతము, మైసూరురాజ్యము, అరాబియాసముద్రము, ఈనాలుగింటికి మధ్యనున్న ప్రదేశమంతయు మౌర్యరాజ్యమెయని శిలాశాసనములు ప్రకటించుచున్నవి.

అశోకుఁడు 130 స్తూపములను గట్టించెనని హుయాన్‌సియాంగు వ్రాసెను. ఇవిగాక యాయన యనేక మఠాదులను గట్టించినట్లు పురాణము వల్లఁ దెలియవచ్చుచున్నది.

హ్యూయన్‌సియాంగుయొక్క గ్రంథసాక్ష్యము.

ఆస్తూపములలోఁ గొన్ని పరరాజ్యములయందుఁ గట్టించెనఁట. ఇట్లుకట్టించుటకు నాయా రాజ్యాధిపతుల యనుమతిం బడసియే యుండును. తక్కిన స్తూపము లన్నియుఁ దన పాలనదేశమునందే కట్టించెను. మూఁడుస్తూపముల నిప్పటి యాఫ్ఘనిస్థానములోఁ గట్టించెను. నూఱడుగుల యెత్తుగల "పిలుసార" (Pilusara) స్తూపమును "కాపిశ" (Kapisa) యందుఁ గట్టించెను. జలాలాబాదు దగ్గఱ "నాగరహార" నగరమునకు భూషణముగా 300 అడుగుల యెత్తుఁగల శిలాస్తూపము వెలయుచున్నది. శిలను దొలిచి యనేక చిత్రరేఖలతో నీ స్తూపము నిర్మించిరి. ఈ బ్రహ్మాండమైన స్తూపమునకు దక్షిణముగా చిన్న స్తూప మొకటి గలదు. ఇంకఁ బ్రసిద్ధము లయిన స్తూపములు స్వాతు (Swat valley) పల్లపుప్రదేశములయం దున్నవి. తక్ష

శిలయందు 3 స్తూపము లున్నవి. కాశ్మీరమును 4 స్తూపములచే నశోకుఁడలంకరించెను. మఱియు నా దేశమందె 500 మఠములను గట్టించిన ట్లిదివఱకె లిఖింపఁబడి యున్నది.

ఇతర సాక్ష్యములు స్తూపములు.

తూర్పుతీరమందు తామరలిప్తిలోను సందర్భందు దీవులయందున్న సామతాత పట్టణములోను, ఓఢ్రదేశములోను, కళింగదేశములోను, అశోకనిర్మితములయిన స్తూపము లున్నవి.

గిరినరమను మడుగు నుండి కాల్వలు.

భరతఖండమునకుఁ బడమటి దిశయందున్న గుజరాతు దేశములో వల్లభి (Valabhi) పట్టణమందును సింధుపరగణాయందును దానితోఁజేరిన ప్రదేశములయందును అశోకుఁడు కట్టించిన స్తూపములు సమృద్ధిగ నున్నవి. “కత్తియవారు” పర్యాయద్వీపమందు నశోకునిచే నుంచఁబడిన పరిపాలకుఁడు చంద్రగుప్తుని కాలములో నిర్మింపఁబడిన గిరినరము (Girnar) అను మడుఁగునుండి కాల్వలను ద్రవ్వించె నని రుద్రదామను (Rudradaman) అను శాసనము తెల్పుచున్నది.

సకూటాస్తూపములు.

సకూటా (Tsaukuta) పరగణాలో దశస్తూపంబులు నశోకుఁడు కట్టించెను.

కంచిస్తూపము.

ద్రవిడదేశపు రాజధానియైన యిప్పటి కంచియందును చెన్నపట్నమునకు 48 మైళ్ల దూరమున నిప్పుడు వెంగిపట్టణ మనఁబడు నాంధ్రరాజ్య రాజధానియందును అశోకుఁడు స్తూపములను గట్టించెను.

సిరియా రాజ్య మశోకుని రాజ్యమునకుఁ బ్రాంతరాజ్య మయినట్టు శాసనములు విశదపఱచుచున్నవి. దీనింబట్టియు నశోకుని రాజ్యమునకు నీశాన్యప్ర

ఈశాన్యపు టెల్ల. టెల్ల హిందూకూషుపర్వతములనియితరసాక్ష్యమునకుఁదోడ్పాటుగాఁ బల్కుచుండగియున్నది.

అశోకుని రాజ్యములోఁజేరిన ప్రదేశముల పేర్లు. కాఁబట్టి అశోకచక్రవర్తియొక్క రాజ్యమునందు నీ క్రింద వివరింపఁబడిన ప్రదేశములు చేరియుండెను.

(1) 12-వ అక్షాంశమునుండి హిమాలయ పర్వతముల వఱకుంగల మధ్యహిందూస్థానమును, (2) నేపాళ కాశ్మీర పల్లప్రప్రదేశములును, (3) స్వాతు (Swat) పల్లపుదేశమును, దాని పరిసరప్రదేశములును, (4) యూసిఫుజా (Yusufzai) దేశమును, (5) హిందూకూషు పర్వతముల వఱకు ఆఫ్గనిస్థానమును, (6) సింధుదేశమును (7) బెలూచిస్థానమును.

అశోకుని కాలమందుఁ గళింగరాజ్య మొకటి మగధరాజ్యములోఁ జేరియుండెను. శేషించిన దంతయు నించుమించుగాఁ జంద్రగుప్తుని కాలమందుండిన రాజ్యమయి యుండెను.

## 2-వ ప్రకరణము - రాజ్యపరిపాలన.

ఇండియాదేశపు ప్రథమచక్రవర్తియయిన చంద్రగుప్తుఁడు తన బుద్ధివిశేషంబుచే నేర్పఱచిన పాలనవిధానము నె

అశోకుని పాలనాపద్ధతి. యశోకుం డించుమించుగా ప్రధానవిషయముల యందు ననుసరించి నూతన నిబంధనలఁ గొన్నిఁటినిఁ జేర్చి తన పితామహుఁడైన యా చంద్రగుప్తుని శాసనములలోఁ గొన్ని మార్పుల నొనరించినట్లు గన్పట్టుచున్నది.

గ్రీకుదేశపు రాయబారియయిన మెగాస్తినసు చంద్రగుప్తుని యేర్పాటులను గుఱించి దాదాపుగ • సమగ్రముగ

అశోకుఁడు పాలించిన రీతిని దెలిసికొనుటకు వ్రాసిన వృత్తాంతమును, శాసనగ్రంథములును, అశోకుని పరిపాలనక్రమం బెట్లుండెను తెలి

సాధనములు. సికొనుటకుఁ జాలవఱకు సాహాయ్యము చేయుచున్నవి.

అశోకచక్రవర్తియొక్క యధికారము నిరంకుశముగానే యుండెను. అన్నియేర్పాటు లాయన చిత్తానుసారముగానె చేయఁబడెను. ఆయన యాజ్ఞలు రాజకీయ ప్రధానోద్యోగుల మూలమునఁ గ్రింది యధికారులకుఁ దెలియఁజేయఁబడెను. అట్టి ప్రధానోద్యోగులకు శిఖరములుగా ప్రతినిధు లుండిరి. ఆ ప్రతినిధిస్థానముల యందు రాజుయొక్క పుత్రులుగాని రాజసన్నిహితబంధువులుగాని యుండిరి.

అశోకుని నిరంకుశాధికారము.

ఆ ప్రతినిధులలో నొకఁడు ప్రసిద్ధమయిన తక్షశిలానగరమం దుండెను. ఈ నగరము పంజాబుదేశములో "రావల్పిండి" (Rawalpindi) జిల్లాలో "షాలిధేరి" (Shalidheri) అను చోటఁ బాడుపడియున్నట్లు కనిపెట్టఁబడినది. శతద్రు (Satlej) నదికిఁ బడమరగ హిందూకుశపర్వతములవఱకుఁ గల ప్రదేశ మంతయు నీ ప్రతినిధియొక్క పాలనయం దుండెను.

రాజప్రతినిధులు తక్షశిలానగరమందుండుట.

రాజప్రతినిధి మఱియొకఁడు "మావా" (Mahwa) లోనున్న పురాతన పట్టణమైన ఉజ్జయినియందుండి ఇందియాదేశ పశ్చిమభాగ మేలెను. తన తండ్రియైన బిందుసారుఁడు రాజ్యాపతిధిగా నుండఁగా అశోకుఁడు ప్రతినిధిగాఁ బాలించినది యీ నగరమందె యనియుఁ దండ్రికి మరణవ్యాధి కలుగఁగా నచ్చటనుండియె బయలువెడలెననియు గతంబున లిఖింపఁబడి యున్నది.

ఉజ్జయినియందు.

సువర్ణగిరియను నగరమందు మఱియొక ప్రతినిధి యుండెను. ఈనగర మెచ్చట నుండెనో యిప్పటికిని దెలి

సువర్ణగిరి నగరమందు.

యలేదు. వేఱొక ప్రతినిధి తోసలి (Tosali) నగరమందుండి కళింగరాజ్యమును బాలించెను. ఈ నగరముయొక్క స్థాన మీనాటికిని నిశ్చయముగా తెలియంగఁబడలేదు. జంగద (Jangada) అని ప్రకృతంబున వాడుకొనఁబడు చోట నుండవచ్చునని చరిత్రకారు లూహింతురు. ఇట్లు నలుగురు రాజన్యులు ప్రతినిధులుగా నున్నట్లు ధౌలి (Dhauli) పరిశిష్టశాసనముల రెంటియందును సిద్ధాపుర లఘుశిలాశాసనమందును బ్రకటింపఁబడి యున్నది.

**నగరపరిపాలన.**

ఈప్రకారంబున మగధరాజ్యములోఁ జేరిన ప్రాంతదేశములను బ్రతినిధులమూలకముగాఁ బాలించి యశోకుఁడు స్వదేశమును బ్రదేశాధికారులవల్ల స్వయముగాఁ బరిపాలనం బొనర్చెను.

**రజ్జుకులనఁబడు నధికారులు.**

ఈ ప్రతినిధులకుఁ గ్రిందియధికారులను రజ్జు (Rajjukas) కులని చెప్పుదురు. వీ రిప్పటి కమిషనర్ల వంటివారు. వీరు లక్షలకొలది జనులను బాలించిరి. ఈ యధికారులకు దిగువనుండు నధికారులు ప్రాదేశికులు (జిల్లాఅధికారులు) అనఁబడిరి.

**దండనాధికారులు.**

దండనాధికారులకు మహామాత్రులని యధికార నామము. ఇది సామాన్యనామము. ఈ యధికారమందు కించిద్భేదములను దెలియఁ జేయుటకై విశేషణ పదములను మహామాత్రపదమునకుఁ బూర్వమం దుపయోగించిరి. ఎట్లనఁగా ధర్మాధికారులును దండనాధికారులలోఁ జేరినవారె కనుక వీరిని ధర్మమహామాత్రులని పిలిచిరి.

**ధర్మాధికారులు.**

ఈ ధర్మాధికారులను దనపాలనకాలములోఁ బదునాల్గవ వత్సరమున నూతనముగా నశోకుఁడు నియమించినట్లు ౫వ శిలాశాసనమం దున్నది. అన్నికుల

ముల ప్రజలయొక్క యోగక్షేమములను విచారింపవలసినదనియుఁ దన పాలనయం దున్న ప్రజల కందఱికి బుద్ధధర్మసిద్ధాంతమును సలక్షణముగ బోధించి దానిని వ్యాపింపఁజేయవలసినదనియును దనపాలనకు లోఁబడియు లోఁబడనట్లు లుండుయవన గాంధార ప్రభృతులయిన ప్రాంతదేశప్రజలకును ధర్మోపదేశ మాప్రకారమె చేయవలసిన దనియును అశోకుండే ధర్మాధికారులకు విధించెను. మఱియు నిర్దోషులను కారాగృహమం దుంచుట, అన్యాయమైన శరీరదండన విధించుట, యిట్టి యక్రమములను నివారింప వలసిన దనియు వీరికి నాజ్ఞాపించుటయే కాక వయోవృద్ధత్వమును బట్టియుఁ హఠాత్సంభవమయిన కష్టమునుబట్టియు బహుకుటుంబభారమును బట్టియు క్షమించుటకు నర్హుఁ డయ్యేనేని యట్టి నేరస్థుని విడుదలఁజేయుటకు నీ ధర్మాధికారుల కశోకుం డధికారమిచ్చెను. ఇదియునుంగాక స్వనగరమందును నితర బస్తీలయందును రాజకుటుంబములలోఁ జేరిన యంతఃపుర స్త్రీలయొక్క క్షేమమును విచారించుట యనుసున్నితమైన పనినిగూడ ఆయన వీరియందే యుంచెను. వీరు తక్కిన రాజకీయోద్యోగములతోఁ బాటుగా రాజుగాని యాయన రాణులుగాని బంధువులుగాని యొసంగు ధర్మములను సద్వినియోగము చేయుచుండిరి. స్త్రీలకుఁ బ్రత్యేక ధర్మాధికారుల నశోకుండు నిర్మించినట్లు చెప్పెదరు.

**స్త్రీధర్మాదికారులు.**

కాని పైన నుదాహరింపఁబడిన ధర్మాధికారులకును వీరికిని నధికారములయం దేమి భేదముండెనో సులభముగా నెఱుఁగఁబడకుండెను.

కేవల దండనాధికారులకు సహాయార్థముగా నీ ధర్మాధికారులను నియమించిన ట్లూహింపఁదగి యున్నది కాని

**పరస్పరవిరోధాధికారములు.**

యధికారములు విస్పష్టముగా లేనందున నధికారములను జెల్లించుటలో వారికిని వీరికి నభిప్రాయభేదములును స్పర్థలును విశేషముగాఁ గలిగితీఱవలెను.

చట్టములకు వ్యతిరేకముగ జంతువులను జంపుట లేక చిత్రవధ చేయుట యనఁగా నేదోయొక యవయవమును గోసి వేయుట, తల్లిదండ్రులను పెద్దలను మొదలయినవారిని మిక్కిలి నగౌరవముచేయుట యిట్టి నేరములను ధర్మాధికారులు విచారణ చేసియుందురు. రాజస్త్రీల యక్రమపునడతలను గూడ వారె విచారణ చేసియుందురు. స్త్రీలయొక్క యధర్మప్రవర్తనలను విచారించుపని స్త్రీధర్మాధికారులదె యయి యుండును. వీరుకూడ నంతఃపురస్త్రీల క్రమప్రవర్తనకు బాధ్యులయి యుండవచ్చును. ఈ స్త్రీధర్మాధికారులు తెలియఁజేయు సంగతులను సమాచారనివేదకులు (Reporters) అయిన రాజకీయోద్యోగులు నిరాకరింపక పైయధికారులకుఁ దెలియ చేయుచుండిరని మెగాస్తినిసు వ్రాసియుండెను.

ధర్మాధికారుల విధికృత్యములు.

నానావిధోద్యోగశాఖల (డిపార్టుమెంట్లు) కొఱకు ననేక తరగతుల యుద్యోగులను నియమించితి నని యశోకుఁడు వ్రాసియుండెను. విచారణకర్తలను (ఇన్‌స్పెక్టరులను) గొందఱిని నియమించిన ట్లుదాహరింపఁబడియుండెనుగాని వారికి విధింపఁబడిన పనులయొక్క వివరము తెలియలేదు. ఉద్యోగులలో మార్గరక్షకు లనఁబడు తరగతివారుండిరి.

ఇతరమయిన యుద్యోగులు.

ఎవఁడయినను దన కన్యాయము కలిగినదని ప్రభువుతో మనవిచేసికొనఁ దలచినయెడల వానికి నెచ్చటినైన నేకాలమందైనఁ బ్రభుదర్శనం బనాయాసముగ నగుటకు గట్టి యేర్పాటు చేయుట బహుముఖ్యకార్యమని యశోకుఁడు తలఁచి వచ్చి

ప్రజల విన్నపములను విచారించుట.

నటువంటి యన్ని వ్యాజ్యెములను, రిపోర్టులను, తన యుబ్బందిని విచారించు కొనక వెంటనె తీర్మానముచేసెనని 6వ శిలాశాసనమం దుండెను. తన తాతగారైన చంద్రగుప్తుని యేర్పాటులనె యనుసరించి వానినె బలపఱుచుటకు నశోకుఁ డిట్టి యుత్తరువులఁ జేసి యాప్రకారమె నడచుకొనెను. చంద్రగుప్తుఁడు తాను సేవకులచే నొడలు పట్టించుకొను సమయమునందైన నూరకుండక దినమంతయు దివాణములోనుండి రాజ్యకార్యముల నెఱవేర్చుచుండెనఁట.

వార్తాపత్రికలు.

రాజకీయోద్యోగులు తమతమ వ్యవహారముల నెట్లు నెఱవేర్చుచుండిరో యావిషయంబులఁ గనిపెట్టి విశేషవార్తలఁ దెలిసికొని లిఖించుటకు నీ ప్రాగ్దేశ ప్రభువుల వలెనె యశోకుండును వార్తా పత్రికలను వ్రాయువారిని నియమించియు అట్టి పత్రికాముఖంబునం దెలియు వార్తలను విశ్వసించెను. ఎవ రెప్పుడు ద్రోహముచేయుదురో యను సంశయముచేఁ జంద్రగుప్తుఁడు పగటిపూఁట నిద్రింపక రాత్రులయందుఁ దన శయనమందిరము నప్పటికప్పటికి మాఱ్చుచుండెను. ఇవ్విధంబుననె యశోకుండును సంశయాత్మ కలవాఁడై చేయుచుండెనఁట. తన తాతగారి యడుగుజాడల వెంబడియె రాజకీయసరణియం దశోకుండు నడచెనని వక్కాణింపవచ్చును.

అశోకుని సంశయాత్మ.

అశోకుని సేనాపరిమితి.

అశోకుని సేనావైపుల్య మిట్టులుండెను. 600,000 కాల్బలమును, 30,000 గుఱ్ఱపుదళము, 9,000 ఏనుంగులు నెన్నియో రథములు, పూర్వకాలమం దేరాజులకును నింత యధికసైన్యము లేదని చెప్పవచ్చును.

## 3-వ ప్రకరణము - సేనాంగవిచారణ.

ఆఱుపంచాయతులు.

సేనాంగవిచారణకు ముప్పది మంది యుద్యోగులను పంచాయతి 1కి 5గురు చొప్పున పంచాయతులనుగా నియమించెను. ఈ పంచాయతులకుఁ బనులను వేఱువేఱుగా నేర్పాటుచేసెను.

1-వ పంచాయతి—నావికసేనాధిపతితో సంప్రతించుచు నావిక సేనావిచారణ చేసిరి.

2-వ పంచాయతి—సేనలయొక్క స్థలాంతర గమనాగమన విచారణ చేయుట వారికి భోజనసామగ్రులు మొదలయినవి యమర్చుట. వారి వలనఁ బనులుగొనుట, యిట్టి కార్యములు నెఱవేర్చిరి. మఱియు రుంజలు వాయించువారు, గుఱ్ఱపునవుకర్లు, ఆయుధములను చేయువారు, గడ్డికోత కాండ్రు ఇట్టివారియొక్క పైవిచారణకూడ నీ పంచాయతియె యొనర్చెను

3-వ పంచాయతి—కాల్బలముయొక్క పైవిచారణ చేసిరి.

4-వ పంచాయతి—తురగసైన్య విచారణం గావించిరి.

5-వ పంచాయతి—యుద్ధరథసైన్యముయొక్క బాధ్యతఁ గలిగి యుండిరి.

6-వ పంచాయతి—గజసైన్యవిచారణం బొనర్చిరి.

పని లేనియప్పు డాయుధముల నాయుధాగారమందు భద్రపఱిచిరి. ఏనుఁగులకును గుఱ్ఱములకును బ్రత్యేకముగా శాల లుండెను. గ్రామాంతరములకుం బోవునపుడు శకటములకు హయంబులం గట్టక యెడ్లం గట్టిరి. ప్రతియుద్ధ రథంబునకు రెండుగాని నాలుగుగాని తురగంబులం బూన్చి దానిపై నిద్దఱు రథికులు నొక సారథియుఁ గూర్చుండిరి. విహారంబునకొఱకు రాజ

యుద్ధవ్యాపారము లేని యపుడు హయాదుల యుపయోగము.

ధిష్ఠించు రథంబునకు నాలుగు తురగంబులం గట్టిరి. యుద్ధగజంబుపైని ముగ్గురు సైనికులును నొక మావటీఁడు నుండిరి.

యుద్ధసన్నాహము చేయురీతి. పదాతిసైన్యమును తురగ సైన్యమును యుద్ధసన్నద్ధంబుఁ జేయుటనుగూర్చి కొన్ని వినోదకరవిషయంబుల నొకచరిత్రకారుఁడిట్లు లిఖించెను.

"హిందువులు యుద్ధాయత్తు లగురీతిని నేను చెప్పఁబోవుచున్నాను. వారికి వేఱుమార్గము లేదని నుడువుటకు మాత్రము వలనుపడదు. యుద్ధభటులు విండులను ధరించెదరు. ఆవిండ్లు వానిని ధరించువారియంత పొడవుగ నుండునట్లు చేయఁబడి యుండెను. ఈ వింటిని యుద్ధభటుండు తన యెడమపాదముతోఁ దన్నిపట్టి నారిని జెవి కంటలాగి బాణంబు విడిచెను. ఈ బాణము రమారమిగా 3 గజములు పొడవుం గలిగియుండెను. దీనిని డాలుగాని ఱొమ్ముకవచముగాని మఱియేదిగాని యెదిరింపం జాలదు. వాని యెడమచేతియందుఁ బదునుఁజేయఁబడని గొడ్డుచర్మముతోఁ జేయఁబడిన యొక డాలుండెను. ఇది ధరించువానియంత వెడల్పుగా లేకున్నను వానియంత పొడవుగా మాత్ర ముండెను. కొందఱు యుద్ధభటులు విండ్లకు మాఱుగా నీటెలను ధరించిరి. పదాతు లందఱును ఖడ్గమును గలిగియుండిరి. కత్తి వెడల్పుగా నుండెను. కాని మూఁడు మూరలకంటె యెక్కువ పొడవుగా నుండదు. బాహాబాహిగా శత్రువులతోఁ బెనంగి పోరుట వారికిష్టము గాకున్నను దప్పక పోరవలసినప్పుడు వార లీ ఖడ్గమును రెండు చేతులతో వాడిరి. గుఱ్ఱపుతొత్తులు రెండు బల్లెములను బదాతులు ధరించు వానికంటెఁ జిన్నవగు డాలులను ధరించిరి, వీరు గుఱ్ఱములమీఁదను జీను వేయరు. వానినోటిలో నినుపకళ్లెములను బెట్టరు. పదునుచేయని యెద్దు చర్మము గుండ్రముగాఁ గుట్టి దానిలో నినుప మేకులనుగాని యిత్తడి మేకు

లనుగాని కొనలు లోనికుండునట్లు లచ్చటచ్చట నాటించి దానిని గుఱ్ఱము మూతికిఁ దగిలించెదరు. ఈ మేకుల కొనలు మిక్కిలి వాడిగ నుండవు. భాగ్యవంతుఁడాచర్మములో దంతపు మేకులను నాటించెను. గుఱ్ఱము నోటిలో నినుపకోలను బెట్టి దాని చివరలకు కళ్లెమును బంధించెదరు. గుఱ్ఱపుసవారు కళ్లెమును లాగునప్పుడు నోటిలోనున్న యినుపకోలకుఁ గుఱ్ఱము లోఁబడియుండును. ఈ కోలయందుండు ముండ్లవంటి మేకులు నోటిలో గుచ్చుకొనుటచే సవారు చెప్పినట్లు గుఱ్ఱము వినును."

## 4-వ ప్రకరణము - నగరి పరిపాలన.

*పరిపాలనాక్రమం బస్పష్టము.*

ప్రజాపరిపాలనను గుఱించి శిలాశాసనములయందుఁ బ్రకటింపఁబడిన యంశములఁ గొన్నిటి నిదివఱకె విశదీకరించియుంటిమి. ప్రజాపరిపాలన విషయమైన యేర్పాటులు మిక్కిలి చిక్కుక యుండుటం జేసి యిదమిద్ధంబని స్పష్టీకరించుటకు వలనుపడకున్నది. అయినను వినుతికెక్కిన మహమ్మదీయ ప్రభువులయిన వర్షా, అక్బరు వీరి పరిపాలనాసరణికి నశోకుని పరిపాలనక్రమము మొత్తమునఁ దీసిపోవునది కాదు.

*నీరు పాఱుదలచేయు డిపార్టుమెంటు.*

ఈజిప్టుదేశమునం దాకాలమున నున్నట్టువలె నీరుపాఱుదలచేయు పరిపాలనశాఖ(డిపార్టుమెంటు)ఒకటియుండెను. ఈడిపార్టుమెంటులోఁ జేరిన యుద్యోగులు నదులలోనుండి కాల్వలను ద్రవ్వించి తూములేర్పఱచి మాగాణి వ్యవసాయికులకు వలసినంత నీటి నిచ్చుచుండిరి, అశోకునిచే సౌరాష్ట్రదేశమునకు నధికారిగా నియమింపఁబడిన పారసీకప్రభువు చంద్రగుప్తుని కాలములోఁ ద్రవ్వింపఁబడిన గిరినగరమను మడుఁగునుండి కాలువలను ద్రవ్వించి వంతెనలను గట్టించి నీరు

పాఱుదల చేయించి యుండెనని క్రీ. వె. 150 సంllలోఁ బ్రచురింపఁబడిన రుద్రదామను (Rudradaman) అను శాసనమువల్లఁ గన్పట్టుచున్నది. ఈ సౌరాష్ట్రదేశము పాటలీపుత్రమునకు 1,000 మైళ్లకంటె నెక్కువదూరమున నున్నది. ఇంత దూరప్రదేశములకు నీరు పాఱుదలఁ జేయించి వ్యవసాయాభివృద్ధిఁజేసి భూమిశిస్తుఁ బెంపొందించుట యొక్కటియె యీయశోకుని జాగరూకతను మనమెంత కొనియాడఁదగినదో తెల్పుటకుఁ జాలియున్నది కదా.

రివిన్యూడిపార్టుమెంటు.

ప్రభువుయొక్క భాండాగారమును నింపుటకు ముఖ్యాదాయమయిన భూమికప్పమును సేకరించుట యిప్పటివలెనె యాకాలంబునను రివిన్యూయుద్యోగులయందుండెను. వ్యవసాయపు భూమియంతయుఁ బ్రభువుయొక్క సొత్తైయుండెను. వ్యవసాయకులు పంటలో నాల్గవవంతుఁ దీసికొని నట్లొక గ్రంథమందుఁ గానుపించెను.

భూమిసుంకము.

నియామకములేని శిస్తుకై పంటలోఁ జతుర్థ భాగమును వ్యవసాయకుఁడు ప్రభువునకుం జెల్లించినట్లు మఱియొక గ్రంథమునందుఁ గన్పట్టును. ఈచివరఁ జెప్పినదియె వాస్తవమయి యుండును.

వ్యవసాయముతో సంబంధించిన కులములవా రనఁగా వడ్రంగులు, కట్టెలఁగొట్టువారు, కమ్మరులు, గనులను త్రవ్వువారు వీరందఱు రివిన్యూ అధికారులకు లోఁబడియుండిరి.

బాటలు.

రాజకీయాధికారులు బాటలను సంరక్షణచేసిరి. రాజమార్గములయందు మైలురాళ్లకు మాఱుగా స్తంభములను ఒకటింబాతిక మైలెడముగ స్థాపించిరి. అనేక శతాబ్దములకుఁ బిమ్మటఁ బరిపాలించిన మొగలాయి

మైలు స్తంభములు. చక్రవర్తి లిట్టి మైలు స్తంభములనె నిర్మింపఁ జేసెరి. అవి యిప్పటికిని దృష్టిగోచరంబు లగుచున్నవి.

ఛాయావృక్షములు. రాజమార్గములయందు ఛాయా వృక్షంబులను ఒండొంటికి సమీపంబుగ నడ బావులను, బాటసారులకుఁ గలుగఁ జేసితినని యశోకుండు తనలోను ప్పొంగుచుండెనఁట. సత్కార్యంబుల నొనర్చువారు పొంగినను బొంగవచ్చునుగదా.

పాటలీపుత్ర నగర వర్ణన. సోనా (Sona) గంగానదుల సంగమస్థానమున సోనానది దక్షిణఘట్టను మీఁద నిప్పటి పాట్నాపట్టణ ఘట్టనుమీఁద నిప్పటి పాట్నాపట్టణమును బాంకిపురపు స్టేషనుండు పట్టునఁ బాటలీపుత్రము నుండెను. సోనా (స్వర్ణ) నదీప్రవాహ మార్గముమాఱి బాంకిపురమునకును పరిధనపుర శిబిరముదగ్గఱ గంగతోఁ గలియుచున్నది. కాని దాని పూర్వమార్గము నిప్పటికిని గనిపెట్టవచ్చును. ప్రస్తుతపు పాట్నా నగరమువలెనె పాటలీపుత్రము పొడుగుగాను సన్నగాను ఉండు సమాంతర చతుర్భుజాకృతిం [ ] గలిగియుండెను. దీని దైర్ఘ్యము తొమ్మిది మైళ్లు. వైశాల్యము ఒకటిన్నర $1\frac{1}{2}$ మైలు. మెగాస్తినసు అను రాయబారి తానుచూచినట్టు వ్రాసిన దారునిర్మితములైన కోటగోడలచుట్టు విశాలముగాను లోతుగానుండు కందకము నగరమునకు సంరక్షకముగా నుండెను. మఱియు నీగోడలపై 570 బురుజులును, గోడలయందు 64 ద్వారములు నుండెను. నగరమునకు వెలుపల నొకరాతి గోడను అశోకుఁడు కట్టించి విశేషాలంకార భూయిష్టము లయిన యనేక శిలాభవనంబులచేఁ బాటలీపుత్రనగరమును బహు మనోహరంబుగఁ జేసెను. కనుకనె తదనంతర కాలంబునఁ బ్రజలు వానింజూచి యవి దేవతానిర్మితము లయియుండెనని భావించిరి. ఈ ప్రాచీననగరమునందు చాలభాగము పైని చెప్పఁబడిన

నదులయొక్క నీటియడుగుననుండు బురదనేలలయందు పాట్నా, బాంకిపుర పట్నములకు నడుగున 10 మొదలుకొని 20 అడుగులలోతు వఱకుఁ బూడిపోయి యుండెను. కొయ్యగోడలయొక్క శేషము లనేక స్థలముల యందు నేలను ద్రవ్వినప్పుడు గోచరములగుచున్నవి. ఆకాలపు పెద్దయిటుక రాళ్లయొక్కయు, దివ్యభవనములయొక్కయు జాడలు కనుగొనఁ బడుచున్నవి. కొన్నియిటుక లోగిండ్లుపాడుపడి యిప్పటికిని భూమిపైఁ గానవచ్చుచున్నవి. తగుశ్రద్ధతో నచ్చటిభూమిని ద్రవ్వించి పరిశీలించినయెడల నశోకుఁడు కట్టించెనని చీనాదేశపు యాత్రికులు వ్రాసియున్న కట్టడములను గనుపింపవచ్చును.

మెగాస్తినసు రాయబారియు, చీనాదేశపు యాత్రికులును మౌర్యరాజధానియయిన పాటలీపుత్రముయొక్క విస్తీర్ణమును ఔన్నత్యములను గుఱించి లిఖించియున్న వృత్తాంతములు వాస్తవములయినట్లు నేటివఱకుఁ జేయంబడిన ఖననములవల్లఁ గానఁబడుచున్నది.

**మెగాస్తినసును, చీనా యాత్రికులును వ్రాసిన గ్రంథములయొక్క సత్యత.**

ఇంతఘనతఁ జెంది యింతవిస్తీర్ణమయియుండిన నగరమును అశోకుండు సమగ్రంబుగఁ బరిపాలించెను. సేనాపరిపాలనఁ జేసినరీతినె నగరపరిపాలనంబుఁ గూడఁ బంచాయతికి 5 గురు చొప్పునఁ గల 6 పంచాయతుల మూలమున నొనర్చెను.

**ఆఱుపంచాయతులు.**

1-వ పంచాయతి—శిల్పులను శిల్పపుపనులను బైవిచారణచేయుట వీరిపని.

2-వ పంచాయతి—పాటలీపుత్రమునకు వచ్చు పరదేశీయులను బరామర్శించుట వీరిపని. పరదేశులకు బసలుకుదిర్చి వారివెంబడి సేవకులనుంచి

యీ సేవకులవలన వారిజీవన మర్యాదల నెఱుంగుచు వారునగరమునుండి నిర్గమించునపుడు వారికి వీరు దారింజూపుచుండిరి. వారికి మరణము సంభవించినయెడల దహనాది క్రియలంజరిపించి వారిసొత్తును వారివారసులకుఁ బంపుచుండిరి. వారు రుగ్మతం జెందినప్పు డౌషధాది సేవల వీరొనరించిరి.

3-వ పంచాయతి—సుంకములను వసూలుచేయుటకును గొప్పవారిలోను, కొద్దివారిలోను సంభవించు మరణములు ప్రభువునకుఁ దెలియఁ జేయుటకును వీరు జననమరణముల పైవిచారణఁజేసిరి.

4-వ పంచాయతి—వర్తకవ్యాపారములపై విచారణఁ గావించిరి. తూనికరాళ్లను, కొలపాత్రలను వీరు స్థిరపఱచిరి. ఆయాకాలముల యందు ఫలించు పంటలకు ధరలుజాబితాను బ్రకటించిరి. ఒక్క సరుకుకంటె నెక్కువ సరకులలో వ్యాపారము చేయువాఁడు వృత్తిపన్ను ద్విగుణమివ్వవలయును.

5-వ పంచాయతి—వీరు సరకులనుజేసి వానివెలను బ్రచురపఱచిరి. ప్రాతసరుకును గ్రొత్తసరుకును మిశ్రమము చేసినయెడల వీరు జరిమానాకుఁ బాత్రులయిరి. దిగుమతియగు సరకులకుంగల చట్టములె యీసరకులకుఁగూడ నుపయోగించిరి.

6-వ పంచాయతి—అమ్మకపు సరకుల వెలలలోఁ బదియవవంతు వీరు వసూలుచేసిరి. ఈ పన్నుఁ జెల్లింపక మాయఁజేసిన వానికి మరణదండనవిధించిరి. ఈ ఘోరమయిన చట్టము చంద్రగుప్తుని కాలములో నేర్పడెను. చంద్రగుప్తునిశిక్షాస్మృతి మిక్కిలి క్రూరమయినదని దెల్పు విషయములలో నిదియొకటి కాని అశోకుఁ డా శిక్షాస్మృతియొక్క కాఠిన్యమును కొంతవఱకు తగ్గించెను.

## 5-వ ప్రకరణము - పరిపాలన విమర్శ.

చంద్రగుప్తుని కఠిన పరిపాలనంగూర్చి “జస్టిన్” అను చరిత్రకారుఁడిట్లు లిఖించెను. “చంద్రగుప్తుఁడు భరత ఖండవాసులను గ్రీకుదేశస్థుల పరిపాలననుండి

చంద్రగుప్తుఁడు కీర్తిని

గోలుపోవుట. విడుదలఁజేసి తాను వారికిం బ్రభువయి తన పాలన కఠినత్వముచేత స్వాతంత్ర్య ప్రదాత యను గీర్తిని గోలుపోయెను. ఏలయనఁ దత్ప్రభువు వారిని హింసించి యూడిగముఁ జేయించుకొనెను. మ్యూనిసిపలుపన్నుఁ

పరిపాలనా కాఠిన్యము. లఁ జెల్లింపనివారికి విధింపఁబడు శిక్షలు పైన నుదాహరింపఁబడినట్లుండఁగ నాప్రభువు బహు కఠినముగాఁ బ్రజల శిక్షించెననుటకు నితరదృష్టాంతములు గ్రంథస్థములయి యున్నవి. మృగయార్థము రాజు వెడలిన స్త్రీవందెల్పుటకుఁ గట్టఁబడిన త్రాళ్లనడుమను వచ్చినవారిని చంద్రగుప్తుఁ డురితీయించెను. శిల్పకారుని హస్తమునకుఁ గాని నేత్రమునకుఁ గాని యపాయముఁ గలుగఁ జేసినవానికి నురిశిక్షయె. ఏలయనగా నిపుణులయిన పనివాండ్రు మిక్కిలిగా రాజున కుపయోగముగ నుందురు. ఎవఁడయినను మఱియొకని యవయవచ్ఛేదంబు చేసెనేని యట్టి యవయమునే వానియంగమునుండి ఖండించి వాని సవ్య హస్తమునుగూడ ఛేదించిరి. అబద్ధపు సాక్ష్యమిచ్చిన వారి నాలుకల కొనలను గోసిరి. ఇవిగాక యేవియొ కొన్ని ఘోరాపరాధంబులఁ జేసినవారి శిరోముండనంబుఁ గావించిరఁట. ఈ కడపటిశిక్ష మిక్కిలి యవమానకరమని యప్పటిజనులు భావించిరి.

ఈ ఘోరమయిన శిక్షాస్మృతిని నశోకుండు స్వల్పంబుగ సులభంబుచేసినట్టు గన్పట్టును. మరణదండన విధింపఁబడిన

శిక్షాస్మృతియం దశోకుం డొనర్చిన సౌలభ్యము. నేరస్థులకు దండనకుం బూర్వము దినత్రయ విశ్రాంతి యొసంగెదరని గతంబున లిఖింపఁ బడియున్నది. ఇట్టి యాజ్ఞను బ్రకటించు శిలాశాసనములో ఘోరములగు నేరములసంఖ్యగాని మరణశిక్షాపాత్రుల సంఖ్యగాని తక్కువపడినట్లు లిఖింపఁబడలేదు. నేరస్థుల విషయమై ధర్మాధి

కారులు కొన్ని కారణంబులంబట్టి కనికరించుట కధికారముఁ గలిగియుండి రని యిదివరలో లిఖింపఁ బడియున్నది. కాని దండనాధికారులు ప్రత్యేకముగా నియమింపఁబడియున్నందున ధర్మాధికారు లెంతవఱకు నేరస్థులను క్షమింపఁ గలిగిరో స్పష్టంబుగఁ దెలియదు.

సంవత్సరోత్సవము.

అశోకుఁడు సింహాసన మధిష్ఠించిన దినమునందుఁ బ్రతిహాయనంబున నుత్సవంబుఁ జేయఁబడెను. అట్టియుత్సవదినంబున మరణ శిక్షాపాత్రులయిన దోషులు క్షమింపఁబడి విడుదలఁ జేయఁబడిరి కాని పైని లిఖింపఁబడిన ప్రకార మురిదీయుటకుఁ బూర్వము మూఁడుదినములె విశ్రాంతికాలము కనుక నట్టి రాజానుగ్రహమువలన మేలుఁబొందిన వార లెక్కువగా నుండియుండరు. లభించినంతవఱకు గ్రంథసాక్ష్యముగాని శాసనసాక్ష్యముగాని పరిశీలింపఁగాఁ దనపితామహుని చండశాసనము నే యశోకుఁడు కించిన్న్యూనంబుగ ననుసరించెననియె యూహింపఁ దగియున్నది.

అశోకుని పరిపాలన మప్పటి దేశకాలానుగుణ్యముగానుండుట.

కరుణామయుఁడైన యశోకుఁడు తన పితామహుఁడైన చంద్రగుప్తుని ప్రచండశాసనము నించుమించుగా ననుసరించిన మాత్రన నశోకుని ధర్మవచనములు దంభవచనములని యాయన కరుణావిశేషము కపటవిన్యాసమని యెంచుట యెంతమాత్రమును సరసముకాదు. అప్పటి దేశకాలపాత్రముల కనుగుణముగాను నేరముల విచారించి శిక్షల విధించుటయందు ప్రాగ్దేశరాజ్యముల మర్యాద కనుకూలముగాను, అశోకుఁడు పరిపాలనఁజేసియుండెను. అశోకుఁడు తన యుద్యోగస్థులకు బోధించిన పద్ధతులప్రకారము వారు నడచుకొనినయెడ రాజ్యపరిపాలనయం దధికన్యాయమును, తత్కాలమందున్న ఘోరాభ్యాసములు కొంతవఱకయినను క్షీణించుటయును, నిస్సం

అశోకుఁడు స్తవనీయుడు.

దేహముగా సిద్ధించియుండును. అట్టిపద్ధతుల నేర్పఱిచి నందుకు నశోకునిం గొనియాడ వలయును.

కాళింగుల యెడల నశోకుని యభిలాష.

జయింపఁబడిన కళింగదేశముయొక్క పరిపాలకులకును దండనాధికారులకును బ్రచురించిన ధౌలి (Dhauli) జంగద (Jangada) అను పరిశిష్ట శాసనములం జూడఁ గరుణామయుఁడై నిదానంబుగ రాజ్యపరిపాలనంబొనర్చుట కశోకుని పూర్ణాభిలాష స్పష్టంబుగఁ దెలియుచున్నది.

రాజ్యము సమర్థంబుగ నుండెననుట.

ఈ విస్తీర్ణరాజ్యము చంద్రగుప్తునుండి బింబిసారునికి బింబిసారునుండి యశోకునికి నిర్వివాదంబుగను నిరాటంకముగను వచ్చియుండుటం బట్టి రాజ్యపరిపాలన నిబంధనలయందు లేశంబయినఁ గొఱంతలేకుండె ననియు, విదేశరాజుల దండయాత్రల సరకుఁ గొనక పరరాజ్యవిజయం బొనర్చుటకుం జాలిన ప్రబలసేనాంగముండె ననియు, గ్రహింపందగియున్నది. ఇంతసమర్థంబుగ నుండుటంబట్టియె యీపరిపాలన నిబంధనలు ప్రజాసౌఖ్యంబునకు సంబంధించిన పనులనుగూడ సమగ్రంబుగ నెఱవేర్పం జాలియుండెను. చంద్రగుప్తుఁడు మొదలుకొని యశోకునివఱకు ముగ్గురు చక్రవర్తులకును పాటలీపుత్రమే రాజధానిగ నుండెను. మఱియు వీరిరాజ్యము బంగాళాఖాతము అరాబియా సముద్రములకు నడుమ నిప్పటి బ్రిటిషుఇండియా అనఁగా ఇంగ్లీషువారి పాలనక్రిందనున్న హిందూదేశముకంటె నెక్కువగనుండెను.

సాధన సామగ్రి.

ఇక్కాలపు నవీననాగరికమున కవసరంబులైన ప్రబల సాధనసామగ్రు లశోకునికప్పుడు లేకుండినను

దనరాజధానికి 1200 మైళ్లదూరముననున్న కాబూలునందునను, 1000 మైళ్ల దూరముననున్న గిరినగరమందునను అశోకుఁడు తన యాజ్ఞను జెల్లించుకొనెను. రాజ్యమునకువచ్చిన తొమ్మిదవ వత్సరంబున నశోకుండు శత్రుభీకరంబయిన తన ఖడ్గమును కళింగయుద్ధంబునఁ బ్రకాశింపఁ జేసి పిమ్మట పరిపాలింప శక్యముగాని యాటవిక జనంబులను సహనముచే వశపఱచుకొనెను. మఱియుఁ దనరాజ్యమందు మనోహరము లయిన భవనంబులం గట్టించి నీతిని ధర్మమును బట్టుదలతో వ్యాపింపఁజేసెను.

అశోకుని సౌమ్యమును కౌశల్యమును.

దీర్ఘకాలమువఱకు జగత్ప్రసిద్ధంబుగ నిట్లు పరిపాలించిన యశోకున కనంతరం బాయన యేర్పాటు లెంతకాలము గమనింపఁ బడెనొ తెలియదు. ఆయనకుఁ దరువాత వచ్చిన రాజులను గుఱించియు మౌర్యరాజ్యము క్షీణించి యంతరించుటను గూర్చియు నేమియుఁ దెలియదు. అప్పటి కాలపువారీ మౌర్యవంశమం దసూయచేఁ దద్వృత్తాంతంబులను గారణంబులను వ్రాసియుండలేదని యూహింపఁ దగియున్నది. అశోకుని రాజ్యపాలన విమర్శను దచ్చరిత్రకారుఁడయిన విన్సెంటు. ఏ. స్మిత్ పైన నుడివిన విధంబుగ లిఖించియుండెను.

అశోకుని పాలనవిషయమై విన్సెంటు. ఏ. స్మిత్తు యొక్క యభిప్రాయము.

బుద్ధకాల హిందూదేశ చరిత్రకారుఁ డశోకుని పరిపాలనాదికమును గుఱించియిట్లు వ్రాసెను.

రైసు. డేవిడ్సుయొక్క యభిప్రాయము.

స్వల్పలోపములు పరిపాలనమందున్నను అశోకచక్రవర్తి ప్రపంచములో విశేషప్రజ్ఞావంతులనియు సర్వజనానురంజకులనియు వినుతికెక్కిన

వారిలో నొకండని నిస్సంశయముగా నుడువవచ్చును. శాసనములం జదువు నప్పుడు కలుగు నావేశము మఱువవలసినది కాదు. ఆశాసనములయందు వ్రాయఁబడిన వచనంబు లశోకునివదనంబునుండి వెడలినవేయయియున్నవి. తనయపరాధంబుల నొప్పుకొనుచు దానిట్లు చరించెదనని ప్రకటించుచు, శాసనములయం దమ్మహనీయుఁడు లిఖింపఁజేసిన వచనంబులను ఆయన కన్యుండు కలిపెనని యనఁగలమా? కాని శాసన వచనంబులు రసవంతము లుగఁ గనుపడవు. మఱియుఁ బునరుక్తి దోషంబులతో నిండియున్నవి. ఇట్టి చరిత్రకారుఁ డిచ్చట నాక్షేపించెంగాని ధర్మాచరణమందుఁ దనకుఁగల యా దరమునుబట్టి తనవచనంబులు పునరుక్తంబులుగ నుండననియె పదునాల్గవ శిలా శాసనంబున నశోకుఁడు ప్రకటించియుండె. మఱియు ధర్మోపదేశమె యశో కుని ముఖ్యాభిలాషకాని సాహిత్యవిశేషంబును దద్రచనయుఁ గాదని చదు వరులు గ్రహింపఁదగియున్నది. జనులయొక్క కష్టసుఖములను గుఱించియు, నడతలనుగుఱించియు, అశోకుని యభిప్రాయము గర్వములేనిదిగను, సత్య మైనదిగను, సర్వసమ్మతమయినదిగానునుండెను. అక్కాలమందుఁ బ్రాగ్పశ్చిమ దేశములలో సర్వజనులకుంగల మూఢభక్తి యాకాలంబుననె యశోకుని విడిచిపోయెను. మూఢభక్తి పూర్ణంబుగ నశోకుని విడుచుటకు బౌద్ధమతా చార్యులబోధ కారణమైయున్నది. కాని యటుల మూఢభక్తిని త్యజించుట తనబుద్ధి విశేషంబుచేతనె కలిగెనని యశోకుండు బల్కియుండెను. ఏది కారణమొయని కొంచెము విచారింపవచ్చును. గ్రీకుదేశపు రాజులెందఱో మహాబుద్ధిశాలు లక్కాలంబున నుండిరి. వారును అశోకునివలె వినుతికెక్కఁ జాలియుడిరి. కాని సంభవింపలేదు. కావున నప్పటికాలమందు బుద్ధివై భవంబు భరతఖండవాసులకె సగటున నధికమయి యుండెననియె చెప్ప వలెను. అయినను నశోకుఁడు బౌద్ధాచార్యులవల్ల గొంతవఱకైనను బోధింపఁ బడియుండవలెను లేనియెడల నశోకుండు మానుషాతీత ప్రజ్ఞావిశేషంబు గల

వాఁడని నుడువవలసివచ్చును. శంకరాచార్యులు మొదలయిన మహనీయు
లెందఱో యమానుష ప్రజ్ఞావంతులై భరతఖండ పుత్రులుగ జన్మించియుం
డఁగా నశోకుండు వారిలో నొకఁడయి యుండవచ్చునని, యీచరిత్రకారుఁ
డూహింపజాలఁడయ్యె. అశోకుని జన్మాది సంవత్సరంబు లన్యవిధంబుగఁ
గడపఁబడినవి. చిరకాల ప్రభుత్వమునుబట్టి యీయనపూర్ణమయిన దేహ
దార్ఢ్యముగలవాఁడని తలఁపవలెను. మఱియు నీయన చలింపని మనోనిశ్చ
యము కలవాఁడనియు ధర్మాచరణమం దాసక్తిగలవాఁడనియు, నింద్రియ
జయంబుగూడఁ గలిగియుండెననియు, వచించుటకు లేశమాత్రమయినను
సందేహము లేదు. ఇట్లు పాశ్చాత్యచరిత్రకారు లుభయులు నశోకుని సుగు
ణంబులను బరిపాలన విశేషంబులను ఘనంబుగఁ గొనియాడిరి.

మఱియుఁ గొన్ని విశేషాంశంబులు గ్రహింపఁదగియున్నవి. చంద్రగుప్తుఁడు

**మఱికొన్ని విశేషంబులు. చంద్రగుప్తుని సంశయము.**

రాజసగుణప్రధానుఁడై తనశౌర్యధైర్యాదుల
చేఁ బ్రబలమగధరాజ్య పరిపాలన మొన
ర్చెను. కాని యేకాలంబున నేరూపంబునఁ
దనకు శత్రుబాధకలుగునో యని నిరంతరము
శంకావిష్టుండైయుండెఁ గాన రాజ్యంబు సమ
ర్థంబుగఁ బాలించుచు సేనాంగంబుఁ బలపఱచుకొని నేరస్థులకుఁ గఠినశిక్షల
విధించుచు చండశాసనుండని పేరు వడసెను. ఆయన కుమారుఁడైన బింబి
సారుఁడు అమిత్రఘాతుఁడని బిరుదుఁ జెంది తండ్రియేర్పాటులనే యనుస
రించెను. అనంతరమువచ్చిన యశోకుఁడును దనతాతగారివలెనే శత్రుపీడ
కలుగునేమోయని సందేహమనస్కుఁడై యుండుటంజేసి యాయన కఠినపద్ధ
తులనే కొంతవఱకు నవలంబించి యుండెను.

**అశోకు డించుమించుగ చంద్రగుప్తునిరీతిని పాలిం**

అశోకుని పాలనానంతమువఱకు రాజ్యమున
శేయపాయంబు లేకుండుటయే వీరిపరిపాల

చుట యుచితమె.

నము తత్కాలానుకూలమయి యుండెనని నిర్వివాదంబుగఁ దెల్పుచున్నది. రాజ్యసంరక్షణార్థము కఠినశిక్షలఁ గొంతవఱ కశోకుఁడు విధించినను, శిక్షలకుంగారణములు నేరములనియు నేరముల ధర్మమంబునం బొడముచున్నవనియు, అధర్మంబు ధర్మాచరణంబున నశించుననియుఁ

ధర్మబోధావసరము.

దద్ధర్మాచరణంబునకు ధర్మబోధ యవసరంబనియు యోచించెను. ఈ ధర్మాచరణంబయినను బ్రజలకుఁ గష్టసాధ్యంబుగ నుండలేదు. ఏలయనఁగా వారాచరింపవలసిన ధర్మంబులు:—(1) తల్లిదండ్రులను బూజించుట. (2) పెద్దలను గౌరవించుట. (3) పశువులనయినను హింసింపకుండుట. (4) పరోపకారము చేయుట. (5) సత్యవచనము బల్కుట మొదలయినవి.

ధర్మాచరణము వలని ప్రయోజనములు.

ఈ ధర్మంబుల జనులభ్యసించెదరేని యన్యోన్యవైరంబులకును నపకారంబులకును కారణంబులయిన కామక్రోధాదులు తలలెత్తవు కదా. క్రమక్రమంబుగ నవి నిర్మూలంబులగును. అన్యోన్యానురాగంబులును బ్రవర్తిల్లును కాన నేరంబులు నభావంబులగును. శిక్షలకవసరంబె యుండదు. ఇట్లుండుట సత్యగుణప్రధానుఁడైన ప్రభువునకానందజనకంబె కదా. దీనం జేసి ప్రజలకును నిహపరలోక సౌఖ్యము చేకూరును. ఇట్లైన సప్తమ శిలాశాసనమందు నశోకుండు ప్రకటించియుండెను. రాజ్యరక్షణార్థము మరణదండన విధించినప్పుడు నేరస్థునికి మూడుదినముల విశ్రాంతిని నశోకుం డొసంగెననుట యట్టి కఠినశిక్షను విధించుట కాయన మనస్సు క్షోభించె ననియె తెల్పును. అశోకునకుఁ బూర్వపురాజులుగాని యనంతర రాజులుగాని యీనేటికాలము వఱకు నేరస్థుల శిక్షించి పరిపాలించుచుండిరి కాని యశోకునింబోలి ప్రజలను ధర్మాచరణ మూలంబునఁ బరిశుద్ధమన

స్థూలనుగాఁ జేయఁబూనిన వా రెవ్వరుండిరి?

శిక్షలు నిస్సారములు.

శిక్షలవలనఁ బ్రయోజనంబుండదా యనినచో నేరస్థుని కారాగృహవాసునిగఁ జేసినప్పుడు వానిశరీరమె కారాగృహమందుండును గాని వానిమనస్సు నుండుననిచెప్పఁ గలమా? మఱియు వాఁడచ్చటనుండి పునర్దోషాచరణంబునకు వెరవు పరికించుచుండుఁ గాని పశ్చాత్తాపంబు నొందుచుండునా? ఇట్లు నేరంబులును శిక్షలును నిరంతరము జంటగాఁ బోవుచుండుటయెల్లరకును దెలిసినవిషయంబే కదా. కావున శిక్షలు దుర్వృత్తులను నిర్మూలంబుఁ జేయంజాలవు. ధర్మంబే వానిని నిర్మూలంబు చేయఁగలదు. ప్రజల కుపదేశించిన ధర్మంబునే యశోకుండు తాను స్వయముగా నాచరించుట మఱియొకగొప్ప విషయంబని గ్రహింపఁదగును. ఈ ధర్మోపదేశంబును దదాచరణంబును దత్కారణ ప్రయోజనంబులును సవిస్తరంబుగ ముందటి యధ్యాయంబులో విశదీకరింపఁబడును కనుక నింతవఱకు సంగ్రహంబుగ లిఖింపఁబడినది. మఱియుఁ బాటసారులకు రాచబాటల (హైరోడ్లు) యందుఁ జలివేంద్రలను, శ్రమదీర్చు

అశోకుని ధర్మకృత్యములు.

కొనుటకు విశ్రాంతి శాలల నేర్పఱచుటయును, వారు రోగపీడితులయినప్పు డౌషధసేవయు, నుపచారాదులం జేయించుటయు, పరదేశులకుమార్గగమనంబునఁదోడ్పాటొసంగుటయు, నిదియునుంగాక పశువులకును రోగనివారణంబు కొఱకు నౌషధశాలల నేర్పఱచియే తన్నిమిత్తమై వనమూలికలఁ దెప్పించి వానిని బ్రజలునాటి పెంచునటుల బహుళ ప్రయత్నంబుచేయుటయు, నిట్టి ధర్మకార్యంబు లశోకుని భూతదయాళుత్వమును జాటుచున్నవి.

ధర్మకార్యపరాయణత్వ మిట్లుండ నశోకుండు రాజ్యతంత్రమందు నేకచ్ఛత్రాధిపతియై స్వచ్ఛందాధికారియై తనయ సమానసామర్థ్యంబును నైపు

ణ్యాంబును జగ ద్విదితంబుగఁజేసె. ఇంతయేల

పరిపాలన సామర్థ్యము. ధర్మలక్షణంబును, ప్రభులక్షణంబు నశోకు నియందు మూర్తీభవించి నట్లున్నవి. మఱియు ధర్మప్రభు లక్షణంబు లిట్టివియని తనయనంతరరాజులకు బోధించుట కశోకుండాచార్యుండయ్యె ననందగియున్నది. కాని యమ్మహనీయుని లక్షణంబుల గ్రహించి యాచరించిన వారాయనకుఁ దరువాత నేలిన భరతఖండ ప్రభువులందుఁ దఱచుగాఁగానంబడరు. కనుక నశోకునికిని సాటి యశోకుండె యని వచింపవచ్చును. ఇట్లశోకచక్రవర్తి యీ భరతఖండమును క్రీ. పూ. **272** సంవత్సరము మొదలుకొని 41 సం॥ల నుపమానంబుగ ధర్మపాలనంబు చేసి క్రీ. పూ. 231 సం॥ము నందు శాశ్వతకీర్తి శేషుండయ్యె.

ఉ. రాజ్యము నేలె సర్వజనరంజకమౌగతి, నాత్మసంపదల్
భోజ్యము సేసె భిక్షులకు భూమిసురాళికి నర్థికోటికిం,
ద్యాజ్యము సేసె దుర్నయము, నందఱకు న్మహనీయ ధర్మముం
బూజ్యము సేసె, సత్వగుణభూమి యశోకుఁడు మోక్షకాముఁడై.

---

## 8-వ అధ్యాయము.

### జ్ఞాపకార్థమై కట్టఁబడిన కట్టడములను గుఱించి.



అశోకుని కాలమునకుఁ బూర్వమే యనఁగా నిప్పటికి 2000 సం॥ల క్రిందటనే నిపుణులైన శిల్పులకి భరతఖండము ప్రసిద్ధికెక్కి యుండెను. ఈ శిల్పులను నిపుణత్వమందు గ్రీకుదేశీయులు మాత్రము మించి యుండిరని పాశ్చాత్యులు వ్రాసిరి కాని సమస్తశాస్త్రనిర్మాణమ లైన భరతఖండవాసులను వారు మించియుండిరనుట యెంతవాస్తవమో తెలియదు. పూర్వకాలంబున నీదేశ శిల్పులు దారువుల మీఁదఁగాని, శిలలమీఁదఁ గాని చిత్రవిచిత్రంబులుఁ దమపనితనముం జూపియుండిరి. అప్పటి ప్రభువులును సిల్పులఁ జక్కఁగ నాదరించి ప్రోత్సాహపఱచి శాస్వతములయిన కట్టడంబులఁ గట్టించి రమ్యంబులును మనోహరంబులు నగుచిత్తరువులం జెక్కించి సత్కీర్తులయి వెలసిరి. అట్టి రాజోత్తములలో నశోకుం డొకఁడై యుండె. దారునిర్మితములయిన కట్టడంబులకుఁ బిపీలికాదులచేఁ గాలాంతరమున నష్టంబు వాటిల్లునని యెంచి శిలామయంబులయిన కట్టడములును శాసనంబులును శాశ్వతంబులుగ నుండునని భావించి యట్టిపనులఁ జేయించినవారిలో మొదటి బుద్ధిశాలి యశోకచక్రవర్తియె. ఈమహనీయునిచే నిర్మితములయిన శాసనాదులలోఁ బోయినవి పోఁగా లభించియున్నవియె యక్కాల చరిత్రం దెలిసికొనుట కాధారంబులయి యున్నవని చరిత్రకారులు సంతోషముతో వ్రాసిరి. అట్టి కట్టడములను వానియందు గోచరించుచున్న శిల్పనైపుణ్యమును

*శిలాభవనాదుల గట్టించిన వారిలో నశోకుఁడు ప్రథముఁడు.*

గుఱించిన వృత్తాంతమును సంగ్రహంబుగఁ దెల్పినట్లయినఁ జదువరులకు నానందకరంబుగ నుండునని యది విశదీకరింపఁ బడుచున్నది.

అశోకనిర్మిత భవనాదులను జనులు దేవతానిర్మితములనుకొనుట.

అశోకచక్రవర్తి 84000 పవిత్రసమాధులను గట్టించెనని పురాణంబులందు నతిశయోక్తిగ లిఖింపఁబడి యున్నది. అశోకుఁడు కట్టించిన కట్టడములయొక్క విశాలతను, రమణీయతను జూచి యద్భుతపడి యంత యతిశయంబుగ వర్ణించి యుందురు. మఱియు ఆయనకట్టించిన కట్టడములను దేవతలు నిర్మించిరని జనులు భ్రమించునంతగా నవి మనోహరములయి యుండెను. క్రీ. పూ. 5-వ శతాబ్ద ప్రారంభమందు "ఫావాయాన్" అను చీనాదేశ యాత్రికుఁడు పరిశీలనాశక్తిఁ జక్కఁగ లేనివాఁ డగుటఁ జేసి యట్లు వ్రాసెనని యొకచరిత్రకారుఁ డభిప్రాయపడెను. ఆయాత్రికుఁడు వ్రాసిన దేమనఁగా :—

"ఫావాయాన్" వ్రాసినది.

"పూర్వమునందువలెనే యీ 5-వ శతాబ్దమందును పాటలీపుత్రమను పట్టణమునకు మధ్యరంగమందున్న రాజమందిరమును సభాభవనంబును దేవతానిర్మితములె కాని మానవనిర్మితములు కావు. ఆదేవతలశోకుని యాజ్ఞప్రకారము ప్రశస్తములయిన శిలలఁదెచ్చి పేర్చి గోడలను ద్వారములను నిర్మించి వానిపై భువనమోహనములైన చిత్తరువులను జెక్కియుండిరి. ఆపనులు మనుష్యుని శక్తికి మించి యున్నవి". యనివ్రాసెను.

హ్యూయాన్‌సియాంగు

తరువాత రెండుశతాబ్దములకు "హ్యూయాన్‌సియాంగు" అను పేరుఁగల చీనాదేశ యాత్రికుఁడు పాటలీపుత్రనగరమునకు వచ్చినప్పుడా నగరము పాడుపడియుం

కాలమున నాకట్టడ డెను. దానిని బ్రజలు విడిచిపోయిరి. ఆకా
ములస్థితి. శమును జుంబించిన దానిబురుజులును, దాని
విచిత్రములైన రాజభవనంబులును దానియం

దుండు పవిత్రదేవాలయములును, గంగా స్వర్ణనదులలోఁ బూడిపోయి యున్నవి. అవి పూడియున్న ప్రదేశము మీఁద దూరపు ఇండియా యినుపదారియును, పాట్నాపట్టణమును, బాంకిపూరు సివిలుస్టేషనును గట్టఁబడినవి.

విలాసార్థముగా నశోకుఁడు కట్టించిన భవనాగులలో నొకటియు నిక్కా
లంబున గోచరించుట లేదు. కాని వాని
అశోక కాలపు భవనాదుల యేర్పాటులను శిల్పవిశేషంబులను బరిశీలించు
గోచరములుగా నున్నవి. టకు వలనుపడకుండెను. బాంకిపురమును
పాట్నానగరంబును గలుపు రైలుదారికి దక్షి

ణముగానున్న "కుమ్రాహారు" అను గ్రామముయొక్క పొలములక్రిందను ఇండ్లక్రిందను మౌర్యుల రాజభవనశేషము లడఁగియున్నవి. ఇంతవఱకు భూమిని ద్రవ్వి కనిపెట్టఁబడిన శేషములు సుబోధకములుగ నుండలేదు.

రాజ్యములో బహుస్థలములయం దశోకుఁడు నిర్మించియున్న యనేక
గొప్ప మఠములకు రాజభవనముల గలియే
స్తూపములు మాత్రము సంభవించెను. వానిలో నొక్కటియు నిపుడు
దృశ్యములుగానున్నవి. గుర్తింపఁదగిన స్థితిలో లేవు. అశోకుఁడువిశేష
ధనవ్యయముఁజేసి కట్టించిన స్తూపములలో

ననేకములు మధ్య హిందూస్థానమందున్న "సాంచి" యం దదృష్టవశంబున మంచిస్థితిలో నున్నవి.

బుద్ధునియొక్కగాని బుషియొక్కగాని శల్యములను బ్రతిష్ఠించుట
కయినను లేక బుద్ధమత విషయికమైన
స్తూప స్వరూపము. ప్రసిద్ధసంగతిని జ్ఞాపకము చేయు కొఱకయి-

నను వాడుకగా స్తూపమును (సమాధిని) బౌద్ధులు గట్టించిరి. కొన్ని సమయములందు బుద్ధుని గౌరవార్థముగాఁ గూడ స్తూపముఁ గట్టించిరి. అశోకుని కాలమందు స్తూపముయొక్క నిర్మాణంబిట్లుండెను. చదరమైన యడుగు భాగముగల స్తంభముమీఁద నర్ధవలయాకారముగా నుండు రాతి కట్టడమయి యుండెను. పూజకులు పోవుటకు దానిచుట్టును దారియుండెను. ఆరాతికట్టడముయొక్క పైభాగము బల్లపఱుపుగాఁజేసి దానిమీఁదఁ జదరముగనుండు దైవపీఠము నిర్మించిరి. పీఠముపైన రాతితోఁ జెక్కఁబడిన ఛత్రములుండెను. ఆకట్టడముయొక్క యడుగు భాగమున రాతికంచె యుండెను. దీని స్తంభములను, కడ్డీలనుమదురు తోలను, బహునైపుణ్యంబుగఁ దొలిచి వీనిపై సుబ్బెత్తుగఁ బెద్దవిగ్రహములఁ జెక్కి యలంకరించిరి.

సాంచి స్తూపవర్ణన.

సాంచి వనమందున్న గొప్పస్తూప మిటుకతోను రాతితోను గుమ్మటము వలెఁ గట్టఁబడి యుండెను. దీని వ్యాసము 106 అడుగులు. దీని యడుగున నుండు స్తంభము 14 అడుగులయెత్తు. ఆస్తూపముయొక్క పైభాగము డాబావలెనుండి 34 అడుగుల వ్యాసముఁ గలిగియుండెను దానిచుట్టు రాతికంచెయు నాకంచెలోపలఁ జదరమైన పీఠముండెను. దీనిచుట్టు నొకరాతి కంచెయుండును. ఈస్తూపముయొక్క యున్నతమంతయు 100 అడుగులను మించియుండెను.

అత్యున్నత స్తూపములు.

అశోకుఁడు కట్టించిన యనేకస్తూపము లింతకంటెఁ జాల నెత్తుగా నుండెను. ఆఫ్గని స్థానములో నశోకుఁడు కట్టించిన స్తూపము 300 అడుగు లెత్తుగ నుండెను. సింహళములో నొకస్తూపము 400 అడుగులను మించి యెత్తుగా నుండెను.

సాంచియందున్న గొప్పస్తూపముయొక్క పునాదిచుట్టున నొక పెద్ద రాయి కంచెగాఁ దొలవఁబడెను దాని యెత్తు 10 అడుగులు. ఇది యాపావనమయిన స్తూపమునకు చుట్టును నొక మార్గముగా నుండును. మిక్కిలి యలంకారముగ నుండునట్టి యీకంచె యశోకునికిఁ దరువాత నిర్మింపఁబడినది.

సాంచి స్తూపముయొక్క కంచె.

సాంచి యందుఁగాని సమీపమందుఁగాని యున్న కొన్ని స్తూపముల ద్వారములఁ దెఱచిచూడఁగా నారాతి కట్టడము లోపల నస్థికలబరణులు కనుగొనఁబడెను. రెండవ నంబరులో నస్థికలనుంచిన యర, మధ్యభాగమునకు రెండడుగులు పడమరగానుండెను. ఆయరలో నిసుకరాతి పెట్టెయుండెను. దీనిపొడవు 11 అంగుళములు, ఎత్తు $9\frac{1}{2}$ అంగుళములు. దీనిలో నస్థికలుంచఁబడిన నాలుగు సుబ్బురాళ్ల పాత్రములుండెను. అనేకులయిన బౌద్ధమత ఋషులయొక్కయు బౌద్ధమతాచార్యులయొక్కయు నస్థికలని దెల్పుటకై యీపాత్రములయందు వారి నామములు చెక్కఁబడినవి.

అస్థికలబరణులు.

అశోకుని కాలమందు నిర్మితమయిన యొక విచిత్ర స్తూపము యొక్క శేషమును 1873 సం|| లో సర్. అలెగ్జాండరు కన్నింఘము అలహాబాదు పట్టణమున కాగ్నేయముగా 95 మైళ్లదూరమున భాగెల్‌ఖండు (Bhagelkhand) జిల్లాలోనున్న బారహట్ (Barahut) గ్రామమునందుఁ గనుగొనెను 68 అడుగుల వ్యాసముఁ గలిగి యశోకుని శాసనములలో జెక్కఁబడిన యక్షరములవంటి యక్షరములతో ననేక శిలా లేఖనములను గలిగి యద్భుతముగాఁ దొలవఁబడిన రాతికంచెను ఆవరణముగాఁ

విచిత్ర స్తూపశేషము.

గలిగిన యిటికఱాల స్తూపముయొక్క శేషమును ఆయన కనుపెట్టెను. ఈస్తూపమునకు గచ్చుచేసి, దీపములు పెట్టి ప్రకాశమానముగా నుంచుటకై ముమ్మూలలుగల వందలకొలఁది గూళ్లను గట్టిరి. పండుగ దినముల యందు నన్ని గూళ్లలో దీపములు పెట్టి పూలు పూలదండలు కేతనములు మొదలయిన వానితో స్తూపముల నలంకరించుట బౌద్ధులకాచారము.

భారహాటుస్తూపము.

భారహాటు (Bharhut) స్తూపము 7 అడుగుల యెత్తుండెను అతి శృంగారము లయిన దీని ద్వారములయొక్క శేషము లిప్పటికిని గోచరించుచున్నవి. అయిన నవి సాంచియందు నిప్పటికిఁ గొంచెము బాగుగాఁ గానవచ్చుచున్న స్తూపశేషములవలెనె ఘనముగాను శృంగారముగాను నిర్మింపఁబడినవే యయియున్నవి.

సాంచిస్తూపముయొక్క ద్వారబంధము.

సాంచిస్తూపముయొక్క ద్వారబంధములలో సంపూర్ణముగానున్న యొక ద్వారబంధము దక్షిణ కెన్సింగుటను(South Kensington) పట్టణములో ఇండియన్ మ్యూజియము (Indian Museum) అనఁగా హిందూదేశపు విచిత్రవస్తు ప్రదర్శనశాలలో నుంచఁబడెను. దీనిని బోలియే బారహాతు ద్వారబంధముండెను. గ్రామజనులచేఁ బాడుచేయఁబడని భారహాతు శిల్పపుపనులు కలకత్తాకుఁ దీసికొని పోఁబడి యక్కడనున్న రాజకీయమైన మ్యూజియములోఁ బ్రధానవస్తువులుగా నుంచఁబడియున్నవి. ద్వారబంధములలో నొకటి కొంతవఱకుఁ గనుపడుచుండును. వర్తులాకారములోఁ జతుర్థభాగముగా నుండు రెండుకంచెలు దాని ప్రక్కగా నుంచఁబడెను. వీనిని దర్శించు వారికి నప్పటి శిల్పకార్యమిట్టిదియని కొంతవఱకు బోధపడును. అకంచెను

కలకత్తామ్యూజియము.

స్తంభములు, మూఁడు అడ్డకడ్డీలు, నొకబరువయిన మదురునుండెను. ప్రతి స్తంభము నేక శిలగానుండి ప్రతివైపున నడుమ నుబ్బెత్తుగఁ జెక్కఁబడిన యొకబిళ్లయు, శిఖరమున నర్ధవలయముగాఁ జెక్కఁబడిన యొకబిళ్లయు, వడుగున నటువంటి బిళ్లయె మఱియొకటియు నుండెను. కంచెయొక్క ప్రతి భాగముమీఁదను నద్భుతమైన శిల్పపుపని కన్పట్టుచున్నది. బౌద్ధచరిత్ర కంతకు నీశిల్పకృత్యములు మిగుల వన్నెఁబెట్టుటయె కాక యాచరిత్రను గూడఁ జాలభాగము శోధించుచున్నవి. ఏలయనఁగాఁ దత్కాలిక శిలా లేఖనములవల్ల నప్పటి చరిత్ర తెలిసికొనఁ బడుచున్నది.

అశోకుని కాలమందు నిర్మితములయిన కంచెలయొక్క శేషములు బుద్ధగయయందున్నవి. బాబు పి. సి. ముక్కర్జి పాట్నాయందు భేదములయిన మూఁడురాతి కంచెలనుగనుఁగొనెను. వీనిలోఁగొన్నియశోకునికిఁబూర్వమె నిర్మితములయియుండవచ్చును.

**పాట్నాయందలి రాతి కంచెలు.**

అశోకుని కుమారుఁడును గుమార్తెయునైన మహేంద్రుఁడు, సంఘమిత్ర యనువారియొక్క తల్లియైన దేవి అను నామె యొక్క జన్మస్థానమగు విదిశాగిరియందు మౌర్యకాలపుశిల్పపు పనులఁగలిగిన కొన్ని రాతికంచెలున్నవి. మహాత్ముల కర్పించినట్లు వీనిమీఁద లేఖనములున్నవి.

**విదిశాగిరియందలి రాతి కంచెలు.**

పూర్వకాలమందు బౌద్ధులును జైనులు నాదేవాలయములను, పీఠములను, మఠములను మొదలయినవానిఁ గట్టించుటకు ధర్మముల నార్జించి యట్టి దాతల యొక్కగాని దాతల సంఘముయొక్కగాని నామములను నేదోయొక శిలా స్తంభము మీఁదనో,

**దాతల పేర్లను శిలలపైఁ జెక్కుట.**

మధురగానుండు శిలమీఁదనె యట్టి కట్టడముయొక్క యితరభాగము మీఁదనె చెక్కించెడు నాచారము కలదు. (ఇట్టి యాచార మిప్పటికి నక్కడక్కడఁ గన్పట్టుచునుండును). ఇట్టి సదాచార మాశియాఖండమందును గ్రీక్కుల పాలన క్రిందనున్న దేశములయందును గానవచ్చుచున్నది. కెయిరో (Cairo) యందున్న లెబ్రాండా (Labranda) దేవాలయమందు నెయిరో (Nairo) చక్రవర్తికాలములో నిర్మితము లైపలకలు దీర్పఁబడిన పండ్రెండు స్తంభములున్నవి. ఈ స్తంభముల నెవరు ధర్మార్థముగాఁ గట్టించిరో వారి పేర్లు వానిమీఁదఁ జెక్కఁబడియున్నవి. ధర్మములను సౌక్యముగాఁ బోగుచేసి శిల్పకారున కియ్యఁగా నతఁడు సాధారణమైన ప్లాను ప్రకారము కట్టియుండును. తమపేర్లు భూమియందు శాశ్వతముగ నుండుటకును దమకును దమ కుటుంబమునకును బుణ్యలోక ప్రాప్తికొఱకును ధర్మదాత లటులఁ దమ నామంబులఁ జెక్కించుకొందురు. హిందూదేశమందుండు శిలాలేఖనములన్నియు నిట్టి యభిలాషతో నేర్పడినవే యయి యున్నవి.

ఇట్లు దాతలు తమపేర్లను శిలలపైఁ జెక్కించుకొనుటలో నొక విశేషంబు కలదని చరిత్రలవలనఁ దెలియుచున్నది.

దాతల నామములకుఁ బూర్వమందుండు విశేషణ పదములు. ఒక కట్టడములో నెవరే భాగము కట్టించియుండిరో యాభాగమునందె వారిపేర్లను జెక్కించి కొనిరి. మఱియు నొకరకంబె నెక్కువమంది యేక నాములయిన యెడల విశేషణ పదంబులు వారి నామములకుఁ బూర్వమునఁ జేర్పఁబడెను. అట్టి విశేషణ పదంబులలోఁ గొన్ని యీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

1. ధర్మకథక—ధర్మమును బోధించు వాఁడనియర్థము. ధర్మసూత్రములంగల వినయ పేటికను విడిచి తత్త్వ సిద్ధాంతమును, నీతిమార్గమును బోధించువారికిబౌద్ధవిద్యాలయంబులయందు ధర్మకథకులని సంకేత నామముఁ బెట్టిరి.

2. పేటిక—సూత్ర పేటికను గంథతః వల్లించిన వాఁడని యర్థము. సాంప్రదాయ ప్రశంస లీ పేటిక యందుండెను. పేటికయనఁగాఁ బెట్టె యని గ్రహింపవలయును. తమ సిద్ధాంతముయొక్క కొంతభాగ మీగ్రంథ మందుండుటంజేసి వీనికిఁ బేటికయని సాంకేతిక నామంబును బుద్ధులు పెట్టిరి.

3. సూత్రాంతిక—సూత్రములను వల్లించినవారని యర్థము.

4. సూత్రాంతికిని—సూత్రములను వల్లించిన స్త్రీయని యర్థము. బౌద్ధమత సిద్ధాంతములలోని కొన్ని భాగములను ముఖ్యముగా బుద్ధుని సంభాషణలను ప్రత్యేకముగా వల్లించిన వారి కిది సాంకేతిక నామమయి యుండెను. సూత్రాంతిక మనఁగా సూత్రములయొక్క పర్యవసానము. బుద్ధునియొక్క సంభాషణలు సూత్రములయొక్క సారమును విపులముగా బోధించుటంజేసి యాసంభాషణలనే సూత్రాంతికములని పేర్కొనిరి.

5. పంచనికాయక—పంచనికాయమును వల్లించిన వారని యర్థము. నికాయము లనఁగా సముదాయములు. ఇవి బౌద్ధధర్మసూత్రములకు సంబంధించియుండు శాస్త్రములు. అయిదు నికాయములలో రెండుసూత్రాంతములు. మఱి రంటియందు సూత్రములను ద్వివిధముగాఁ జేసిరి. శేషించిన దానియందు నిటీవలి గ్రంథములు చేర్పఁబడినవి. ఈ నికాయముల నె పిమ్మట నాగమములని వాడుకొనిరి.

నరవిగ్రహములు.

జంతు శిలా విగ్రహములె కాక యింక కొన్ని చిత్ర శిల్పములు మౌర్యుల ప్రభుత్వకాలములో నిర్మింపఁబడినవి. మంచి స్థితిలో నవి కొన్ని యున్నవి. ఈచిత్ర శిల్పములలో బ్రహ్మాండమయిన మనుష్య విగ్రహమొకటి యేడడుగుల యెత్తుఁగలది మధుర, ఆగ్రానగరముల మధ్యనుండు గ్రామమయిన "పరఖాము" (Parkham) లోఁ గనఁబడెను. అద్భుతముగా నునుపుచేయఁబడిన బూడిదవర్ణముగల యిసుక రాతిని జెక్కి యావిగ్ర

మును జేసిరి. దీని చేతుల నన్యాయముగ నెవరో విఱుగఁ గొట్టిరి. ముఖమును జెడఁగొట్టిరి. దీనియందుఁ గనుపఱుపఁ బడిన దుస్తు వింతగానున్నది. ఒక వదులు చొక్కాయును దానిపైనఁ బోరచుట్టు నొక కట్టును నడుము చుట్టు నొక కట్టునుండెను. ఇంత యద్భుతమైనది స్త్రీవిగ్రహం బొకటి 6 అ. 7 అం. ఎత్తుగలది విదిశానగరమం దుండెను. ఈవిగ్రహ మొక్కటియే యాకాలమం దుండిన విగ్రహములలో స్త్రీవిగ్రహము. ఇది యొక్కటియె కనుపడినందున బహు వినోదకరముగా నున్నది. సాంచియందున్న గొప్ప స్తూపమునకుఁ బరిసరమునందుఁ బ్రత్యేకముగనుండు స్తంభమున కుపరిభాగమున నొక ఋషి నిలిచియున్నట్లు పరివేషముతో నొక శిలావిగ్రహమున్నది. ఇండియాదేశపు శిల్పవిద్యానైపుణ్యముం దెల్పు నధిక సుందరమయిన విగ్రహములలో నిది యొకటియై యుండెనని కన్నింగ్‌హాము (Cunningham) తలఁచెను.

**ఏకశిలా స్తంభములు.**

బ్రహ్మాండము లయిన యేకశిలా స్తంభములను నిర్మించుటయం దశోకుని కధికాభిలాషకలదు. కాన వాని ననేకములుగ స్థాపించెను. వానిలోఁ గొన్నిటియందు లేఖనములున్నవి. కొన్నిటియందు లేవు. "సాంచి" స్తూపములోఁ బ్రవేశించునపు డుత్తరద్వారమునం దొకటియు దక్షిణద్వారమం దొకటియు నిట్టి శిలాస్తంభంబులు నేత్రానందకరములుగ నున్నవి. పైనఁజెప్పిన ఋషి విగ్రహమున కాధారంబైన యుత్తర దిశాస్తంభము 45 అడుగుల యెత్తుగా నుండెను. దక్షిణదిశనున్న

**సింహ విగ్రహములు.**

స్తంభము దానికంటె 5 అడుగులు తక్కువ. దీనిమీఁదఁ బృష్ఠభాగంబులచే నెదుర్కొనుచున్న నాలుగు సింహ విగ్రహములున్నవి. ఈ రెండు స్తంభములును కడమ వానివలెనే యధికముగ నునుపుచేయఁబడిన యిసుకరాళ్లచే నిర్మింపఁబడి



సాంచిస్తూపముయొక్క ఉత్తరపు ద్వారబంధము.

యున్నవి. పునాది మొదలుకొని శిఖరము వఱకు మధ్యనుండు నిడుపాటి భాగ మీ దక్షిణ స్తంభమందు 32 అడుగుల యెత్తుగా నుండెను.

బాగుగనున్న శిలా స్తంభములు.

సాంబియంనుండు స్తంభములలో దక్షిణ స్తంభము అలహాబాదు స్తంభము మీఁదనున్న కౌశాంబి శాసనముతో సంబంధించు శాసనము గలదిగనై యున్నది. కాని సాంబి యంనుండు స్తంభము లన్నియుఁ గ్రిందఁ బడద్రోయఁబడి యుపయోగము లేకుండ నున్నవి. అశోకునిచే నిర్మింపఁబడిన శిలా స్తంభములలో రెండు మాత్రము బాగుగా నున్నవి. ఒకటి ముజాఫరుపూరుజిల్లాలో బాసార (Basar) దగ్గర బఖీరా (Bakhira) లోనున్నది. రెండవది చాంపరన్ (Champaran) జిల్లాలోన "లౌరియా నందఘరు" (Lauriya Nandagarh) లోనున్నది. ఈ రెండు స్తంభములయొక్క సమగ్రవర్ణనవల్ల నీ తరగతిలోఁ జేరెడు నన్ని స్తంభము లిట్టివెయని తెలియును. కనుక నీదిగువ విశదీకరింపఁబడు చున్నవి.

బాఖిరా శిలా స్తంభవర్ణన.

బాఖిరా స్తంభము (Bakhira) సొగసైన యొక యిసుకరాయి. ఇది విశేషముగా నునుపుచేయఁబడినదై నీటి మట్టమునకుఁ బైన 32 అడుగు లెత్తుగా నుండెను. దీనియొక్క అడుగు మట్టము చదరమై మూఁడు మెట్లు కలిగి నీటిలో నుండెను. నీటిమట్టమునుండి శిఖరము వఱకు నడుమనుండు స్తంభము, మొదట * 49 అ. 8 అం. లావుగనుండి క్రమముగా స్థూలము తగ్గి శిఖరము దగ్గఱ 38 అ. 7 అం. స్థూలముగ

* 'అ' యనిన అడుగులనియు "అం" యనిన అంగుళము లనియు గ్రహింపవలయును.

నుండెను. శిఖరము ఘంటాకృతిగా నుండెను. ఇది 2 అ. 10 అం. ఎత్తు. దీనిపైన 12 అంగుళముల యెత్తుఁగల యొక రాతిపలక, $4\frac{1}{2}$ అడుగుల యెత్తుఁ గలిగి మండివేసికొని కూర్చుండు నట్లుండు సింహ విగ్రమునకుఁ పీఠముగా నుండెను. నీటిపైని యెత్తంతయు 44 అ. 2 అం. నీటిలో నున్న భాగమును గలుపుకొని స్తంభమంతయు 50 అడుగుల యెత్తుండ వచ్చును. ఈ స్తంభముయొక్క బరువు 50 టన్నులుండును.

లారియా శిలా స్తంభవర్ణన.

లారియా స్తంభము యొక్క యేర్పాటుకూడఁ బై స్తంభము వలెనే యుండెనుగాని యిది దాని యంత బరువుగలది కాదు. మధ్యనుండు స్తంభము నునుపుగలిగి 32 అ. $9\frac{1}{2}$ అంగుళము లెత్తుగానుండి మొదట $35\frac{1}{2}$ అంగుళములు లావుగను జివఱను $22\frac{1}{4}$ అంగుళములు లావుగ నుండెను. దీని శిఖరము పైని పీఠము వర్తులాకారముగనుండి రెండు బాతు లాహారము నేఱుకొని తినుచున్నట్లు బొబ్బెత్తుగా, నంచున శృంగారముగాఁ జెక్కఁబడెను. శిఖరము దానిమీఁద నుండుసింహ విగ్రహముతోఁ గూడ 6 అ. 10 అం. ఎత్తుగ నుండెను. కాఁబట్టి స్తంభమంతయు 40 అడుగుల యెత్తుండెను.

రాంపర్వ శిలా స్తంభ వర్ణన.

వికలాంగముగాఁ జేయఁబడి యాజిల్లాలోనె "రాంపర్వా" (Ram-parwa) లో నుండిన శిలా స్తంభము పై పేరాలో వ్రాసిన శిలా స్తంభమునకుఁ బ్రతి యయి యుండెను. స్వచ్ఛమయిన రాగిని పీపాయొక్క యాకారముగఁజేసి దానితో స్తంభమును దాని శిరమును గలుపఁబడెను. ఈరాగి పీపాయొక్క పొడవు 2 అ. $0\frac{1}{2}$ అం. వ్యాసము 4 5/16 అం. చివరలు 3 5/8 అంగుళములు. దీనిని రాతి స్తంభమునకును రాతి శిఖరమునకును సిమెంటుతో నవసరము లేకుండఁ దూచినట్లు సరిపుచ్చిరి.

పైన నుదాహరింపఁబడిన స్తంభముల కనుకూలమయి, సొగసయిన యిసుక రాలను గల గనులను వందలకొలఁది మైళ్లదూరమున నుండు స్థలములయందు నశోకునిచే నేకశిలా స్తంభములు స్థాపింపఁబడి యున్నవి. ఈ బ్రహ్మాండమైన శిలలయొక్క స్థౌల్యమును శిల్పముయొక్క శృంగారమును జూడ నశోకుని కాలమందు శిల్పులయొక్కయు, శిలలను జెక్కువారి యొక్కయు, కౌశలమును, నుపాయము నద్భుతముగా నుండె ననుటకు నవి ప్రబల సాక్ష్యముగా నున్నవి.

శిల్పుల కౌశల్యము.

ఇప్పుడు ఢిల్లీనగరమందుఁ గన్పట్టుచున్న యశోక నిర్మితములైన రెండు స్తంభములలో నొకటి పంజాబుదేశములో "అంబాలా" (Umballa) జిల్లాలో నున్న "టోప్రా" (Topra) నుండియు రెండవది పశ్చిమోత్తర పరగణాలయందున్న "మీరటు" (Meerut) నుండియు మొగలాయి చక్రవర్తియయిన "ఫిరోజిషాటోగ్లకు" (Ferozesha Tughlak) క్రీ. శ. 1356 సం॥ లోఁ దెప్పించెను. టోప్రానుండి శిలా స్తంభమును దెప్పించిన విధమును దత్కాలగ్రంథకర్త వర్ణించియుండెను. అశోకుని కాలమందు శిల్పులు తఱుచుగా నెంతెంత శ్రమపడి యట్టిపనుల నెఱవేర్చిరో యావిషయము చదువరులకుఁ దెలియుటకై యాగ్రంథకర్తయొక్క వర్ణన యిందుఁ బొందుపఱుపఁ బడుచున్నది.

అశోక నిర్మిత స్తంభములు ఢిల్లీనగరమునకుఁ దీసికొని పోఁబడుట.

ఆచరిత్రకారుఁడిట్లు వ్రాయుచున్నాఁడు. "కొండలకు సమీపమందున్న "ఖిజ్రాబాదు" (Khizrabad) ఢిల్లీనగరమునకు 90 క్రోశముల దూరమున నున్నది. ఫిరోజిషాసుల్తాను ఖిజ్రాబాదును జూడఁ బో

శిలలను దూరదేశమునకుఁ గొంపోయిన విధము.

యి నప్పుడు "టోప్రా" యం దా స్తంభమును దర్శించి ముందుసంతతుల వారికి జ్ఞాపకార్థముగా దానిని డిల్లియందు స్థాపింపఁ దలఁచెను. స్తంభమును బెల్లగించుటకు యుక్తమయిన యుపాయంబుల నాలోచించి దూయాబు దేశమందును దాని చుట్టుపట్లప్రదేశముల యందునున్న ప్రజల నందఱను గుఱ్ఱపు సేనలను, కాలిబంట్ల నందఱను బిలిపించెను, ఈపనికి నవసరమయిన సాధన సామగ్రులతో దూదిబస్తాలతోడను రండనికూడ నుత్తరువుచేసెను. ఈ దూదిని స్తంభము చుట్టు నమర్చిరి. నేలను దూదిపఱపులను బఱచిరి. స్తంభముయొక్క పునాదిని త్రవ్వి మట్టిని దొలఁగింపఁగానే యా స్తంభము దూదిపఱపుల మీదికిఁ జల్లచల్లగా నొఱగెను. ఆదూదిని క్రమక్రమముగాఁ దొలగింపఁగాఁ గొన్నిదినము లయిన పిమ్మట స్తంభము నేలమీఁది కేయపాయము లేకుండ వ్రాలెను. స్తంభముయొక్క పునాదులశోధింపఁగా నొక పెద్ద చదరపుఱాయి దానియడుగునఁ గనుపడెను. దానినిగూడ బయలికిఁ దీసిరి.

స్తంభమును బండ్లపైఁ తీసికొని పోవుట.

ఆ స్తంభమున కపాయము కలుగకుండుటకై చుట్టును రెల్లును ఊనని చర్మములను జుట్టిరి. నలువది రెండు చక్రములను గల యొక బండిని సిద్ధపఱచి ప్రతిచక్రమునకుఁ ద్రాటిమోకులు కట్టిరి. వేలకొలది జనులు ప్రతిమోకును బలిమితోలాగఁగ బహుళ ప్రయాసంబుతో నా స్తంభముబండిపై కెక్కెను. ప్రతిచక్రమునకుఁ బలమయిన మోకుంగట్టి 200 జనంబులాగెను. ఇట్లు బహుజను లొక్కుమ్మడి పూనికతో నీడ్వఁగా నాబ్రహ్మాండమైన స్తంభము యమునానదీ తీరముఁ జేరెను. ఇచ్చటికు సుల్తానుగారు దయచేసి యనేక నావలనాయత్తము చేయించెను. ఆనావలు 2000 మణుగులకుఁ దక్కువ పడకుండ 7000 మణుగులవఱకు ధాన్యము పట్టఁదగినవై యుండెను. ఆ స్తంభమును బహు నైపుణ్యముతో నావలలోని కెక్కించి ఫిరోజాబాదు (ప్రాతఢిల్లీనగరమునకు) దీసి

కొనిపోయిరి. అచ్చటనుండి యది యధికకష్టముతోను నేర్పుతోను "ఖుస్కు" (Khusk) నకుఁ దీసికొనిపోఁబడెను. దీని నిమిత్తమై ప్రత్యేకంబుగ నొక కట్టడము కట్టించి స్వస్థానమునుండి యా స్తంభమును దెచ్చుటకుఁ బడినన్ని కష్టంబుల మరలఁ బడి యాకట్టడముపైకి దాని నెక్కించి రనియు నా చరిత్రకారుఁడు వ్రాసెను. అచ్చోటనే యా స్తంభం బిప్పటికిని జూపఱు నకుఁ గన్నులపండువుగఁ గన్పట్టుచుండును.

**మఱికొన్ని శిలా స్తంభములు.**

అశోకుఁడు నిర్మించిన స్తంభములలో నెల్లఁ బైనిజెప్పఁబడిన స్తంభము మిగుల మనోహరముగా నుండును. మఱియు నమూల్యధన మనందగిన సప్తమశిలాశాసనము దీనిపైఁ జెక్కఁబడియుండెను. క్రీ. పూ. 399 సం॥ము మొదలుకొని 15 సం॥లు దేశయాత్రం జేసిన "ఫాహియన్" (Fahien) అను చీనాదేశయాత్రికుఁడు పాటలీపుత్రమందు రెండును, "సంకాశియ" (Sankaseya) యందు నొకటియు నశోకనిర్మితములైన శిలాశాసనంబులు కలవని వ్రాసియుండెను. పిమ్మట వచ్చిన "హ్యూన్‌శియాంగు" అను చీనాదేశయాత్రికుఁడు 7-వ శతాబ్దమందు నీదేశ సంచారంబుచేసి యశోకనిర్మితములని చెప్పఁబడు 16 శిలాస్తంభములను గనుఁగొంటినని వ్రాసెను. వీనిలో రెండు మాత్రము నిర్వివాదముగా దృష్టంబులయినవి. ఎచ్చటననఁగా ఒకటి శాసనము లేనిది "బఖీరా" (Bakhira) యందునను, రెండవది శాసనముకలది రుమిందె (Rummindei) యందునను గనఁబడెను.

**నిగ్లివియా శిలా స్తంభము.**

నిగ్లివియా (Niglivia) అను మఱియొక శిలాస్తంభముకలదు. స్వస్థానమునుండి దీనిని దొలఁగించిరి. కొణకముని స్తూప సామీప్యమునందు "హ్యూన్‌శియాంగు" కు గోచరించినది ఈస్తూపమె యయి

యుండును. పైనుదాహరింపఁబడిన స్తంభద్వయములో నొకదాని శిఖరమందు వృషభంబును రెండవదాని శిఖరమందుఁ జక్రంబును నిర్మించిరి. శ్రావస్తి నగరపరిసరమందున్న ప్రసిద్ధ "జేతవన" (Jetavanu) మఠద్వార ప్రదేశమున నీ స్తంభములు రెండు నున్నవి. ఇవి యిప్పటికిని నేపాళదేశారణ్యమందు భూస్థాపితములై యున్నట్లు విశ్వసింపఁబడుచున్నవి. వీనిని గనుఁగొని కీర్తివహించెడు భాగ్యం బెవనిదయి యుండునో తెలియదు. పాట్నానగరమందును దానిసమీపమునను ద్రవ్యాగా నశోకుఁడు నిర్మించిన స్తంభముల యొక్క శేషములు కనఁబడినవి. చీనాదేశయాత్రికు లానగరమందుఁ గనుగొంటిమని వ్రాసిన రెండు స్తంభములును ఆ శేషములలోనె యుండవచ్చును.

అశోకనిర్మిత నవసంఖ్యా స్తంభములను గుఱించి చీనాయాత్రికులవ్రాఁతలు.

శాసనములను గలిగిన స్తంభములఁ దొమ్మిదింటి నశోకుఁడు నిర్మించినట్లు తెలియవచ్చుచున్నది. కాని చీనాయాత్రికులు "రుమ్మిందే" (Rummindei) "నిగ్లివియా" (Nigliviaa) ల యందున్న శాసన స్తంభములను దప్ప యశోకనిర్మితములయిన కడమ శాసన స్తంభములను గాని శిలాశాసనములను గాని యెంతమాత్రము నుదాహరింపకుండుట వింతగాఁ దోఁచుచున్నది. వారు కనిపెట్టియున్న శిలా స్తంభముల యందున్నట్లు వారు తెలియచేసిన లేఖనము లేమహనీయుని కొఱకొ యవియర్పింపఁబడినవి యని కాని యే మహాత్ముని జ్ఞాపకార్థమొ యవి స్థాపింపఁబడినవి యని కాని సూచించెడు గ్రంథములయి యున్నవి.

శాసన స్తంభముల జాబితా.

గ్రంథావగాహన కుపయోగంబుగనుండునని శాసనములను గల స్తంభముల యొక్క జాబితా యీదిగువ వ్రాయఁబడుచున్నది.

| సంఖ్య. | శాసనము పేరు. | స్థానము. | రిమార్కులు. |
| --- | --- | --- | --- |
| 1 | ఢిల్లితోప్రా. | ఢిల్లీకి దగ్గఱ పాడుపడిన పట్టణమయిన ఫిరోజాబాదు పట్టణములోనున్న "కొతీలా" (Kothila) శిఖరము మీఁద ఫిరోజిషా తొగ్లకు దీనిని అంబాలా జిల్లాలోనున్న "తోప్రానుండి" క్రీ. పు. 1356 సం॥ లో కొతీలాకు తీసికొనిపోయెను. | 1 మొదలు కొని యేడువఱకు శిలాశాసనములు దాదాపుగా సంపూర్ణముగా నున్నవి. ఈ స్తంభ శిఖర మిటీవల ఏర్పఱుపఁబడినది. |
| 2 | ఢిల్లిమీరటు (Meerut.) | ఢిల్లీ యందున్న కొండల వరుసమీఁద ఇంగ్లీషు దొరతనము వారివల్ల 1867 సం॥ లో నిది తిరిగి కట్టఁబడినది. దీనిని బూర్వము క్రీ. త. 1356 సం॥ లో ఫిరోజిషా "మీరటు" Meerut నుండి తీసికొనిపోయి యిప్పుడున్న చోటికి సమీపంబుగఁ దన మృగయామందిర ప్రదేశమందు స్థాపించెను. | 1 మొదలుకొని 6 వఱకు స్తంభశాసనములు భిన్నములుగఁ జేయఁబడినవి. అవి యయిదు ఖండములుగాఁ జేయఁబడి మరలఁగూర్పఁబడినవి. ఈ స్తంభ శిఖరం బగోచరంబుగ నున్నది. |
| 3 | అలహాబాదు. | అలహాబాదు కోటలో ఎల్లింబరోలో సిపాయి లుండు | 1 మొదలుకొని 6 వఱకు శిలాశాసనములు |

| సంఖ్య | శాసనము పేరు. | స్థానము. | రిమార్కులు. |
|---|---|---|---|
| 3 | అలహాబాదు. | సాల (Barracks) దగ్గఱ నున్నది. | ను రాణిశాసనమును కౌశాంబి(Kousambi) శాసనమును నసంపూర్తిగా నున్నవి. శిఖరము నిటీవలఁ గట్టినారు. |
| 4 | లారియా అరరాజ్ (Lawria-Araraj.) | అరరాజ మహాదేవాలయము నకు 1 మైలుదూరమున లారియా గ్రామ మందున్నవి. | 1-6 శిలాశాసనములు పూర్ణముగానే యున్నవి. శిఖరము పోయినది. |
| 5 | లారియానవందగర్ (Lawria Navanda-garh.) | లారియా అను పెద్ద గ్రామము దగ్గఱ, మాదియా (Mathia) కు త్తరమున 3 మైళ్ల దూరమున నున్నది. | డిటో. శిఖరము పూర్తిగా నున్నది. |
| 6 | రాంపర్వా Rampurwa. | పిపారియా (Piparia) అను పెద్ద గ్రామము దగ్గఱ నున్న రాంపర్వా అనుపల్లెలో నున్నది. | డిటో. |
| 7 | సాంచి. | మధ్య హిందూస్థానములోని భూపాల రాజ్యములో నున్న | నేలఁబడి విఱిగి పోయినది. శిఖరము మా |

| సంఖ్య. | శాసనము పేరు. | స్థానము. | రిమార్కులు. |
|---|---|---|---|
| 7 | సాంచి. | సాంచిస్తూపముయొక్క దక్షిణ ద్వారమందున్నది. | త్రమున్నది. |
| 8 | నిగ్లివియా. | బాస్తి (Basti) జిల్లాకుత్తరమున నిగ్లివియా (Niglivia) దగ్గఱ నిగాలి (Nigali) సాగరుయొక్క పడమటి గట్టుమీఁద నున్నది. | రెండు తునకలుగా నున్నది. స్వస్థానమందు లేదు. శిఖరము కనుపడలేను. కొణకమణి స్తూపము నశోకుఁడు దర్శించిన విషయము దీనిమీఁద వ్రాయఁబడినది. కాని పూర్తిగాఁ గనుపడుటలేదు. |
| 9 | రుమ్మిందె (Rummin-dei.) | బాస్థిజిల్లాలో దుల్హా (Dul-ha.) కు నుత్తరమున 6 మైళ్ల దూరమున తారె (Tarai) యందున్న రుమ్మిందేలో నున్నది. | పిడుగుపడి చీలి యసంపూర్తిగా నున్నది. శిఖరములో కొంత భాగము మాత్ర మున్నది. అశోకుఁడు లంజినీవనమును దర్శించిన వృత్తాంతము సంపూర్ణముగా నున్నది. |

అశోకుని కాలమం దేర్పడిన యీశిలాలేఖనము లశోకుని పాలన మిట్టిదని శాశ్వతముగాను విలక్షణముగాను జ్ఞాపకము చేయునవియై యున్నవి. అశోకుఁడు రాజ్యమునకు వచ్చిన పదుమూఁడవ పదునాల్గవ వత్సరములయందుఁ బ్రకటింపఁబడిన పదునాలుగు శిలాశాసనములును శిలలయందుఁ బొడవుగా వ్రాయఁబడియున్నవి. ఈ శాసనములు తఱుచుగా నొకదాని కొకటి పాఠాంతరముగాఁ గన్పట్టుచున్నవి. మఱియును ఈశిలాశాసనము లశోకుని రాజ్యములో యత్యంత దూరప్రదేశములయందు స్థాపింపఁబడినవి.

శాసనము లశోకుని పాలన నిబంధనలఁ దెల్పును.

"షాబాజుగర్హి" (Shahbazgarhi) అను గ్రామము "యూసఫుజాయి" (Yusufzai) దేశములో "పోలూషా" (Polusha) యను పురాతన పట్టణస్థానమందున్నది. ఈగ్రామము "పెషావరు" (Peshawar) పట్టణమునకు నీశాన్యముగా 40 మైళ్లుదూరమునను అశోకుని రాజధానియయిన పాటలీపుత్రమునకు సూటిగా 1000 మైళ్లకంటె నెక్కువ దూరముగాను నుండును. ఈ గ్రామమునకు నాగ్నేయ మూలగానున్న కొండల స్లోపులో 24 అ. పొడవుగాను 10 అడుగుల వెడల్పుగా నుండెడు నొక పెద్దశిలమీద దూర్పుపడమర వైపులయందు ముఖ్యశాసనము చెక్కింపఁబడెను. కొన్నిసంవత్సరములక్రిందటఁ గన్పట్టఁబడిన పంద్రెండవ శిలాశాసనము అనఁగా నన్యమత సహనబోధక శాసనము, పైని జెప్పఁబడిన గ్రామశాసనమునుండి ప్రత్యేకముగా దానికి 50 గజముల దూరమున మరలఁ బ్రకటింపఁబడినది. దీనిమీఁద 14 శాసనములయొక్క మూలగ్రంథము దాదాపుగాఁ

కొన్ని శిలాస్తంభ స్థలములు వానిపైఁగల శాసన విశేషంబులు.

బూర్తిగానుండెను. పంజాబులోనున్న "హజారా" (Hazara) జిల్లాలో "మాన్‌సెరా" (Mansera) యందు శిలాద్వయముమీఁదఁ జెక్కఁబడిన మొదటి పదమూఁడు శాసనములయొక్క మతియొక ప్రతి కనుఁగొనఁబడినది. కాని షాబాజుగర్ శిలాశాసన మందువలె దీనియందు మూలము పూర్తిగా లేదు. పాఠాంతరములుగానున్న

క్షరోష్ఠిలిపిలో వ్రాయఁడిన శాసనములు.

యీ రెండుశాసనములు "క్షరోష్ఠి" అను లిపితో కుడినుండి యెడమకు వ్రాయఁబడియున్నవి. ఈ రెండు శాసనములయందును "పరమతసమాన" శాసనమునకు నెక్కువ ప్రాముఖ్యత యొసంగఁబడినది. ఎట్లనఁగా "మాన్సెరా" శిలాశాసనమందు శిలయొక్క యొకవైపునను "షాబాజుగరు" శిలాశాసనములలోఁ బ్రత్యేక శిలయందున నీశాసనము వ్రాయఁబడియున్నది.

అశోకుని రాజ్యమునకు నుత్తరపు టెల్లయందున్న "కాల్సి" (Kalsi) యందు నీశాసనములయొక్క మూఁడవ పాఠాంతరము కనుఁగొనఁబడియున్నది. ఈశాసన గ్రంథము స్ఫటికపురాతి బండమీఁదఁ జెక్కఁబడినది. ఈశిల 10 అడుగుల యెత్తును 10 అడుగుల పొడవును గలిగి యుండెను.

2 శాసనములు తప్ప కడమవి బ్రాహ్మిలిపిలో వ్రాయఁబడినవి.

దీనిమీఁద శాసనముల మూలగ్రంథము దాదాపుగఁ బూర్తిగానుండి మాన్సెరా శిలాశాసన గ్రంథముతో నేకీభవించుచున్నది. షాబాజుగరు మాన్సెరా శాసనములు తప్ప కడమ శాసనములు బ్రాహ్మియను పేరుఁగల పురాతన లిపిలో లిఖింపఁబడియున్నవి. ఈ బ్రాహ్మిలిపియే దేవనాగరి, తెలుగు, కన్నడము మొదలయిన భాషలకు మాతృకగానున్నది.

పదునాలుగు శాసనములయొక్క రెండు ప్రతులు పడమటితీరమందుఁ ప్రకటింపఁబడియున్నవి. బొంబాయికి నుత్తరముననున్న "తాణా" (Thana, జిల్లాలో "సోపారా" (Sopara) యందుఁ గనఁబడిన శిలాశాసన ఖండములయందు నెనిమిదవ శాసనములోని కొన్నిశబ్దములె గోచరించుచున్నవి. అయిన నచ్చోట శిలాశాసనముయొక్క ప్రతియొకటుండెననుటకు నిది చాలినంత దృష్టాంతమై యున్నది. "సోపార" పట్టణము పూర్వకాలమందు ననేక శతాబ్దముల వఱకుఁ బ్రాముఖ్యతం జెందియుండెను.

"సోపార" శిలాశాసన ఖండములు.

గిరినగరమందున్న శిలాశాసనము ప్రథమమునఁ గనిపెట్టఁబడినది. ఇది "కత్తియవారు" (Kathiawar) పర్యాయ ద్వీపమందు "జూనగర్" (Junagarh)పట్టణమునకుఁ దూర్పున గిరినగర పర్వతములయందున్న నల్లరాతిబండమీదఁ జెక్కఁబడినది.

గిరినగరమందున్న శిలాశాసనము.

అశోకుఁడు రాజ్యాధిపతియయిన తొమ్మిదవవత్సరములో జయించినకళింగ రాజ్యముయొక్క సరిహద్దులలో బంగాళాతీరమందుఁ బైన నుదాహరింపఁబడ్డ శాసనములయొక్క రెండుప్రతులు కనుఁగొనఁబడినవి. బరిస్సాలో కటకపుజిల్లాలో భువనేశ్వరమునకు దక్షిణముగా 4 మైళ్లదూరమున నుండు "ధౌలి" (Dhauli) దగ్గఱ "అశ్వస్థామ" అనుకొండమీఁద నుత్తరపుప్రతి చెక్కఁబడినది. కొండయొక్క పైప్రదేశము 15 అడుగుల పొడవును 10 అడుగుల వెడల్పును గలది. అది నునుపు చేయఁబడి దానిపై శాసన గ్రంథము లిఖింపఁబడియె.

పదునాలుగు శాసన ప్రతులు.

ఉత్తరపు ప్రతి.

దక్షిణప్రతి గంజము జిల్లాలో పురాతన నగరమయిన "జాగద" (Jaugada) లోనున్న నల్లరాతికొండలో

దక్షిణప్రతి.

120 అడుగులయెత్తుగానున్న రాతిబండమీఁదఁ జెక్కఁబడెను. పైశాసనమును నిదియు నొకటి కొకటి ప్రతులుగానె యున్నవి. ఈరెంటిలో 11, 12, 13 శాసనములు లేవు కాని వీనియందుఁ కళింగరాజ్య ప్రాంతమందుండెడి యాటవికజనంబుల నిమిత్తమును, రాజధానికి బాహ్యమందుండు ప్రదేశవాసుల నిమిత్తమును బ్రచురింపఁబడిన విశేషశాసనములు రెండు నున్నవి. కళింగరాజ్య శాసనములయొక్క మూలము లసంపూర్తిగా నున్నది.

పదునాలుగు శాసనము లున్నస్థలములు.

కాబట్టి 14 శిలాశాసనము లించుమించుగా సంపూర్తిగా నీదిగువ సప్తస్థలముల యందున్నవని తోఁచుచున్నవి.

(1) షాబాజుగర్ (Shahbazagrh.)

(2) మాణసిరా (Mansera.)

(3) కాల్సి (Kalsi.)

(4) సోపారా (Sopara.)

(5) గిరినగరము (Girinagarh.)

(6) ధౌలి (Dhauli.)

(7) జాగద (Jaugada.)

శేషించిన పాఠాంతర శాసనములుకూడ దృగ్గోచరములు కాలక్రమంబునఁ గావచ్చును.

నానాపాఠములుగా నుండు నొక స్వల్పశాసనమును బౌద్ధధర్మమును సంగ్రహముగఁ దెల్పుమఱియొక యల్పతర శాసనమును "సిద్దాపుర" (Siddapura) యందున్న

లఘు శాసన ద్వయము.

శాసన ప్రతుల సమూహములో నున్నవి. 14 శిలాశాసనముల వలెనె యీ లఘుశాసనములు రాజ్యమందు వెదచల్లఁ బడియున్నవి. ఎట్లనఁగా రాజపుత్ర స్థానములో "బెయిరాతు" (Bairat) నందు, మధ్యపరగణాల లో "రూపనాథము" (Rupnath) నందు, బంగాళములో సాహస్రమము (Sahasram) నందు, మైసూరులో సిద్ధాపురము (Siddapur) నందు నున్నవి. సిద్ధాపురమునందుఁ గాని దాని సామీప్యమందుఁ గాని మూఁడు ప్రతులున్నవి.

బ్రాబ్రా శాసనము యొక్క విశేషము.

బ్రాబ్రాశాసనము తక్కిన శాసనములంబోలి యుండదు. తగుపాటి ప్రమాణము కలిగి కొంచెమెత్తుగా బూడిదవర్ణముగా నుండు గండశైలము(గుండ్రాయి) మీఁద నీశాసనము చెక్కఁబడినది. ఇది రాజపుత్ర స్థానములలోనున్న బియిరాతు (Bairat) నకు సమీపమునఁ గొండశిఖరము మీఁద 1837 సం|| లోఁ గనుఁగొనఁబడెను. ఇచ్చట నె ప్రథమ లఘుశిలాశాసనము కూడ నున్నది. కలకత్తాలో బంగాళా దేశపు ఆశియాసంఘముయొక్క గదులలో నీగండశైలమున్నది. ఇది బౌద్ధ మతాచార్యుల నుద్దేశించి లిఖింపఁబడిన విశేష శాసనమయి యున్నది.

అలహాబాదు సాంచి (Sanchi) శిలా స్తంభములమీఁద శేషపరిపూర్తి కొఱకుఁ జెక్కఁబడిన శాసనములు విశేషావశ్యకములయిన సంగతులం దెల్పుటలేదు.

అశోకుఁ డాజీవకులకు గుహావాసంబుల నొసంగుట.

బౌద్ధులయొక్క మహాపావనక్షేత్రము లయిన రెంటిని నశోకుఁడు దర్శించెనని నేపాళమందున్న టెరాయి (Tarai) స్తంభశాసన ద్వయము దెల్పుచున్నది. కొండలను దొలిపించి నిర్మించిన గుహావాసములను అజీవకు లనఁబడు జైనమత

సన్యాసులకు నశోకుఁడు దాన మొసంగెనని గయ (Gaya) దగ్గఱనున్న బరాబరు (Barabar) గుహాశాసనములు సంగ్రహముగా నుడువుచున్నవి. ఈగుహావాసములు నల్లరాతిని దొలిచి నిర్మించిరి. మఱియు నమితశ్రమలఁ బడి వీని గోడలను నునుపుఁజేసెరి.

శాసనముల తరగతులు. విదితములగు యశోకుని శాసనములను నవి నిర్మింపఁబడిన కాల క్రమమున నెనిమిది తరగతులుగా విభజింప వచ్చును.

(1) పదునాలుగు శిలాశాసనములు. వీనియందు నేడు పాఠాంతరము లున్నట్టు లిదివఱకె లిఖింపఁబడియున్నది. ఇవి క్రీ. పూ. 257, 256 సం॥ లలో వేయింపఁబడినవి.

(2) ధౌలి, (Dhauli) జగద (Jaugada) యందు రెండు కళింగ శాసనములు. ఇవి క్రీ. పూ. 256 సం॥లోఁ జెక్కింపఁ బడినవి.

(3) లఘు శిలాశాసనములు రెండు. మొదటి దానికి నాలుగు పాఠాంతరములు. రెండవ దానికి మూఁడు ప్రతులు నున్నవి. ఇవి క్రీ. పూ. 232 లేక 231 లో ననఁగా నశోకుఁడు రాజ్యమునకు వచ్చిన 41 సం॥లకు స్థాపింపఁబడినవి.

(4) భాబ్రా (Bhabra) శాసనము. ఇది క్రీ. పూ. 232 లేక 231 లో చెక్కింపఁబడి యుండును. బుద్ధుని సుభాషిత వచనములలో ముఖ్యములయిన యేడు వచనము లీశాసనమువల్ల బోధింపఁబడినవి.

(5) గుహాశాసనములు మూఁడు.

ఇవి బరాబరు అనుచోట క్రీ. పూ. 257 లోను నిర్మింపఁబడినవి.

(6) తెరాయి స్తంభశాసనములు రెండు. ఒకటి నిగ్లివియా (Niglivia) యందునను, రెండవది రుమ్మిండె (Rummindei) యందున నున్నవి. ఇవి క్రీ. పూ. 249 సం॥ లో ప్రచురింపఁబడినవి.

(7) స్తంభశాసన సప్తకము. ఇవి 6 పాఠాంతరములను గలిగి యున్నవి. ఇవి క్రీ. పూ. 249, 242 సం॥లో వేయఁబడినవి.

(8) శేషపరిపూర్తిం జేయు స్తంభశాసనములు: అనఁగా రాణిచే నిర్మింపఁబడిన శాసనమును, అలహాబాదు స్తంభము మీఁదనున్న "కౌశాంబి" (Kousambi) శాసనమును "సాంచి" (Sanchi) స్తంభమందుఁ గొంత మార్పుతోఁ జెక్కఁబడిన కౌశాంబి శాసనమును. ఇవి క్రీ. పూ. 240 లో వేయింపఁ బడినవి.

విశదములైన శాసనసంఖ్య ముప్పది శాసనముల సంఖ్యయు నాల్గని గణింపవచ్చును. పైన నుదాహరింపఁ నుపయోగమును. బడిన వరుస ననుసరించి వ్రాయఁబడు చున్నవి.

| పైసంఖ్య. | శాసనముల సంఖ్య. |
|---|---|
| 1 | 14 |
| 2 | 2 |
| 3 | 2 |
| 4 | 1 |
| 5 | 3 |
| 6 | 2 |
| 7 | 7 |
| 8 | 3 |

ఇట్లశోకుఁడు లోకోపకారకముగా క్రీ. పూ. 257 నుండి 231 వఱకును శాసన నిర్మాణమహోద్యమమందుఁ బూనికఁ గలిగియున్నట్లు గనుపించుచున్నది. ఈశాసనములయందు సత్ప్రవర్తనయు, భూతదయయు సత్యప్రియత్వమును, పరమతసహిష్ణుతయు మొదలయినవి బోధింపఁబడియున్నవి.

ఈశాసనములన్నియు నానావిధప్రాకృత భాషలలో వ్రాయఁబడినవి.

శాసనములయందు వాఁడఁబడినభాష.

ఇవి సంస్కృతమునకుఁ జేరువుగనుండు దేశీయ భాషలైయుండెను. ఇచ్చట నీభాషల విషయమై కొంచి ద్విశదీకరింపఁబడును.

| భాష. | వాడుకొను దేశములు. |
|---|---|
| 1. సంస్కృతము. | స్వర్గలోక ప్రశస్తము. |
| 2. ప్రాకృతము. | మహారాష్ట్రదేశము. |
| 3. ప్రాకృతములోని యంతర్భాగములు. | |
| 1. శౌరసేని. | |
| 2. మాగధి. | |
| 3. పైశాచికము. | |
| పైశాచికము | భోజ, కనోజ, పాండ్య, కేకయ, |
| 4. చూళిక. | సాళ్వ, బాంహ్లిక, అనూప, గాంధార, నేపాళ, కుంతల, సుధేష్ణ. |
| 5. అపభ్రంశము. | ఆభీరదేశము. |
| 6. ఆంధ్రము. | ఆంధ్రదేశము. |

(ఇట్లనియప్పకవీయ మందున్నది.)

శాసనములయం దుపయోగింపఁబడిన భాష యసాధారణముగా గనఁబడుచున్నది. ఇది పాలిభాషతోగాని ప్రాకృత భేదములతోగాని యనుసరించి యుండదు. అనుసరింపని కారణము లీదిగువ వ్రాయఁబడుచున్నవి.

క్రీ. పూ. 3-వ శతాబ్దము నందీ శాసనములను జెక్కుటలో రెండుద్దేశము లప్పటివారియందు నెలకొనెను.

దేశీయవర్ణమాలయు భాషయు సంస్కరింపఁబడుట.

మొదటి యుద్దేశము ప్రకారము భాషాక్షరములు సౌలభ్యము కొఱకుఁ బెంపు జేయఁబడినవి. అక్షరములను మిగుల నందముగాను, క్రమముగాను జెక్కిరి. కాఁబట్టి తత్పూర్వమునకంటె వర్ణసమామ్నాయము హెచ్చు తక్కువలుగాని స్వరలోపముగాని లేకుండఁ బూర్తిగ నుండునటుల నొనర్పఁబడెను. రెండవ యుద్దేశ ప్రకారము లేఖకులుగాని శిల్పులు (శిలలం జెక్కువారు) గాని దేశీయభాషయొక్క యక్షరామ్నాయ మప్పుడెట్లుండెనో యటుల నుంచక యధిక శాస్త్రీయముగా నొనర్చిరి. కాఁబట్టి శాసనముల యందలి యక్షరమాల వలనఁ దద్దేశీయాక్షరమాలను నిరూపించుటకు వలన పడకుండెను. మఱియు భరత ఖండమందు దేశీయభాషలు కాలక్రమమున వాడుకలోనికి వచ్చియుండెను. భాషామాత యగు సంస్కృతము మతాచార్యుల సొత్తుగానుండి విశేష గౌరవనీయముగా నుండుటంబట్టి దేశభాషల లోనికి సంస్కృత భాషాశబ్దంబులఁ గొన్ని మార్పులతోఁ జొప్పించి తమ భాషలకుఁ గొంత గౌరవంబుఁ గలుగఁ జేసితిమని దేశీయు లనుకొనిరి. కాని దీని చేత దేశభాషలు స్వస్వరూపములకును సంస్కృతమునకును మధ్యమస్థితిం బొంది వింత రూపమును ధరించినవి. కావుననవి సంస్కృతము నధికముగ ననుకరించుచుండినచో మిశ్రమ సంస్కృతములనియు, దేశభాష నెక్కువగఁ బోలినయెడల మిశ్రమ దేశభాషలనియుఁ, జెప్పఁబడియె. ఇది యిటుండఁ గాలక్రమంబున సంస్కృతమందలి యధిక గౌరవమును ప్రేమను బట్టి తద్భాషా రూపములే దేశీయ భాషలయం దుపయోగింపఁబడెను. ఇదిగాక దేశభాషలలోఁ గొన్ని శబ్దములకుఁ గల్పిత రూపము లప్పటివార

లేర్పఱచిరి. పైన వ్రాసిన కారణంబులంబట్టి దేశీయభాష త్రివిధంబుగ సంకరంబయ్యె. ఎట్లనఁగా (1) సంస్కృతభాషలోని శబ్దంబులను గొన్నిటిని మార్పులేకుండ వాడుటచేతను, (2) కొన్ని మార్చివాడుటచేతను, (3) దేశభాషయందుఁగాని సంస్కృతమందుఁగాని లేని శబ్దములఁ గొన్నిటిని వాడుట చేతను దేశభాషలు సంకరంబయ్యెను.

శావస్తియందు వాడఁబడు వ్యావహారిక భాష.

మఱియు కోసలరాజ్యమునకు రాజధానియయిన శావస్తియందు వాడఁబడు దేశీయభాష నాధారముఁ జేసికొని వ్యావహారిక భాషయొకటి యేర్పడెను. ఇదియే కోసల రాజకీయోద్యోగులును, వర్తకులును కోసలరాజ్య మందుండిన విద్వాంసులే కాక దూర్పునుండి పడమర వఱకు ననఁగా ఢిల్లీ పట్నమునుండి పాట్నా నగరము వఱకును ఉత్తరమునుండి దక్షిణము వఱకు ననఁగా శావస్తి నగరమునుండి యవంతిపురము పర్యంతమును జనువ నేర్చిన వారందఱును పైనఁ జెప్పిన వ్యావహారిక భాషనే

వ్యావహారిక భాష.

వాడుచుండిరి. ఈ వ్యావహారిక భాషను ముఖ్యముగ నక్కాలపు పరివ్రాజకులు తాము సంస్కృత భాషాప్రవీణులయినను జనసామాన్యముతోఁ బ్రసంగించునపుడుపయోగించిరి. దానినే ప్రజలన్యోన్య సంభాషణలయందును వ్యవహారములయందును వాడుకొనిరి. కావుననా వ్యావహారికభాష సంభాషణ భాషయనికూడఁ జెప్పఁబడెను. పిమ్మటనీ సంభాషణ భాష నాధారముగాఁ గొని మధ్యమోత్తమ హిందూ పాలిభాష (Middle High Indian Pali) యేర్పడెను. ఈభాషనవంతి యందు వాడుకొనిరి.

తరువాత నశోకుని కాలమందు ముఖ్యముగా పాట్నానగరములో వాడుకొనఁబడిన సంభాషణ భాషనే పైనఁ జెప్పినమధ్యమోత్తమ పాలి భాష



అశోకుని కాలమందలి కూలముగాఁకను గొన్ని మార్పులు చేసిరి.

విశేషభాష. బ్రాహ్మణములలోనునుపనిషత్తులలోను ఉండు వైదుకశబ్దములుకూడఁ జేర్పఁబడుట వల్లను, గాంధారదేశము మొదలుకొని మగధదేశము వఱకును వాడుకలోనుండు దేశభాషా శబ్దములను జైన నుదాహరింపఁ బడిన సంభాషణ భాషా శబ్దములను భరతఖండమందు వాడుకలోనున్న మధ్య మోత్తమపాలి (Middle High Indian Pali) భాషా శబ్దములను జేర్చుటవల్లను సంస్కృతభాష బహు విపులమయ్యెను. ఈ చివరఁ జెప్పఁబడిన రెండు భాషలలోని శబ్దములు సంస్కృతభాషా శబ్దరూపముల కనుగుణముగనే మార్పుఁ జేయఁబడెను. ఇట్టి సంస్కృతభాషకనుకూలముగ నవాత మశోకు కాలమందు దేశభాషను గౌరవార్థముగ గొంతవఱకు వికారము నొందించిరి. కాఁబట్టి శాసన గ్రంథము నందలి భాష, పాలి (Pali) భాషతోఁ గాని ప్రాకృతభాషలతోఁ గాని సంస్కృతముతోఁ గాని యనుకూలింప కుండెను.

శాసనములలో ననేకములు మాగధీయ భాషలోఁ వ్రాయఁబడినవి. ఈ భాషయే మగధరాజ్య రాజధానియందు

మాగధీయ భాషలోఁ వాడఁబడుచుండెను. మఱియు శాసనముల

గొన్ని శాసనము లుండుట. గ్రంథ మిచ్చుటనె సిద్ధపఱుపఁ బడెను. బహు దూర ప్రదేశములయిన గిరినగరము, షాబాజు నగరులందుఁ బ్రచురింపఁ బడిన శాసన పాఠాంతరములు రాజకీయ కార్య స్థానములయందుఁ గూర్పఁబడినవి. వీనియందా ప్రదేశవైచిత్య్రము లనేకములు విశదీకరింపఁబడినవి. మధ్యపరగణాలయందునను మైసూరునందు నను బ్రచురింపఁ బడిన శాసనముల భాష గిరినగరమునను దానికిఁ దూర్పున నుండు దేశములయందునను వాడఁబడు భాషలకు మధ్యస్థముగ నున్నది. అశోకుని శాసనములను ననేక పండితులు సమగ్రముగ విచారణచేసిరి.

వారిలో నగ్రగణ్యులు "ఎమిలిసినర్టు" (Emile Senart) డాక్టరు బూలరు (Dr. Bulher) నయి యుండిరి. వీరి విచారణ వలననె పూర్వకాలపు హిందువులయొక్క స్థితులను గుఱించిన శంకలనేకములు నివారితంబు లయినవి.

అశోకుని కాలమందలి శిల్ప విద్యావిశేషములు.

అశోకుని కాలమందు శిల్పవిద్యలు నిస్సందేహముగా మహోన్నత దశయందుండినవి. రాజకీయ శిల్పులు ప్లానులను వేసి దారువుతోను, నిటికలతోను, శిలలతోను విశాలములయి యెత్తుగ నుండు కట్టడములను గట్టుటకును, నేకముగా నుండు బ్రహ్మాండమైన శిలల నుపయోగించునటుల సిద్ధము చేయుటకును, గొప్ప చెఱువు కట్టలను యుక్తములయిన తూములతో నిర్మించుటకును, బహు కఠినములయిన శిలలయం దనుకూలములయిన గదుల నిర్మాణం బొనర్చుటకును సమర్థులయి యుండిరి. విగ్రహాదులను జెక్కు శిల్పకారులు వీరికిఁ దోడ్పాటుగా నుండిరి. ప్రసిద్ధి కెక్కిన కట్టడములయందు ప్రౌఢముగాను, బహ్వాలంకారముగాను జెక్కఁబడిన పనులు మిగుల మనోహరములుగా నున్నవి. శిలలయం దుబ్బెత్తుగఁ జెక్కఁబడు విగ్రహాదులలో ననేక విచిత్రములు గన్పట్టుచున్నవి. జంతు విగ్రహములు నరప్రతిమలు నసంఖ్యాకములుగా నున్నవి. చిత్తరువులు వ్రాయు విద్యకూడ నశోకుని కాలమందుఁ గలదు. కాని శైశవదశయందున్నట్లు గన్పట్టును. అశోకుని యనంతరకాలమున నది వన్నె కెక్కెను. అయినను మౌర్యవంశ పరిపాలన కాలమందలి చిత్తరువుపని యొక్కటియుఁ గానరాదయ్యె.

శిల్పాది విద్యా

శిలలను దొలిచి మలచు శిల్పకృత్యము లక్కాలంబున సంపూర్ణనైపుణ్యముతోఁ జేయఁబడెను. ముప్పది లేక నలువది యడుగుల పొడవుఁ గల్గి కఠినమై

నైపుణ్యము.

బ్రహ్మాండమైన యిసుకరాళ్లను, నల్లరాతియొక్క విశాలమైన పైభాగములను నగలకు మెఱుగుపెట్టినట్లు శిల్పకారులు మెఱుగు పెట్టిరి. శిలలయొక్క మూలలను దూచినట్లు కలిపిరి. పాట్నానగరమందున్న నదులయొక్క నీటి యడుగు బురదలోఁ బూడియున్న కొన్ని స్తంభములను దూలములును దప్ప దారువుతోఁ జేయఁబడిన పనుల మాదిరీలను బిపీలకాదులు తమ పొట్టను బెట్టుకొన్నవి. అయినను దారువు మీదఁ జెక్కఁబడియున్న మాదిరీపనుల వలన నక్కాలంబున వండ్రంగమెంత మనోహరమై, శ్లాఘనీయమయి యుండెనొ తెలియుచున్నది. ఈ సంగతినె ఫిరుగుస్సన్ (Fergussion) పట్టుదలతోఁ బ్రతిపాదించి యుండెను. మౌర్యరాజుల కాలమందును దానికి బహు పూర్వకాలమందును నిర్మితములయిన పూసలును నితరాభరణములును దఱచుగా లభించి యున్నవి.

దారునిర్మిత భవనాదులు.

అవి యీభరత ఖండములోఁ బహుపూర్వకాలము నందె రత్నముల పనివాండ్రును, బంగారు పనివాండ్రును తమ పనులయందు బహు కౌశల్యము కలవారని తెలియఁబఱచుచున్నవి. మఱియు వారిని మించిన పనివాండ్రు లోకమునందే లేరని చరిత్రకారులు నిశ్శంకముగా వచించిరి. రథములు, జీనులు, ఆయుధ సామగ్రులు, సేనల దుస్తులు, నితర దుస్తులు, నేతబట్టలును ఇట్టి వస్తువులను జీవనార్థముగాని విలాసార్థముగాని సిద్ధపఱచుకొనిన వివరమంతయు లిఖిత గ్రంథములయందును శిల్పరచనలయందును గానంబడుచున్నవి.

బంగారు పనివాండ్రు.

క్రీ. పూ. 16, 17 శతాబ్దములయందుఁ బ్రసిద్ధికెక్కిన మొగలాయి చక్రవర్తుల యేలుబడిలో మూర్తిమంత

నాగరిక స్థితియొక్క

యశోన్నత్యము.

మయిన యనఁగా స్పష్టముగఁ గోచరించు నాగరికస్థితికిఁ దుల్యంబుగఁ దత్పూర్వము రెండు వేల వత్సరంబుల కాలమందె యీభరత ఖండము నాగరిక దశయందుండె. మగధ రాజ్యముయొక్కయు, బంగాళా రాజ్యముయొక్కయు ప్రాబల్యమును వస్తుసమృద్ధిని గుఱించి గ్రీకుదేశపు గ్రంథకర్తలు బహు గౌరవంబుగ నుడివిరి.

చదువుటను వ్రాయుటను జనులు నేర్చియుండిరనుట.

వ్రాఁత పూర్వకాలము నుండి వాడుకలోనున్నది. దేవనాగరి లిపికిని నీదేశములో వాడుకగా నుండు ననేకము లయిన యితర లిపులకును తల్లియయి బహు పురాతన లిపిగానుండిన "హీబ్రు" లిపి నుండి వచ్చిన బ్రాహ్మీలిపిలో శాసనము లనేక మార్పులుగా వ్రాయఁబడినవి. కాఁబట్టి ఈబ్రాహ్మీలిపి యనేక శతాబ్దములనుండి వాడుకలో నుండిన ట్లూహింపఁదగియున్నది. "సాంచి" (Sanchi) యందుఁ గనుగొనంబడిన యస్థికల పాత్రలంబట్టి యుక్కాలంబున శిరాతో వ్రాయుట వాడుకగా నున్నట్లు తోఁచుచున్నది. జనులు రాకపోకలఁజేయు బాహాటమయిన మార్గములయందు శిలలమీఁదను, గుండ్రాళ్ల మీఁదను, స్తంభముల మీఁదను అశోక చక్రవర్తి మతోపన్యాసములను చెక్కించుటం జూడఁ దత్కాలమందు జన బాహుళ్యము చదువ నేర్చి యున్నట్లూహింపవచ్చును.

క్రీ. పూ. 8 శతాబ్దముందు వ్రాఁత సంకుచితావస్థలో నుండుట.

ఈపేరాయం దుదాహరింపఁబడిన బ్రాహ్మీలిపిని గుఱించియు, జనులు ప్రాయికముగాఁ జదువ వ్రాయ నేర్చియుండుటను గుఱించియుఁ గొంత దెలిసికొనందగియున్నది. క్రీ. పూ. 8-వ శతాబ్దమునకు ముందు భారతీయులకు వ్రాఁత సామాగ్రు లున్నట్లు కన్పట్టదు. ఒకవేళనున్నను గ్రంథ

ములు వ్రాయుటకు వలసినంతగా నుండక పోవచ్చును. వ్రాత సామగ్రు లనఁగా నాకులు లేక కాగిదములు, కలము లేక గంటము. సిరా పదం పడి బహుకాలమునకు ననఁగా రమారమి 5-వ శతాబ్దకాలమునందు రాజకీయ ప్రకటనల (నోటీసుల) కును ఒకరి కొక రుత్తరములు వ్రాసికొనుటకును వ్రాఁత నుపయోగించిరి. వ్రాఁత వ్రాయుట సాధ్యమయిన పని యనియు దానివలన మర్యాదగా జీవింపవచ్చు ననియు నప్పటివారు తలఁచియే యుండిరి. వ్రాఁతను వారు నేర్చుకొనవచ్చును వీరు నేర్వకూడఁ దను మాట యక్కాలంబున లేనందున సామాన్య జనులు, స్త్రీలు సయితము నేర్చుకొనిరి. వ్రాయుట పిల్లలాడు నాటలలో సుకరపూటగాఁ జేసిరి. ఎట్లనఁగా బయలులో బిల్లల వీపులమీద నక్షరములు వ్రాసి వ్రాసిన దేమిటో చెప్పుమని పిల్లలను వినోదకరముగా నడిగిరి. సామాన్య వ్యవహారముల కొఱకు వ్రాఁత నుపయోగించుకొనిరి. కాని యప్పటివారు గ్రంథములు వ్రాయుటకుఁ దలంపులేని వారైరి. ఇందుకు రెండు కారణములను జరిత్రకారు లూహించిరి. ఎవ్వి యనఁగా (1) గ్రంథములు కంఠతః వల్లించి తమ యధికమయిన జ్ఞాపక శక్తియం దుంచుకొని పారంపర్యముగ వానిని నిల్పుకొనువాడుక భారతీయులకు లేఖనశక్తి యీ దేశమందుఁ బ్రవేశింపక పూర్వమె యుండెను. లేఖనశక్తి ప్రవేశించిన యనంతరమయినను దానిని వారు సేవింపక తమజ్ఞాపకశక్తియె చాలుననుకొనిరి. (2) విపులములయిన గ్రంథములను వ్రాయుట కవసరములయిన సామగ్రుల నెట్లుపయోగింపవలెనో వ్యాఖ్యలుంగ రైరి. ఇంక బ్రాహ్మీలిపిని గుఱించి విచారించెదము.

కారణములు.

బ్రాహ్మీలిపి యీభరతఖండములో నెప్పు డెట్లు ప్రవేశించెను సంపూర్ణముగఁ దెలియకున్న నీక్రింద వ్రాయఁబోవు

బ్రాహ్మీలిపి యీదేశము నది విచారణ వలన నిప్పటికిఁ దేలినదని

లోనికి వచ్చిన విధము. బుద్ధకాలపు హిందేశ చరిత్రయందు వ్రాయఁబడి యున్నది.

(1) నావికా యాత్రికులయిన వర్తకులు భరతఖండము యొక్క వాయవ్యమూలనుంచి యనఁగా మొదట "సౌవీరము" (Sovira) నుండియుఁ బిమ్మట "సుప్పారక" (Supparaka) "భరుకచ్ఛము" (Bharukaccha) ముల నుండియు (ఇవి రేవు పట్టణములు) ననుకూలములయిన ఋతువులలో క్రీ. పూ. ఏడవ శతాబ్ద ప్రారంభమున నైు యొకవేళ నెనిమిదవ శతాబ్దాంతిమ భాగమందో సముద్రయానము చేసి యక్కాలంబున ప్రసిద్ధ వర్తక స్థానమయిన బాబిలోను నగరమునకుఁ బోవువాడుక కలదు.

భారతీయవర్తకులు బాబిలోను నగరమునకు వెళ్లుట.

(2) ఆవర్తకులు విశేషభాగము ద్రావిడులు కాని యార్యులు కారు. వారి స్వభాష యరవము. కాన నిప్పటికిఁ గొన్ని వస్తువుల పేళ్లు సంస్కృతమునుండి కాని పాలి భాషనుండి కాని రాక యరవము నుండియె వచ్చియున్నవి.

ఆవర్తకులార్యులు.

(3) ఆవర్తకులు బాబిలోను నగరమందు వాడఁబడుచున్న లిపిని గార్యావసరములను బట్టి యభ్యసించిరి. ఆలిపి "సిమిటికు" (Semetic) జాతివారికిఁ బూర్వులు స్వయముగఁ గనిపెట్టి వాడుచుండిన లిపినుండివచ్చి యుండెను. ఆపూర్వులను "ఆక్కేడియనులు". (Akkadians) అని యిప్పుడందురు.

బాబిలన్ నగరమందున్న లిపిని నేర్చుకొనుట.

(4) "సిమెటికు" జాతులవల్ల నిర్మింపఁబడిన శాసనములలోను బాబిలన్ నగరపు తూనికరాళ్లమీఁదను ఉన్న యక్షరముల పైని వ్రాసినప్రకార

వర్తకులు నేర్చుకొన్న యక్షరములు బాబిలన్ నగరాక్షరములె యని స్థిరపఱచుట.

మీదేశపు వర్తకులు నేర్చుకొన్న యక్షరములు మిక్కిలిగాఁబోలియున్నవి. ఆశాసనాక్షరములును దూనికరాళ్లమీఁది యక్షరములును భరతఖండవర్తకులు లా దేశమునకు వర్తకముకొఱకు వెళ్లకపూర్వమె లిఖింపఁబడియున్నవి.

ఆలిపిని మార్చుట.

(5) వర్తకులాలిపి నీదేశమునకుఁ దెచ్చిన తరువాత నది క్రమక్రమముగా వృద్ధిచేయఁబడి యీదేశపు విద్వాంసులకును సామాన్యజనులకు ననుకూలమగునట్లుగా నమర్పఁబడినది. ఇట్లమర్పఁబడిన లిపి తదనంతరము దాదాపుగా వేయివత్సరంబులకు బ్రాహ్మిలిపియను పేరితో మహోత్తమమయిన లిపియని ప్రసిద్ధికెక్కెను. ఆమధ్యకాలములో (ననఁగా నశోకుని కాల మనుకొందము.) ఆలిపికేమి పేరుండెనొ తెలియదు. భరతఖండము, బర్మా, సయాం, సింహళము, నీదేశములలో వ్రాయఁబడు లిపులా బ్రాహ్మిలిపినుండి యుద్భవమయినవె.

బాబిలన్ నగరమం దక్కాలపు వ్రాఁత సామగ్రులు.

(6) మఱియు నాకాలపు వ్రాఁతసామగ్రులను గూర్చి కొంతవిచారింపవలసి యున్నది. బాబిలన్ నగరమం దప్పుడు బంకమట్టి బిళ్లలమీఁద నక్షరంబులు వ్రాసిరి. భరతఖండమందుఁ గొండరావిచెట్టు పట్టల మీఁదను,నాకులమీఁదను గంటముతో వ్రాసిరి. సిరాయక్కాలంబున వాడుకలో లేదు. కాని చెట్టుపట్టలు కాని యాకులు కాని, పెళుసుగా నుండుటచేఁ బగిలిపోవుటయొ లేక మఱియేకారణముచే నయిన నశించుటయొ కలుగుచుండెను.

తర్వాత బహుకాలమునకుఁ జెట్లయొక్క పెద్దపట్టలను గాని, తాళపత్రములను గాని వ్రాఁతకుపయోగించిన యెడల నవి పగిలి పోవని కనిపెట్టిరి. వానిమీఁద నినుపగంటముతో నక్కరములు వ్రాసిరి కాని యవి కాలక్రమమున గనుపింపమిచే వానిపై మసిపూసినయెడలఁ గన్పట్టుటను బిమ్మట బహుకాలమునకుఁ దెలిసికొనిరి.

తాళపత్రములపై వ్రాయుట.

ఇట్లు దీర్ఘకాలంబువఱకు వ్రాఁత సామాగ్రులఁ గనుంగొనలేను. వ్రాఁత పనిముట్లు యవసర మప్పటి బ్రాహ్మణులకు లేనందుననె వార ట్లపేక్షించియుండిరని యూహింపఁదగి యున్నది. వేదమంత్రముల నధ్యయనము చేసి వానిని జిరకాలము జ్ఞాపకమునందుంచుకొని శిష్యపరంపరకు నధ్యాపన మొనరించు శక్తి వారికి మెండుగ నుండుటచే వ్రాఁత వారి కీవిషయమునందు నవసరమయ్యెనని గ్రహింపఁదగి యున్నది. మఱియు వేదమంత్రములను లిఖితంబులఁజేసిన యెడల బ్రాహ్మణేతరులు గ్రహించుటసంభవించి వాని రహస్యంబునకు, వాని ప్రభావమునకును హానికలుగుననియు వారియభిప్రాయమై యుండవచ్చును.

(8) చెట్లయొక్క పట్టలమీఁదను తాళపత్రముల మీఁదను లేఖన మొనర్చిరని పైన లిఖించియుంటిమి కదా అట్టి లేఖనము బౌద్ధులకాలమందే యారంభమయి యుండెను. మఱియు శిలలమీఁదఁ గాని, లోహముల మీఁదఁ గాని చెక్కఁబడిన ప్రప్రథమలిఖిత గ్రంథములకుం గర్తలు బౌద్ధులె. తమ మత గ్రంథములను లిఖితరూపంబుగ నుంచిన వారును బౌద్ధులె. ఇట్లు లిఖింపఁబడిన ప్రథమ మతగ్రంథము బ్రహ్మాండమైన వాశిష్ఠధర్మసూత్రముగాఁ గన్పట్టుచున్నది. ఇది యిటీవల నేర్పడిన

తాళపత్రాదులమీద లిఖించుచుట బౌద్ధ కాలమందె యని నిరూపించుట.

ధర్మశాస్త్రము. దీని యందు బౌద్ధమతగ్రంథ ప్రశంసల మితంబుగ నుదాహరింపఁబడి యున్నవి.

పై పేరాలో వ్రాయఁబడిన దానింబట్టి యీభరతఖండములో బౌద్ధుల కాలమందును నిటీవలను లిఖిత గ్రంథము లేర్పడినట్లును దత్పూర్వమందు లేనట్లును దెలియఁ బడుచున్నది. ఈదిగువ కారణము లచే నటులఁ దలఁచుటకు వలను పడదు.

బౌద్ధకాలములోనే యనుటను ఖండించుట.

(1) వేదాంగము లయిన శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పసూత్రములు సూత్రయుగ మనగా క్రీ. పూ. 1000, 500 సం॥ల కాలములో నేర్పడినట్లును రామాయణ భారత గ్రంథములు క్షాత్ర యుగము (క్రీ. పూ. 14000, 1000) యొక్క చివర భాగమందు రచింపఁ బడినట్లును మఱియు నీయుగమందె జ్యోతిషము కొంతవఱకు వృద్ధి చేయఁ బడినట్లు "హిందూకథా సంగ్రహ" గ్రంథమందు లిఖింపఁబడి యున్నది.

(2) పై గ్రంథములు బహు విపులములయి యుండుటంబట్టి యిదివఱలో వ్రాసియున్న ప్రకార మప్పటివారు కంఠతః వానిని పల్లించి జ్ఞాపకమం దుంచుకొని రనుట దురూహ్యముగనున్నది. కాఁబట్టి యాగ్రంథములు లిఖింపఁ బడియె యుండవలెను.

అందువలన బౌద్ధకాలమునుండియె లిఖితగ్రంథము లుండెనను వచనమును మఱియొక రీతిగ యన్వయింపందగియున్నది. ఏమనిన నప్పటి యార్యులు తమ వేదగ్రంథము నె లిఖితరూపంబుగ నుంచలేదని చెప్పవచ్చును. బౌద్ధులకుఁ బూర్వమెయార్యులకు లిఖితగ్రంథము లుండెననియు గ్రహింపందగియున్నది.

బౌద్ధమత గ్రంథమునుండి తనకు మిక్కిలి యానందకరములని సప్తభాగములను బ్రత్యేకంబుగ నేర్పర్చుకొనెను. దీనిం బట్టిచూడ నక్కాలంబున మతగ్రంథ బాహు

మతగ్రంథ సంగ్రహము.

శ్యమునుండి యధిక ముఖ్యాంశములను సంగ్రహించి వ్రాసిపెట్టికొని యుండిరనియుఁ గన్పట్టుచున్నది. ఏలయనఁగా బౌద్ధ మతగ్రంథము విశేషముగా వచన రూపముగా నుండుటచే కేవలజ్ఞాపకమునె యాధారము చేసికొని యాగ్రంథములను జనులు చదువులేకపోవచ్చును.

భరతఖండ వాసుల కింతమహత్తగమయిన నాగరికదశ యెట్లు కలిగెనో

**భరత ఖండవాసుల యధిక నాగరికతకుఁ గారణము.**

తెలిసికొనుటకు చరిత్రాధారమెంత మాత్రమును జాలియుండలేదు. కొన్ని నాణ్యములను బోధించు గ్రంథములును, పిప్రావా (Piprava) స్తూపమునందున్న యస్థికల పాత్రమందున్న యర్పణ లేఖనమును నింక నితరములైన రెండుమూడు సంగ్రహములయిన గ్రంథములును దప్ప యీ భరత ఖండమందున్న శాసనములలోఁ బ్రప్రథమ శాసనము లశోకనిర్మితములె యయియున్నవి. ఈ శాసనములయందున్న లిపి "హీబ్రు" లిపితోనెట్లు పోలియుండెను తెలిసికొనుటకుఁ దగు గ్రంథ సామగ్రి యభావంబుగా నుండె "మెసపొటేమియా" (Mesapotamia) నుండి బ్రాహ్మిలిపి యీభరత ఖండమునా క్రీ. పూ. 800 సంll కాలములోఁ బ్రవేశమొందినట్లు బూలరు (Bhuler) సరిగానె వ్రాసియుండిరి.

క్షరోష్ఠి లిపి కుడినుండి యెడమకు వ్రాయఁబడును. ఈ లిపిలోనె

**క్షరోష్ఠిలిపితో గొన్ని శాసనములు వ్రాయఁబడి యుండుటకు కారణము.**

"షాబాజుగర్హి" (Shabazgarhi) "మాన్‌సిరా" (Mansera) శిలాశాసనములీ లిపిలోనే వ్రాయఁబడినవి. ఈలిపి సిరియా లిపిని బోలియుండి క్రీ. పూ. 500 సంll లకు "హిస్టాస్పసు" (Hystaspus) కుమారుఁడైన "డెరయసు" వలన జయింపఁబడిన తరువాత నీదేశపు వాయువ్య



మూలప్రదేశములలోనికిఁ బ్రవేశించెను. మహా అలెగ్జాండరు దండెత్తివచ్చు వఱకు పారశీక పరిపాలన క్రింద నాప్రదేశము లుండెను.

పారశీక దేశ నాగరిత నీదేశస్థు లనుసరించి రనుటకు దృష్టాంతములు.

పారశీక రాజ్యమునుబట్టి యీదేశస్థులయొక్క యద్భుత వేషభాషా కల్పనలు హిందువుల (భరతఖండ వాసుల) మనంబుల నాటుకొన్నట్లు హిందువుల నాగరికత విశేషములలో ననేకములు తార్కాణంబుగ నున్నవి. వాయవ్య మూలయందున్న శిలాశాసనములు పారశీక లేఖకులయొక్క లిపితోఁ జెక్కింపఁబడుట యేకాక లేఖనము అనుశబ్దమున కాదేశీయ శబ్దమె వాడఁబడెను. మఱియు "ప్రియదర్శి ప్రభువిట్లు నుడువుచున్నాడు" అను రాజకీయ గౌరవశైలితో నశోకుని శాసనము లారంభింపఁబడి యున్నవి. ఆశైలికేవలము పారశీక రాజశైలిగానున్నది అశోకునిచే జ్ఞాపకార్థము విడిగా నిర్మింపఁబడిన యేక శిలాస్తంభములును ధర్మోపదేశముల నిమిత్తము స్థాపింపఁబడిన స్తంభములును స్పష్టముగా పారశీక శిల్పితనము నే ప్రతి పాదించుచున్నవి ఎట్లనఁగా పునాసులు, శిఖరములు, శిఖరములపైని జంతువులు, మొదలయిన పని విశేషములన్నియు పారశీక రాజ్యమునుండి గ్రహింపఁబడినవే. పైనఁజెప్పఁబడిన స్తంభములలో ననేక స్తంభముల మీఁద నుబ్బెత్తుగఁ జెక్కఁబడిన విగ్రహములున్నవి. ఇవియు పారశీక దేశీయములె.

అస్సిరియానుండియు గ్రీసునుండియుఁ గొన్ని చిత్తరువు పనులు గ్రహింపఁబడినవి.

ఇట్లుండఁ బక్షంబులం గల సింగంబులును ఇంక శిల్పికృత్యములయిన యనేకాలంకారములును "అశ్శిరియా" Assyria దేశమునుండి గ్రహింపఁబడినవి. అశోకుఁడు నిర్మింపఁజేసిన శిఖరములలోఁ గొన్నిటి యందుఁ గన్పట్టు పూలచెట్లును, ఆకులును,

బూసలును ఇట్టి యలంకారములును, గ్రీసుదేశపు పనులంజూచి గ్రహింపఁబడినవిగా నుండవచ్చును.

దారువులకు మాఱుగ శిలాదులతో శిల్పపుపనులు.

క్రీ. పూ. 5, 6 శతాబ్దములయందుండిన భరతఖండ స్థితిని వర్ణించెడు బౌద్ధయుగపు చిత్రకథలవల్ల నప్పటి శిల్పపుపని దారువులమీఁదనె చూపఁబడినట్లు కన్పట్టుచున్నది. దారువులతోఁ జేయఁబడిన శిల్పపు పనులకుఁ బ్రతిగా నిటికలతోను, శిలలతోను అశోకుని కాలమందా పనులు కావింపఁబడినవి. శిల్పపు పనుల యందీ మార్పు నశోక చక్రవర్తియే వెలయింపఁ జేసెనని నుడువవచ్చును. మౌర్యరాజ్య స్థాపకుఁడైన చంద్రగుప్త మహారాజు తన రాజధానియైన పాటలీపుత్రమునకుఁ జుట్టును దారువుతో గోడను గట్టించి తృప్తింజెంది యుండఁగా నశోక చక్రవర్తి దానిస్థానమందు రాతిగోడను నిర్మింపఁజేసెనని యొక పురాతన వృత్తాంతమును హ్యూయాన్‌శియాంగు లిఖించియుండెను. కొయ్యకు మాఱుగా రాతిని నుపయోగించినందునకు నదియొకటియె సాక్ష్యముగా నున్నప్పటికిఁ గొన్ని స్తూపములు తప్ప అశోకునకుఁ బూర్వము రాతిపనులే లేనందున దారుస్థానమందు శిలల నుపయోగించుట యశోకుని కాలమునుండి సాధారణముగా జరుగుచుండెననుట కిది సూచకముగనున్నది. పవిత్ర గోపురశిఖరముగల యొక స్తూపము పెద్దమట్టి దిబ్బమీదఁ గట్టఁబడినది. ఇది యొకటి తప్ప మౌర్యులకాలమందు దారువుతోనె తఱచుగ శిల్పకృత్యము లొనరింపఁబడినవి. మఱియు నాస్తూపముల కంచెలును, ఆకంచెలయొక్క ద్వారములును, గొయ్యపనుల మాదిరిగానె కట్టఁబడినవి. కాఁబట్టియశోకునికిఁ బూర్వము దారువుతోనె కట్టడములు నిర్మింపఁబడినవనిపలుకవచ్చును.

దారువుతోఁ జేయఁబడిన శిల్పపు పనుల మాదిరిగా శిలలతోఁ జేయవలెనని యశోకుని కాలమందు యత్నించిరికాని మిక్కిలి నాణెమయిన కట్టడ

శిలాశిల్ప ముద్భుతమైనను విన్నాణగ లేదు.

ములం జూచినయెడల బనియెంత యద్భుతముగ నుండినను నుద్దేశ్యము (ప్లాను) నకుఁదగినట్లు పని తనముండినదని నుడువుటకు వలనుపడదు. రాతి కట్టడములయొక్క పురోభాగములయందు నుబ్బెత్తుగనుండు విగ్రహములు చెక్కఁబడియుండెను. ఇవి దారువుతోఁ జెక్కఁబడు పనుల మాదిరిగానె యుండెను. మఱియు సౌధములయొక్క పురోంగణములను, నితర కట్టడములయొక్క ముఖభాగములను నిర్మించుటయందు నిక్కాలంబు నందుంబలె తత్కాలంబునను విశేషముగా దారువునె వాడుచుండిరి.

శిల్పవిద్యానైపుణ్యమును నిరూపించుటకుఁగల యాటంకములు.

తత్కాలమందలి భరతఖండ శిల్పులయొక్క విద్యాప్రావీణ్యము గ్రీకుదేశస్థులయొక్క మహానైపుణ్యము ననుకరింపఁజాలకున్నను అల్పముగా నుండెననుటకు నెంతమాత్రమును ధర్మము కాదు. నశింపకాఁగా శేషించియున్న నరవిగ్రహములు భిన్నములయి యున్నవి. వానిం గూర్చి వ్రాయఁబడిన వివరణాంశముల సంపూర్తిగా నున్నవి. ఇక్కతంబునఁ దత్కాల శిల్పకర్మ విశేషంబులను బ్రావీణ్యంబును ఇట్టిదియని ఖండితంబుగఁ బల్క సాహసింపఁ జాలకుంటి మని చరిత్రకారులు వ్రాసిరి.

గణనీయములయిన శిల్పపుపనులు.

బఖీరియా (Bakhiria), లారియా నందనగర్ (Lauria Nandan-garh) అను శిలాస్తంభములపై శిఖరములుగ నున్న సింహ విగ్రహములు కొంచెము మోటుగా నున్నను మెచ్చఁదగిన పనులయి యున్నవి. వాని పాదములు కేవలము నిజసింహపాదములం బురణించును. గజవిగ్రహముల నిర్మించుటయందు భరతఖండవాసు లాదికాలమునుండి నేటివఱకును ప్రవీణులయి యున్నారుగాన

నకొక్కలపు విగ్రహములును బహుశ్లాఘనీయములుగా నున్నవి. అశోకుని శాసనములలో నొకటి "ధౌలి" (Drauli) కొండయం దున్నది. ఈ కొండను తొలిచి గజవిగ్రహముయొక్క ముందు భాగమును జెక్కిరి. ఇది చూచుటకు మిగుల రమణీయముగా నుండును. మఱియు బుద్ధుని చిహ్నముగా దీనిని జెక్కిరి. మత్స్యకన్యలను (ఈ విగ్రహముల కధోభాగము మత్స్యాకృతిగను నూర్ధ్వభాగము నరాకృతిగ నుండును.) నింకననేక కల్పిత జంతువులను శిలలపైనఁగాని దారువులపైనఁగాని జెక్కుటయందు భారతీయ శిల్పులు తమ బుద్ధిచాతుర్యమును బ్రకటించినను వర్ణింపఁబడిన వస్తువుల యొక్క విగ్రహములను నిర్మించుటకు యత్నించిన వారుకారైరి. శిలోపరి భాగములయం దుబ్బెత్తుగఁ జెక్కఁబడిన విగ్రహములు జీవప్రతిమలుగాను సాక్షాజ్జంతువులుగానె యిప్పటికిని గన్పట్టుచున్నవి. చిత్రప్రతిమోపేతములైన రంగములు తద్వస్తువు లెదురఁ లేకున్నను దద్వృత్తాంత బోధకములై యున్నవి. ప్రతిమలలో ననేకములు జీవవంతములుగాఁ గన్పట్టును. కాని యా చిత్తరువులలో జంతువుల కండపుష్టి చాలినంతగాఁ గనుపడదు.

బుద్ధునియొక్క ప్రతిమ అశోకుని కాలమందు లేవు కనుకనే యా ప్రభువు చేయించిన చిత్తరువు పనులయందు బుద్ధుని విగ్రహములు లేవు.

శిల్పాదివిద్యావిశేషముల గూర్చి చరిత్రకారుల యభిప్రాయము.

అశోక చక్రవర్తి చేయించిన యలంకారపుపను లాయన యనంతర మనేక శతాబ్దములవఱకు బౌద్ధులును, జైనులును జేయించిన పనులతోఁ బ్రాయికముగాఁ బోలియుండెను. అశోకుని కాలమునుండిఁ జిత్తరువు పనుల ననేక మాదిరులుగాఁ గల్పనఁ జేసిరి. అట్టి పనులలో ఫలాకారములుగాను, బుష్పాకారములుగాను జేయఁబడినవి యధిక సుందరములుగాను, మనోహరములుగానున్నవి. పైన వ్రాసిన విధంబుగ నశోకచరిత్రకారుఁడు వ్రాసెను.

**అశోకుని బుద్ధివైభవము.** ఈభరతఖండ వాసుల విశేష శిల్పవిద్యా ప్రావీణ్యమునకుం దోడుగ విదేశములనుండి యద్భుతపు పనులమాదిరులు సహితము అశోకుఁడు తెప్పించి యీదేశమంతయు వెలయింపఁజేసి తద్విద్యాభివృద్ధిని జిత్రవిచిత్రపు పనులవల్లఁ బ్రజలకు నయనోత్సవంబును గావించె. ఇట్టి మహత్కార్యంబు లొనరించినప్పుడు పేదల కెందఱకు జీవనోపాయంబు గలిగెనో శిల్పకారుల కెంత యుత్సాహంబు వాటిల్లెనో వేఱ వచింపనేల. ఇవి యిటుండ నొకచెంప విపుల రాజ్య పరిపాలనంబును, ఒకదెస ధర్మోపదేశంబులును, ఒకత్రోవ జన సౌఖ్య విచారణయు, నొక తట్టునఁ బశురక్షణంబును, యథాక్రమంబుగను నిరాటంకంబుగను బచరింపుచు పైనుడివిన విధంబుగ శిల్పవిద్యావ్యాప్తియం దంతగ నశోకుఁడు తన బుద్ధి వినియోగించె. ఈకారణంబులచే నశోకుని బుద్ధివైభవం బనన్యసామాన్యమైనదనియు నశోకుండు భరతఖండవాసుల దృష్టి యందవతార పురుషుఁడుగ నుండదగియె ననియు మిక్కిలి వక్కాణింపవచ్చును.

శా. ఆచంద్రార్కముగా వెలుంగ ధర బ్రహ్మాండంబులౌ ఱాలపైఁ
బ్రాచుర్యంబుగ శాసనంబులను శుంభద్వృత్తిఁ జెక్కించి యెం
తో చిత్రంబుగ శిల్పకృత్యములఁ దా స్తూపంబులం జూపె శి
ల్పాచార్యుండో యశోకుఁడంచు విబుధుల్భావింప నెక్కాలమున్.

# 9-వ అధ్యాయము.

## అశోకనిర్మితశిలాశాసనములు.



శిలాశాసనములయొక్క నిర్మాణమునకుఁ బ్రథమకర్త యశోకుండని గతంబున లిఖింపఁబడియుండె. ఆశిలాశాసనంబులె యశోకచరిత్రం దెలుపుటకుఁ బ్రబలసాక్ష్యంబు లగుటంజేసి గతాధ్యాయములయందు వానిలోనియరశంబులు వలసినంతవట్టు విమర్శింపఁబడియె. ప్రతిశాసనముఖంబున నశోకుఁడు ప్రకటించిన ధర్మవచనంబు లసమగ్రంబుగ విశదీకరించినచో నామహాత్ముని ధర్మాచరణప్రచారణంబులను జదువరులు స్పష్టంబుగ నెఱిఁగి సంతుష్టిఁ జెందుదురని యీక్రింద ననుక్రమణికగ నాంధ్రీకరింపఁబడుచున్నవి.

(1) పదునాలుగు శిలాశాసనంబులు అశోకుఁడు ప్రభుత్వమునకు వచ్చిన 13, 14-వ వత్సరంబులలోఁ బ్రచురింపఁబడియె.

### ప్రథమ శిలాశాసనము.

#### జీవపావనత్వమును గుఱించి.

పావనుఁడై ఘనతవహించిన ప్రియదర్శిప్రభువు నాజ్ఞానుసారముగ నీ పవిత్రశాసనము ప్రకటింపఁబడుచున్నది. ఇక్కడ ఈరాజధానియందు(పాటలీపుత్రమున), జాతరలయందు బలులకొఱకు నేజంతువునయినను వధింపఁగూడదు. సాంఘికోత్సవములం జేయఁగూడదు. ఏల యన్నఁగా నట్టియుత్సవములందు ననేకదుష్కృత్యములను జేయుటను ప్రియదర్శిప్రభువు స్వాయముగాఁ గనుఁగొనియున్నాఁడు. ఆదుష్కృత్యములు లేనియెడలఁ గొన్నియుత్సవములు ప్రభుదృష్టియందు యోగ్యతరములుగానే యుండఁగలవు.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభువుయొక్క పాకశాలయందుఁ బూర్వము ప్రతిదినంబున ననేకజంతువులు వ్యంజనంబు (కూర) కొఱకుఁ జంపఁబడుచుండెను.

ఈపవిత్రశాసనము లిఖింపఁబడుకాలమందు నీనిమిత్తమున రెండునెమళ్లును, నొకజింకయు నీమూఁడుజంతువులు మాత్రమె జంపఁబడుచున్నవి. జింకను మాత్ర మవశ్యముగాఁ జంపుట లేదు.

ఇఁకమీఁదట నీమూఁడుజంతువులు సహితము వధింపఁబడవు.

## ద్వితీయ శాసనము.

### మనుష్యులయొక్కయు, జంతువులయొక్కయు సౌఖ్యమును గుఱించి భవిష్యన్నిబంధనలు.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభువుయొక్క రాజ్యమం దన్నిచోట్లను * చోళ, పాండ్య, సత్యపుత్ర, కేరళపుత్ర, యీప్రాంతరాజ్యములయందును, సింహళమునందును, గ్రీకుదేశపుప్రభు వయిన "† అంటియోకసు" Antiochus యొక్క రాజ్యమునందును, ఆరాజునకు లోఁబడియున్న యితరరాజుల యొక్క రాజ్యములయందును, అన్నిచోట్లను ఘనతవహించిన ప్రియదర్శిప్రభువుయొక్క యభిప్రాయప్రకారము రెండువిధము లయిన చికిత్సలు చేయఁబడుచున్నవి. ఒకవిధపుచికిత్స మనుష్యులకును, రెండవవిధపుచికిత్స

* చోళరాజ్యమునకు రాజధాని :— ఉరయూరు (Uraiyur) తిరుచనాపల్లిదగ్గఱ నుండెను.

పాండ్యరాజ్యమునకు రాజధాని :— మధుర.

కేరళరాజ్యము :— ఇది మలబారు తీరమున నుండెను.

సత్యపుత్రరాజ్యము :— ఎక్కడనుండెనొ తెలియదు.

† అంటి యోకసుప్రభువునకు లోఁబడిన ప్రభువు లెవరో తెలియ లేదు.

మృగములకును, మనుష్యునియొక్కయు, మృగముయొక్కయు చికిత్సలకుం దగినయౌషధులు లేనిచోట్లకు వానిని దెప్పించి నాటఁబడినవి.

ఈవిధముగానె లేనితావులకు వేళ్లను, బండ్లను దెప్పించి నాటించుట జరిగినది.

రాజబాటలయందు మనుష్యునకును మృగమునకు నుపయోగార్థము చెట్లను వేసి బావులను ద్రవ్వించుట కలిగినది.

## మూఁడవ శిలాశాసనము.

5 సం॥ల కొకసారి సభగూడుటను గుఱించి.

ఘనత వహించిన ప్రియదర్శిప్రభు విట్లు విధించుచున్నాఁడు. నేను పరిపాలనకు వచ్చినపదమూఁడవ వత్సరంబునం దీయాజ్ఞను జేయుచున్నాను. నారాజ్యమందు విధేయు లయిననాగరికజనులు, కమిషనర్లు (రాజకీయమైనయేపనినైనఁ జేయుటకు నియమింపఁబడినవారు.) జిల్లాయధికారులు నయిదుసంవత్సరంబుల కొకసారి మహాసభకు నేతెంచి యితరపనికిఁ దోడుగ బుద్ధధర్మమును ముఖ్యముగాఁ బ్రకటింపవలెను. ఆధర్మ మేమనగ :—జననీజనకులయెడల విధేయతఁ గలిగియుండుట యోగ్యమయియుండును. స్నేహితులు, పరిచయులు, బంధువులు, బ్రాహ్మణులు, యోగులు నిట్టివారియెడల నౌదార్యముగా నుండుట యుచిత మగుపనిగా నుండును. అమితవ్యయమును బరుషభాషణమును మానుట యోగ్యమయియుండును.

ఈధర్మమును మతాచార్యులు నాగరిక జనమునకుఁ గూలంకషముగ బోధింపవలెను.

## నాల్గవ శిలాశాసనము.

బౌద్ధధర్మాచరణము.

బహుకాలమునుండి (యనేకశతవత్సరములనుండి) జీవజంతువుల వధించుటయు, వానిని హింసించుటయు బంధువుల నగౌరవము చేయుటయు,

బ్రాహ్మణులను, భిక్షువులను సన్మానింపకుండుటయు నిట్టి దుర్నయములు ప్రబలుచున్నవి. కాని యిప్పుడు ఘనత వహించినప్రియదర్శి ప్రభువు బౌద్ధధర్మము నాచరించుటవలన రణభేరిధ్వనికి మాఱుగ ధర్మభేరీధ్వని కర్ణతాడిత మగుచున్నది. మఱియు స్వర్గమును జూపుసులోచనములో యనందగు నుత్సవరథములు, గజములు, దీపారాధనలు మొదలయినవి ప్రజలకు నయనోత్సవంబుగఁ జూపింపఁబడుచున్నవి.*

---

* ఇచ్చట బౌద్ధమతబోధ భేరీధ్వనితోఁ బోల్పఁబడినది. ఆబోధకాలమందు మహత్తరము లయినయుత్సవంబులు, నాచారంబులు నొనర్పఁబడును. ఇవి స్వర్గప్రదర్శక సులోచనములుగ వర్ణింపఁబడినవి. ఈమతబోధలేనికాలమందు నీయుత్సవాదులకు మాఱుగ, రణాడంబరము లొనర్పఁబడుచుండెను. పాటలీపుత్రమందుజరిగిన గొప్పబౌద్ధోత్సవమిట్లు వర్ణింపఁబడినది.

“ప్రతిసంవత్సరమందును నెనిమిదవమాసమున విగ్రహముల నుత్సవము చేయుదురు. వారు నాలుగుచక్రముల రథము కట్టి దానిమీఁద బొంగులతో నయిదంతస్థు లేర్పఱచెదరు. ఈయంతస్థుల కొక స్తంభ మాధారముగా నుండును. దానిని రాజస్తంభ మందురు దానికి నేటవాలుగఁ గొన్నిగడలును, ఈటెలును గట్టఁబడును. ఈరథ మిరువదిమూర లెత్తుగా నొక తోపుం బోలియుండునుఁ దీనిచుట్టును దెల్లపట్టువస్త్రముఁ గట్టి దానిపైఁ జిత్రవిచిత్రము లయినరంగులు వేయుదురు.

వెండి బంగారములను బొదిగిన వైడూర్యములతో దేవతా విగ్రహములను జేసి వానిపైఁ బట్టు ధ్వజములను, వితానములను నమర్చెదరు నాలుగు వైపుల గూళ్లను గట్టి ప్రతిగూటియందును బుద్ధుని విగ్రహమును ఆయన శిష్యుని విగ్రహమును నెలకొల్పెదరు”.

ఇట్లు గొప్ప వయి భ్రమింపంజేయు నరదంబు లిరువది యుండును కాని యొకదానిని బోలి మఱియొకటి యుండదు. ఉత్సవపు దినమునకుఁ

కడచినయనేక శతాబ్దములనుండి సంభవింపకున్నను ఘనతవహించిన ప్రియదర్శిప్రభువు బుద్ధధర్మమును ప్రకటించుటవల్ల నిక్కాలంబున జీవజంతువులను వధించుట మానివేయఁబడినది. వానిని హింసించుటయు నాటంకపఱుపఁబడినది. బంధువులను గౌరవించుటయు, బ్రాహ్మణులను, భిక్షువులను సన్మానించుటయుఁ, దల్లిదండ్రులకు విధేయులుగా నుండుటయు, పెద్దల కణకువగా నుండుటయు నభివృద్ధి యగుచున్నవి. ఇట్లు బహువిధములుగ ధర్మాచరణము వృద్ధియగుచున్నది. ఘనతవహించిన ప్రియదర్శిప్రభువాధర్మాచరణము నింకయు వృద్ధిచేయును.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభువుయొక్క పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రులును బహుకాలమువఱకీధర్మాచరణమునె వృద్ధిచేయవలెను. వారు భక్తియు, నీతియుఁ గలవారలై బౌద్ధధర్మమును బ్రకటింపవలెను. ఏలయనఁగా నట్టిప్రకటన సమస్తకార్యములలోఁ బ్రశస్తమయియున్నది. తద్ధర్మాచరణంబునకు దుర్మార్గుఁడర్హుఁడు కాఁడు.

ఈధర్మప్రకటనయందును, నాచరణమందును అభివృద్ధి మంచిది. క్షీణము మేలు కాదు.

---

ప్రాంతవాసులైనప్రజలు భిక్షువులు నందఱు వచ్చెదరు. గాత్రపు పాటకులును, జంత్రపుపాటకులు నుందురు. భక్తితో విగ్రహములమీఁదఁ బువ్వులు చల్లి ధూపములు వేయుదురు. పట్టణములోఁ బ్రవేశించుటకు బ్రాహ్మణులు వచ్చి బౌద్ధుల నాహ్వానము చేయుదురు. బౌద్ధులు సక్రమముగఁ బట్టణంబునం బ్రవేశించి రెండు రాత్రంబు లం నుండెదరు. రాత్రియంతయుఁ దీపంబులు వెలుఁగుచుండును. రమ్యగానంబులు జరుగుచుండును. నైవేద్యంబులను దేవతల కొసంగుచుందురు.

ఈ ప్రకారముగానె కడను రాజ్యముల యందును జరుగుచుండెను.

ఇందుకొఱకై యీశాసనంబు ప్రకటింపఁబడుచున్నది. ఇందువలన జనులు ధర్మమును క్షీణింపఁజేయక వృద్ధినె చేయవచ్చును.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభువు తాను పరిపాలనకు వచ్చిన పదు మూఁడవహాయనంబున వీనిని బ్రకటించున ట్లాజ్ఞాపించెను.

## అయిదవ శిలాశాసనము.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు పలుకుచున్నాఁడు. సత్కార్యము కష్టసాధ్యము.

సత్కృత్యమును జేసినవాఁడు కష్టసాధ్యమయినపనిని జేసినవాఁ డగుచున్నాఁడు. ఇప్పటికి ననేకసత్కృత్యములు నావలనఁ గావింపఁబడినవి. నాపుత్రపౌత్రపారంపర్యము నీధర్మమార్గానుసారముగ బహుకాలం బుండిన యెడల వారు సత్కృత్యపరాయణులై యగుదురు. నాయాజ్ఞ నుల్లంఘించినవాఁడు చెఱుపుచేసినవాఁడే యగును. పాపం బొనరించుట సులభము.

గతించిన బహుకాలములో నెన్నఁడును ధర్మోపదేశకు లనఁబడు నుద్యోగు లేర్పడియుండలేదు. నాపరిపాలనకాలములోఁ బదునాల్గవవత్సరమున నట్టివారలు నాచేనియమింపఁబడిరి. ధర్మమును బెంపొందించుటకును, ధర్మవ్యాపకుల వృద్ధి చేయుటకును, విశ్వాసవంతు లగుప్రజలయొక్కయు,* యవనులు, కాంభోజులు, గాంధారులు, రాష్ట్రికులు, పైటీనికులు రాజ్యప్రాంతవాసు లయినయింక యితరజాతులు నిట్టివారియొక్కయు క్షేమ సౌఖ్యములఁ బెంపొన

---

* యవనులు. భరతఖండమునకు వాయవ్యమూల నుండువిదేశ జాతులవారు. వీరు సగము స్వాతంత్ర్యముఁ గలవా రయియుండిరి.

గాంధార్యులు. అఫ్గనిస్థానమం దుండు కాండహారు (Kandahar) ప్రదేశవాసులు.

కాంభోజులు, వీరును వాయవ్యమూల నుండు నొకతెగవారు. రాష్ట్రికులు. పైటీనికులు వీర లెవరో నిశ్చయముగాఁ దెలియలేదు.

రించుటకై యీధర్మోపదేశకు లన్ని తెగల జనులనిమిత్తము నియమింపఁబడిరి.

నా సేవకులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు, భాగ్యవంతుల యొక్కయు, దరిద్రులయొక్కయు, వృద్ధులయొక్కయు క్షేమసౌఖ్యములను హెచ్చించుటకై వారు నియమితులైరి.

అక్రమమయిన కారాగృహప్రవేశమును, అక్రమపు శిక్షను ఆటంకపఱచుటకును; ఇతరము లగునాటంకముల నివారించుటకును, నేరస్థుఁడు బహుకుటుంబియై, యాపదఁ జెందియుండి కాని వయోవృద్ధుఁగాఁ గాని, యున్నస్థితిలో వానిని విడుదలఁజేయుటకును ధర్మాధికారు లేర్పఱుపఁబడిరి.

ఇక్కడను (పాటలీపుత్రమందును) ఈరాజ్యమందున్నకడమ పట్టణముల యందును. నాసోదరసోదరీజనముయొక్కయు, నితరబంధువులయొక్కయు, స్త్రీపరిజనమును గుఱించి పైవిచారణ చేయుటకును వారు నియమింపఁబడిరి.

నారాజ్యమం దెక్కడనయినను బుద్ధధర్మపరాయణు లై తద్ధర్మాచరణమందు స్థిరచిత్తులై, మహాదాతలై యుండువారితో ధర్మాధికారులు ముఖ్యముగాఁ గలిసి ప్రవర్తింపవలెను.

ఇందుకొఱకీధర్మశాసనము లిఖింపఁబడినది. ఇదిచిరకాల మంతరాయంబు నొందకుండుగాత. ప్రజలు దీని ననుసరించి నడచుకొందురు గాత.

## ఆఱవ శిలాశాసనము.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు వచించుచున్నాఁడు.

దీర్ఘకాలమునుండి రాజకీయవ్యవహారము బాగుగ నెఱవేర్పఁబడలేదు. దివారాత్రములయం దనఁగా నన్నివేళలయందు వార్తలు (రిపోర్టులు) మాకుఁ జేరుటలేదు. * నేను భోజనముచేయుచున్నప్పుడు గాని అంతఃపుర

* వ్యావహారికవార్తలం దెల్పునుద్యోగులు చంద్రగుప్తునికాలమం దేర్పఱుపఁబడిరి. వారికి సుప్రద్రష్టలు (ఓవరుసీర్లు) అని పేరు. వారు రాజ్య

ములో (జనానాలో) నున్నప్పుడుగాని, శయనగృహమం దున్నప్పుడు గాని, మఱుగుచోట నున్నప్పుడు గాని, బండిలోఁ బోవుచున్నప్పుడు గాని, విహారవనములలో నున్నప్పుడు గాని, యేకాలమందైన, నేస్థలమందైనను జనులయొక్క వ్యవహారము నాకు నెల్లప్పుడు నివేదింపవలసిన యుద్యోగులు వార్తలను శ్రుతపఱచుచుండవలెను. అట్టివ్యవహారమును నే నెచ్చోట నున్నను నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నాను.*

దానం బొసంగితి నని కాని, యుత్తరవు చేసితి నని కాని, యవసరమయినపని నుద్యోగులకు నొప్పగించితి నని కాని, యెప్పుడైనను దైవికముగా నేను నోట నాజ్ఞాపించినయెడ నట్టి యాజ్ఞను జెల్లించుటలో వివాదము గాని, మోసము గాని మతాచార్యులలోఁ దటస్థించినయెడల నట్టి వివాదమును, మోసమును ఏకాలమందయినను, నెచ్చటనయినను నాకు

---

ములోఁ జరుగుచున్న దంతయుఁ గనిపెట్టి రాజునకు రహస్యముగా నివేదించిరి. వారిలోఁ గొందఱు నగరశోధనఁ జేయువారును, కడమవారు సైన్యశోధనఁ జేయువారును గా నుండిరి. నగరశోధకులు నగరవేశ్యలను, సైన్యశోధకులు తదితరవేశ్యలను దమకు సాహాయ్యముకొఱకు నుంచుకొనిరి. ఈయుద్యోగమునకు నధికసమర్థులును, విశ్వసింపఁ దగినవారల నియమింపఁబడిరి.

* చంద్రగుప్తునివిషయమై మెగాస్తినసు ఇట్లు వ్రాసెను. ప్రభువు యుద్ధకాలమందే గాక వ్యాజ్యెములను (ఫిర్యాదులను) విచారించుటకు నగరము విడిచి వెళ్లును. అంతటను ఆయన న్యాయస్థానము (కోర్టు) నందు దినమంతయుఁ బనిచేయుచుండును. తాను దేహపరిశ్రమంబు నొందునప్పుడనఁగా రోకళ్లవంటి కఱ్ఱలతో నొడలు మర్దించుకొనునప్పుడైనను రాజకీయవ్యవహారముఁ జాలింపకుండును. నలుగురు సేవకు లొడలు పట్టునప్పుడును వ్యాజ్యెముల వినుచుండును.

వెంటనే శ్రుతపఱచుటకు నాజ్ఞాపించుచున్నాను. ఏల యనఁగా పరిపాలనవిషయమై నేను పడుచున్న శ్రమతోను నేను వ్యవహారమును నెఱవేర్చు రీతితోను నేను సంపూర్ణముగాఁ దృప్తిం జెందుచుండలేదు.

ప్రజలమేలుకొఱకే నేను వ్యవహరింపవలెను. దానిమూలమంతయు నాకృషిలోను, దాని వినియోగములోను ఉన్నది. సర్వజనక్షేమదాయక మయినది. యంతకంటె మఱియొకటి లేదు. నేను మఱి దేనికొఱకు శ్రమపడవలెను? దీనికంటె మఱియొకటి లేదు. ఏది యనఁగా—జీవులకు నాఋణమును దీర్చుకొనుటయుఁ గొందఱ్నైనను ఈలోకమందు సుఖులను జేసి వారికి పరలోకమును గలుగఁజేయుటయు.

ఇందుకొఱకీ ధర్మశాసనమును లిఖింపఁజేసితిని. ఇది చిరకాలము వినియోగింపఁబడుచుండుఁగాత. ప్రజాక్షేమం బొనర్చుట యత్యంతశ్రమవలనఁగాని సిద్ధింపకున్నను నాపుత్రపౌత్రపారంపర్యముగా నందఱు ప్రజాక్షేమమునకై పాటుపడుచుందురు గావుత.

## ఏడవ శిలాశాసనము.

ధర్మమసంపూర్తిగా నాచరింపఁబడుటను గూర్చి ఘనతవహించిన ప్రియదర్శిప్రభువు సకలమయినస్థలంబులయం దన్నిమతములవారును నివసించుట నభిలషించుచున్నాఁడు. ఏల యనఁగా వా రందఱు నింద్రియవశంబును మనశ్శుద్ధిని గోరువార లయియున్నారు.

మనుష్యునకు సంకల్పములయందును, వాంఛలయందును నిలుకడ లేదు.

ఆయామతములవారిలోఁ గొందఱు పూర్తిగాను, గడమవారు కొంతవఱకును నాయాజ్ఞను జెల్లించియున్నారు. సమృద్ధిగ దానంబు జేయుటకు శక్తిలేని వాఁడయినను నింద్రియవశంబును మనశ్శుద్ధినిఁ, గృతజ్ఞతను గలిగియుండెనేని నట్టిగుణవిశేషంబు లెల్లప్పుడు గణనీయములై యుండును.

## ఎనిమిదవ శిలాశాసనము.

గతకాలమందలి ప్రభువులు సంతోషయాత్ర లని యేమొ చెప్పుచు విహరించుచుండెడువారు. అట్టి విహారములలో వేటియందును మఱియు నటువంటి వినోదములయందును వారు కాలంబుఁ గడపిరి.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు వెట్లయినను (తాను పూర్వ మట్లె చేసియున్నను) తాను ప్రభుత్వమునకువచ్చిన పదునొకటవవత్సరంబున సత్యజ్ఞానమార్గగామి * యయ్యెను. దానంజేసి ధర్మయాత్రలం జేయుట కలిగెను. ఈయాత్రలయందు భిక్షువులను, బ్రాహ్మణులను దర్శించుటయు, మహాత్ములను దర్శించుటయు, స్వర్ణదానము చేయుటయు, రాజ్యమును, బ్రజలను వీక్షించుటయు, బౌద్ధధర్మమును బ్రకటించుటయుఁ దద్ధర్మమీమాంసం జేయుటయు బ్రాప్తించుచున్నవి. కాఁబట్టి ఘనతవహించిన ప్రియదర్శి † ప్రభు వాకాలమునుండి తత్పూర్వసంతోషయాత్రలను మాని ధర్మయాత్రలయందె యానంద మొందుచున్నాఁడు.

---

* అమార్గ మేదియన "అష్టాంగమార్గము" ఇది యర్హాత్పదంబున కుపాసకుని జేర్చును. అష్టాంగము లెవ్వి యన :—(1) శుద్ధసంకల్పములు. (2) శుద్ధానుభవములు. (3) శుద్ధవాక్కులు. (4) శుద్ధప్రవర్తన. (5) శుద్ధజీవనము. (6) శుద్ధకృషి. (7) శుద్ధస్మృతి. (8) శుద్ధవిచారణ, మనశ్శాంతి.

† బౌద్ధమతధర్మప్రకారము భిక్షువులను, బ్రాహ్మణులను, పెద్దలను గౌరవించుట విధి యయియున్నది. కావున నశోకుఁడు తదాచరణము యోగ్య మని తలఁచెను. ప్రజలకుఁ దాను ప్రభు వయియుండుట కాక తాను తండ్రి సమానుఁడ నని ప్రకటించుకొనెను. కావుఁ దదనుకూలంబుగ రాజ్యమునె కాక ప్రజలనుగూడ వీక్షించెద నని వ్రాసెను.

## తొమ్మిదవ శిలాశాసనము.
### శుద్ధాచారమును గుఱించి.

ఘనత వహించిన ప్రియదర్శి ప్రభు విట్లు వక్కాణింపుచున్నాఁడు. రోగపీడితు లైనప్పుడును, బుత్రపుత్రికా వివాహములయందును, సంతానము కలిగినప్పుడును, బ్రయాణ సమయములయందును, బ్రజలయొక్క యాచారము లనేకములుగా నున్నవి. పైన నుడువఁబడిన సమయములయందే గాక యితర సమయములయందును జనుల యాచారములు పెక్కులుగ నున్నవి.

అట్టి సమయములయందు స్త్రీలు చేయునాచారంబులు సంకరములును బనికి మాలినవియు నయి యనేకములుగా నున్నవి. ప్రయోజనకరములు కాకున్నను నాచారంబుల మానుటకు వీలు లేదు. ఎట్లయినను నీధర్మాచారము మాత్రము మంచి ప్రయోజనము కలది. బానిసలను, సేవకులను దయతో నాదరించుట, గురువులయందు గౌరవము, జీవమునందు లక్ష్యము, భిక్షువులయెడలను, బ్రాహ్మణులయెడల నౌదార్యము నిట్టివియే ధర్మాచారము లనఁబడుచున్నవి.

కాఁబట్టి తండ్రి, కొడుకు, సోదరుఁడు, యజమానుఁడు, మిత్రుఁడు, పొరుగువాఁడు సహితము నీధర్మాచారము యోగ్యమయిన దని పలుకవలయును. సత్సంకల్పసిద్ధి యగునంతవఱకు నీధర్మమే యనుష్ఠేయ మని వచింపవలెను.

ఏవిధమయిన యాచారమువల్ల సత్సంకల్పసిద్ధి యగును? ఈప్రపంచాచారము సందేహకరమైనశక్తిఁ గలది యయియున్నది. దీనివలన సత్సంకల్పసిద్ధి కావచ్చును. ఒకవేళ ప్రపంచాభిలాషమాత్రమె తీరవచ్చును. ధర్మానుకూల మయినయాచార మన్ననో యనిత్యము కాదు. దానివలనను ఈప్రపంచములో సత్సంకల్పసిద్ధి లభింపకున్నను లోకాంతరమందు శాశ్వత

పదవిని నిస్సంశయముగ నొసంగఁగలదు. ఈధర్మాచార మొకవేళ నీప్రపంచమందు సత్సంకల్పసిద్ధిం జేసినయెడల నాయాచారము వలన ఫలద్వయసిద్ధి గలిగినదని నుడువవలయును. ఎట్లనఁగా నీప్రపంచమందు సత్సంకల్పసిద్ధి యొకటియుఁ, దదాచారమువలన లోకాంతరమందు శాశ్వతపదసిద్ధి రెండవదియు నయియున్నవి.

## పదియవ శిలాశాసనము.

ప్రజలు వర్తమానకాలమందును, భవిష్యత్కాలమందును వినయముతో బౌద్ధధర్మమును విని తదాచరణం బొనరించువఱకును వారి ప్రతాపమును, గీర్తియును వారికి విశేషలాభమును గలుగఁజేయఁజాలవు. అని ఘనతవహించిన ప్రియదర్శిప్రభువు నమ్ముచున్నాఁడు.

తత్ప్రతాపకీర్తులను బౌద్ధధర్మాచరణమందే సంపాదించుట ఘనతవహించిన ప్రియదర్శిని ప్రభువుయొక్క యభిలాష యైయున్నది.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు చేయుకృషియంతయు పాపరహితమైన యుత్తరజన్మమును బొందునిమిత్తమయియున్నది.

అల్పుఁడుగాని యధికుఁడుగాని సంపూర్ణవైరాగ్యమువల్లను, ధర్మాచరణమువల్లను దప్ప యట్టిపాపరహితమయిన జన్మమును బొందుట మిక్కిలి దుర్లభముగానుండును. మఱియుఁ బ్రపంచమందు మహద్దశయం దుండువారికి నట్టిజన్మప్రాప్తి యత్యంతదుర్లభముగా నుండును. *

---

* ధర్మపాద మనుగ్రంథమం దిట్లున్నది. ముముక్షుత్వ మమృతత్వమునకును, ఉపేక్ష మరణంబునకును మార్గంబు లయియున్నవి. ముముక్షువులు మరణింపరు. ఉపేక్షకులు మరణించినవారిం బోలుదురు. ముముక్షువులు మరణింప రనఁగా వారి పరిశుద్ధకర్మలు సంఘమందు సంక్రమించి మరణము నొంద వని వీరి సిద్ధాంతమందుఁ గన్పట్టుచున్నది.

## పదకొండవ శిలాశాసనము.

బౌద్ధధర్మదానమును బోలుదానము, తద్ధర్మస్నేహమువంటి స్నేహమును, తద్ధర్మవిభజనకృత్యముం బురణించు విభజనకృత్యమును (పంచిపెట్టుట), ఆధర్మబంధుత్వమునకు సాటియగు బంధుత్వమును లేవు.

బానిసలను, సేవకులను దయతోఁ జూచుట, తల్లిదండ్రులయందు విధేయత, భిక్షువులకును, బ్రాహ్మణులకును దానంబుచేయుట, జీవపావనత్వమందు గౌరవము నీనత్కృత్యములె బుద్ధధర్మమనఁబడుచున్నవి.

కాఁబట్టి జనకుఁడు, పుత్రుఁడు, సోదరుఁడు, గురువు, స్నేహితుఁడు సహచరుఁడు మఱియు పొరుగువాఁడు నీధర్మము మిగుల యోగ్యమయినది, దీనినాచరింపవలయు నని పలుకవలయును.

బౌద్ధధర్మదానము నొసంగుచు నిట్టు లెవఁడు నడుచుకొనునో వాఁడీలోకమందు మేలుఁ బొందుటయే గాక లోకాంతరమందు శాశ్వతపదముం బొందును. *

## పంద్రెండవ శిలాశాసనము.

### పరమతసహిష్ణుత.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు భిక్షువులను గాని, గృహస్థులను గాని దానము లొసంగుట వలనను మఱియు ననేక విధములుగాను గౌరవించుచున్నాఁడు.

అన్ని మతములకును ధర్మసారముయొక్క యభివృద్ధి యనఁగా నాయా మతధర్మములను శ్రద్ధగా శ్రవణముచేసి సారమును గ్రహించి వానిని గ్రమక్రమ

* దీని యభిప్రాయం బేమనఁగా బౌద్ధధర్మమును బ్రతిమనుష్యుఁడును దన పొరుగువానికి బోధింపవలెను. అట్టి బోధన, వస్తురూపదానమునకంటె మేలయి యుండును. ఆధర్మమువలన జన్మబంధుత్వమునకంటె బలమయిన యాత్మబంధుత్వము కలుగుచున్నది.

ముగ సమగ్రంబుగ నాచరించుట యవసర కార్యము కనుక దానము లొసంగుటయు, బాహ్యమునఁ బెద్దలు మొదలగువారిని గౌరవించుటయుఁ బ్రియదర్శి ప్రభువునకు నెక్కువ సంగతులుగా నుండవు. ఆయా మత ధర్మములయొక్క సారాభివృద్ధి యనేకరూపములుగా నున్నను నట్టి ధర్మములకు మూలాధారము వాగ్నియమ మయియున్నది. అనఁగా స్వల్పకారణములనుబట్టి పరమతమును హీనపఱచి తన మతమును ఘనమని చెప్పుకొనుట యెవనికిని దగదు. ఏదో కారణముచేతఁ బరమతమును గౌరవనీయమై యుండుకతనఁ జాలినంత కారణ మున్నప్పుడె దానిని హీనపఱచవలయును.

ఇందువలనఁ బ్రతి మనుష్యుఁడును దనమతము నభివృద్ధిఁజేసికొని పరమతమునకు నుపకరింపవచ్చును. ఇందుకు వ్యతిరేకంబుగ నడుచుకొన్నయెడలఁ దనమతమును క్షీణింపఁజేసికొని పరమతమునకు నుపయోగి యగును. ఎవఁడైనను దనమతమందుఁ దనకుం గలవిశేషాభిమానంబునంజేసి తనమతమును గొప్పచేసికొని పరమతమును దృణీకరించెనేని వాఁడు వాస్తవముగాఁ దన మతమునకె గొప్ప చెఱుపుఁ జేయుచున్నాఁడు.

కాఁబట్టి మనోవశీకరణ మనఁగాఁ బరమతధర్మములను శ్రద్ధతో వినుట ప్రశస్తమయిన కార్యము.

ఏమతమువారయినను దమమత ధర్మములను బాగుగా నెఱింగి వానియందు గాఢానుభవముఁ గలవారై యుండుట ప్రియదర్శి ప్రభువుయొక్క ముఖ్యాభిలాష యైయున్నది.

వారివారి మతధర్మములయొక్క సారములను సలక్షణముగా గ్రహించి క్రమక్రమంబుగ వృద్ధిఁజేసికొనుటయె యవసరకృత్యము. కావున దానంబుల నొసంగుటయు బాహ్యగౌరవంబులఁ జూపుటయుఁ బ్రియదర్శి ప్రభువున కవసరంబులు కావని సమస్తమతములవారికిఁ దెలియఁజేయవలెను.

ఇందునిమిత్తమై ధర్మాధికారులను స్త్రీలకొఱకుఁ బ్రత్యేక ధర్మాధికారు

లను, శోధకులను (ఇన్స్పెక్టరులను) ఇతర యుద్యోగులను నియమించి యుంటిని. ప్రతి మనుష్యుఁడును దనను ధర్మమును వృద్ధిచేసికొనుటయు, బౌద్ధధర్మమును బ్రకాశింపఁజేయుటయును నట్టి యుద్యోగస్థుల నేర్పఱుచుట యొక్క ఫలితముగా నెన్నఁబడును.

## పదమూఁడవ శిలాశాసనము.

### సత్యజయము.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు తాను పరిపాలనమునకు వచ్చిన తొమ్మిదవ వత్సరంబునఁ గళింగరాజ్యములను * జయించెను.

ఈధర్మజయమును ప్రియదర్శి ప్రభువువలనఁ దనరాజ్యమందునను దన రాజ్యమునకు 600 యోజనముల వఱకు ననఁగా రమారమిగా 4800 మైళ్లదూరములోఁగా నున్న పొరుగురాజ్యములందునను వ్యాపింపఁ జేయఁబడినది. మఱియు అంటియోకసు (Antiochus) నామధేయుం డగు గ్రీకు ప్రభువుయొక్క రాజ్యమువఱకును, ఆరాజ్యమున కావల నున్న "టోలమి" (Ptolemy), "అంటిగోనసు" (Antigonus), "మాగాస్" (Magas) "ఆలెగ్జాండరు" (Alexander) అను రాజచతుష్టయము † యొక్క

---

* మహానదినుండి దిగువగా కృష్ణానదికి నవతలవఱకు నుండు బంగాళాఖాతతీర ప్రదేశము కళింగరాజ్య మయియుండెను. మఱియు దీనికి కళింగరాజ్యత్రయ మని పేరు గలదు. (i) అమరావతి. (ii) ఆంధ్ర దేశము లేక వరంగలు. (iii) మధ్యమకళింగము లేక రాజమహేంద్రవరము. ఈమూఁడు కళింగరాజ్యములు కలిసి మహాకళింగరాజ్య మయ్యెను.

ధౌలి (Dhauli), జంగద (Jangada), శిలాశాసనము లీకళింగ రాజ్యమందేయున్నవి.

† అంటియోకసు సిరియాదేశపురాజు, టోలమి యీజిప్టు దేశపు రాజు, అంటిగోనసు మాసిడోనియాదేశపురాజు, అలెగ్జాండరు ఏపిరసు

రాజ్యములవఱకును ధర్మజయము వ్యాపించియున్నది. దక్షిణమున నున్న పాండ్య, చోళ, సింహళ రాజ్యములయందునను నాయా రాజ్యమంనునను ఉన్న ప్రజలును (రాజ్యప్రాంతదేశములయం దుండు నడవిజనము లయిన) యవనులు, * కళింగులు, భోజులు, పిటినికులు, ఆంధ్రులు, పుళిందులును బ్రియదర్శి ప్రభువు ప్రకటించిన ప్రకారము బౌద్ధధర్మావలంబులై యున్నారు. ప్రియదర్శి ప్రభువుయొక్క ధర్మోపదేశకులు ప్రవేశింపని దేశములయందును బ్రజలు బౌద్ధధర్మ మవలంబించుచున్నారు. ఆధర్మము నను సరించి ప్రియదర్శి ప్రభువు చేయుచున్న భక్తిపూర్వకమయిన ప్రకటనను వారు వినఁగానే ఆయాధర్మమును విడువక యాచరింపఁ గలరు.

ఇట్లు సర్వత్ర పరిదృశ్యమాన మయిన ధర్మజయము సంతోషం బొసంగుచున్నది.

బౌద్ధధర్మ వ్యాపకరూపజయ మానంద దాయకంబుగ నున్నది. కాని యీయానందమును సామాన్యముగానే యెంచవలెను. పరలోకసాధక

---

(Epirus) దేశపు ప్రభువు. మాగాసు సయిరీను (Cyrene) దేశపు రాజు.

* యవనులు, మగధరాజ్యములో చేరియున్న వాయవ్యపుమూల నున్న సరిహద్దు ప్రదేశములయం దుండు విజాతీయజనులు. వీరిని కేవలము గ్రీకు లని నుడువుటకు వలను పడదు.

కాంభోజులు. వీరును ఆప్రదేశవాసులే. ఆంధ్రులు కృష్ణాతీరవాసు లయియున్నారు. వీరిదేశము కళింగదేశమునకు దక్షిణముగా నుండెను. కాలాంతరమందు వీరు బలమయిన రాజ్యమును స్థాపించిరి. పుళిందులు, భరతఖండ మధ్యపరగణాలయం దుండిరి. పిటినికలు గోదావరి తీరమందు నుండు "పయిఠాన (Paithana) ప్రదేశవాసు లయియుండవచ్చును. ఈ చెప్పఁబడ్డ యడవిజను లందఱు నశోకునిపాలనమం దుండిరి.

మయినదే తప్ప * మఱేదియు ప్రియదర్శి ప్రభువునకు ఘనమయినదిగాఁ గనుపడదు.

ఇందు నిమిత్తమై యీధర్మశాసనము లిఖింపఁబడినది. ఆనిమిత్త మేమనఁగ నాపుత్రపౌత్రపారంపర్యముగ నావంశము వారందఱును నూతనరాజ్య సంపాదనమును దమకు విధియయిన కృత్యముగఁ దలఁపకుందురుగాక. ఒక వేళ నట్టి యుద్ధప్రసక్తిం గలవా రయినప్పటికైనను సహనమందును శాంతమందును వారికి సంతోషము కలుగుఁగాక. ఉభయలోక తారకమైన ధర్మమార్గజయమె నిజమైనజయమని వారు గౌరవముతో భావించెదరు గాక. కాఁబట్టి యిహలోక పరలోకములయందు మేలొనరించుకృత్యముల వలనఁ గలుగు సంతోషమే వారికి సర్వసంతోష మవుగాక.

## పదునాల్గవ శిలాశాసనము.

### ఉపసంహార శాసనము. †

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు నయిననాయాజ్ఞానుసారముగ నీశాసనము లన్నియు లిఖింపఁబడినవి. మఱియు నారాజ్యము విస్తీర్ణముగా నుండుటచేతను, తత్కారణమున నొక ప్రదేశమం దుపయోగించునదియే సర్వత్ర యుపయోగింప కుండుటచేతను, పైనఁ జెప్పఁబడిన శాసనములలోఁ గొన్ని సంగ్రహముగాను, గొన్ని మధ్యమ ప్రమాణముగాను, గొన్ని విపులముగాను నున్నవి.

ఇంతవఱకు విశేషముగా లిఖింపించియుంటిని. ఇంతకంటె విశేషముగా వ్రాయింపవలసియే యున్నది. ఈశాసనములలోఁ గొన్ని వచనములు పునరుక్తములుగా నుండియున్నవి. అందుకుఁ గారణము లేమన్నఁగా నాయా

* మతావలంబు లయి యానందింపఁజేయుట చాలదు. పరలోక సాధక మయిన యమృతపదంబు నొందవలె నని యభిప్రాయము.

† అనఁగా గ్రంథాంతమువలె శాసనములయొక్క యంతము.

విషయములు మధుపుకంటె బహుమధురంబుగ నుండుటయుఁ జెప్పిన విషయమునె మరల మరల నుడువుట వలనఁ బ్రజ లత్యాదరము కలవారై యట్లొనర్చెద రనుభావమును కారణములు. లిఖింపఁబడిన శాసన గ్రంథము కొంత యసంపూర్తిగా నుండవచ్చును. అటుల నున్నయెడల నది స్థలసంకోచమువల్లఁ గాని, యేదో యితర ముఖ్యకారణమువల్లఁ గాని, శిల్పకారుని ప్రమాదమువలనఁ గాని సంభవించియుండును.

II. కాళింగశాసనములు. (వీనిని బ్రత్యేకశిలాశాసనము లందురు.)

అశోకుఁడు ప్రభు వయినపదునాల్గవవత్సరంబునను తదనంతరమె ప్రచురింపఁబడినవి.

(2) మగధరాజ్య ప్రాంతవాసుల (సరిహద్దున నుండెడి యాటవికజనంబుల) కొఱకు లిఖింపఁబడిన శిలాశాసనము. (దీనిని కాళింగ శాసనములలో రెండవది యందురు.)

రాజ్యముయొక్క సరిహద్దుల నుండు నానాజాతులయెడల నుద్యోగులు నడుచుకొనవలసిన విధులు ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు వచించుచున్నాఁడు.

ప్రభు విద్విధముగ నాజ్ఞాపించుచున్నాఁడని “సమాపా” (Samâpâ) యం దుండునుద్యోగులకుఁ దెలియఁ జేయవలెను.

నాయభిప్రాయములనుదగురీతిగ సలక్షణముగ నెఱవేర్చుటను నేనుగోరుచున్నాను. అట్లు నెఱవేర్చుటకు ముఖ్యాధారములు మీకు నే నొసంగు నాజ్ఞలె. ప్రజ లందఱు నాబిడ్డ లై యున్నారు. ఇహపరలోకములయందు నా బిడ్డలు సుఖముఁబొంది యభివృద్ధిం జెందవలె నని యెంతగఁ గోరుదునో యంతగానె నాప్రజలను గుఱించియు నభిలషించెదను.

ప్రాంతర జాతులయెడల నీయభిప్రాయం బేమని మీరు ప్రశ్నించెదరేని నే నిట్లుత్తరమిచ్చుచున్నాను. వారు వ్యాకులరహితులై యుండుట

ప్రభువుయొక్క ముఖ్యాభిలాష యని వారికి నమ్మకముగ బోధింపవలెను. వారు నన్ను విశ్వసించి నావలన వారు సుఖమునె కాని దుఃఖమును బొందరని నమ్మవలయు ననియు, వారియెడల నాకు మంచి యభిప్రాయము కలదనియు, నాయనుగ్రహము పొందుటకును నన్ను సంతోషపెట్టుటకును బౌద్ధధర్మము నాచరించి యిహపరలాభములను వారు పొందవలయు ననియుఁ బ్రభువు నయిన నేను కోరుచున్నా నని వారికి దృఢముగా బోధింపవలెను. దీనికొఱకు నేను మిమ్ము నాజ్ఞాపించుచున్నాను. ఈచందముగ మిమ్ము నాజ్ఞాపించి నాయుత్తరువులను నాచేఁ బంపిన పదంపడి నాయుత్తరువులును, నావాగ్దానములును మార్పఁబడవు. ఇది తెలిసికొని మీరు మావిధులను జెల్లింపవలయును. వారికి విశ్వాసము కలుగఁజేయవలెను. ఎంతవిశ్వాస మనఁగా ప్రభువు వారియెడలఁ దండ్రివలె నుండు ననియుఁ దనను దాను జూచుకొనినట్లు వారలం జూచు ననియు వారు నమ్మవలయును.

నేను నాయాజ్ఞల నిచ్చియుంటిని. నాయుత్తరువులఁ బ్రకటించితిని. నా నిశ్చయాభిప్రాయములును, నావాగ్దానములును వ్యత్యయము కానేరవు. కావున మీకు నియమించినపనిని మీరు సలక్షణముగా నెఱవేర్పవలెను. ఏల యనఁగా వారికి మాయందు విశ్వాసము కలుగఁజేసి యిహపరసౌఖ్యములు వారికిఁ జేకూరునట్లొనరించుటకు మీకుఁ జాలినంత యవకాశమును, వీలు నున్నవి. అటులఁ గావించుటవలన మీకు స్వర్గప్రాప్తియు రాజఋణవిమోచనమును సంఘటించుచున్నవి.

ఈకార్యనిర్వాహకు లయినయుద్యోగులు పైన నుదాహరింపఁబడిన జాతుల వారికి రాజవిశ్వాసంబుఁ గలుగఁ జేయుటయందును ధర్మమార్గమున వారిని నడిపించుటయందును గొఱవడని పట్టుదల నెట్టుకొనంజేయుదు రని గట్టిగ నమ్మియున్నాను.

నాలుగు మాసముల కొకసారి జరుగు*పుష్యనక్షత్రోత్సవంబునం దీ శాసనమును జనులకుఁ జదివి వినుపింపవలెను. మఱియు నుచిత సమయములయందును వినుపింపవలయును. ఇట్లొనరించుటవలనఁ బ్రజలు సన్మార్గవంతులగుచున్నది లేనిది పరాకాష్ఠగఁ గని పెట్టవలెను.

రాజధానియం దుండుప్రజలు గాక రాజ్యమం దుండు నితర ప్రజలకుఁ గాను లిఖింపఁబడిన శాసనము.

## (Provincial Edict.)

దీనిని బ్రత్యేకశాసనములలోఁ బ్రథమ మందురు.

ఈశాసనము "ధౌలి" (Dhauli) యం దున్నది. అట్టి యనాగరిక ప్రజల విషయమై యుద్యోగులు నడుచుకొనవలసిన విధులు ఘనత వహించిన అశోకప్రభువుయొక్క యాజ్ఞనుబట్టి "తోసలి" (Tosali) పట్టణపరిపాలకు లయిన యుద్యోగు లిట్లు బోధింపఁబడుచున్నారు.

నాయభిప్రాయముల నుచితమైన సాధనములవల్ల గమనించి సార్థకరించుటకు నేను వాంఛించుచున్నాను. అటుల నొనరించుటకు మీకుఁగల ముఖ్యాధారములు నేను మీకుఁ దెలియఁజేయు కట్టుబాటులె. ఏలయనఁగా ననేక సహస్రజనంబులపై మిమ్ము నధికారులుగ నియమించి యుంటిని వారిలో సజ్జను లగువారి యభిమతమును మీరు సంపాదించుకొనవలెను.

ప్రజ లందఱు నాపిల్ల లయియున్నారు. నాపిల్ల లుభయలోకముల యందు సుఖపడి యభివృద్ధి గాంచవలె నని యెంతగా నభిలషించెదనో యంతగానె నాప్రజా విషయమై కూడ నభిలషించెదను.

---

* అశోకుని కాలమందు భాగమునకు 4 మాసముల చొప్పున సంవత్సరమును 3 భాగములుగా విభజించిరి. ప్రతిదినమునకుఁ జంద్రు డుండు నక్షత్రమునె పేరుపెట్టిరి. ఆనక్షత్రములలోఁ బుష్యమి నక్షత్రమునె యధిక మంగళప్రద మని భావించిరి.

అయినను బొందదగిన శుభోదర్కము లయిన ఫలితములను మీరు పొందుటలేదు. నాబోధనంతయు గమనింపక కొంతవఱకే వినియోగించు వారు కొందఱు గలరు. కావున ధర్మబోధను సమగ్రముగ వినియోగించు నటుల నట్టివారిని జేయుట మీపని యైయున్నది.

కారా గృహవాసులును, హింసితులు నగుజనులు కొందఱును ఉన్నారు. ఆరెండు శిక్షలను విధించుట యందనధికార కృత్యములు పొసఁగకుండ మీరు సన్నిహితులై యుండి వానిని నివారింపవలెను. కొందఱు మదోద్రేకులయి యత్క్రమములు చేయుదురు. వారిని సన్మార్గమునకుఁ దేవల యును.

బౌద్ధధర్మము జయమొందుటకుఁ బ్రతిబంధకము లయిన గుణములు కొన్ని గలవు. ఎవ్వి యనిన నోర్వలేమి, పట్టుదలలేమి, కఱకుఁదనము, ఓర్పులేమి, పనిపూనకుండుట సోమరితనము ఒడలు వంగనితనము. కాఁబట్టి మీర లట్టిప్రతి బంధక రూపములయిన దుర్గుణములను ద్యజింపవల యును. ఏల యనఁగా నీధర్మబోధయొక్క మూలమంతయు సత్ప్రివర్తన మందలి పూనికలోను సహనములోను నున్నది. పాలుమాలిక గలవాఁడు తనవిధికృత్యముం బూనఁడు. అయినను నుద్యోగియైనవాఁడు వానిని బ్రోత్సాహపఱచి తాను ముందు నడచి వానిని నడుపింపవలెను. మీరు చేయుపైవిచారణ యనుకృత్యంబు నిట్లే మీ రొనరింపవలెను. ప్రభువు నాజ్ఞ లిట్టి విట్టి వని మీరు పర్యాలోచించి గమనింపవలెను. ఈనాయాజ్ఞలను మీరు చెల్లించుటవల్ల విశేషఫలము సిద్ధించును; చెల్లింపనియెడల గొప్ప చెఱుపు కలుగును. అలసులకుఁ బ్రోత్సాహ మొసంగని యుద్యోగులకు దైవానుగ్రహము గాని రాజానుగ్రహము గాని లభింపదు. ప్రోత్సాహ పఱచుటను గూర్చి నే నింతపట్టుదలగా వచించుట మీకు ద్వివిధముగా ఫలకారి యగును. ఎట్లనఁగా మీ ర ట్లాచరించుటచే మీకు స్వర్గప్రాప్తి

గలుగును. మఱియు నాయెడల మీకుం గలబాధ్యతను నెఱవేర్చికొనిన వార లగుదురు.

ఈశాసనమును పుష్యనక్షత్రోత్సవమందును ననుకూలించిన యెడలఁ బుష్యనక్షత్రములకు నడిమి కాలములయందును బ్రజలకుఁ జదివి వినిపింప వలెను. ఇట్లొనరించుటవలనఁ బ్రజలు సన్మార్గమునకు వచ్చుచుండిరేమొ శ్రద్ధగాఁ బరిశీలించుచుండవలెను. పట్టణవాసుల నధికారము లేకుండఁ జెఱ సాలలోఁ బెట్టుట, హింసించుట యిట్టి యక్రమములను నివారించుట యందుఁ బట్టణాధికారు లగునుద్యోగులు తఱుగనిపట్టుదలం జూపుటకై యీశాసన మిచటఁ బ్రచురింపఁబడినది.

ఈవిషయముల నాకర్ణించి నాబోధల ననుసరించి నడచుటకై నెమ్మదిని, సహనమును, జీవ గౌరవమును గలమనుష్యులను అయిదు సంవత్సరముల కొకసారి బౌద్ధధర్మానుసారముగాఁ బిలిపించెను.

ఆప్రయోజనము కొఱకె యుజ్జయినీ రాష్ట్రాధికారి మూఁడు సంవత్సర ముల కొకసారి తన ప్రజలను రావింపవలయును. ఈప్రకారమే తక్షశిలా ప్రదేశప్రభువు కూడ నొనరింపవలయును.

అట్టి మహాసభకు నరుదెంచెడునుద్యోగులు తా మొనర్పవలసిన విశేష కార్యంబుల నుపేక్షింపక సభయందు బోధింపంబడు విషయంబుల సావ ధానంబుగ విని తదాచరణ పరాయణులుగా నుండవలెను.

### III. లఘు శిలాశాసనములు.

అశోకుఁడు పాలనమునకు వచ్చిన పదునెనిమిదవవత్సరంబునఁ బ్రచు రింపఁబడినవి.

లఘు శిలాశాసనము. నెం 1 రు.

(బ్రహ్మగిరియం దీశాసనమున్నది.)

---

## ధర్మాచరణ ఫలము.

సువర్ణగిరియందుండు ప్రభువుయొక్కయు, దండనాధి కారులయొక్కయు నుత్తరువు ప్రకారము "ఇసిలా" (Isila) యందుండుదండనాధి కారులకుఁ గుశలప్రశ్నానంతర మిట్లు లిఖింపఁబడుచున్నది.

ప్రియదర్శి ప్రభువుగారి ట్లాజ్ఞాపించుచున్నారు. సార్ధద్వయ వత్సరంబులవఱకు (2 సం॥లు 6 నెలలు) బుద్ధధర్మము శ్రద్ధతో నాచరింపక తద్ధర్మావలంబిగా మాత్ర ముంటిని. ఆయువత్సరంబులకుఁ గించి దధిక కాలము నుండి యుపాపక వర్గంబులోఁ జేరి యాధర్మమును శ్రద్ధాపూర్వకంబుగ నాచరించుచుంటిని. * అంతకుఁ బూర్వము సత్యమతావలంబు లని భరతఖండమం దంతటను గౌరవింపంబడు వారందఱును, వారిదైవములును అసత్యము లని నాయుపాసనకాలమందుఁ గనుపఱుపఁబడినది.

ఏలయన నిదియె ధర్మాచరణఫలము. ఇది గొప్పవానికి మాత్రమె లభ్యమగు ననఁగూడను. అల్పుఁడైనను ముముక్షుత్వముఁ గలిగి శ్రద్ధాళువై యుపాసించిన యెడల నిర్వాణపదంబు నొందఁగలఁడు. కాఁబట్టి యల్పుఁడును నధికుఁడును శ్రద్ధతో ధర్మాచరణంబు నొనరించుటకై యీశాసనము ప్రకటింపఁబడినది.

నారాజ్యప్రాంతదేశీయులును నాబోధను గ్రహింపవలయును. వారు ధర్మాచరణమును బహుకాలం బొనరించెదరు గాక.

ఈధర్మాచరణము వృద్ధియగును. నిశ్చయముగా విపులముగా వృద్ధియగును. ఇప్పటికంటె నధమము సగమయినను వృద్ధికావచ్చును.

---

* ఇది బ్రాహ్మణుల నుద్దేశించిన వచనంబు. బ్రాహ్మణాధికారము నిరాకరింపఁబడినందున వారి దేవతలును నిరాకరింపఁబడి రని తెలిసికొనవలెను.

గతించిన మహనీయులవలన నీయాజ్ఞ ప్రకటింపఁబడినది. అప్పటినుండి 256 * సంllలు గడిచినవి.

వెనుకటి శాసనమె "రూపనాథ" లఘు శిలాశాసన ప్రతిలో నిట్లున్నది :—

ప్రియదర్శిని ప్రభు విట్లు వచింపుచున్నాఁడు.

రెండు సంll ల 6 మాసములవఱకు బుద్ధధర్మశ్రవణము చేసియుంటిని గాని తదాచరణమందు శ్రద్ధవహించి యుండలేను. నే నుపాసక సంఘములోఁ జేరి 6 సంllలకుఁ బైగాఁ గడచినది. ఈకాలములో శ్రద్ధాభూతుఁడనై ధర్మానుష్ఠానంబుఁ జేసితిని.

శిలాశాసనములయం దుండు వచనములలో నిది యొక్కటియె దురవగాహంబుగ నున్నది. దీని యభిప్రాయ మిది యని యొక్కండును నేటివఱకు సహేతుకంబుగ స్పష్టీకరింపలేఁడయ్యె. గతించిన మహనీయులనుమాటలు బుద్ధమునిం దెల్పుననియు 256 సంఖ్య యాయన మరణాదిగ గతించిన వత్సరంబు లనియు "బూలరు" (Bühler) పట్టుదలతో వాదించెను. ఇతరులును గొన్ని యభిప్రాయము లిచ్చిరి కాని బూలరుయొక్క యభిప్రాయమె చాలభాగము వఱకు సమ్మతింపఁ దగియున్నది. ఈయభిప్రాయము నిర్దోషమయిన యెడల సింహళపురాణములు తెల్పు కాలక్రమమునకు విరోధముగా బుద్ధుని మరణము క్రీ. పూ. 508 సంllల ప్రాంతమందని వచింపవలెను.

క్రీ. పూ.

ఎట్లన్న:—అశోకుఁడు పట్టాభిషిక్తుఁ డయిన సంll 269

---

* 256 కుఁ దరువాతఁ గుండవకరణమందు లిఖింపఁబడిన శబ్దములు మూలమందు లేవు. చరిత్రకారుఁడు వ్రాసినవైయున్నవి. అందుకుఁ గారణ మి ట్లాయన వ్రాయుచున్నాఁడు.

పూ. క్రీ.

పిమ్మట 9 సంIIలకు కళింగ రాజ్యమునుజయిం
చి బుద్ధధర్మావలంబి యయిన సంIIము } 261

2½ సంIIలు సామాన్యముగా నుండిపిమ్మట
6½ సంII (మొత్తము 9 సంIIలు) దృఢ
మయిన యుపాసకుఁడుగానుండెను. } 252

దీనికి 256 కలపగా బుద్ధుని మరణము. 508

ఇది యిట్లుండ 256 సంఖ్య గతించిన మతోపదేశకులను దెల్పు నని "సీనర్టు" (M. Senart) వ్రాసెను. ఇది కొంత భ్రమఁ గలుగఁ జేయుచున్నది. ఈసంశయము రూపనాథ శాసనమువలనఁ గొంత విడుచున్నది.

ఆ కాలమునందు భరతఖండములో నంతట సత్యదేవత లని పేర్కొనంబడిన వన్నియు నసత్యదేవత లని తెలిసెను. ఏల యనఁగా నిది ధర్మాచరణముయొక్క ఫల మయియున్నది. ఇది గొప్పవానికె లభ్య మని యనఁగూడదు. ఏల యన నల్పుండైనను శ్రద్ధతో నుపాసించినయెడల విశేష మయిన స్వర్గసుఖముఁ బడయఁగలఁడు.

కాఁబట్టియె యల్పుఁడును నధికుండును స్వర్గలాభంబునకై కష్టింపవలసినదని యాజ్ఞాపించుచున్నాను.

నాపొరుగు రాజ్యములవారు కూడ నీబోధను నేర్చుకొనవలెను. పైన నుడివినరీతిగ ధర్మాచరణము చిరకాలము జరుగుఁగాక.

నాయీప్రయత్నముం బట్టి ధర్మాభివృద్ధి యగును. సందేహము లేదు. విపులముగా నగును. ఇప్పటి వృద్ధి కంటె సగమయిన నధిక మాగును.

ఈవిషయ మిక్కడను దూరప్రదేశములయందును శిలలమీఁదఁ జెక్కింపఁబడినది. ఎక్కడెక్కడ శిలాస్తంభ ముండునో దానిమీఁద నీయంశమును లిఖింపవలయును.

తనయన్నం బీరసవర్గముతో నెవండయిన నెన్నిసారులు తడుపునో యన్నిసారులం నతనికి నధికతృప్తి కలుగును. అనంగా వాం డీబోధను మననము చేసినకొలంది నింద్రియ వశీకరణము కలిగి యానందించును.

నిర్వాణపదంబు నొందిన మహనీయుం డీయాజ్ఞ నొసంగెను. ఆయన గతించి 256 సం॥ము అయినవి.

## ద్వితీయ లఘు శిలా శాసనము.

(బ్రహ్మగిరియందుండుశాసనప్రతి).

బౌద్ధధర్మసంగ్రహము.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు చెప్పుచున్నాండు.

తల్లిదండ్రులకు విధేయులుగ నుండవలయును. ఆప్రకారమె జీవుల యెడల గౌరవము విధిగాం జూపవలెను. నిజము వచింపవలెను. బౌద్ధధర్మము కోరుయోగ్యత లివి యయియున్నవి. తద్విధముగానె శిష్యుండు గురువును గౌరవింపవలెను. బంధువులను సన్మానింపవలెను. ఇది పురాతన ధర్మ నియమము. దీనిని జిరకాల మాచరింపవలెను. దీని ననుసరించి ప్రజలు నడుచుకొనవలెను.

## IV. బాబ్రాశాసనము.

అశోకుండు పాలనమునకు వచ్చిన పదునెనిమిదవ వత్సరంబున లిఖింపంబడినది.

మతాచార్యులకుం జేయంబడిన యుపన్యాసము. బౌద్ధమతాచార్యుల యొక్క యారోగ్యము నభివృద్ధియు నభిలషింపుచువారికిం బ్రియదర్శిప్రభు వభివందన మొనరింపుచున్నాండు.

పూజనీయులారా!

గౌరవనీయుం డైనబుద్ధముని సింహనాదవలన వచింపంబడిన దంతయు సలక్షణముగనె యున్నది. అయినను నాత్మేమముకొఱకు నేను నుడువ

వచ్చును. కనుక "బుద్ధధర్మము చిరకాలజీవిగా నుండు నని" బుద్ధమహా ముని నుడివిననుడిని బూజ్యులారా! మీకు జ్ఞాపక మొనర్చుటకు నేను సాహసించుచున్నాను.

పూజనీయులారా!

(1) ధర్మనియమాభివృద్ధి. (వినయసంకోశము.)

(2) ఆర్యులయొక్క యమానవశక్తులు. (ఆర్యవేషాని.)

(3) రాగలభయము. (అనాగతభయాని.)

(4) భిక్షుగీతము. (మునిగాధ.)

(5) భిక్షుజీవితసంభాషణ. (మానిసూక్తి.)

(6) ఉపతిష్యప్రశ్న. (ఉపదేశ ప్రశ్న.)

(7) అనృత మనువిషయము నారంభించి రాహులునకుఁ జెప్పఁబడిన యుపన్యాసము.

పైన నుదాహరింపఁబడిన గ్రంథవచనములను మహానుభావుఁ డైన బుద్ధుఁడు వచించియుండెను. ఆ నేను లయిన భిక్షువులును భిక్షునిలును దద్వచనములను శ్రవణముఁ జేసి మననము కావింపవలయు ననియు నుగనారేమి స్త్రీ లేమి ప్రజ లందఱు నట్లే యాచరింపవలె ననియు నేను కోరుచుందును.

పూజ్యులారా! యీ కారణమునుబట్టి నేను దీనిని లిఖింపఁజేసితిని. ఇందువలన నాయుద్దేశము ప్రజలు తెలిసికొనవచ్చును.

గుహాశాసనములు. స్తంభశాసనములు.

అశోకుఁడు పరిపాలనమునకు వచ్చిన 13 మొదలు 28-వ వత్సరము వఱకుఁ బ్రకటింపఁ బడినవి.

(I.) గుహాశాసనములు.

పదుమూఁడవ యిరువదియవ పాలన సంవత్సరములయందు లిఖింపఁబడినవి.

బరాబరు కొండగుహలయందలి శాసనములు అజీవకులకు గుహాగృహంబుల దాన మొసంగుట.

నెం 1 రు శాసనము.

తాను పరిపాలనమునకు వచ్చిన పన్నెండవ యబ్దంబున ప్రియదర్శి ప్రభు వీరావివృక్షగుహ నజీవకులకు దాన మొసంగెను.

నెం. 2 రు శాసనము.

తనపాలనయొక్క 13-వ వత్సరంబున ప్రియదర్శి ప్రభువు "ఖాలటీక" (Khalatika) కొండలలో నున్న యీగుహ నజీవకులకు దానం బొసంగెను.

నెం. 3 రు శాసనము.

తన పాలనయొక్క యిరువదియవ హాయనంబున నీగుహ నర్పించెను.

అశోకునకుఁ జాల తరువాతకాలపు ప్రభు వయినప్పటికి నాయన మనుమఁడయిన దశరథుఁడు లిఖింపఁజేసిన శాసనము లీశాసనములకు సంబంధించియుండుట చేత నిచ్చట నె యవి యుదాహరింపఁబడుచున్నవి. గుహాదానంబులొసంగిన ట్లీశాసనములయందు పైశాసనములయందు వలెనె లిఖింపఁబడియున్నది. ఇవి మూఁడుగుహాశాసనములు. వాని పేర్లు "వహీయక" "గోపిక" "వేదాధిక." ఇవి నాగార్జున కొండయం దున్నవి. వీనిని దశరథుఁడు తాను సింహాసనారూఢుఁ డగునప్పు డజీవకుల కొసంగెను. వీనిలో నొకదానియం దిట్లున్నది.

దశరథునియొక్క వాహ్యాకగుహాశాసనము.

ఘనతవహించిన దశరథప్రభువు తాను పరిపాలనమునకు వచ్చినవెంటనె యీవాహ్యాకగుహను సూర్యచంద్రు లున్నంతవఱకు నజీవకులకు * నివాసంబుకొఱకు నొసంగెను.

---

* అజీవకులు బ్రాహ్మణ సన్యాసులలో నొక తెగవారు. వీరు నారాయణభక్తులు. ఈదేశపు పూర్వమతస్థులలో వీ రగ్రగణ్యులుగానుండిరి.

(2) "బెరాయి" స్తంభశాసనములు.

అశోకునియొక్క 21-వ పాలనవత్సరములోఁ జెక్కింపఁబడియె.

"రుమిండె" (Rummindei) స్తంభము.

శాక్యముని యగు బుద్ధునిజన్మస్థానమును దాను దర్శించినందుకు జ్ఞాపకార్థముగా నీ స్తంభమును దీశాసనము చెక్కింపఁబడెను.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు తన పరిపాలనలో నిరువది యొకటవ వత్సరంబున స్వయముగా నేతెంచి యీపుణ్యస్థలమును దర్శించెను. ఏల యనఁగా బుద్ధమహాముని యిచ్చట జన్మించెను. ఆయన గౌరవార్థముగా శిలాతురంగము నిర్మింపఁబడి శిలా స్తంభము ప్రతిష్ఠింపఁబడినది. ఆ మహాత్ముని జన్మంబుచే నీలంబినీగ్రామము పవిత్రమయినది. కనుక దీనిపైఁ బ్రభువునకు రావలసిన సుంకము త్యజింపఁబడినది (మాపుచేయఁబడినది.) ప్రభువుయొక్క దానమున కిది పాత్రమయి యుండెను.

నిగ్లివియా (Niglivia) స్తంభశాసనము.

కొణకమ్ముని బుద్ధుని స్తూపము (సమాధిని) దర్శించి తద్జ్ఞాపకార్థముగా నశోకుం డొనరించిన సత్కార్యము.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు తాను పరిపాలనమునకు వచ్చిన పదునేనవ వత్సరంబున కొణకముని బుద్ధునిస్తూపమును ద్వితీయపర్యాయ మభివృద్ధిఁ జేయించెను. మఱియు నిరువది యొకటవ యబ్దంబున స్వయముగా వచ్చి పూజించి శిలా స్తంభమును నిర్మింపఁజేసెను. *

(3) సప్త శిలా స్తంభ శాసనములు.

---

* ఈశాసన మసంపూర్తిగా నున్నది. ఇదియు, వెనుకటి శాసనమును (రుమిందెశాసనము) నొక్క సంవత్సరమందే చెక్కింపఁ బడియుండ వచ్చును. ఈరెండు శాసనములకు మధ్య 13 మైళ్లయెడ మున్నదికాని నిగ్లివియా శాసన మిప్పుడు స్థలాంతరముం బొందియున్నది.

అశోకుని పరిపాలన కాలమునందు 27, 28 సంIIలలోఁ బ్రతిష్ఠింపఁ బడినవి.

## ప్రథమశాసనము.

### పరిపాలన విధులు.

ఘనతఁజెందిన ప్రియదర్శి ప్రభు విట్లు వచించుచున్నాఁడు. నాపాలన యొక్క యేకవింశతి వత్సరంబున నీధర్మశాసనముం బ్రకటింపఁ జేసితిని.

బౌద్ధధర్మపరాయణత్వమును అధిక జాగరూకతయు, సంపూర్ణవినయమును, అత్యంతపాపభీతియు, అత్యధికసామర్థ్యమును లేనియెడల నిహపరలోక సుఖంబు నొందుట దుర్లభమయి యున్నది.

అయినను నాబోధలంబట్టి బౌద్ధధర్మాభిలాషయుఁ, దదాచరణమును నానాఁటికి వృద్ధి యగుచున్నవి. యింకయు వృద్ధి కాఁగలవు.

నాచేతిక్రింది యధికారులు కూడ వారు గొప్పయధికారులు కాని, మధ్యస్థులుకాని, స్వల్పాధికారులు కాని, నాయాజ్ఞలను శిరంబుల ధరించి పిఱికివారిని బ్రోత్సాహపఱచి కార్యోన్ముఖులనుగాఁ జేయుచు జనులను సన్మార్గం బవలంబించునటుల నొనర్చుచున్నారు. మార్గరక్షకు లయిన యుద్యోగులు (బాటసారులకుఁ దోడ్పాటు నొసంగువారు) కూడ నటులనే యొనర్చుచున్నారు. బౌద్ధధర్మము ననుసరించి రక్షణ యొసంగుట, పరిపాలించుట, సుఖింపఁజేయుట, నిరుపద్రవంబుగ నుంచుట యివియె నాపరిపాలన చట్టములు.

## ద్వితీయ స్తంభశాసనము.

### ప్రభు దృష్టాంతము.

(అనఁగా ధర్మాచరణంబునకుఁ బ్రభువు తననె దృష్టాంతముగాఁ బ్రజలకుఁ దెల్పుట.)

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు నుడువుచున్నాఁడు.

బౌద్ధధర్మము పరమోత్తమ మయి యున్నది.

బౌద్ధధర్మమనఁగా నేమి?

అహింస, బహుసత్క్రియాచరణము, కరుణ, సత్యము, పరిశుద్ధత యివి చేరియే బౌద్ధధర్మ మవుచున్నవి. అంతర్దృష్టి (జ్ఞానము) యొక్క దానమును నేను బహువిధంబుల నొసంగితిని. మఱియు ద్విపాజ్జంతువులకును, చతుష్పాజ్జంతువులకును, పక్షులకును, జలజంతువులకును, ననేక యుపకారంబులఁ జేసితిని. వానికిఁ బ్రాణోపద్రవంబుకూడ లేకుండఁ జేసితిని. ఇంక ననేక సత్కార్యంబుల నొనరించితిని. ప్రజ లీధర్మ మవలంబించి యాచరించెద రనియు, నీధర్మము చిరకాలము వెలయుచుండు ననియు, నీధర్మ మాచరించువాఁడు క్షేమపడు ననియు నిట్టి యుద్దేశముతో నీధర్మశాసనంబు లిఖింపఁ జేసితిని.

## తృతీయ స్తంభ శాసనము.

### ఆత్మశోధన.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు పలుకుచున్నాఁడు. మనుజుఁడు తా నొనరించిన సత్కార్యమునే తలఁచుకొను చుండును. కావున నే నీమంచికార్యంబు కావించితి నని వచించును. కాని తా నొనరించిన చెడుపనిని దలఁచుకొనఁడు. కాఁబట్టియే యీ దుష్కార్యము నీపాపకృత్యమునే నొనరించితి నని వాఁ డననే యనఁడు.

అత్యావశ్యకమయిన నీయాత్మశోధన నిశ్చయముగాఁ గష్టతరముగా నుండును.

అయినను క్రూరత్వము, కోపము, గర్వము, అసహిష్ణుకత (ఓర్వలేమి) యివి పాపలక్షణము లని మనుజుఁడు లక్ష్యమం దుంచుకొని "వీనివలననే యధోగతిపాలు కాకుందునుగాక" అని పలుకవలెను. పదంపడి ప్రథమమార్గము ప్రపంచమున కుపయోగకర మనియు ద్వితీయమార్గం బెట్లయి

వను బరలోక సాధక మనియు మనుజుఁడు ముఖ్యముగా నెఱిఁగి యుండ వలెను. *

## చతుర్ధ శిలాస్తంభ శాసనము.

† కమిషనర్లయొక్క యధికారములును, విధులును ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు వచించుచున్నాఁడు. నాపాలనమందు నిరువది యేడవ వత్సరంబున నీధర్మశాసనమును లిఖింపఁజేసితిని.

అనేక లక్షలజనమును బాలించుటకు కమీషనర్లను నియమించితిని. బహూకరించుటకును, శిక్షించుటకును వారికి స్వతంత్రాధికార మిచ్చితిని. అందువలన వారు సురక్షితముగాను, నిర్భయముగాను దమపనుల నెఱవేర్ప వచ్చును. మఱియు వారు ప్రజలకు క్షేమసౌఖ్యములఁ గలుగఁజేసి వారి కుపకారముల నొనరింపవచ్చును.

కమిషనర్లు ప్రజలయొక్క సౌఖ్యాసౌఖ్యములకుఁ గల కారణములను విచారించి తెలిసికొనవలయును. బౌద్ధమత ధర్మానుసారముగ దేశప్రజలను బ్రోత్సాహపఱచి యిహపరలోక లాభమును వారికిఁ గలుగఁ జేయవచ్చును. నాకమీషనర్లు నన్ను సేవించుటకు నధికాపేక్ష గల్గియున్నారు. నేను నియమించి యున్నయేజెంట్లు (కార్యనిర్వాహకులు) నాయభిప్రాయాను కూలముగ నన్నుంగొలువ సిద్ధముగ నున్నారు. మఱియు నవసరంబులం బట్టి హెచ్చరికఁ గలుగఁజేయుదురు. అందువలన కమిషనర్లును నాయనుగ్ర హంబుఁ గోరి పట్టుదలగఁ బనులు సేయువా రగుచున్నారు.

---

* ప్రథమమార్గ మనఁగా శోపాది దుర్గుణంబులకు వశుం డగుట. ద్వితీయమార్గ మనఁగా నాత్మశోధనవల్ల దుర్గుణంబుల నిరోధించుట.

† వీరు జిల్లాయధికారులకును, (ప్రాదేశికులు) గవర్నర్లకును మధ్యాధికార్లు.

ఎవఁడయినను దనశిశువును సమర్థురాలయిన దాయికి నప్పగించి దాయి తన శిశువును మిగులఁ బ్రేమతోఁ బోషించుచున్న దని యె ట్లనుకొనునో యారీతిగనే దేశముయొక్క క్షేమసౌఖ్యముల కొఱకుఁ గమిషనర్ల నియమించి ప్రజలను బహూకరించుటకును, దండించుటకును, వారికి స్వాతంత్ర్యమిచ్చి వారు తమపనులను నిర్భయముగాను, సురక్షితముగాను నమ్మకముగాను నెఱవేర్చునటులఁ జేసి యుంటి ననుకొనుచున్నాను.

రాజ్యపరిపాలనయం దేకపద్ధతి * యవసరము కావున నురిదండన విధింపఁబడిన వారికి నురిదినమునకుఁ బూర్వము 8 దినముల విశ్రాంతికాల మొసంగునటుల శిక్షాస్మృతియందు నొక యుత్తరువు కూడఁ జేసియుంటిని. ఇందువలన మరణదండనకుఁ బాత్రు లయినవారిలోఁ గొందఱియొక్కయయినను బంధువు లీమూఁడు దినములలో నాదోషులు తాము చేసియున్న నేరములఁ దలఁచుకొని పశ్చాత్తాప పడునట్లు చేసి యవ్విధమున వారి జీవములను బావనంబు చేయుదురు. అట్లు చేయుటకు వలను పడకుండినచో వారిక్షేమమునకై యాబంధువులు చెల్లింపఁ దలఁచియున్న మ్రొక్కుబడులను జెల్లించి చేయఁదలచిన యుపవాసములు చేసి మరణ సన్నిహితులై యున్నయట్టివారికిఁ బశ్చాత్తాపవృత్తిని బెంపొందింతురు.

ఏల యనఁగా దోషులు కారాగృహమం దున్నను గృషిచేసి పరలోకలాభంబుఁ బొందవచ్చు ననియు నింద్రియవశీకరణము మహౌదార్యమును గలవారలైన ప్రజలు నానావిధములయిన ధర్మాచారముల నొనరింపుచుండ వలయు ననియు నాయభిప్రాయము.

---

* ఏకపద్ధతి మరణదండన విషయముననే కాని కడమ శిక్షల విషయమై కాదని గ్రహింపవలయును.

## పంచమ శిలా స్తంభ శాసనము.

జంతువులను వధించుటను, చిత్రవధఁ జేయుటను నిబంధనలో నుంచు చట్టములు ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు వచించుచున్నాఁడు. ఈక్రింద నుదాహరింపఁబడు జంతువులను వధింపఁగూడ దని నాపాలన యొక్క యిరువది యేడవవత్సరంబున విధింపఁబడినది.

చిలుకలు, పెడిసెవంటిపక్షులు, బెగ్గురుకొంగలు, పొట్టిబాతులు, బాతులు, నక్కమూతివంటి మూతిగల గబ్బిలములు, పెద్దయాడు చీమలు, * చిన్నతాబేళ్లు, పెద్దగొయ్యచేపలు, టేకిచేపలు, తాబేళ్లు, ఏదుపందులు, ఉడతలు, దుప్పులు, ఆఁబోతులు, బల్లులు, ఖడ్గమృగములు, కాజులు, గ్రామపావురాలు, తినుటకుఁగాని మఱియొక పనికిఁగాని మనుష్యున కుపయోగింపని యితర చతుష్పాజ్జంతువులు.

ఆఁడుమేకలను, మేకపిల్లలను, పందులను నివి చూలుతో నుండినఁ గాని, పాలిచ్చుచుండినఁ గాని వధింపఁ గూడదు. వాని పిల్లలను 6 నెలలు పెరుగువఱకుఁ జంపఁ గూడదు.

కోడిపుంజులకు విత్తులు తీయఁ గూడదు. పురుగు లున్నయూఁకను దగులఁ బెట్టఁగూడదు. † విలాసార్థముగాఁ గాని, జంతువులకుఁ జెఱుపొనరించుటకుఁ గాని యడవులఁ గాల్పఁగూడదు. ‡ ఒక జంతువును బోషిం

* వీనిని వీర్యవృద్ధికై తిందురట.

† కీటకాదులను జంపుటకై కళ్లములో నున్నయూఁకను గొన్ని వేళలఁ దగులఁబెట్టుదురు.

‡ కొన్నివేళల విలాసార్థముగాను, గొన్ని సమయములయందు తృణాభివృద్ధికొఱకును, మఱికొన్నితరుణములయందు వేఁటమృగములను బయలకు వెడలఁ గొట్టుటకును గాననంబులఁ దహించెదరు.

చుటకై మఱియొక జంతువును జంపరాదు. *

ప్రతి ఋతువుయొక్క యంత్యమాసములోను, పుష్యమాసములోను, శుద్ధ చతుర్దశి, పౌర్ణమి, బహుళపాడ్యమి యీమూఁడు దివసంబులయందును, సంవత్సరము పొడుగున వచ్చు నుపవాస దినములయందును మత్స్యములను జంపఁగూడదు. విక్రయింపఁగూడదు.

ఆదినములయందే యేనుఁగులకొఱకై యురు లొడ్డఁబడిన స్థలముల యందును, జెఱువులయందు నుండు నితరజంతువులను హింసింపఁగూడదు.

ప్రతిపక్షములోను అష్టమి, చతుర్దశి, పౌర్ణిమ యందునను, చంద్రుఁడు పునర్వసు, పుష్యమి నక్షత్రములయం దున్నప్పుడును, ఋత్వంతమాసపూర్ణి మలయందునను, సర్వజనోత్సవ దినములయందును ఎడ్లకును, మేకపోతుల కును, పొట్టేళ్లకును, మగపందులకును, విత్తులు తీయరాదు. వాడుకగా విత్తులు తీయఁబడునట్టి మఱియేజంతువునకైనను విత్తులు తీయఁగూడదు.

పునర్వసు, పుష్యమి నక్షత్రములతోఁ గూడిన దినములయందును, ప్రతి † ఋతువుయొక్క చివరమాసమందు వచ్చు పున్నమలయందునను, శుక్లపక్ష ములయందునను గుఱ్ఱములకుఁ గాని, యెడ్లకుఁ గాని వాతలు పెట్టుట నిషే

* పావురములయొక్క రక్తముతో డేగలను బెంచునట్టి క్రూరాచార మిప్పటికిని గలదు.

† భరతఖండమునఁ బూర్వకాలమందు గ్రీష్మఋతు వని, వర్షఋతు వని, శిశిరఋతు వని సంవత్సరమును త్రివిధముగా విభాగించిరి. ఇందువలన గ్రీష్మఋతువునకు నాషాఢమును, వర్షఋతువునకుఁ గార్తికమును, శిశిఋతు వునకు ఫాల్గుణమును గడపటిమాసము లగుచున్నవి. ప్రతిమాసములో నాలు గుపవాసదినము లుండెను. మత్స్యములను జంపుటకుఁ గాని, విక్రయించు టకుఁ గాని సంవత్సరములో నేఁబదియాఱు దివసంబులు నిషేధింపఁ బడినది.

ధింపఁబడినది. * నేను పట్టాభిషిక్తుఁడ నయిన యిరువదియాఱవవత్సరంబు వఱకు నిరువదియయిదుపర్యాయములు కారాగృహవాసులను విడుదలఁ జేసితిని.

## ఆఱవ శిలాస్తంభశాసనము.

అన్ని మతశాఖలవారికిని దమ తమ మతముల నుపాసించుట యవసర మని తెల్పుటనుగుఱించి ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు వచింపు చున్నాఁడు.

జనులు తమదురభ్యాసములను బరిత్యజించి ధర్మమార్గ మవలంబించెద రనియు, నందువలన వారిక్షేమసౌఖ్యములను బెంపొందింపవచ్చు ననియు నాపరిపాలనయొక్క పండ్రెండవవత్సరంబున ధర్మశాసనములఁ జెక్కించి ప్రచురింపఁజేసితిని.

ప్రజలయొక్క క్షేమసౌఖ్యములను లక్ష్యమం దుంచుకొని వారిలోఁ గొందఱినయిన సుఖవంతులను జేసి నేను ధన్యత నొందుటకై నాస్వజనంబునందుంబలె నాకు దూరంబుగ నున్నవారియెడలను, సమీపవర్తులుగ నున్నవారియెడలను శ్రద్ధావంతుఁడ నయియున్నాను.

ఈప్రకారమె నానా సమాజములయందును లక్ష్యము కలవాఁడనై యున్నాను. నానాశాఖలవారికినిద త్తనుచితగౌరవంబులం జేసియున్నాను. † కావున ఒకశాఖవారు మఱియొక శాఖవారియెడల ననురాగముఁ గలిగి యుండుట నాముఖ్యాభిలాష యయియున్నది.

---

* పట్టాభిషేకదినోత్సవమును బ్రతిసంవత్సరమునందునఁ జేసిరి. ఆదినంబునఁ గారాగృహమం దున్నవా రందఱు విడుదలఁజేయఁబడిరి. వారిలో మరణదండన విధింపఁబడినవారు నుండిరి.

† 12-వ శిలాశాసనముయొక్క ప్రారంభవాక్యముం జూడవలెను.

నా పాలనయొక్క యిరువది యేడవవత్సరంబున నాయాజ్ఞ ననుసరించి యీధర్మశాసనము లిఖింపఁబడియె.

## సప్తమ స్తంభశిలా శాసనము.*

బౌద్ధధర్మవ్యాప్తికొఱకు నశోకరాజుయొక్క యుద్యమనములు.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు నివ్విధంబుగ వచించుచున్నాఁడు.

గతకాలమునందలి రాజులు బౌద్ధధర్మమును జను లేదోవిధముగ వృద్ధి చేయుదు రని యభిప్రాయపడిరి కాని యాధర్మమును వా రపేక్షించినటుల జనులు ప్రకాశింపఁజేయలేను. కాన నా కీమీమాంస కలిగెను. జనులు బౌద్ధధర్మమున కెట్లు విధేయు లగుదురు? అభిలషించిన ప్రకారము తన్మత వికాసమును వా రెట్లొనర్చెదరు? వారిలోఁ గొందఱిచేతనైనఁ దన్మత ధర్మం బెట్లాచరింపఁ జేయఁగలను? కాఁబట్టి ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు పలుకుచున్నాఁడు.

నా కీయూహ వొడమినది. ధర్మోపన్యాసములను జేయించెదను. ధర్మమందుఁ జెప్పంబడిన విధులను నేను బోధించెదను. ఈ యుపన్యాసములను

---

* ఈశాసనము ప్రియదర్శి ప్రభువుయొక్క యన్నిశాసన పేటికలకుఁ దాళపుచెవివంటిదై యీశాసనములకు భాష్యముగా నుండును. మఱియు దీనియందు బౌద్ధధర్మాభివృద్ధికై యశోకుని ప్రయత్నాష్టకమును, శాసనాంతమును సంగ్రహముగ సూచింపఁబడినవి. ఎనిమిది యత్నములేవనఁగా:—(1) ఉపన్యాసములఁజేయుట. (2) స్తంభశిలాశాసనములఁ జెక్కించుట. (3) మనుష్యులయొక్కయు, మృగములయొక్కయు సౌఖ్యార్థ మయిన యేర్పాటులఁ గావించుట. (4) ధర్మోపదేశకులను నియమించుట. (5) రాజకీయదాన వినియోగకరుల నియమించుట. (6) రాజుయొక్క స్వీయదృష్టాంతము. (7) ధర్మనిబంధనలను సంపూర్ణముగ విశదీకరించుట. (8) ధర్మసిద్ధాంతములను మననముచేయుటకై జనులను ప్రోత్సాహపఱచుట.

బోధలను విని జనులు లోఁబడవచ్చును. ప్రోత్సాహము కలవారలై తద్ధర్మాభివృద్ధిఁ గావింపవచ్చును.

ఈనాయభిలాష సిద్ధించుటకొఱకు ధర్మోపన్యాసంబులఁ జేయించితిని. అనేకములైన బోధలఁ జేయించితిని. నాబోధలను జనుల కందఱకును స్పష్టంబుగ వివరించుటకు నేజెంట్లను (అధికార్లను) నియమించితిని.

విశ్వాసపాత్రు లయిన జనులను నాబోధల నీయావిధముగ వివరించి తెల్పుటకు కమిషనర్ల నేర్పఱచితిని.

పైన వ్రాసిన ప్రయోజనముకొఱకె ధర్మాధికారులను నియమించి ధర్మోపన్యాసములఁ జేసితిని.

శిలా స్తంభశాసనములను స్థాపింపఁ జేసితిని.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభు విట్లు వచించుచున్నాఁడు. మనుష్యునకును మృగమునకును నీడ నొసంగుటకై బాటలలో మఱ్ఱివృక్షముల నాటించితిని. మామిడివృక్షములను వేయించితిని. అరకోసున కొక బావిని ద్రవ్వించితిని. (బాటసారులకు) విశ్రాంతిగృహములఁ గట్టించితిని. మనుష్యునకును మృగమునకు నుపయోగముగ నక్కడక్కడ ననేక పానీయశాలల నేర్పఱచితిని.

ఇట్టి సౌఖ్యమును గలుగఁజేయుట యొక గొప్పవిషయము కాదు. పూర్వపురాజులు కూడ నిట్టిమహోపకారములను బ్రజలకు నావలెనె చేసియున్నారు. కాని నే నీయుపకారములను జనులు బౌద్ధధర్మ మవలంబించెదరను నుద్దేశముతోడనె వారికిఁ జేసియున్నాను.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు నుడువుచున్నాఁడు. నాచే నియమింపఁబడిన ధర్మాధికారులు నానావిధము లయినధర్మసంఘములతోను, భిక్షువులతోను, గృహస్థులతోను అన్నిమతముల వారితోను బనిఁ గలిగియుందురు. మఱియు బౌద్ధమతాచార్యుల కృత్యములను గుఱించియును

బ్రాహ్మణులు, జైనులు, అజీవకులు, వీరిని గూర్చియు, నింక పలువిధము లయిన తెగలవారిని గుఱించియు వారు విచారించుచుండుటకుఁ దగినయేర్పాటులను జేసితిని.

సాధారణ దండనాధికారులు వారినియమితాధికారములను వారు చెల్లించుచుందురు. కాని ధర్మాధికారు లన్ని తెగలవారిని విచారించుచు నట్టి నియమితాధి కారములను గూడ నెఱవేర్చెదరు.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు వక్కాణింపుచున్నాఁడు.

వీరును నింక ననేకగొప్పయుద్యోగులును నేను చేయునట్టివిగాని, రాణులు చేయునట్టివి గాని రాజకీయదానములను (సత్పాత్ర) వినియోగము చేయుచుందురు. పదంపడి నగరమందుఁ గాని, దేశమందుఁ గాని యుండు రాజభవనములలో దానార్హసమయములను విపులముగ వారు సూచించుచుందురు.

నాభార్యల పుత్రుల యొక్క గాని, రాణుల పుత్రులయొక్కగాని * దానములను వినియోగించుటకు ధర్మాధికారులను నియమించియుంటిని. ఇందువలనధర్మకృత్యములును, ధర్మాచరణమును బెంపొందును. ఏలయనఁగాఁ గనికరమును, ఔదార్యమును, సత్యమును, బరిశుద్ధతను, శాంతమును, సజ్జనత్వమును మనుష్యులయందు వృద్ధియగుటనుబట్టి ధర్మకృత్యములును, ధర్మాచరణమును బెంపొందును.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు పలుకుచున్నాఁడు.

నేను చేసినమహాత్కార్యముల నన్నిటిని బ్రజలు గ్రహించి యొనర్చు

---

* ఇచ్చట స్వభార్యాపుత్రు లనియు, తనయుంపుడు కత్తెయొక్క పుత్రు లనియు భేదము గ్రహింపవలె నని యశోకచరిత్రకారుఁడు వ్రాసెను. రాణు లనఁగా గతించిన రాజుల భార్య లని మఱియొక చరిత్రకారుని యభిప్రాయము.

చున్నారు. ఇఁక ముందును నొనర్చఁగలరు. ఇందువలననె తల్లిదండ్రుల యెడల విధేయత గురువులయెడ వినయము, వృద్ధులయెడల గౌరవము, బ్రాహ్మణులను, భిక్షువులను, బీదలను, నిర్భాగ్యులను దుదకు సేవకులను, బానిసలను గూడ దయతోఁ జూచుట యిట్టి సద్గుణాలంబనమందు బౌద్ధ ధర్మ మభివృద్ధిం జెందుచున్నది. మఱియు నభివృద్ధి కాఁగలదు.

ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు వాక్రుచ్చుచున్నాఁడు.

ప్రజలయందు ధర్మాభివృద్ధి, ధర్మనిబంధనలవల్లను, ధర్మము మననము చేయుటవల్లను గలుగును. ఈ రెండువిధములలో ధర్మనిబంధనలు విశేషమైనవి కావు. ధర్మాచరణమె విశేషమయిన విధము. అయినను ఇట్టి యిట్టి జంతువులను హింసింపఁగూడదనియు, నింక నిటువంటివె మఱికొన్నియు నిబంధనలను జేసియుంటిని. జనులయందు ధర్మాభివృద్ధినిబట్టియును, వారు జీవజంతువుల కుపద్రవముఁ జేయుటను, వానిని హింసించుటను బొత్తిగా మానివేయుటను బట్టియు ధర్మోపాసన ఫలించుచున్నట్టు లెన్నవలెను. నావంశ మున్నంతవఱకును సూర్యచంద్రు లుండుపర్యంతమును ధర్మము చెడకుండ నుండవలె ననియు జనులు నాబోధను గ్రహించి యభ్యసింపవలె ననియు ఈశాసనము ప్రకటింపఁబడినది. అటుల నభ్యసించిన యెడల వారికి నిహపరలాభములు రెండును లభించును.

నాపాలనయొక్క యిరువది యెనిమిదవ వత్సరంబునం దీశాసనము చెక్కింపఁబడినది. ఘనతవహించిన ప్రియదర్శిప్రభు విట్లు దీనివిషయమై వచించుచున్నాఁడు.

ఎక్క డెక్కడ శిలాస్తంభములు గాని, పలకలవంటి శిలలు గాని యుండునొ యచ్చట నీధర్మము శాశ్వతముగా నుండుటకై యీశాసనమును జెక్కవలయును. ఈశాసనముతో స్తంభశాసనము లేడును సమాప్తిం జెందినవి.

## అనుబంధ శిలాస్తంభ శాసనములు.

అశోకచక్రవర్తియొక్క యిరువది యెనిమిదవపాలన వత్సరంబున నిం తదనంతర మెు చెక్కఁబడినవి.

### రాణియొక్క శాసనము.

#### రెండవరాణియొక్క దానములు.

ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువుయొక్క యాజ్ఞప్రకార మీదిగువ సంగతు లుద్యోగులకుఁ దెలుపఁబడుచున్నవి. మామిడితోపుగాని, యుద్యానవనముగాని, ధర్మసత్రముగాని, యింక నేదయినను గాని రెండవరాణి యేదానమును జేసిన నది యామె యొనరించిన దానముగానె గణింపవలెను. "తితివల" (Titivala) యొక్క తల్లి యయి కాలువాకి యను నామంబు గల రెండవరాణి యొసంగుటంజేసి పైన నుదాహరింపఁబడిన దానములామెకు శ్రేయం బొసంగవలెను. *

### కౌశాంబి శిలాస్తంభ శాసనము.

అలహాబాదునం దుండుశిలా స్తంభమందు రాణిగారి శాసనముగాఁ గనుపడిన యీశాసనము భాషాంతరీ కరించుటకు వలను పడనంత యసంపూర్తిగా నున్నది. దీనిలోని కొంతభాగము "సాంచి" స్తంభముమీఁద కూడఁ జెక్కఁబడినది. కాని యదియును రూపుచెడియున్నది. అయినను నెకమతమునకు మార్గ మొసంగినట్టు లీశాసనము బోధించుచున్నది. ఇంతటితో శాసనగ్రంథము ముగిసినది. ఈశాసనములు "పాలి" భాషలో

---

* ఈశాసన మనేకవిషయములను బోధించుటచే మనోహరముగ నున్నది. దీనివలన నేమి తెలియుచున్న దనఁగా నశోకున కిద్దఱు భార్యలు కలరు. వారిని రాణు లని యనిరి. ఆయిద్దటిలో రెండవరాణి పేరు కాలువాకి. ఈమె కుమారుఁడు తితివల యని తెలియుచున్నది. ఈశాసనము మాగధి భాషలో వ్రాయఁబడినది.

లిఖింపఁబడుటంజేసి పాశ్చాత్యపండితులు శ్రద్ధాళువులై యాభాష నభ్యసించి యాశాసనగ్రంథము నింగ్లీషులోనికి భాషాంతరీకరించి చదువరులకు వెలయింపఁజేసిరి. అది యిప్పు డీచరిత్రయం దాంధ్రీకరింపఁబడినది. కాని యీ శాసనగ్రంథమందుఁ బునరుక్తులు మెండుగఁ గల వనుటకు నశోకుఁడు తనకు మతధర్మంబునం గలయాదరంబుకతన నట్లు వచించితి నని పదునాల్గవశిలాసనంబున నుడివె. అయినను నట్టిపునరుక్తులవల్ల ధర్మస్వరూపంబు విస్పష్టంబు గాకుండుటంజేసి గ్రంథంబు చర్వితచర్వణంబుగ నున్న దనియె చదువరులకుఁ దోఁచవచ్చు నేమొ యని ధర్మస్వరూపంబు ప్రకాశింపఁజేయుటకై తత్సారాంశము లీక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి. బుద్ధకాలపు హిందూదేశచరిత్రకారుఁ డాసారాంశముల నిట్లు వ్రాసెను.

శిలాశాసనము నెం 1 రు.

(1) ఏజంతువు నైనను బలియిచ్చుటకు వధింపఁగూడదు.

(2) గొప్పస్థలములయందు సమాజోత్సవములను జేయఁగూడదు.

శిలాశాసనము నెం 3 రు.

(3) తల్లిదండ్రులయెడల విధేయత మంచిది.

(4) స్నేహితులు, పరిచయములు, బంధువులు, బ్రాహ్మణులు, భిక్షువులు వీరలయెడల నౌదార్యము మేలైనది.

(5) జీవజంతువుల బాధింపకుండుట మంచిది.

(6) మితవ్యయము, వివాదములను మానుట యివి సత్కృత్యములు.

శిలాశాసనము నెం 7 రు.

(7) ఇంద్రియవశీకరణము
(8) అంతఃకరణశుద్ధి
విపులముగ దాన మొసంగఁజాలని బీద

శిలాశాసనము నెం 7 రు. (9) కృతజ్ఞత (10) విశ్వాసము. }కైన నివి సాధ్యములును, శ్రేష్ఠములు నయిన కృత్యములుగా నున్నవి.

శిలాశాసనము నెం 9, 11 రులు.

(11) వ్యాధిగ్రస్తు లయినపుడును, వివాహములయందును, శిశుజననకాలములయందును, ప్రయాణసమయములయందును జను లాచారకర్మలను జేయుదురు. ఈయాచారకర్మలు దోషకలితములుగాను, నిస్సారములు గానున్నవి. ఇట్లుండఁగా శ్రేయస్కర మయిన కర్మ యొకటి యున్నది. దాని నాచరింపవచ్చును అది పైవానివలె నిస్సారము కాదు. సంపూర్ణఫలము నిచ్చును. అది యేదనిన బౌద్ధధర్మమె. ఈదిగువ లిఖింపఁబడునవియు మఱికొన్నియుఁ జేరి యాధర్మ మవుచున్నవి.

బానిసల యెడలను, సేవకుల యెడలను యోగ్యముగా నడుచుకొనుట. గురువులయెడల గౌరవము, అహింస, బ్రాహ్మణులయెడల, భిక్షువులయెడల నౌదార్యము. ఈసుగుణములన భ్యసించెదరేని బౌద్ధధర్మప్రకారము శ్రేయోదాయక మైనయాచారం బగును. కావున తండ్రిగాని, కొడుకు గాని, సహోదరుఁడు గాని, యజమానుఁడు గాని యాధర్మాచరణము యుక్తమయిన దని తమవారితో జోక్యము కలుగఁజేసికొని చెప్పవలెను.

శిలాశాసనములు నెం 9, 11 రులు.

ఇట్లు శాశ్వతలాభముకొఱకు క్రియాచారమొనర్పవలెను. జనులు పరోపకారము మేలనియెదరు. కాని ధర్మోపదేశము చేయుట కంటెను, ధర్మాచరణమునకు సహాయపడుట కంటెను ఇతరదానముగాని యేయితర సాహాయ్యముగాని యెక్కువయినదికాదు.

శిలాశాసనము నెం 12 రు.

(12) పరమతసహిష్ణుతఁగలిగి యుండవలెను. పరమతావలంబకు లయిన సమస్తలౌకికులను భిక్షువులను గౌరవింపవలెను. ఎవఁడుగాని పరమతమును నిందించి తనమతమును గొప్ప చేసికొనఁగూడదు. నిష్టురము లయినవాక్కులనె పల్కుట యోగ్యమయిన విషయముగానున్నది. ప్రతిమనుష్యుఁడును తనమతధర్మముయొక్క సారమును గ్రహించి దానియనుభవమును వృద్ధిచేసికొనుటకు యత్నించుట మంచిపని.

శిలాస్తంభ శాసనము నెం 2 రు.

(13) బౌద్ధధర్మ ముత్తమమైనది. అయినను ధర్మ మనఁగా నేమి? ఎవఁడయిన నల్పాభిలాషిగా నుండుట. *

---

* "అభిలాష" శబ్దము బౌద్ధమత సిద్ధాంతమందు సాంకేతికశబ్దమయియున్నది. ప్రారంభమం దభిలాషలు వారు మూఁడని చెప్పిరి:— (1) విషయాభిలాష, (2) జన్మాంతరాభిలాష, (3) అజ్ఞానజనితాభిలాష. పదంపడి పరవస్తువును నిరూపింపఁజాలని వేదాంతసూత్రములయం దభిలాష యని నాల్గవది మఱియొకటి కలదనిరి. బౌద్ధమతప్రకార మర్హతపదంబు

శిలాస్తంభ శాసనము నెం 2 రు.

పరుల కనేకము లయినయుపకారములు చేయుట, కనికరము, దాతృత్వమును, సత్యము, పరిశుద్ధత యివి చేరియె బౌద్ధధర్మ మగును.

(14) నరుఁడు తా నొనరించినసత్కార్యముల నే యెన్నుకొనుచు నే నీమంచిపనిని జేసితి నని చెప్పును. వాఁడు తాను కావించిన చెడుపనులను దలఁచుకొనఁడు. ‘ఆచెడుపనిని నేను చేసితిని. ఆపనియందు దోషమున్నది.’ అని వాఁడు చెప్పఁడు. ఇట్టి యాత్మశోధన దుష్కరము అయినను, ప్రతి మనుష్యుఁడును తా నొనరించినపనులను దాను పరీక్షించుకొనుచుండవలెను. మఱియుఁ బశుత్వము, క్రౌర్యము, కోపము, దంభము, ఇట్టి గుణములు దుర్గతికి నడపించును. ఓర్వలేమిచేత నేను దుర్భాష లాడకుందునటుల జాగ్రత్తగ నుండెదను. అట్టి జాగ్రత్తవలన నాకీలోకంబునను మిక్కిలిగాఁ బరలోకంబునను మేలుకలుగు నని వాఁడు వక్కాణింపవలెను.

ఉ. శాసనముల్ రచించి, యవి శాశ్వతబోధ నొనర్ప ఱాలపై
భాసిలఁ జేసి, ధర్మమును బాలనముం బలుమాఱు చాల వి

---

నొందినవాని కీయభిలాషలుండవు. ఆమతమును శ్రద్ధతో నుపాసించువానికి నల్పంబుగ నీయభిలాష లుండదగు నని యశోకుని యభిప్రాయము.

శ్వాసముతోడఁ దెల్పి, జనసంఘము నిందున నందు సౌఖ్యసం
వాసముగాఁ నొనర్చి, తగ వాసికి నెక్కె నశోకుఁ డెంతయున్.

---

# 10-వ అధ్యాయము.

## బౌద్ధధర్మ సిద్ధాంతసంగ్రహాదులు.

### (1) ప్రకరణము.

#### బుద్ధుని చరిత్ర మతసిద్ధాంతసంగ్రహము.

బౌద్ధధర్మమును గుఱించి విచారింపవలసిన ముఖ్యాంశములు.

అశోకచక్రవర్తి కళింగరాజ్యజయానంతరము బౌద్ధధర్మావలంబియై తదాచరణపరాయణుండై తనప్రజావర్గంబునకు ధర్మోపదేశకుండై వారలు ధర్మాచరణం బొనరించుటకు ననేకప్రయత్నంబులు గావించె నని గతాధ్యాయములయందు విశదీకరింపఁబడి యున్నది. మఱియు భూతదయాళుత్వాది మహాత్కార్యంబు లన్నియు బౌద్ధధర్మలక్షణంబులె యనియు నశోకుండు పావనశాసనంబులయందు జగద్విదితంబుఁజేసెను. కావున నట్టిపరమపావన ధర్మంబునుగుఱించి యీదిగువయంశంబులను మనము కొంత విచారింపఁదగియున్నది.

(1) బౌద్ధధర్మనిర్మాత యెవఁడు?

(2) అమ్మహనీయుని సంగ్రహచరిత్రం బేమి?

(3) ఆధర్మస్వరూపలక్షణంబు లేమి?

(4) ఆధర్మమునకును భరతఖండమందు బహుకాలమునుండి వ్యాపించి యుండిన యార్యమతమునకును భేద మేమి?

(5) ఆర్యమతానుసారులై యున్న భరతఖండవాసు లట్టిభేదధర్మము నవలంబించుటకుఁ గారణము లేమి?

(6) ఆధర్మమున నెంతవఱకు నశోకుండు వ్యాపింపఁజేసెను?

(7) అశోకుం డటుల ధర్మవ్యాపకముఁ దనరాజ్యమందుఁ బట్టుదలతో నొనరించుట రాజ్యపరిపాలనకు నవసరమయ్యెనా? లేక యుపకరించెనా?

(8) ధర్మమును దనరాజ్యమందును, మిత్రరాజ్యములయందును వ్యాపింపఁజేయుటయం దశోకునియభిలాష యేమి?

పై యంశంబుల వాస్తవంబును విచారించితిమేని తద్విచారణదర్పణంబున సత్వగుణాలంకారభూషిత మైన యశోకచక్రవర్తియొక్క హృదయంబును నిద్దంబుగఁ దద్దయుఁ జూడంగల మని తోఁచెడును.

(1) బౌద్ధధర్మనిర్మాత యెవఁడు?

క్రీ. పూ. ఏడవశతాబ్దమందు బౌద్ధమత మారంభమయినట్లు కనంబడుచున్నది. అది మొదలుకొని గౌతముఁ డయినబుద్ధుఁడు జన్మించువఱకుఁ గొందఱు బుద్ధులు గతించియుండిరి. ఇదిగాక గౌతమబుద్ధుఁడు తనకుఁ బూర్వము బుద్ధులు కొంద ఱుండి రని తనప్రసంగంబులయందు సూచించుచు వచ్చెను. ఈయన క్రీ. పూ. 6-వ శతాబ్దమధ్యమమున జన్మించి యుండు నని కొందఱును, క్రీ. పూ. 557 సంllమునందు జననంబొందె నని మఱికొందఱు నభిప్రాయులై యుండిరి. కావున గౌతమబుద్ధుఁడె బౌద్ధమతనిర్మాత కాఁడు. అయినను గౌతమబుద్ధునికిఁ బూర్వము బౌద్ధమతము మిగుల సంకోచావస్థలో నుండుటంజేసియు, నాయన స్వయంకృషివలన నది మిగుల నభివృద్ధిరయై వికాసావస్థ నొందియుండుటంజేసియుఁ దన్మతనిర్మాత గౌతమబుద్ధుఁడే యని జనులు గౌరవముతో భావించిరి. ఈకారణముచేతనె బౌద్ధయుగము క్రీ. పూ. 557 సంll మొదలుకొని 500 సంll వఱకు అనఁగా గౌతమబుద్ధునితోనె యారంభ మని చరిత్రకారు లెంచిరి.

(2) గౌతమబుద్ధుని సంగ్రహచరిత్రం బేమి?

బుద్ధుని జన్మస్థానము.

గోరఖ్పూరు జిల్లాకు నుత్తరమున కపిలవస్తునగరమునకు సమీపమున "లంబినివనము"నందు గౌతమబుద్ధుఁ డుద్భవించెను. ఈకపిల వస్తునగరము కోసల రాజ్యమున కీశాన్యముగా నున్నశాక్యవంశపురాజులయొక్క చిన్నరాజ్యమునకు రాజధాని. ఇది రోహిణీనది యొడ్డున నున్నది. గౌతముని తండ్రియయిన శుద్ధోదనుఁ డారాజ్యము నితరనాయకులతోఁ గలిసి పరిపాలించుచుండెను. ఆరాజ్యము నాయకసత్తాకరాజ్యము (Republic) అని యెఱుంగవలయును. గౌతముని జనని పేరు మాయాదేవి. ఈమె శాక్యవంశజుఁ డగుసుప్రబుద్ధుని కూఁతురు. గౌతముఁడు తనజననంబుచే లంబినివనమును బావనంబుచేసె నని యశోకచక్రవర్తి దానియందు గౌతముని కంకితంబుగ నొక శిలాస్తంభమును క్రీ. పూ. 329 సం॥న స్థాపించి దానిపై నిచ్చట మహాపురుషుఁడు జన్మించె నను పావనాక్షరంబులఁ జెక్కించెను. ఆకాలమందలియితరవంశములతోఁ బాటుగనీశాక్యవంశ మంతరించినను మహానుభావుఁ డైనగౌతముఁడు తనజన్మంబుచే దానిఁ బ్రకాశింపఁజేసినందున సర్వకాలంబు నది స్మరణీయం బైనవంశమయ్యె.

గౌతముని నామములకుఁ గారణములు.

గౌతమబుద్ధుఁడు గౌతమగోత్రజుఁ డగుటచే గౌతముఁ డనియు, శాక్యవంశజుఁ డగుటచే శాక్యముని, శాక్యసింహుఁ డనియు, పరతత్త్వమెఱుంగుటచే బుద్ధుఁ డనియుఁ, దలఁచినపరమార్థమును బడసియుండెం గాన సిద్ధార్థుఁ డనియు, మహనీయులు చెందియుండినపరమపదంబును బ్రాపించెఁ గాన తథాగతుఁ డనియుఁ బేర్కొనంబడెను. జన్మనామం బేదియొ తెలియదు.

ఈబుద్ధుఁడు జన్మించినపిమ్మట నేడవదివసంబుననె యాయన జనని కాలధర్మంబు నొందఁగా నీయన మేనత్త యయిన ప్రజాపతిగౌతమి యప్పటినుండి

బుద్ధుని బాల్యదశ.

యీయనను దల్లివలె బహుప్రేమతోఁ బోషించెనఁట. తనపుత్రుండు రాజభోగంబుల ననుభవించుటకై శుద్ధోదనుఁడు లేశంబైనఁ గొఱంత లేక సమస్తము సిద్ధపఱచుచుండినను ఆయన (బుద్ధుడు) సంసార సుఖము నెల్లక క్షాత్రధర్మమున కొడంబడక యత్యాశ్రమంబునకుం దగిన శాంతస్వభావంబుఁ గలిగి దయాళువై చింతాక్రాంతుఁడుగా నుండెను. తన

బుద్ధుని వివాహము.

యుఁడు బాల్యమునుండి యిట్లు విరాగిగా నుండుటం జూచి శుద్ధోధనుఁడు విచార పడి యతనిని సంసారమార్గమునం బెట్ట గట్టిగఁ దలపెట్టి యశోధర యనురాచపట్టిని దెచ్చి తనకొడుకునకుఁ బెండ్లి చేసెను.

బుద్ధునిజనకుం డాయన కొకయుద్యానవనంబులోఁ బ్రత్యేకంబుగ నివాసమందిరం బేర్పఱచి తనకుమారునకు దుఃఖకర మైన దేదియు దృష్టి గోచరంబు కానీయవల దనియుఁ, జెట్లక్రింద రాలం బడుటాకుల నయినఁ గండ్లపడనీయఁగూడ దనియు, సేవకులకుఁ గఠినముగ నాజ్ఞాపించెనఁట.

బుద్ధుఁడు నగరముఁ జూడఁబోవుట.

మఱియు నొకప్పుడు బుద్ధుఁడు రాజనగరంబుం జూడఁగోర జనకుండు తత్సమయంబునకు నగరం బంతయు నలంకరించియుండు నటుల ముందుగనె తగుప్రయత్నం బొనరించెను. అంతట బుద్ధుఁడు నగరమంతయుఁ జూచి జనులందఱు సుఖం బుండి రని సంతసించెను అనంతరము బుద్ధుఁడును గొంతకాలము సంసార సుఖంబు లనుభవించినను లంపటత్వము నొందకుండె నని యూహింపఁదగి యున్నది. జననం బాదిగ నిరువదియైదువత్సరంబులవఱకు బుద్ధుఁడు సుఖమే తప్ప కష్ట మెఱుఁగఁడనియుఁ జరిత్రకారులు తలఁచిరి. పిమ్మట మఱియొక



బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతమును సూచించు జింకలను
గూర్చిన జాతక కథ.

దినమున జనకునకుం దెలియకుండఁగనె నగరంబుం జూడఁబోవ బుద్ధునకు నొక రోగియు, నొక వృద్ధుఁడును, నొక శవంబును మార్గంబునఁ గానవచ్చెను. అందుమీఁదట సంసారచక్రంబునఁ బరిభ్రమించువారి కందఱికి రోగజరామరణంబులు తప్పక సంభవించు ననియు నవి దుఃఖకరము లగుటచే దుఃఖనివారణోపాయంబుఁ గనుంగొనవలె ననియు నిశ్చయించుకొని గృహంబునకు మరలెను. విశ్వాసపాత్రుం డైననిజసారథిని రథం బాయత్తంబు సేయు మని యాదినంబుననె యర్ధరాత్రంబున రహస్యముగ బుద్ధుఁ డాజ్ఞాపించి యప్పుడు తనసుందరాంగి యగునర్ధాంగియు ముద్దులమూటఁగట్టు పట్టియు నిద్రించుచుండు శయన మందిరంబునకుం బోయెను. అచ్చట కళంకరహితం బయిన చంద్రబింబముఁ బోలునామెవదనంబు దీపంబులవెలుంగున మఱియుఁ బ్రకాశించుచుండఁ గాంచి

దారాపుత్రాదుల యందువిరక్తి.

యామె వదనలావణ్య మనుసరోవరంబునఁ దనమనస్సు మునిఁగిపోవునేమో యని యామెం జేరక చక్కఁదనాల కిక్క యగు నక్కుమారుని వీక్షించి వాని నక్కునం జేర్చి ముద్దాడినచోఁ బుత్రేషణ పాశంబు తనయుల్లంబును బంధించు ననియేమో వాని డాయక బుద్ధుఁ డిది యంతయు మోహవిభ్రమం బని తిరంబుగ నెన్నిదిటం బూని వారిని ద్యజించెను.

ఇట్లాయన సుభోజ్యం బగు తనరాజ్యంబును, మనోహారిణి యగుభామామణిని, మారునిం బోలుకుమారుని విడిచి

బుద్ధుఁడరణ్యమునకుఁ బోవుట.

దుఃఖసముద్రమునుండి లోకంబు నుద్ధరించుటకు వెలువఁ బరికింప రథం బెక్కి యరణ్యంబుఁ జేరి సారథివేషంబుఁ దాను ధరించి తన రాజవేషంబు సారథి కిచ్చి రథంబు నిజనగరునకుం బంపివేసెను. పూర్ణవైరాగ్య

లక్షణం బన్న నిదియే కదా. ఆయన యంతటఁ దనశిరోజంబులఁ గత్తిరించివైచి సన్యాసిరూపంబుఁ దాల్చెను. అప్పటికి బుద్ధునకు ముప్పదివత్సరముల ప్రాయము.

## బుద్ధుఁడు గురువుల సేవించుట.

ఆరాదకాలఁపుడు.

పదంపడి బుద్ధుఁడు వైశాలియందు బహుశిష్యగణపరివృతుండై తత్త్వబోధాచార్యుఁడుగా నున్న ఆరాదకాలపుఁ డను బ్రాహ్మణుని శిష్యుఁడయ్యెను. ఆబ్రాహ్మణుఁడు సాంఖ్యయోగప్రతిపాదకుం డైన కపిలాచార్యుని శిష్యుఁడు. కావున నాయన సమస్తమయినయుపాధులయందాత్మ కలదనియు, నుపాధిప్రతిబంధకములనుండి విడుదల యగుట యే మోక్ష మనియుం దృఢంబుగఁ బ్రతిపాదించి బోధించెను. ఇట్టినిరూపణముబుద్ధునకు రుచింపలేదు. అంతట నయ్యాచార్యుని విడిచి రుద్రకరామపుత్రుఁ డను నాచార్యుని సేవించెను. ఈయన సహితము “అహం” అనుదానిఁ గూర్చి బోధించి కర్మను బునర్జన్మమును విశేషముగా నిరూపించెను. ఇదియు బుద్ధునకు హితముగా నుండలేదు. ఏల యనఁగా నాత్మ కలదని పునర్జన్మం బుండునని బుద్ధుఁడు నమ్మఁజాలఁడయ్యెను. బాధ, దుఃఖము వీనిని నివారించుకొను నుపాయమును దెల్పుదు రేమొ యని దేవస్థానాచార్యుల సేవించెను. దైవపీఠమున కెదుటఁ గ్రూరము లయినబలు లియ్యవలె నని వారు బోధింపఁగా బుద్ధునియొక్క మనంబున కది మిగుల నసహ్యంబుగఁ దోఁచి జీవహింసఁజేసి బలుల నిచ్చు యవ్విధంబున జనులు పాపంబులఁ బాపుకొనఁజాల రనియు, నీతిబాహ్య మయినమతము మతముకాదనియు వారి కాయనబోధించెను.

రుద్రకరామ పుత్రుడు.

దేవస్థానాచార్యులు.

పిమ్మట రుద్రకుఁ డనువానియొద్ద నయిదుగురు శిష్యులు యోగాభ్యాస మొనర్చుట యద్భుతంబుగఁ దోఁచి యాయన వలన యోగలక్షణంబులఁ గ్రహించి బుద్ధుఁ డాఱువత్సరంబులు ఘోరతపస్సుఁ జేసెను. ఇందువలన బుద్ధుఁడు మిక్కిలిగఁ గృశించి యొకదినమున నేటిలో దిగి స్నానమాడి యొడ్డెక్క లేకపోయెను. మఱి యొకప్పుడు బుద్ధుఁడు తనకు నిస్త్రాణ రాఁగా నేలం గూలి మృతప్రాయుఁ డుగా నుండఁగా నాదారిని దైనికంబుగ నేగుచున్న యొకగొల్లచిన్నది యింత గంజి పోయఁగాఁ బునర్జీవితుం డయ్యెను. అంతటఁ దపస్సువలన మనంబు క్లేశపడుటయు, దేహంబు శుష్కించుటయు నే గాని మోక్ష మార్గంబు చేకూర దని నిశ్చయించుకొని యాగురుశిష్యులను విడిచి బుద్ధుఁడు వెళ్లెను.

బుద్ధుఁడుయోగా భ్యాసము చేయుట.

తర్వాతఁ దపస్సును బొత్తిగా మానివేసి శరీరారోగ్యమునకు వలసిన విషయంబులఁ బాటింపుచుఁ దనబుద్ధిబలం బును నమ్ముకొని యాత్మశోధనయు, విచారణ యుఁ జేయఁబూనెను. ఒకరాత్రివేళ నశ్వత్థ వృక్షముక్రింద నాసీనుఁడై నిశ్చలచిత్తంబుతో విచారణఁ జేయఁగా దత్వంబు సలక్షణంబుగ బుద్ధునకు బోధపడియెను. బుద్ధుఁడు కనుంగొనినతత్వమునకు సంబోధి యనియు, స్వబోధన మనియు బౌద్ధులు పేరు పెట్టిరి. గురువుగాని, యీశ్వరుఁడుగాని సాహాయ్యపడకుండ స్వబుద్ధిప్రభవలవను స్వప్రయత్నము వలనను దత్వముం గన్పెట్టెను గాన దానికి స్వబోధన మనునామము సార్థకం బని చరిత్రకారులు తలఁచెదరు. సంబోధిని (తత్వమును) గనుఁగొనినపిమ్మట నె గౌతమునకు బుద్ధుఁ డను పేరు వచ్చెను.

బుద్ధుఁడు సంబోధినిం గనుట.

సంసారసాగరమందు మునిఁగి కొట్టుకొనుచుండు జీవుల నుద్ధరించుట

**ధర్మబోధకై బుద్ధుఁడు కాశికివెళ్లుట.**

మహత్కార్యం బనియుఁ, దాను తెలిసికొనిన తత్వమును బోధించినయెడల వారలాసాగరమును దరించెద రనియు నిశ్చయించుకొని బుద్ధుఁడు కాశీనగరమునకు వెళ్లెను. అచ్చటఁ గౌండిన్యుఁ డనునాయనయొక్క నలుగురుశిష్యులును బుద్ధుని రాకఁ జూచి యితఁడు తపశ్చర్య నుల్లంఘించెఁ గావున నితనికిఁ బ్రత్యుద్ధానాభివందనంబు లొసంగఁగూడ దని కృతనిశ్చయులై యుండిరి కాని వారికి బుద్ధునిముఖసందర్శనంబు కాఁగానె వారి నావహించియున్న యసూయా దేవి పలాయన మయ్యె. అంతట వార లాయన కుచితసత్కార్యంబు లొనరించిరి. పిమ్మట వారికి బుద్ధుఁడు ధర్మబోధఁ జేసెను. ఈబోధనె ధర్మచక్రప్రవర్తనసూత్ర మని బౌద్ధు లనియెదరు. బుద్ధుఁడు చేసినబోధలలో నిదియె ప్రథమబోధ. గురువును, శిష్యులును గలిసి వా రయిదుగురును ప్రథమబౌద్ధసంఘ మయిరి. అనంతరము కాశియందె యొక గొప్పవానికుమారుఁడు యౌవనప్రాయమందుండి మహానిరాగియై సంచరించుచు నొకరాత్రి బుద్ధునిచే బోధింపఁబడి యాతఁడు తనయనుచరులగు 54 గురితో బుద్ధధర్మమును స్వీకరించెను.

**సంఘనిర్మాణము.**

సంఘమం దిట్లేర్పడినయఱువదిమందికి బుద్ధుఁడు బౌద్ధధర్మమును సమగ్రముగ బోధించి యన్నిదిశలయం దుండుజనులకు బాహాటముగా ధర్మమును బోధించుటకై వారిని ధర్మోపదేశకులనుగాఁ బుత్తెంచెను.

**సంఘములోఁ జేరిన ముఖ్యులు.**

పిమ్మటఁ గ్రమక్రమముగా ననేకులు సంఘమునం జేరిరి. అటులఁ జేరినవారిలో ముఖ్యులగుకొందఱిని గుఱించి యీదిగువ విశదీకరింపఁబడుచున్నది.

(1) రాజగృహానగరమం దుండుశారీపుత్రుఁడును మౌద్గల్యాయనుఁడును, సాంఘికు లయిరి. వీరు గొప్పవిద్వాంసులు. త్రిపేటిక యనుబౌద్ధధర్మగ్రంథములలోఁ దత్వబోధక మయిన యభిధర్మగ్రంథమును వీరే రచించి రని చెప్పెదరు. వీరిని బుద్ధుఁడు మిగుల గౌరవించెను.

(2) వేణువనమందు బుద్ధుఁ డుండఁగా నచ్చటి పండితుఁ డయినమహాకస్యపుఁ డనుబ్రాహ్మణుఁడు తనపతివ్రత యయినభార్యను దనయమితభాగ్యమును ద్యజించి సంఘమునఁ జేరెను. బుద్ధునిమరణానంతరము అజాతశత్రు వనురాజుయొక్క ప్రాపకముక్రింద "రాజగృహ" నగరమందు జరిగిన పరిషత్తు నీపండితుఁడే సమకూర్చి బహుభిక్షువుల సాయంబుచే "త్రిపేటికా" గ్రంథమును నిర్మించెను. బౌద్ధమతమున కీయనను ప్రధానాచార్యుఁ డనియుఁ జెప్పవచ్చును.

(3) కోసలరాజ్యప్రభు వయినప్రసన్నజిత్తు మొదలయినకొందఱు రాజులును, కపిలాచార్యుని శిష్యుఁ డయిన పంచశిఖుఁడు మొదలగుకొందఱు బ్రాహ్మణులును సాంఘికు లైరి

(4) (*a*) అంగుళిమాలుఁడు. వీఁడు బందిపోటుదొంగ, ప్రాణిఘాతుకుఁడు. కోసలరాజ్యమునకుఁ బెద్దపులివంటివాఁడు.

(*b*) "ఆలవికుఁడు". వీఁడు నరమాంసభక్షకుఁడు.

(*c*) "ఉగ్రసేనుఁడు". వీఁడు దొమ్మరివాఁడు.

(*d*) "ఉపాలి". వీఁడు మంగలి. త్రిపేటికలోఁ జేరినవినయగ్రంథ మంతయు వీనికి జిహ్వాగ్రమం దుండెను.

(*e*) "సునిత". వీఁడు పాకివాఁడు.

ఏజాతివాఁడైనను, నేవృత్తివాఁడయిన సర్షుఁ డనితోఁచినయెడల వానిని బౌద్ధులు తమసంఘములోఁ జేర్చికొనుటను దెల్పుటకై నం 4 రులో నీచజాతివారి పేర్లను వ్రాయుట కలిగినది.

(5) బుద్ధునిబంధువు లయినశాంక్యవంశజులును గొందఱు సంఘములోఁ గలిసిరి. వా రెవ రనిన:—

(a) బుద్ధునితండ్రి యయినశుద్ధోదనుఁడు, (b) బుద్ధుని పుత్రుఁ డయిన రాహులుఁడు, (c) బుద్ధుని భార్య యయిన యశోధర, మేనత్త యయిన ప్రజాపతి గౌతమి.

ఈ నంబరులోఁ జివరఁ జెప్పఁబడినయిద్దఱును స్త్రీలగుటచే సంఘములోఁ జేర్చుకొనుటకు బుద్ధుని కిష్టము లేదు. అయినను దనను బెంచిన మేనత్తయొక్క ప్రార్థనలవలనను, దన ప్రియశిష్యుఁ డైనయానందుని యిష్టముచొప్పునను స్త్రీసంఘ మొకటి యాయన ప్రత్యేకముగా నేర్పాటుచేసెను.

స్త్రీసంఘము.

ఇంతవఱకు బుద్ధుఁడు సంకల్పసిద్ధిం జెంది సిద్ధార్థుఁ డనుతనదివ్యనామము సార్థకం బొనరించుకొనెను. కాని వెలుఁగు వెంబడి చీఁకటి యున్నటుల శ్రేయస్కరము లయినకార్యములకు విఘ్నకారులు కొందఱుందురు కదా. బుద్ధుని దాయాదులలో నొకఁ డయినదేవదత్తుఁడు బుద్ధుని మతనిబంధన లతిసులభముగా నున్న వని తలఁచి కఠిననిబంధనలతోఁ బ్రత్యేకసంఘ మొకటి యేర్పాటుచేసెను. బింబిసారుని పుత్రుఁ డయినయజాతశత్రు వనురాజా సంఘమునకు విహారారామ మొకటిఁ గట్టించియిచ్చెను. కాని యాసంఘములో నెక్కువమంది చేరనందునను, బుద్ధునిసంఘము దినదినప్రవర్ధమానంబుగ నుండినందునను నోర్వలేమి దేవదత్తునితలకెక్కి బుద్ధునిప్రాణంబుం బుచ్చుకొమ్మని యాతనిఁ బురికొల్పెను. బుద్ధునిఁ జంపుటకు దేవదత్తుఁడు నియమించినఘాతుకులు బుద్ధునిఁ గనుంగొనిన

బుద్ధునకుఁ గలిగిన శత్రుబాధ.

దేవదత్తుఁడు.

తోడనె తమమనస్సులు కరఁగుటంజేసి యాయన బోధనను వినిరి. గృధ్రకూటమునుండి బుద్ధునిమీఁదికిఁ దొర్లింపఁబడిన యొకఱాతిబండ రెండుతునకలై బుద్ధునికిఁ దగలకుండఁగనే పోయెను. దారివెంబడి వచ్చుచుండఁగా బుద్ధునిపైకిఁ దోలఁబడినయేనుఁగు బుద్ధునిఁ జూచి సాధు వయ్యెను. అంతట దేవదత్తుఁడు విఫలమనోరథుఁడై తనదుష్కృత్యములను మిగులఁ బరితపించి తాళఁజాలక బుద్ధుని శరణుఁజొచ్చి తత్త్వంబుఁ దెలిసికొని తుదకుఁ జిత్తశాంతిం బొందెను.

దేవదత్తుని పరితాపము.

బుద్ధునియంత ప్రసిద్ధింజెందినవారు కాకపోయినను కొంద ఱితరమతాచార్యు లాయనకాలమం దుండిరి. మఱియు నప్పుడు మతాభిమానములు మెండుగా నుండెను. అట్టి భిన్నమతాచార్యులలో నైదుగురి పేర్లు మాత్రము బౌద్ధగ్రంథములయందుఁ గన్పట్టుచున్నవి.

బుద్ధునికి ద్వేషులైన యన్యమతాచార్యులు.

(1) సంజయబిలాధిపుత్రుఁడు. ఈయన యాత్మవిచారణను నిరాకరించి సర్వము సంశయగ్రస్త మని సిద్ధాంతపఱచెను.

(2) అజితకేశకంబళుఁడు. ఈయన సూక్ష్మవిచారణవలన జ్ఞానము కలుగ నేరదనియు, భూమి, జలము, వాయువు, అగ్ని, వీనితో మానవశరీరము నిర్మింపఁబడిన దనియు, మరణకాలమం దివి వీడిపోవు ననియు సిద్ధాంతీకరించెను.

(3) పురాణకశ్యపుఁడు. ఈయన ధర్మాధర్మవిచారణఁజేయక సమభావము కలవాఁడై సర్వసమభావమునే యొకమతముగా నేర్పాటుచేసెను.

(4) మాఖలిగోసలుఁడు. ఈయనయే "ఆజీవక" మతోద్ధారకుఁడైయుండియుండవచ్చును. ఈయన సర్వము గత్యధీన యున్నదనియు,

మనుష్యయత్నములో నేమియు లేదనియు సిద్ధాంతపఱచెను. మఱియు గతి ననుసరించి జీవు లనేకజన్మ లెత్తగాఁ దుదకుఁ బాపపుణ్యావివక్ష లేకుండ నన్నిజీవులకు జన్మరాహిత్య మగు ననియు ఆయన సిద్ధాంతము.

(౬) మహావీరుఁడు. ఈయన జైనమతముయొక్క పునరుద్ధారకుఁడు. అన్నిప్రాణులకు నాత్మ లుండు ననియు, ఆయాత్మలే తిరిగి జన్మంబు లెత్తు ననియు, వృక్షములుగాను, నచేతనంబులుగాను గూడఁ బునర్జన్మంబులు కలుగు ననియుఁ జెప్పెను. మఱియుఁ దపస్సువలనను, నైష్కర్మ్యమువలనను ముక్తి గలుగుననియు, నాత్మహత్య బహుయోగ్యమును శ్రేయస్కరము ననియు ఈయన సిద్ధాంతము. ఈయన కాలమం దీయనకు 2,00,000 శిష్యు లుండి రని జైనులు చెప్పెదరు.

అన్యమతాచార్యులు. బుద్ధునికిఁ జేసిన యపకృత్యములును వారు చెందిన పరాభవములును.

పైని జెప్పిన భిన్నమతాచార్యులు తమమతంబులను విశేషజనంబులు స్వీకరింపక బుద్ధుని ధర్మమునే యవలంబించుటయు, భక్తిగల లౌకికులు బుద్ధసంఘములోఁ జేరినవారికే దానంబు లొసంగుటయుఁ, జూచి యసూయాపరవశులై బుద్ధునిగౌరవమునకు హానిఁ గలుగఁజేసి భ్రష్టీకరింపవలె నని తలఁచిరి. తనతో బుద్ధుఁడు వ్యభిచరించె నని సంఘముయొక్క యెదుటఁ బల్కునట్లు భిన్నమతయోగిని నొకదానిని వారు పురికొల్పిరి. దాని ద్రోహకృత్యము బయలుపడినందున నది కఠినశిక్ష ననుభవించెను. ఇంతటితో వారు విరమింపక సుందరి యను నొకదానివలన నట్టియల్లరినే చేయించిరి. పిమ్మట దానిని ఘాతుకు లైన కొందఱిచే వారు చంపించి యాశవమును బుద్ధు డుండుజేతవనపరిసరమం దున్నపొదలలోఁ బడవేయించిరి. బుద్ధుఁడే యీహత్యఁ జేయించె నని యామతాచార్యులు ప్రతిపాదించి యాయనను న్యాయవిచారణ చేసి శిక్షింపుఁ డని రాజును



ఒక పవిత్రవృక్షమున వసించుచుండిన నాగులకు తన మత
మును బుద్ధుడు బోధించుట.

గోరిరి. ఇట్లుండఁగా బైని జెప్పఁబడిన ఘాతుకులు త్రాగి యొడలు మఱచి యాహాత్య నెందఱోరలపైఁ బెట్టుకొని కలహింపఁ దొడంగిరి. వారిని బట్టుకొని దండనాధికారులు విచారింపఁగా వారు నేరముగ నొప్పుకొనుచుఁ దమ్ములఁ బ్రేరేపించినవారి పేర్లను గూడ బయలుపఱచిరి. ఇట్లసూయాపర వశులైనవారు తెగులులేకయే పొగలుట గాక జగంబు నగదుం జెంది మిగుల నొగులుటయుఁ గలుగుం గదా.

ఇంతమట్టుకు బుద్ధుని ప్రభావంబును, దద్వైరులయొక్క దుష్టబుద్ధులును, వారు పొందినవంచనలను బరిగణించితిమి.

బుద్ధునిబోధనాశక్తి.

ఆయన మతబోధనాశక్తిని గొంచెము విచారించెదము. శిష్యులయొక్క శక్తికిం దగినట్లాయన బోధించెను. పండితులతో మర్యాదగాను, సయుక్తికముగాను సంభాషించెను. జనసామాన్యముతోఁ బ్రసంగించునపు డుపమానములు, సామెతలు, కట్టుకథలు, దృష్టాంతములు, చరిత్రాంశములు మొదలయిన వాని నుపయోగించెను. ఒకప్పుడు బుద్ధుఁడు దక్షిణగిరియం దుండఁగా బ్రాహ్మణాగ్రహార మయిన "యెకనాల" యనుగ్రామమునకు వెళ్లెను. అక్కడ "కృషి భారద్వాజు" లనునొక బ్రాహ్మణుఁడు

కృషిభారద్వాజుతో బుద్ధునిప్రసంగము.

పొలములో సేద్యముఁ జేయుచు బుద్ధుఁడు తనను సమీపింపఁగా గౌరవింపక ఓయి శ్రమణా! (నింద్యజీవనము కలవాఁడా!) నావలె నీవును వ్యవసాయము చేసికొని జీవింపుము" అనెను. అంతట బుద్ధుఁ డిట్లు సరసముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. "నేనును దున్ని విత్తనము వేసి దానిఫలము నె యనుభవించుచున్నాను" అనెను. "నీవ్యవసాయసామగ్రి యేది" అని బ్రాహ్మణుఁడు మరల నడిగెను. అందుకు బుద్ధుఁ డిట్లు నుడివెను. "నేను విశ్వాస మనుబీజము నాటితిని, నేను చేయు

నుపాసనయే దానికి వర్ష మయ్యెను, వినయమేనాఁగేటిదుంప, మనసే మోకు, లక్ష్యమె నాఁగేఁటి కఱ్ఱు, సత్యమే వానికి బంధనము, కనికరమే బంధమోక్షము, పట్టుదలయే గుఱ్ఱములు, యెద్దులు. ఇట్లు వీనితో వ్యవసాయముఁ జేయుచుఁ భ్రమ లనెడుకలుపుమొక్కలను దీసివేసి నిర్వాణసుఖ మనుపంట ననుభవించుచున్నాను." ఆబ్రాహ్మణుఁ డామాటలు విని "గౌతమా! ఈ క్షీరాన్నము తినుము. నీవే సత్యమయిన వ్యవసాయకుఁడవు. నీపంట శాశ్వతపుపంట" యని యాయన పలికెను. బుద్ధునిబోధ వినినవాఁ డెవ్వఁడైనను ఆయన శిష్యుఁ డైతీరెను.

బుద్ధుఁ డెనుబదిసంవత్సరములు జీవించి తుదకు వ్యాధిగ్రస్తుఁడై నేపాళదేశమం దుండుతెరాయికిఁ దూర్పుగ నున్న కుశినగరమందు క్రీ. పూ. 477సం॥నందుఁ గాలధర్మము నొందెను.

బుద్ధునిమరణము.

ఈమహనీయుఁడు తనయవసానకాలమందు సహితము సుభద్రుఁ డనునొకసన్యాసిని బిల్చి వానికి అష్టాంగమార్గమును బోధించి ధన్యునిఁ జేసెను. మరణించుసమయమం దాయన తనశిష్యులతోఁ బల్కిన దేమనిన "పదార్థసంయోగ జనితములైనయీశరీరములకు వియోగము తప్పదు. ధర్మకాయ మొకటియె శాశ్వత మైనది. జ్ఞానమును వెదకి స్వయంకృషివలన నిర్వాణంబు నొందుఁడు" ఇవియె యాయన చివరవాక్యములు.

అవసానవాక్యములు.

ఈమహానుభావునిచరితమును గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగా లిఖించి యింతటితో విరమించుచున్నాము.

కుశినగరమం దున్నమల్లనాయకులు బుద్ధుని పవిత్రశరీరమును రాజాధిరాజులకుం దగినమర్యాదతోను, వైభవముతోను కుశినగరమందు దహ

నముచేసి యస్థికలను దద్గ్రామ మందున్న సభామందిరమునకుం గొంపోయి యాయుధశాలయం దుంచి యస్థికలపైఁ బూలదండలు వేసి పరిమళద్రవ్యములు పోసి సంగీతములఁ బాడి నాట్యములు చేసిరఁట. మఱియు నీమహాపురుషుని యస్థికలలోని కొంతభాగమును మగధరాజయిన యజాతశత్రువును, "లిచ్చిరి." నాయకులును మఱికొందఱు భక్తులును దమకుఁ బంపుఁడని మల్లనాయఁకులను గోరఁగా వారు సమ్మతింపరైరి. ద్రోణుఁ డనుబ్రాహ్మణుఁడు వారికిట్లు భోధించెను "బుద్ధమహాముని సర్వసోదరత్వమును బ్రతిపాదించి బోధించియుండె కావున బుద్ధముని యొక్క యస్థికల నపేక్షించినవారలు మీరు సోదరులె యగుదురు. కావున వారికి అస్థికలను బంచిపెట్టుఁడు" అని హితోపదేశము చేసెను. అంతట మల్లనాయఁకు లాయననే పంచిపెట్టు మని ప్రార్థించిరి. అట్లే యాబ్రాహ్మణుం డొనర్చెను. అస్థికల (ధాతువుల) లోనిభాగములం గొన్నవారు ధాతుగర్భంబులం దాభాగములఁ దాచిపెట్టికొనిరి. పిమ్మట యశోకచక్రవర్తి తనపరిపాలనకాలంబులో నాపురాతన ధాతుగర్భంబులఁ దెఱచి యాయస్థికలను దనరాజ్యమందంతట వినియోగపఱచి వానిపై నెనుబదివేలస్తూపంబులను (సమాధులను), ధాతుగర్భంబులను గట్టించి వానిని సురక్షితంబులఁ జేసెను. బుద్ధమునిని లోకోపకారి యనియు, మహానుభావుఁ డనియు జనులు భావించి కృతజ్ఞులయియుండి రనుటకు నింతకంటె వేఱు తార్కాణం బేల.

బుద్ధునియస్థికలు.

మల్లనాయకులు.

అస్థికలపై నశోకుండు స్తూపంబులఁ గట్టించుట.

(8) బౌద్ధధర్మలక్షణంబు లేమి?

ఈధర్మమం దీశ్వరుఁడు లేఁ డని ప్రతిపాదింపఁబడినది. ఈశ్వరుఁడే

ఈశ్వరుఁడు లేఁడు వేదము లనవసరంబులు.

లేఁ డనునప్పు డీశ్వరనిర్మితము లని యార్యులు భావించు వేదంబులును బౌద్ధుల కనవసరంబు లయ్యె. కావున దైవభయము గాని భక్తి గాని, యవాఙ్మానసగోచర మయినది యొకటి యున్నది దానిలో నైక్యము నొందవలెననుట గాని బౌద్ధమతస్థులకు లేవు.

బౌద్ధధర్మమునకు మతలక్షణము లేదు.

“లోకమునందు దేవుఁడు లేఁడని బోధించు నట్టిమతమే యుండదు. కనుక దేవుఁడు లేఁ డనుటవలన బౌద్ధధర్మమును మత మనుటకు వలనుపడదు. అయినను మత మనునది దాని నవలంబించువారికి నుత్సాహంబును, నాసక్తిని నొసంగు నని చెప్పఁదగిన యెడల బౌద్ధధర్మం బారెంటినిఁ గలుగఁజేయును గాన నాపక్షమందు బౌద్ధధర్మమును సయిత మొకమతముగ గణింపవచ్చు” నని యొకగ్రంథకర్త వ్రాసెను.

ఈశ్వరవేదములను గుఱించి బౌద్ధులయభిప్రాయమునకు గారణము లీగ్రంథమున కనవసరము.

పైని వ్రాసినప్రకారము దేవుఁడు, లేఁడనియు, వేదము లప్రమాణము లనియు, సాధించుటకు ననేకకారణములు “బౌద్ధమతగ్రంథసార” మందు వ్రాయఁబడి యున్నవి. కాని యీచరిత్ర కవి యన్నియు ననవసరంబు లని విడువఁబడుచున్నవి. బౌద్ధసిద్ధాంతములలోని ముఖ్యవిషయంబులె యీ క్రింద వ్రాయఁబడును. బుద్ధముని జనుల కుపదేశించిన దేమనఁగా.

ప్రత్యక్షానుమానములు

(1) బౌద్ధధర్మమునకుఁ బత్యక్షానుమానములే ప్రమాణములు. కావున నీధర్మమును వినువారు తమకుఁ బ్రత్యక్షానుభవములు గాను, ననుమానసాధ్యములు గాను

ప్రమాణంబులు.

ఉన్న విషయంబులనే గ్రహింపం దగును. గ్రహించినమాత్రముననె కాదు. వానినాచరించి తమ్మును దాము ఉద్ధరించుకొనవలెను. ఈశ్వరుఁడు గాని, యితరులు గాని వారి నుద్ధరింపలేరు. తపస్సులు, పూజలు, ప్రార్థనలు ఇవియును వారి నుద్ధరింపలేవు.

ప్రపంచలక్షణము.

(2) ఈపరిదృశ్యమాన మయినప్రపంచము మిథ్య కాదు. నిత్యమును గాదు. మఱి మనినఁ బ్రతిక్షణమును మాఱుచు నుండును. ప్రపంచము కనుపడుచుండుటచే మిథ్య కాదు; మాఱుచుండుటచే నిత్యము కాదు. మఱియుఁ బ్రపంచమునందుఁ గారణకార్యపరంపర గానంబడుచున్నది. ఒకటికి మఱియొకటి కారణమై యాకారణ మింకొకదానికిఁ గార్య మగుచున్నది. ఎట్లనఁగా ఎండ, ఆవిరి, మేఘము, వర్షము వీనిలోఁ బూర్వ పూర్వములు కారణములును, నుత్తరోత్తరములు కార్యములు నగుచున్నవి. ఇట్లు కారణకార్యవిచారణ చేయఁగా కార్యరూపముగా నున్నయీప్రపంచమునకు నాద్యంతములు గానఁబడవు.*

కారణకార్యపరంపర.

* ఈకారణకార్యసంబంధమం దొకవిశేషంబు కలదు. బీజమునుండి మొలక యేర్పడుటకు బీజమందె యాసత్తారూప మయినకారణ మున్నది. ఆకారణమును బౌద్ధధర్మమందు హేతు వందురు. ఆబీజమునకుఁ దోడ్పడు భూమి, నీరు, వెలుఁగు, గాలి, బయలు మొదలయిన వన్నియు బౌద్ధులు కారణసముదాయ మందురు. (అద్వైతశాస్త్రమందు కుండ కార్యము. కుమ్మరివాఁడు నిమిత్తకారణము, మృద్ద్రవ్యము ఉపాదానకారణ మందురు). ఈలాగుననె విజ్ఞానబీజము (చైతన్యము) నామరూపములకు హేతువు; జననీజనకుల సంయోగము, జననిగర్భము మొదలయినవి కారణములు. కారణ

ఈశ్వరుఁడే కారణ మని యార్యులు ప్రతిపాదించెదరు కాని యదియు బహువిధంబుల నసంగతంబుగనె యున్నది. మఱియుఁ బ్రపంచమున కాదికారణం బెద్దియొ, యంత మెప్పుడోయని విచారించుటకూడ మనము దుఃఖవిముక్తులమయి ముక్తిం జెందుట కుపకరింపదు. కానఁ దద్విచారంబు మన కవసరంబు కాదు.

అహంపదార్థవిచారణ.

(8) ప్రతి నరునియందు అహం (నేను) అనునది యొకటి యనుభవముగా నున్నది కదా. ఇది రూప, వేదన, విజ్ఞాన, సంయోజన, సంస్కారము లను పంచస్కంధములవలన నేర్పడును. రూప మనఁగా స్థూలదేహమూలమునఁ గలుగు వివిధానుభవము. వేదన యనఁగా మనస్సుయొక్క క్షణికవృత్తులు. విజ్ఞాన మనఁగా సంకల్పములు. సంయోజన యనఁగా స్మృతియు, కల్పనాశక్తియు. సంస్కార మనఁగా స్వభావము. ఇట్టి స్కంధసముదాయమువలన నేర్పడిన అహం పదార్థము మార్పును బొందకుండినను, దాని వ్యాపకము ప్రతిక్షణమును మాఱుచుండును. ఎట్లనఁగా బాల్య యౌవన కౌమార వార్ధక్యావస్థ లొండొంటితో భేదపడుచున్నను ఆనాలుగవస్థలయందున "అహమ్" అను వ్యవహారము మార్పు లేకుండఁ గలుగుచునె యున్నది. ఒక క్షణమందున్న "అహమ్" మఱియొకక్షణమందు వృత్తిభేదముఁ గలదగుచున్నను "అహమ్" మార్పుపొందక యేకముగానె యున్నట్లు తలఁచుచున్నాము. ఈతలఁచుటను గొంతవఱకు గంగీకరింపవచ్చును. ఏల యనఁగా, నది ప్రవహించునప్పు డొకక్షణంబున నొకచోట నున్ననీ రచ్చట మఱియొకక్షణంబున నిలువక ముందుకుఁబోవు

---

కార్యపరంపరను బౌద్ధమతమందు "ప్రత్యయసముత్పాద" మందురు. దీనిని సమగ్రంబుగ తెలిసినవాఁడె బౌద్ధధర్మ మెఱిఁగినవాఁ డగు నని బౌద్ధులు చెప్పుదురు.

చుండ నచ్చోట రెండవక్షణంబునఁ గ్రొత్తనీరు నిలుచుచున్నది. ఇట్లు నీరు ప్రతిక్షణమును మాఱుచున్నను. ఆప్రవాహమును నదియనియే చెప్పెదము. మఱియు దీపముయొక్క వత్తియుఁ జమురును బ్రతిక్షణమునను గొంచెముగ వ్యయంపడుచున్నను వెలుఁగునది దీపమే యని నుడువుచున్నాము.

**మరణము, జన్మాంతరము.**

(4) నరుఁడు పంచస్కంధసముదాయ జనితుఁడనిపైన నుడువఁబడి యున్నది. ఆపంచస్కంధములు కూడియున్నవఱకు నరుఁడు జీవించియుండును. అవి వీడి పోవఁగానె "అహమ్ పదార్థము" లేక పోవును. అది లేకుండుటయే మరణము.

**మరణము.**

కాష్ఠములయం దగ్గి లేకున్నను, రెండు కాష్ఠముల నొండొంటితో మథించుటచే వానియం దగ్గి పొడమునట్లు కొన్ని నిబంధనవల్ల విజ్ఞానము కలిగి యానిబంధనలు నాశ మయినప్పు డావిజ్ఞానమును నశించును. కొయ్య కాలిపోయిన తరువాత నిప్పుండదు కదా. అటులనే పంచస్కంధములు వీడిపోయిన యనంతర మహమ్ పదార్థ ముండదు. అది నశించుటయె మరణ మని తెలిసికొన వలెను.

**జన్మాంతరము.**

పైనివ్రాసినప్రకార మహమ్పదార్థ మనునది యొకటి ప్రత్యేకముగ లేనందున మరణించినపిమ్మట జన్మాంతరమును బొందునదియు లేదు. కాఁబట్టి "నిత్యము, సత్యము, శాశ్వతము నైనపరమాత్మ యొకటి యున్న దనెడుబ్రాహ్మణులవలె నేను శాశ్వతవాదిని గాను." శ్లో. భస్మీకృతస్య దేహస్య పునరాగమనంకుతః। తస్మాత్సర్వప్రయత్నేన ఋణం కృత్వా ఘృతం పిబేత్॥ అనఁగాఁ దగులబెట్టఁబడెడు దేహమునకుఁ బునర్జన్మ మెక్కడిది? కావున సమస్తప్రయత్నములను జేసి ధనమార్జించి గాని,

ధనము దొఱకనియెడల ఋణముచేసికాని నెయ్యి త్రాగి బ్రతికియున్నవఱకు
సుఖపడవలె నని దేహమే యాత్మ యనుకొను చార్వాకమతస్థులును వాగా
దీంద్రియములె యాత్మగా భావించులోకాయత మతస్థులును వాదించునటుల
"ఉచ్ఛేదవాది"ని గాను ఈయుభయవాదములకు మధ్యమార్గ మవలం
బించినాను అని బుద్ధుఁడు చెప్పెను. జీవాత్మ శాశ్వతపదార్థమయి జన్మపరం
పరను బొందునని యీబౌద్ధధర్మ మం దంగీకరింపకున్నను నరు లొనరించు
పుణ్యపాపకర్మలు జన్మాంతరమును బొందు నని ప్రతిపాదించుచున్నది. పంచ
స్కంధములు సంఘీభవించుటయె జన్మ మని యవి వీడిపోవుటయె మరణ
మని గ్రహింపవలెను. ఆస్కంధములు కలిసి యున్నప్పు డహంభావము
జాగరూకతఁ గలిగి శ్రమను దొఱంగి సుఖము నన్వేషించుచు, ఈకార్య
ములయం దన్యనరులతో సంబంధంబుఁ గలిగి ప్రతిక్షణమును బ్రకాశించుచు
నుండును. నరునియం దుండుఅహంపదార్థముయొక్క సత్తా వానినే యాశ్ర
యించియుండక యితరనరులయందును సంక్రమించి వాఁడు మరణించినను
ఇతరనరులయం దది చెడకుండ నుండును. కా

**కర్మ.**

వున నరుఁడు మరణించుచున్నాఁడు. వాఁ
డొనరించినకర్మమాత్రము వానిమరణానంత
రము తిరిగి యితరులయందు జన్మ మెత్తుచున్నది. ఎట్లనఁగా నరుఁ డుత్తర
మును వ్రాసి చాలించిన తరువాత వాని లేఖనక్రియ లేకున్నను లిఖింపఁబడిన
యుత్తరము చెడక దృశ్య మగురీతిగ స్కంధములు ధ్వంసమయినను జేసిన
కర్మలు ధ్వంసములు కావు. మామిడివిత్తనమును భూమిలో నాటినపిమ్మట
నది కుళ్లి భూమిలోఁ గలిసిపోవును. దానినుండి కలిగినఫలములో నట్టివిత్త
నమే మరలఁ గనుపడును. కాని యటులఁ గనుపడునది మొదట పాతి
పెట్టఁబడిన విత్తనము కాదు. కనుక నది జన్మాంతరమును బొందియుండదు.
కాని దానిరూపమును ఇతరలక్షణములను గల మఱియొకవిత్తనము నూతన

ఫలములో మన కగుపడుచున్నది. అటులనె యొకఁడు మరణించి వాఁడె తిరిగి పుట్టఁడు. నామరూపములను ధరించిన యొకడు చేసినకర్మలవల్ల నామ రూపధారి యగు మఱియొకఁడు జన్మించును. ఒకఁడు చేసిన కర్మల యొక్క ఫలమునకును గుణముగా మఱియొకఁడు జన్మించును. కనుక చేసిన కర్మ దుష్కర్మయయ్యేనేని కర్మఫలమునుండి విముక్తి కనుపడదు. నరుఁడు విజ్ఞానవంతుఁ డగుటంజేసి పశువుం బోలఁడు. నరునియొక్క సాంఘిక వ్యాపారము పశుకర్మప్రాయము కాదు. పురుషుఁ డని స్త్రీ యని యనఁ బడు నామరూపము లనిత్యములు ; మానుషత్వము నిత్యము. కావున నరుని యొక్క సత్ప్రవర్తన మానుషత్వములోఁ గలసి యుత్తమమైన పునర్జన్మము నొందును. నరునియం దుండువ్యష్టిచైతన్యస్ఫురణను వాఁడు కలిసియుండు సంఘముయొక్క సమిష్టిచైతన్యస్ఫురణనుండి ప్రత్యేకించుటకు వలనుపడదు. సంఘమందుఁజేరి సంఘసౌఖ్యానుభవమును గోరనినరు డుండఁడు. ప్రతినరుని కర్మయు సంఘకర్మతో సంబంధించియే యుండును. ప్రతినరునికష్టసుఖములు వాని పూర్వజన్మకర్మఫలము లనుట సహేతుకము కాదు. అట్టిసుఖదుఃఖ ములు నిర్హేతుకము లనియు బౌద్ధధర్మము వచింపదు. మానవకోటియంత యు సాంఘిక కర్మసూత్రముచే గొలుసువలె నొండొకరితో సంబంధించి యుండును. ఘాతుకుఁడును, చోరుఁడును దాము సంఘమునకు జేయునప కారంబున కెట్లు బాధ్యులో సంఘమును వారి కటులనె భాధ్యమైయున్నది. ఏల యనఁగా నట్టివారిని సంఘము సన్మార్గమందుఁ బెట్టవలసియుండెను. ఇతరులయెడల నడుచుకొనురీతినిఁ బట్టియే ప్రతినరుని ప్రవర్తనయొక్క యోగ్యతా యోగ్యతలను దెలిసికొనవలయును. కాఁబట్టి అహం పదార్థ మునకు జన్మాంతరము లే దనియు, నది నశించు ననియు, చేయఁబడిన సత్కర్మ శాశ్వతమైన మానుషత్వములోఁ గలయు ననియు, దుష్కర్మ జన్మ పరంపరల నొందు ననియు గ్రహింపవలయును. బ్రాహ్మణు లెవనికర్మఫలము

వాఁడె జన్మాంతరమం దనుభవింపకతీర దని ప్రతిపాదించెదరు. ఈతెల్పఁబడిన దట్టికర్మ గా దని యెఱుంగవలయును.

(5) నాలుగు యథార్థవచనములను సత్యవచనతుష్టయము. దెలిసికొనవలెను. వీనిలో బుద్ధమతసార మిమిడియున్నది.

(a) మొదటి వచనము. బాల్యాద్యవస్థలలో నేయవస్థలో నుండువానికైనను నధికమధ్యమాధమస్థితులయం దుండువారికైనను శ్రమయు, బాధయుఁ దప్పక కలుగుచున్నవి. జన్మ, వయస్సు, వ్యాధి, మరణము నివి యన్నియు బాధలె. సంకల్పించినది సిద్ధించువఱకు బాధయె. ప్రతికూలమయినది సంభవించుటయు బాధయె. అనుకూల మగుదాని నెడఁబాయుట మఱియు బాధగా నుండును.

(b) రెండవవచనము. దుఃఖమునకుఁ గారణము తృష్ణ (ఆశ) యగుచున్నది. స్వకీయ సుఖాపేక్షచే ఆశ వొడముచున్నది. ఇట్టి యాశ శ్రమకును దుఃఖమునకును మూల మగుచున్నది. సుఖము తనను గోరువారిని వంచించు మోహిని యయి యుండి నరకోటిని శ్రమలపాలు చేయును.

(c) మూఁడవ వచనము. నిరాశ దుఃఖమును బోఁగొట్టు పరమసుఖమును గలుగఁజేయును. లేమివలన నాశ గలుగును. అపేక్షించినది సిద్ధించువఱకు శ్రమగా నుండును. సిద్ధించినమిమ్మటఁ దృప్తి చేకూరినను, ఆశ తీఱక తిరిగి వాంఛలను, దుఃఖములను సంభవింపఁజేయును. వాంఛారూపదాహముయొక్క శాంతి నరున కెన్నఁడును గలుగునట్లు కనుపట్టును.

(d) ఆర్యాష్టాంగమార్గ మవలంబించినమనుష్యుఁ డాశారహితుఁడై బాధావిముక్తుఁ డగును. ఎవఁడు బౌద్ధధర్మ మవలంబించునొ వాఁ డీయష్టాంగమార్గమందు నడువవలెను. “నేను చెప్పినంతమాత్రమున నావచనములను నమ్మవలదు. మీరును స్వబుద్ధి నాలోచించి కారణకార్యవిచారణ

చేసి పిమ్మట యుచిత మనితోఁచినయెడల నాచరింపవలయును". అని బుద్ధుఁడు నొక్కి వక్కాణించెను.

అష్టాంగమార్గము. (6) అష్టాంగమార్గలక్షణము తెలుపఁబడుచున్నది.

(1) శుద్ధవిశ్వాసము. (సమ్యగ్దృష్టి.)
ఇది యష్టాంగమార్గముం గనుపఱచుటకుఁ గరదీపిక (కాగడా.)

(2) శుద్ధాపేక్ష. (సమ్యక్సంకల్పము.)
ఇది యుపాసకుని నడపించును.

(3) శుద్ధవాక్కు. (సమ్యగ్వాక్కు.)
ఇది యామార్గమందు విశ్రాంతిమందిరము.

(4) శుద్ధకర్మ. (సమ్యక్కర్మ.)
ఇది యుపాసకుని నడతను జక్కఁజేయును.

(5) శుద్ధజీవనము. (సమ్యగాజీవ.)
ఇది యుపాసకునికి దారియందుఫలాహారము.

(6) శుద్ధప్రయత్నము. (సమ్యగ్వ్యాయామ.)
ఇది యుపాసకునిసంచారము.

(7) శుద్ధచింతన. (సమగస్మృతి.)
ఇది యుపాసకునకుఁ బ్రాణవాయువు.

(8) పూర్ణశాంతి. (సమ్యగ్సమాధి.)
ఇది యుపాసకునకు శయ్య.

(కుండలీకరణములలో లిఖింపఁబడినవి బౌద్ధపరిభాషావచనములుగా నెఱుంగవలయును).

ఈ యష్టాంగమార్గోపాసకులు రెండు గొప్పవిషయములను విడువవలయును. (1) సుఖాపేక్ష. ఇది నీచమును నిస్సారము నయియున్నది. (2)

స్వశరీరమును దపస్సుచే శోషింపఁజేసి కొనుట. ఇది శ్రమకరమును, వ్యర్థకృత్యము నయియున్నది. ఈయష్టాంగమార్గ మారెంటికి మధ్యమమార్గమయి యున్నది. ఇది యంతర్దృష్టిని, విజ్ఞానమును, చిత్తశాంతిని లభింపఁజేయును.

అష్టాంగమార్గముల వివరణము.

(7) (a) ఒకమత ధర్మమందు విశ్వాసమును గలిగియుండవలెను. అట్టి విశ్వాసమువలన భక్తి కలుగును. భక్తివలన నాచరించుటయం దిచ్ఛ వొడమును. విశ్వసించుమతము శుద్ధమయినది కానియెడలఁ దదాచరణమంతయు వ్యర్థమగును. కనుక శుద్ధావిశ్వాసము మొదటియంగముగాఁ జెప్పఁబడెను.

(b) నరునకు జీవితకాలమందుఁ గలుగుసుఖానుభవమును, దుఃఖకారణమును, దుఃఖనివారణోపాయమును దెలిసికొనినబుద్ధిశాలికి సుఖాభిలాష కలుగునా? కలుగదు. ఏల యనఁగా సుఖాభిలాషవలన శ్రమం బధికమగుచున్నదని వాఁడు కనుగొనెను. కాఁబట్టి స్వకీయసుఖాభిలాషను వర్జించి, పరులను బ్రేమించుటయం దపేక్షఁ జెందవలెను. ఇదియే శుద్ధాపేక్ష. అపేక్ష వ్యాపారమునకు మనస్సును నడపించును. కాన ద్వితీయాంగము.

(c) శుద్ధాపేక్ష. పరిశుద్ధమయినవాక్కులఁ బలుకుటయందును, సత్కర్మలఁ జేయుటయందును, సజ్జీవనమందును దృశ్యమగును. శుద్ధవాక్కనఁగా (1) అబద్ధములాడకుండుట, (2) కొండెములు చెప్పకుండుట, (3) పరుషములు వలుకకుండుట, (4) తుచ్ఛప్రసంగముఁ జేయకుండుట. మఱియెట్లు భాషింపవలె ననిన స్పష్టముగాను, సత్యముగాను దయారస మొలుకు నట్లుగాను బలుకవలయును. శుద్ధాపేక్ష శుద్ధవాక్కునందుఁ బ్రకాశించుటచే శుద్ధాపేక్షకు శుద్ధవాక్కాధారమయి విశ్రాంతిమందిరమయి తృతీయాంగమగుచున్నది.

(*d*) శుద్ధకర్మ యనఁగా నహంకారదూషితముకానివ్యాపారము. ఇది శుద్ధవాక్కుతో జతగా నుండును. స్వకీయసుఖంబు నపేక్షింపక లోక సుఖార్థంబుగఁ జేయుకృత్యము సత్కార్మ యగును. పుణ్యము శీలమువల నను, దానమువలనను గలుగును. జపములవల్లను, ప్రార్థనలవల్లను, దేవతా బలులవల్లను, బుణ్యము రాదు. శీలమనఁగా నీతినిబంధనల ననుసరించి నడచు కొనుట మఱియు దుష్కార్మలను జేయుట కవకాశ ముండునప్పు డట్టి కర్మలను జేయకుండుటయు నగును. ఇట్లు తాను మాత్రము నడుచుకొను టయె చాలు నని నరుఁడు తలఁపఁగూడదు. పరులను నడచునట్లుచేయ వలెను. ఇదియును శీలమె. ఈబౌద్ధమతమందు. శీలమె ముఖ్యాంగము. పునాది. కాఁబట్టి దీని నుపేక్షింపఁజనదు. అహింసాదిసత్కార్మల నొనరించి శీలసంపన్నుఁడైయుండినఁ జాలు నని తలపఁగూడదు. దీనికి వన్నె తెచ్చు నది మఱియొకటి యున్నది. అదేమనిన "దానముచేయుటయె." స్వార్థత్యా గం బొనరించియైన నార్తిం జెందినవారికి సకాలంబున స్వశక్తికొలంది సాహాయ్య మొనర్చి వారిని సంతోషపెట్టుట దానం బగును. దీనివలన దాతకును గ్రహీతకును మేలు చేకూరును కానిదాతకంటె గ్రహీత కించి న్న్యూనత్వముఁ జెందును. బౌద్ధధర్మ దాన మనఁగా బౌద్ధధర్మమును దెలి యనివారికి బోధించి దాని నాచరించునటుల వారిం జేయుట. ఈదానము కడమయేదానముకంటెను శ్రేష్ఠమయియున్నది. దాన మనఁగా వస్తురూప ధర్మ మని సామాన్యులు తలఁచెదరు. అది కాదు. మాటవల్లఁ గాని, తన దేహశ్రమవల్లఁ గాని, వస్తువుల నొసంగుటవలనఁ గాని, యొకఁడు మఱి యొకనికిం జేయు సాహాయ్య మంతయు దాన మనియే బౌద్ధధర్మము తెలుపును. కాని వెలుఁగు వెంబడి చీఁకటి యున్నట్లు దానము వెంట నొక దురభిలాష యుండును. అది యెద్ది యంగు తేని దానమువలనఁ గీర్తియొ యిహపరలోక సంబంధ మయినమఱియొకలాభమొ సంపాదింపఁ దలఁచుట. ఇట్టి స్వప్ర

యోజనపరత్వ మెంతమాత్రమును దగదు. సర్వజీవక్షేమలాభములకొఱకు జీవించుస్వభావమును "దానపరిమితి" యని బౌద్ధధర్మము బోధించును. దాత యొక్క భావననుబట్టి దానముయొక్క యోగ్యతాయోగ్యతలు నిరూపింపఁబడును. శీలదానములవలన నుపాసకునియాచరణము కళంకరహితమగును. కాన శుద్ధకర్మ చతుర్థాంగమయ్యె.

(e) శుద్ధజీవనము. నిర్వాణపదముఁ బొందఁగోరువాఁడైనను నిర్వ్యాపారిగా నుండఁగూడదు. దాత లగువారిని యాచించి పీడించి జీవించుట యాచకులయొక్క ధైర్యస్థైర్యములను వీటఁబుచ్చి వారి గౌరవమునకు హానియుం జేయును. కావున ప్రతిమనుష్యుఁడును దనశక్తికొలఁది పాటుఁబడి లోకోపకారిగా జీవింపవలయును. మఱియు వానిజీవన మేప్రాణికిని హానికరముగాను, నుపద్రవకరముగాను నుండఁగూడదు. మంత్రయంత్రతంత్రములు మొదలయినమాయాకృత్యములవల్ల జీవింపంజనదు. వర్తకము మొదలయినవ్యాపారములు చేయఁగూడదా యందురేమొ. స్వప్రయోజనాభిలాషచేఁ బరులవంచించుట వ్యాపారములయం దనవరతము ప్రాయికముగాఁ గనుపట్టుచున్నది. న్యాయానుకూలముగాఁ బరుల కుపకరించుచు స్వప్రయోజనము సమకూర్చునట్టివ్యాపారము నె వ్యాపార మనందగును. అష్టాంగమార్గమునం బోవుయాత్రికునకు నుపాధిసంరక్షణార్థము శుద్ధజీవనము ఫలాహారమయి పంచమాంగ మగుచున్నది.

(f) శుద్ధప్రయత్న మనఁగా దుర్గుణములను దుర్వృత్తుల నివారించుకొనుటయుఁ దనకుఁ గలసద్గుణములను సంరక్షించుకొనుచు నూతనసద్గుణముల గ్రహించి సద్వృత్తులఁ బెంపొందించుటయు నగుచున్నది. ఇట్టి కృషి వలనఁ గ్రమక్రమంబుగ జితేంద్రియత్వమును బ్రాప్తించును. జితేంద్రియత్వమును తితిక్షయును (ఓర్పును) లేనియెడల మనస్సు స్వస్థపడదు, పరిశుద్ధము కానేరదు. మనస్సునకు జితేంద్రియత్వమును తితిక్షయుఁ గలుగుటకు

దానికిఁ బంచభావన లనఁగాఁ బంచాభ్యాసము లుండవలెను. అవియెవ్వి యనఁగా—(1) అశుభభావన (సమస్తమునందుండు దోషముల విచారించి విరక్తిం జెందుట.) (2) మైత్రిభావన(తనమిత్రులయందును,శత్రులయందుఁ బ్రేమఁ గలిగి రాగద్వేషరహితుఁడై యుండుట.) (3) కరుణాభావన (ఆర్తిం జెందియుండుసమస్తప్రాణులకష్టంబులం దలపోసి వానియందుఁ గనికరముఁ గలిగి యుండుట.) (4)ముదితాభావన (పరులక్షేమసౌఖ్యములం గోరుచు వారి సుఖస్థితిం జూచి యానందించుట.) (5)ఉపేక్షాభావన. (స్వప్రయోజనపరత్వమును, ధనమద, విద్యామద, యౌవనమదములం జెందక కష్టముకాని, సుఖముకాని యేదిసంభవించినను జలింపనిమనస్సుతో నుండుట). ఈభావనల నభ్యసించినయెడల దుర్గుణములును, దుర్వృత్తులును గ్రమక్రమంబుగ నిర్మూలంబు లగును. కాఁబట్టి శుద్ధప్రయత్నము. మనస్సాధక మనఁగా మనస్సునకు వ్యాయామ మయి యీ అవయవంగ మగుచున్నది.

(g) శుద్ధస్మృతి—తలపు. వాంఛ, వృత్తి వీని కన్యోన్యసంబంధము కలదు. కాఁబట్టి శుద్ధప్రయత్నమునకు. శుద్ధస్మృతి తోడ్పాటొసంగవలెను. స్మృతి యనఁగా సంకల్ప మని యెఱుంగవలయు* మనస్సు సంకల్పాత్మకము. కావున మనస్సునందుఁ జెడుతలంపులఁ బొడమనీయవలదు. శుభాశుభకర్మలఁ జేయించునది మనస్సే. కావున మనస్సునకు శుద్ధవిషయానుసంధానము చేయవలెను. ధర్మము మానసాధీనమై యున్నది. బోధి ధర్మాధీనమై యున్నది. బోధి యనఁగా సమాధి. ఉపాసకుఁడు శుద్ధస్మృతి నభ్యసించుటకు ప్రజ్ఞానము కలవాఁ డయియుండవలెను. ప్రజ్ఞాన మనఁగా కాయము, చిత్తము, వేదన, ధర్మము అనెడు స్మృత్యుపస్థానముల నెఱుంగుట. ఈయెఱుకవలన నుపాసకునికిం దెలియునది యేమనఁగా—(1)నానా

* ఇది బౌద్ధులు చెప్పెడి యర్థము. స్మృతి యనఁగా గడచినవిషయస్మరణ యని శాస్త్రనిశ్చయము.

విధమయిన కారణకార్యసమ్మేళనములవలన సృష్టిపదార్థములు కలుగుచున్నవి. (2)అవి యన్నియు ననిత్యములు. (3)ఆత్మ యనునది ప్రత్యేకపదార్థము కాదు. (4)పదార్థములయొక్క యథార్థజ్ఞానము లేనందున సర్వప్రాణులు మానసికవిచారమును, కాయక్లేశమును బొందుచున్నవి. ఈప్రజ్ఞానము కలవానికి సర్వప్రాణులను దుఃఖసముద్రమునుండి యుద్ధరించుటకు శుద్ధస్మృతి కలుగకమానదు. ఈమతమందుఁ బ్రతిపాదింపఁబడుచున్నప్రజ్ఞానమును అద్వైతులు వచించుజ్ఞానమె యని భ్రమపడవలదు. ఈ నుడువఁబడినప్రజ్ఞానము శోధనానుభములవలన సిద్ధించును. అద్వైతులు నిరూపించుజ్ఞానము శ్రుతిబోధితము మాత్రమె యగుచున్నది. శ్వాసకోశము శరీరమునకెంత ముఖ్యమొ శుద్ధస్మృతి యష్టాంగమార్గగామి కంత యవసరమెయగుటచే శుద్ధస్మృతి శ్వాసముతోఁబోల్పఁబడి సప్తమాంగముగా నుడువఁబడియె.

(h) పూర్ణశాంతి యనఁగా బౌద్ధధర్మముతోఁ జిత్తము సంపూర్ణముగా నేకీభవించియుండుట. దీనినె సమాధి యందురు. ఇది ధ్యానయోగము వలనసిద్ధించును. దీనివలన చిత్తచాంచల్యమడంగును. ఈధ్యానయోగమును పతంజలి యోగశాస్త్రమందుఁ దెల్పఁబడిన యోగమును నొకటె యని భ్రమపడవలదు. ఇంతకుఁ బూర్వము చెప్పఁబడినసప్తాంగములయందు ఉపాసకుఁ డధికశ్రమం జెంది ధర్మతత్త్వ మరసి యలసి విశ్రాంతిం జెందుటకీసమాధి శయ్యవలె నుండుఁ గాన నిది యుపాసకుని శయ్యయై యష్టమాంగ మయ్యె.

అష్టాంగమార్గోపాసకుఁడు దశప్రతి

దశప్రతి బంధకములు. బంధకములను నివారించుకొనవలెను అవి యేవనఁగా.

(1) సత్కాయదృష్టి:—శాశ్వత మయినజీవాత్మ యొకటి యున్నదని భ్రమించుటయు, గతంబున లిఖించినప్రకార మహంపదార్థనిర్మాణ

మును దాని లయమును, దెలిసికొనక యీజన్మకు గతజన్మ కర్మకారణత్వ మును, ముందుజన్మమున కీజన్మమందుఁ జేయఁబడు కర్మకారణత్వమును నమ్ము టయు ముక్తికిఁ బ్రబలప్రతిబంధక మగుచున్నవి. కాని జీవాత్మ ప్రత్యేక ముగా లేదనుటచేఁ బుణ్యపాపకర్మలతోఁ బనిలేదనియు, జీవించునంత వఱకు యథేచ్ఛగాఁ దిని తిరుగవచ్చు ననియు మరణానంతర మాకర్మలవలన మన కగునది యేమియు లేదనియుఁ దలఁపఁగూడదు. దోషరహితమయిన స్థితి కలదని నమ్మి దానికై పాటుపడవలయును.

(2) సర్వసంశయమతము:—ఇది జన్మవిషయ మెఱుంగుట కెవని కిని వశము కాదని తెల్పును. ఇది యొకవిధమయిన మనోరోగమై పురో వృద్ధికై యత్నింపనీయదు. కాఁబట్టి యీమతమును విడిచి నిర్వాణంబు కొఱకు యత్నింపవలయు.

(3) శీలవ్రతపరామర్శ:—నిత్య, నైమిత్తిక ప్రాయశ్చిత్తాది కర్మల వలన దుఃఖనాశ మగు నని తలఁచుట. ఇట్టి కర్మల యథావిధిగాఁ జేసెడు వారికైనను రాగద్వేషములు లేకపోలేదు. దుఃఖనాశమును లేదు.

| | |
|---|---|
| (4) కామము.<br>(5) (ద్వేషము.) | పైనఁజెప్పినమూఁడు ప్రతిబంధకములను నివారించు కొనినను. ఈ రెంటివలనను బూర్వస్థితిలోనికి |

మరలఁబోవచ్చును. కనుక నుపాసకుఁడు వీనిని ద్యజింపవలయును. మొదటి మూఁటిని జయించుటచేవాఁడు ప్రథమసోపాన మెక్కును. తర్వాతి రెంటిని జయించుటచే ద్వితీయసోపాన మెక్కును. ఈసోపానమం దుపాసకుని "సకృదాగామి" యని బౌద్ధధర్మమం దందురు.

| | | |
|---|---|---|
| (6) రూపవిషయాభి లాష.<br>(7) అరూపవిషయా భిలాష. | రాగము | ఈపైని జెప్పఁబడిన పంచప్రతి బంధకముల జయించిన మాత్రమునఁ గృతార్థుఁడ నయితినని తృప్తిం జెందఁ గూడదు. ఈప్రక్కను లిఖింపఁబ |

(8) మానము.
అనఁగా గర్వము.
(9) బౌద్ధత్వము.
అనఁగాఁ దానె ధన్యుఁడనను కొనుట.
(10) అవిద్య.
అనఁగా వస్తువులయొక్క యథార్థజ్ఞానము లేకుండుట.

డిన యయిదింటినిం గూడఁ గెలువవలెను. ఇట్లు దశప్రతిబంధకజయశాలి యయ్యేనేని నుపాసకునకు సమస్తముయొక్క యథార్థజ్ఞానము లభించును. దానంజేసి యష్టాంగమార్గమందుఁ దుదముట్ట యాత్రచేసినవాఁడై "అర్హాత" పదంబు నొంది యుపాసకుఁడు నిస్సంశయముగ నిర్వాణఫలంబనుభవించును.

బౌద్ధధర్మమునకు శీలము ముఖ్యాధారము.

(8) బౌద్ధధర్మమందుఁ బ్రవేశించువానికి బుద్ధిసూక్ష్మత విశేషముగా నుండవలెను. నీతిప్రవర్తన మంతగా నవసరము లేదనుకొందు రేమొ. అటులఁ దలఁపఁ గూడదు ఈధర్మమం దాఱు నిబంధన లున్నవి. (1) దాన, (2) శీల, (3) క్షాంతి, (4) వీర్య, (5) ప్రజ్ఞ, (6) ధ్యానములు. ఇవి యుత్తరోత్తరాధిక్యము గలవై యున్నవి. అనఁగా ముందు చెప్పఁబడినదానికంటె వెనుక చెప్పఁబడినది యధిక మని యర్థము. ఈ యాఱింటిని రెండు పెద్దవిభాగములుగాఁ జేయవచ్చును. (1) ప్రజ్ఞాపరిమితి యనఁగా వస్తుశోధనయు, జ్ఞానమును. (2) శీలపరిమిత యనఁగా నీతి. ఈరెండు పెద్దభాగములలోఁ బైనఁ జెప్పఁబడిన యాఱునిబంధనలు నిమిడియున్నవి. ధర్మమంతయు నిమిడియున్నది. శీలమనఁగా నీతిప్రవర్తన దీనినే పుణ్యసంభార మనియెదరు. ఇది కలుగని యెడల, ప్రజ్ఞాపరిమితి యనఁగా జ్ఞానసంభారము సిద్ధింపదు. కాఁబట్టి యీధర్మమునకు శీలము (నీతిప్రవర్తన) ముఖ్యాధారముగా నున్నది.

(9) బౌద్ధధర్మఫలము దుఃఖవిముక్తియే. కావున నట్టి దుఃఖకారణము

లయినస్వీయ (తన) వాంఛలను విడువవల యును. మఱియు "అహమ్" అనునది తృష్ణ యందు వెల్లడిగాఁ గనుపట్టును. కాఁబట్టి తృష్ణను విడుచుట ప్రథమకార్య మగుచున్నది. విడుచుట యె ట్లంటిరేని. పాపకృత్యములను క్రమక్రమంబుగ విడిచి మరలఁ జేయకుండవలెను. సత్కృత్యముల నవలంబించి విడువక చేయుచుండవలెను. ఇ ట్లొనర్చుటయె శీలము.

శీలలక్షణంబు.

పాపకృత్యములు పది యపరాధములవలనఁ గలుచున్నవి.

| అపరాధముల పేర్లు. | అర్థము. |
|---|---|
| (1) ప్రాణాతిపాత. | జీవజంతువును వధించుట. |
| (2) అదత్తదాన. | దొంగతనము. |
| (3) కామమిథ్యాచార. | వ్యభిచారము. |
| (4) మృషావాద. | అబద్ధమాడుట. |
| (5) పైశున్య. | కొండెము చెప్పుట. |
| (6) పారుష్య. | దుర్భాషలాడుట. |
| (7) సంభిన్నప్రలాప. | వృథాప్రసంగము. |
| (8) అభిద్య. | పరద్రవ్యాపేక్ష. |
| (9) వ్యాపాద. | ద్రోహపుతలపు. |
| (10) మిథ్యాదృష్టి. | అసత్యాభిప్రాయము |

(ఈపేర్లు బౌద్ధపరిభాషలోనివి.)

వీనిలో మొదటి మూఁడును శారీరదోషములు. తర్వాతి నాల్గును వాగ్దోషంబులు. చివర మూఁడును మానసిక దోషంబు లగుచున్నవి. నరుఁ డీదోషంబులఁ గ్రమక్రమంబుగ నివారించుకొనక యుపేక్షించినయెడ అవి ప్రబలి వానిని ముట్టడించును. వాఁ డంతట విడిపించుకొనఁజాలఁడు. కనుక ప్రయాసపడి నివారించుకొని వాఁడు పావనుఁడు కావలెను.

అపరాధములను నివారించుకొనుటకు సాయంబులు.

10. పైని జెప్పంబడిన పది యపరాధములను నివారించుకొనునుపాయంబులు నుడువంబడుచున్నవి.

(*a*) జీవజంతువధ. మనుష్యుఁడు మొదలుకొని యత్యల్పజంతువు వఱకును దేనినయినను జంపఁగూడదు. ప్రాణమును మించిన గొప్పపదార్థము సృష్టియందు లేదు. తన కెవ్వరును హాని చేయ రని జంతువులకు నమ్మకము కలిగెనేని అవి యును శాంతముగా నుండఁగలవుయజ్ఞాదికర్మలయందును, దేవతాబలులకొఱకును బ్రాహ్మణమతమందు జంతుహింస జరుగుచుండును. అది యీ బౌద్ధధర్మమందు లేశమాత్రమయిన నంగీకరింపఁబడదు. జంతువులను హింసింపకుండుటయే కాక వానిని రక్షింపవలయు నని కూడ నీధర్మము బోధించుచున్నది. మాంసాహారమును దినువారైనను జంతువులను హింస, జేసి చంపఁగూడదు. వినోదార్థముగాఁ గాని దేవతాబలులకొఱకుఁ గానిఁ యుద్ధములయందుఁ గానిజీవహింస కూడదు. కాని సామదానభేదదండోపాయములలో మొదటి మూఁడు ఉపాయములవలనను శత్రువు వశపడకున్న యెడల నంతిమోపాయంబు నింద్యము కానేరదు. మఱియు దండనోపాయంబు శత్రువును శిక్షించి సన్మార్గవంతుని జేయును. ఎట్లయినను శత్రుపీడ నయిన నోర్చి వాఁడు శరణంబు వేడిన క్షమించి వానిని ప్రేమించుటయె బౌద్ధధర్మముయొక్క ముఖ్యోద్దేశ మని గ్రహింపవలెను. పరమధర్మంబయిన యీ యహింసనుండియే పరమతసహిష్ణుత యనుమేలిగుణం బుదయించును. ఖడ్గప్రయోగముచేఁ గాని, యధికారదర్పణముచేఁ గాని యీధర్మమును వ్యాపింపఁజేయ నక్కఱలేదు. ఈధర్మము యొక్క యథార్థస్థితి మాత్రము బోధింపఁబడును. విశ్వసించువారు దీని నవలంబించెదరు. విశ్వసింపనివారు వారి కిష్టమగు మతమునే వారనుసరింపవచ్చును.

(2) దొంగతనము—పరుని ధనమును దోఁచుకొనఁగూడదు. దొంగిలింపఁ గూడదు. వాని కష్టార్జితమును వాఁ డనుభవించుటకు వానికిఁ దోడ్పా టొసంగవలెను. దొంగతన మెట్లు మానవచ్చు నందు రేని ధనసంపాదనవలన నరుఁ డుత్తమస్థితిం బొందుట కభ్యంతరము కలుగు నని యెఱింగి దాని యందుఁ దిరస్కారభావముఁ జెందినయెడల మానవచ్చును. ప్రాణము, ధనము, అధికారము నివి యుక్తంబుగ నుపయోగింపఁబడినయెడల నపకారంబు చేయవు వీనికై నరుఁ డల్లాడుటచే వీనికి దాసుఁ డగుచున్నాఁడు. ధన మార్జించుటయే ఘనకార్యంబుగా నెంచి యెందఱు ద్రోహకృత్యంబులకు వెనుదీయక యుద్ధంబులకు ముందు కాలిడి తల్లి యనక, బిడ్డ డనక, గురు వనక, దొర యనక ధర్మంబు వీటిఁ బుచ్చి యాధనము నార్జించుచుండిరి. ప్రబలమృగం, బల్పమృగంబును వంచించి దాని మాంసంబుచే మెఱియుం బలిసినట్లు మందప్రజ్ఞుని నధికప్రజ్ఞుండు వంచించి వాని సర్వంబును గపటవ్యవహారసరణిం గొని ప్రబలభాగ్యశాలి యగును. వాని నప్పుడు వ్యవహారదక్షుం డని లోకు లందురు. ఇది యెట్టిధర్మంబో కనుంగొనుఁడు. వ్యవహారియై యొకఁడు కూర్చినధనరాశిం జూచి వాఁడు వ్యయంబు పోఁగ న్యాయంబుగ నంత నిలువఁ జేసె నని కొంద ఱందురు కాని యట్లెన్నుటకంటె వాఁ డెందఱి ను బికారులఁ జేసి భాగ్యశాలి యయ్యె నని యే తలఁపఁదగును. కావున నిదియు దొంగతనంబె యనవచ్చును.

(3) వ్యభిచారము—పరుని భార్యతోఁ గాని, వాని యుంపుడుకత్తెతోఁ గాని వ్యభిచరింపఁ గూడదు. పరిశుద్ధముగా నుండవలెను. పరస్త్రీని వీక్షింపనే కూడదు. వీక్షించినను వీక్షింపన ట్లుండవలెను. ఆమెతో సంభాషించు నప్పుడు శుద్ధహృదయమును గలిగియుండవలెను. ఆమె వృద్ధురా లయిన యెడలఁ దల్లిగను, చిన్న దయినచోఁ దోఁబుట్టువుగను. మఱియుఁ జిన్న దయినచో బిడ్డగను భావింపవలెను. తమ వేషభాషాలంకారములచేఁ బురు

షుల మోహపఱచు బిత్తరుల పొత్తుఁ దొలఁగి మనస్సును నిబ్బరముగను నిశ్చలంబుగ నుంచుకొనవలెను. లేనియెడల మోహం బనెడు కాఱుమబ్బు జ్ఞానం బను సూర్యుని దట్టంబుగఁ గప్పివేయును. అంతట మనస్సు గాఢాంధకారంబునఁబడి వెలవు గానక వెఱ్ఱెత్తినట్లు దిరుగును. కాఁబట్టి వ్యభిచారంబు మానుట శ్రేయస్కరంబు.

(4) అబద్ధ మాడుట—అబద్ధమును లేశమాత్రమును జెప్పఁగూడదు. అయినను నిజమును బరులకుఁ జెఱుపులేనియట్లుగను హృదయమందుఁ బ్రేమఁ గలిగి బదిలముగను జెప్పవలెను. అబద్ధ మాడుట ఘోర మయినదోషములలో నొకటియై యున్నది. అబద్ధము కలియని నేరమె యుండ దని చెప్పవచ్చును. పరనింద, ముఖస్తుతి, అప్రమాణము, నివి యబద్ధములోఁ జేరినవె. కృత్రిమబుద్ధి యనఁగా మనస్సున నొకటి తలఁచి వాక్కున మఱియొకటిఁ జెప్పి, పనియం దింకొకటిఁ గనుపఱచుట, ఇది మతాచార్యులయందు మనను గనఁబడుచున్నది. ఇదియు నొకవిధమయిన యసత్యమె యగును. అవసరమం దసత్య మాడఁగూడదా యందు రేమొ. వివాహములయందు, స్త్రీలయెడలను, బ్రాహ్మణులయెడలను, గోవులయెడలను, ప్రాణవిత్తమానభంగములయందు నసత్య మాడవచ్చు నని బ్రాహ్మణమతమం దున్నప్పటికి నీధర్మమందు సత్యమును బదిలముగఁ జెప్పవలెను. ఎట్లయిన నెల్లపుడు సత్యమునే పలుకవలయును. ఏవిషయమందైనను సత్యమును మార్చి గాని, ప్రచ్ఛన్నముగాఁ గాని నుడువఁగూడదు. ప్రాణాపాయమందైనను, సత్యమె చెప్పవలెను అని సిద్ధాంతము.

(5) కొండెముఁ జెప్పుట. } అబద్ధపు వార్తలను గలిపింపఁగూడదు.
(6) పరుషము లాడుట. } ఇతరులు కలిపించిరేని యట్టి వార్తలను దాను వచింపఁగూడదు. పరుషములు పలికి యితరులమనస్సుల నొప్పింపం దగదు. అందువలన వారి కటులఁ బలికినవారియందుఁ బ్రేమ యుండదు.

ఈ రెండుదోషములను జేయువాఁ డట్టి యపరాధములను దన కొరులు చేసినయెడల దన కెట్లుండునో విచారించుకొనవలయును. మఱియును తానె దుర్మార్గుఁడ నని పరులు సన్మార్గు లని భావించి తన దుర్మార్గమును విడిచి పరుల సన్మార్గమును దా నవలంబించుట మేలు అబద్ధపు వార్తలను గల్పించుటయు వచించుటయు నసత్యములోఁ జేరినవె యగుచున్నవి.

(7) వృథాప్రసంగము — వ్యర్థాలాపము కూడదు. మర్యాదగాను, గౌరవయుక్తముగాను బ్రయోజన ముండువఱకు బలుకవలయును. లేదేని మౌనముగా నుండుట మేలు. అష్టాంగమార్గమందుఁ బోఁదలచినయుపాసకుఁడు ప్రపంచసంబంధమయినఘనతకొఱకును, విషయానుభవముకొఱకును, దుచ్ఛవినోదముల కొఱకును వాంఛింపఁగూడదు. వ్యర్థమును హానికరము నయిన ప్రసంగములు చేయరాదు. గొప్పవారి నాడిపోసికొనఁగూడదు.

(8) పరద్రవ్యమం దపేక్ష — పరులసొత్తుకై యపేక్షింపక వారికి మేళ్లు గలిగినప్పుడు సంతసింపవలెను. ఔదార్యము, ఉపకారము, కరుణ యివి బండి కిరుసుచీలవలె ప్రపంచమున కత్యవసరము. స్వప్రయోజనపరత పరులకు మేలు చేయనీయదు. పరులకు ఏవిధంబుననైన మేలు చేకూరునప్పుడు తనకు స్వప్రయోజనపరతవలనఁ గలుగుసంతోషము తగ్గిపోవును. అంతట తన సంతోషము తగ్గకుండుటకై పరులకు మేలు కలుగకుండుటను నరుఁడు కోరును. తనసంతోషము పెంపొందుటకై వాఁడు పరులకుఁ జెఱుపునుం గోరును. ఈచివరఁ జెప్పఁబడినరెండుకోరికలు కలిసి యోర్వలేమి యను దుర్గుణ మగుచున్నవి. కాబట్టి యోర్వలేమి యనుమనోజాడ్యమునకు బైని జెప్పఁబడిన యౌదార్యాదు లనెడు నౌషధంబుల నుపయోగించి దాని మాన్పుకొనవలెను.

(9) ద్రోహచింత — ద్వేషము, అహంకారము, తృణీకారము. మొదలయినదుర్గుణములను విడిచి మీకుఁ గీడొనరించువారియెడల నైనను

ప్రేమఁ గలిగియుండవలెను. కోపమును ప్రేమవలనను, గీడును మేలువలనను, అత్యాశ నౌదార్యమువలనను, అబద్ధమును సత్యమువలనను జయింపవలెను. ఉపకారంబునకుఁ బ్రత్యుపకారం బొనర్చుట సామాన్యకృత్యమగుచున్నది. అపకారి కుపకారంబు గావించుట బహువిశేషకార్యము. తనద్వేషికి కలిగియున్న ద్వేషబుద్ధిని నరుఁడు ద్వేషింపవలెఁ గాని యా ద్వేషిని ద్వేషింపఁగూడదు. ప్రతినరుఁడును లోకమిత్రుఁడై యుండవలెను. మైత్రివలనఁ గరుణయుఁ, గరుణవలన “ముదిత”యుఁ గలుగును. ఈగుణత్రయము నెవనికిఁ జేకూరునో వాని హృదయమందు ద్రోహచింతనయే యుండదు.

(10) అసత్యాభిప్రాయము—మీ రజ్ఞానవశులుగా నుండక సత్యము నెఱుంగుటకు యత్నింపవలయు. లేనియెడల మీరు సందేహపీడితులై ధర్మమం దుపేక్షఁ గలవారై యక్రమములు చేయుదురు.

సురాపానము కూడదనుట.

ఈపైనఁ జెప్పబడినదశాపరాధంబులును గాక యింకొక యపరాధంబు కలదు. అదియెద్దియన (11) మత్తతను గలుగఁ జేయుభోజనపదార్థములను దినుటయు, సారాయి నిద్రాగుటయు. దీనివలన ద్రవ్యవ్యయమును మాననష్టమును సంభవించును, మఱియుఁ గలహములును, జాడ్యములును మొదలయినవి గలుగును. సురాపానము బ్రాహ్మణమతమం దున్నట్లు గ్రంథాదులవల్లఁ గన్పట్టును. కాని బౌద్ధమతమునందు లేశమాత్రమును దీని నంగీకరింపరు. సారాయి త్రాగుట నాశకరమయిన షట్కృత్యములలో నొకటి యయియున్నది. శేషించిన యయిదు నేవనఁగా (1) వీధులవెంబడి నకాలములయందుఁ దిఱుగుట, (2) నాట్యాదులయందత్యంతాపేక్ష (3) జూదము, (4) దుష్టసహవాసము, (5) సోమరితనము.

పైని నుడువఁబడిన పదుమూఁడు అపరాధంబులఁ జేయుట మాని

**మైత్ర్యాదిగుణముల నభ్యసింపవలెను.**

మైత్రి, కరుణ, ముదిత యనఁబడు సద్గుణంబుల నభ్యసించుచున్నయెడల నరుఁడు పరుల కుపకారి యగును. దానంజేసి పరులు వాని కపకారం బొనర్పరు. పరుల సాహాయ్యము లేనిదియే నగునరుని వాంఛలు ఫలింపవు. సౌఖ్యము చేకూరదు. పరులును సౌఖ్యము నపేక్షించువారలె. కాన వారి కష్టంబులను, దుఃఖంబును నివారించుటకు వాఁడును యత్నింపవలెను. అనేకావయవంబులం గలయీ శరీరంబునం దేయవయవమునకు బాధ సంభవించిన నదియు శరీరాంశమె యని శరీరము నంతయును రక్షించెదను. ఆప్రకారమె సమస్తమానవకోటిని మహా శరీరమనియుఁ బ్రతిమానవుని దానియొక్క యవయవ మనియు, భావించిన యెడలఁ బైన నుడువఁబడినయపరాధము లెట్లు పరులకుఁ జేయంబడును? మైత్ర్యాదు లేల గలుగవు? స్వప్రయోజనపరత కెడ మేది? దానివలన శుద్ధ మయిన సుఖ మెందుకు లభింపదు? ఇవ్విధంబున నీతి నభ్యసించి సదుపాస కులై పదంపడి యష్టాంగమార్గగాములై యజ్ఞాతపదంబు నొంది నిర్వాణ సుఖం బనుభవింపవచ్చును. ఇంతమట్టుకు బుద్ధమునిబోధ సంగ్రహంబుగ నుడువఁబడినది. ఈమత మార్యమత మనఁగా బ్రాహ్మణమతముతో సామాన్య ధర్మములయం దనుకూలపడుచున్నది. ప్రధానాంశములయందు భేదించు చున్నది. కాన నట్టి భేదంబు లీక్రింద విశదీకరింపఁబడుచున్నవి.

## II. ప్రకరణము.

### బౌద్ధమత వ్యాప్తికారణములు - అశోకుని యభిలాష.

బౌద్ధమతమునకు ఆర్యమతమునకుఁ గలభేదంబులు.

(1) బౌద్ధమతము—ఈశ్వరుఁడు లేఁడు. ఈశ్వరుఁడు కలఁ డనియు, సర్వసుగుణములు కలవాఁ డనియు మనుష్యులే కల్పించిరి.

ఆర్యమతము—ఈశ్వరుఁడు కలఁడు. స్వయంభువు అనఁగా ఎట్లుకలిగెనో యూహింపఁజాలము. తనకుఁ దానె కలిగె ననవలెను.

(2) బౌద్ధ—ప్రపంచమునకునీశ్వరుఁడు కర్తకాఁడు. ప్రపంచము కారణకార్యసంబంధమువలనఁ గలుగుచున్నది. విచారింపఁగాఁ బ్రతికారణమును గార్యమె యగును. కాఁబట్టి ప్రపంచముయొక్క యాదికారణ మెద్దియొ తెలియదు. తెలిసికొనలేము. దానియొక్క యంతమును దెలియదు. తెలిసికొనలేము.

ఆర్య—ప్రపంచమున కీశ్వరుఁడేకర్త, కార్యమయి దృశ్యమానమగుచున్న ప్రంచమునుబట్టి కారణుఁడైన యీశ్వరుని గ్రహింపవలెను. ఆయన సర్వజ్ఞుఁడును సర్వశక్తిసంపన్నుఁడును. కనుక సంకల్పమాత్రమున నీశ్వరుఁడు ప్రపంచమును సృష్టింపఁగలఁడు. సృష్టించెను కించిజ్ఞుల మయినమన మాసృష్టిక్రమమును స్పష్టంబుగ నెఱుంగలేము.

(3) బౌద్ధ—జీవాత్మలేదు. పంచస్కంధములవలన నేర్పడిన యహంపదార్థ మొకటి యుండి యాస్కంధనాశనముతో నదియు నశించును. దీనివలెనె పరమాత్మయు లేదు.

ఆర్య—పరమాత్మ వ్యావహారికదశయందు జీవాత్మగాఁ గనుపట్టును. పారమార్థికదశయందు స్వరూపమై పరమాత్మయే శాశ్వతముగానుండును.

(4) బౌద్ధ—జీవాత్మయే లేదు. కనుక దానికి జన్మాంతరమును లేదు. అహంపదార్థ మొనరించు పుణ్యపాపకార్యములు మనుష్యధర్మ మనఁగా మనుష్యత్వమందు సంక్రమించి భిన్ననామరూపములతో జన్మాంతరమును బొందును.

ఆర్య—జీవుఁడు పరమార్థస్థితిని బొంది బ్రహ్మైక్య మగువఱకుఁ దా నొనరించిన పుణ్యపాపకర్మవశంబున జన్మాంతరములఁ బొందుచుండును.

(5) బౌద్ధ—వేదము లప్రమాణంబులు. వేదములలో నేమె చెప్పఁబడి యున్న దనియు, ఆవాక్యముల ననుసరించి మనము నడుచుకొనవలె నను టయు వెఱ్ఱితనము. ప్రపంచమం దుండుదుఃఖమును, దుఃఖకారణము నెఱిగిఁ కారణకార్య సంబంధమును సలక్షణముగఁ గనిపట్టి స్వానుభవముగఁ దెలిసి కొని దుఃఖవిముక్తి కలుగునటులఁ బ్రవర్తించుట సర్వశ్రేయస్కరము.

ఆర్య—వేదము లీశ్వరవాక్యంబులు వానిప్రకారము నడుచుకొనిన యెడల దుఃఖవిముక్తియు, సుఖప్రాప్తియుఁ గలుగును.

(6) బౌద్ధ—యజ్ఞాదులకొఱకును, దేవతాబలులకొఱకును, మఱియెందు కొఱకును బశువులఁ జంపుట యధర్మమును, ఘోరకృత్యము నైయున్నది. ఇంతయేల జీవహింసయే కూడదు.

ఆర్య—యజ్ఞాదులయందుఁ జేయఁబడుపశుహింస మాత్రము వేదప్రామాణ్యమునుబట్టిహింసకాదు.కడమపశుహింసయంతయునార్యమతమునకైష్టమే.

(7) బౌద్ధ—మత్తతఁ గలుగఁజేయు సురాపానము యద్విధంబయిన దయినను గూడదు. దానివలన ననేకచెఱుపు లున్నవి.

ఆర్య—వేదప్రమాణమునుబట్టి యజ్ఞాదులయందు సోమపానము చేయ వచ్చును. తదితరంబుగఁ జేయఁబడు సురాపానము నింద్యమె.

(8) బౌద్ధ—బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యభేద మీమతమందు లేదు. మను ష్యజన్మ యంతయు సుఖదుఃఖానుభవమునందు భేదించియుంచలేదు. అంద ఱును దుఃఖవిముక్తిని సుఖప్రాప్తినిం గోరువారె. సర్వసమత్వభావమును బ్రతిపాదించు బౌద్ధధర్మము నేజాతివాఁడైన నవలంబింపవచ్చును.

ఆర్య—ఆర్యమతప్రాబల్యముఁ గల యీభరతఖండమందు వ్యవహారము కొఱకుఁ గలభేదములును, దత్తదనుగుణవ్యక్తిభేదంబులును గలవు. పార మార్థికదశయందు విజ్ఞానవంతులకు సర్వసమత్వ ముండును. వారుమాత్రము కులభేదమును బాటింపరు.

(9) బౌద్ధ—దైవ ముద్ధరించు నని, వేదవాక్యము లుద్ధరించు నని దేవతాబలులవల్లను, దేవతాప్రార్థనలవల్లను తాను దుఃఖవిముక్తిం జెందుదు నని మనుష్యుఁడు తలఁపఁగూడదు. ప్రపంచమంతయుఁ గారణకార్యసంబంధముతోఁ బెనంగి యున్నది. దాని నెవ్వరును దొలఁగింపలే రనియుఁ, దన సత్కార్యానుష్ఠానమువల్లనె తాను దుఃఖవిముక్తిం జెందుదు ననియు నరుఁడు నమ్మవలయును.

ఆర్య—దైవసాహాయ్యము లేనిది పురుషప్రయత్నము సిద్ధింపదు. ధర్మానుకూలంబుగ వర్తించువానికి దైవసాహాయ్యంబుకలుగును.

(10) బౌద్ధ—ఈమతమందు మాటలె కాని మంత్రములు లేవు. ఆమాటలు కొందఱికె వచ్చును. వారె చెప్పవలయును. కడమవారు గ్రుడ్డిగా వానిని నమ్మి నడుచుకొనవలె ననునిబంధనలు లేవు. స్పష్టముగాఁ దేటమాటలతో ధర్మ మందఱికి బోధింపఁపడును.

ఆర్య—వేదమంత్రములు ముఖ్యముగ బ్రాహ్మణాధీనము లయియుండును. బ్రాహ్మణులె కడమవారికిఁ బరమార్థమార్గదర్శకు లైయుందురు. వేదమంత్రములను శూద్రాదులు వినఁగూడ దనియు గట్టికట్టుబాటు కలదు. ఈమతమందు మంత్రములు ప్రభావము కలదని విశ్వశించెదరు. కావున నట్లచేయుదురు.

(12) బౌద్ధ—సర్వసమత్వబుద్ధిని స్థిరంబుగఁగలిగి ధర్మకాయంబు దాల్చి పరిశుద్ధమనంబుతో సత్కార్యాచరణం బొనరించుటచే నిర్వాణసుఖంబు కలుగును.

ఆర్య—జీవుఁడు బంధవిముక్తుఁడై బ్రహ్మైక్యమును బొంది శాశ్వతసుఖమనుభవింపఁగలఁడు.

ఇంతవఱకు నుభయమతములకుం గలభేదవిషయంబులు సంగ్రహముగ నుడువఁబడినవి. ఆయావిషయంబులంగూర్చి చర్చించుట యీచరిత్ర కనవస

రంబు. గ్రామ్యోగ్రామ్యంబులఁ జదువరు తెయెఱుంగఁ గలరు. మొగట నార్యమతము ప్రబలియుండఁగా బుద్ధమత మేర్పడినది. బుద్ధమతము ప్రబలియున్న కాలమం దార్యమతము తగ్గినది. కాని నశించలేదు. కాలక్రమంబున నీఖండమందు బుద్ధమతము నశించి యార్యమతమె ప్రబలి నేటికాలము వఱకు వ్యాపించియున్నది.

(5) ఆర్యమతానుసారులై యున్న భరతఖండవాసు లట్టిభేదధర్మ మవలంబించుటకుఁ గారణము లేమి?

కొందఱు చరిత్రకారు లీదిగువ కారణముల నూహించిరి :—

(1) సూత్రయుగముఁ క్రీ. పూ. 1000 సంllరం-557 యొక్క చివర కాలమందుఁ బూర్వ మీమాంససూత్రను లేర్పడినవి. ఆకాలంబునఁ బశుమేధము, హయమేధము, గోమేధము, నరమేధము మొదలయినయాగములు ప్రాయికముగఁ జేయఁబడుచుండెను. ఆయాగములకు వ్యయప్రయాసము లధికముగ వలసియుండెను. ఇవి కాక దేవతాబలుల కొఱకు జీవహింసలు మెండుగాఁ జేయఁబడెను. అవి యప్పటిజనంబున కతి క్రూరముగను, భయంకరముగ నుండెను.

కారణములు.

(2) వేదమంత్రములను, మతగ్రంథములను బ్రాహ్మణులు తమస్వాధీన మందే యుంచుకొని స్వాధికారముఁ బ్రకటించుఁ గడమకులములవారి మనంబుల గాటంబుగఁ బాటనంబొనర్చిరి. శూద్రాదులను ముఖ్యముగా బానిసలనుగాఁ జూచి బాధించిరి.

(3) అపరాధములు చేసినప్పుడు కడమవారికివలె బ్రాహ్మణులకు దండన లేదు. రాజులుకూడ బ్రాహ్మణులకు లోఁబడియుండుటచే రాజ్యపరిపాలన చట్టములు న్యాయంబుగ వినియోగింపఁబడియుండలేదు. జనబాహుళ్యమునకు క్షేమసౌఖ్యములు లేవు.

(4) బౌద్ధమతమునకుఁ బూర్వ మనేకశాఖోపశాఖలుగా హిందూ మతమునుండి భేదమతము లేర్పడియుండెను. అవి యన్నియుఁ గొన్ని దుష్కరములుగాను, గొన్ని ముష్కరములుగాను నున్నట్లు జనులు తలఁచిరి. మఱియు నాయామతధర్మమును సవిస్తరముగాను, స్పష్టముగాను, సులభముగాను జనులకు బోధింపరైరి.

బౌద్ధధర్మమం దింమమించుగా నట్టికష్టంబులును లోపంబులును గానరావయ్యె. పైని లిఖింపఁబడిన ప్రతికూలవిషయంబులను నివారించుచు బౌద్ధమతమందు జనులకుఁ గలుగఁజేయఁబడిన లాభంబులను సక్రమంబుగ వ్రాయఁబడుచున్నవి.

బౌద్ధధర్మలాభములు.

(1) యజ్ఞాదులకొఱకుఁ గాని, దేవతాబలులకొఱకుఁ గాని జీవహింసఁ జేయఁగూడదు. యజ్ఞాదులవల్లను, దేవతాబలులవల్లను బ్రయోజనము లేదు అని చెప్పఁబడెను.

(2) కులభేదము లేదు. సృష్టిధర్మముచేత జను లందఱును సమానులె. వేదములతోఁ బనిలేదు. మంత్రములు లేవు. మర్మములు లేవని నుడువఁబడెను. తేటమాటలతో బౌద్ధధర్మము బోధింపఁబడెను. ఇష్టమయినవారె బౌద్ధధర్మమును స్వీకరింపవచ్చు నని కూడఁ దెల్పఁబడెను.

(3) న్యాయచట్టములకు నందఱును సమానముగా బద్ధులని వచింపఁబడెను.

(4) ముష్కరము లయినతపస్సులవలన లాభము లేదు. సర్వజను లాచరింపఁదగినధర్మ మొకటి యున్నది. అధర్మాచరణముకొఱకు జనులు క్లేశపడ వలసినపని లేదు. ఈశ్వరుఁడు లేఁడు. ఈశ్వరానుగ్రహముకొఱకుఁ బాట్లు పడ నక్కఱ లేదు. శీల మనఁగా నీతిప్రవర్తన ముఖ్యముగాఁ గావలయు. దానిచేఁ గడమయోగ్యలక్షణములు చేకూరు నని వచింపఁబడెను.

సర్వజనులకును బౌద్ధధర్మ మింత సులభముగా నుండుటచే దానిని బహు జనులు నిస్సందేహులై యవలంబించి రని యూహింపవచ్చు ననిరి.

మఱియొక చరిత్రకారుఁడు వ్రాసిన దేమనఁగా :—జనాభిప్రాయముల నాలోచించి తదనుకూలముగా నార్యులు స్మృత్యాదులవలనను, భారతాది మహాగ్రంథముల వలనను ఆర్యమతసిద్ధాంతము నప్పటప్పటికి సంస్కరించుచుండిరి. కాఁబట్టి జనబాహుళ్యమున కార్యమత మంతగా బాధకరముగా నుండియుండదు. అప్పటితమస్థితిగతుల కనుకూలముగానుండుటచేతఁ గొందఱు బౌద్ధమతావలంబులైయుండి రనియుఁ, దత్కాలమందలిజనులు తను కళావైశద్యాదులచే వన్నెకెక్కియుండి జ్ఞానహీనులవలె పరమతమును సులభముగ నవలంబించియుండి రనియు నూహింపఁదగియున్న దని వ్రాసెను.

ఈయూహాయె యెక్కువసరసముగాఁ గనుపట్టుచున్నది. మఱియు నశోకునికాలమందు భరతఖండములో బౌద్ధమతము బహువ్యాప్తిం జెందినట్లు చరిత్రలు దెలుపుచున్నవి. అశోకుఁడు తాను దేశప్రభువై మఱియు ధర్మప్రభువై బౌద్ధధర్మ మవలంబించి ప్రజలనుగూడ నాధర్మమునె యవలంబింపుఁ డని బహుళప్రయత్నంబు చేసెను. అట్లు చేయుటయె కాక బౌద్ధధర్మ మవలంబించి తదాచరణపరాయణు లైనవారు తనయనుగ్రహంబునకుఁ బాత్రు లగుదు రనియు శాసనంబులయందుఁ బ్రకటించి ప్రోత్సాహపఱచెను. కాఁబట్టి జనులు రాజానుగ్రహము కోరియైనను బౌద్ధమత మవలంబించియుండి రని కొంతవఱకు ఊహింపఁదగియున్నది.

(6) ఆధర్మమునం దెంతవఱకు నశోకుండు వ్యాపింపఁజేసెను?

బౌద్ధధర్మమునకుఁ బునాది శీల మనియు, శీల మనఁగాఁ బాపకృత్యంబులమాని సత్కర్మల నాచరించుట యనియు గతంబున సవిస్తరంబుగ లిఖింపఁబడియున్నది. శీలమునకుఁ దోడుగ దానం బనియు, దానం బిహపరాభిసార

హితంబుగనుండవలె ననియు, బౌద్ధధర్మమును దానముచేయుట యుత్తమోత్త మకృత్యం బనియుఁ దెల్పఁబడియున్నది. ఈశీలదానములను ధర్మావలంబకు లందఱు ప్రథమంబున నాచరింపవలసినవై యుండుటంజేసి యశోకుఁ డీరెం టినే పలుమాఱు శాసనంబులయందుఁ బ్రచురింపఁజేసెను. ఈశీలదానంబుల వలన జనులు దోషరహితులై యన్యోన్యమైత్రిని, గరుణను గలిగి యష్టాంగ మార్గ మనెడియుత్తమపథంబునఁ బోవుట కర్హులగుదు రని బౌద్ధధర్మము ప్రకటించుచున్నది. కాఁబట్టి యశోకుఁడు శీలదానంబులఁ బ్రకటించినది గాక యష్టాంగమార్గలక్షణంబులనుగూడ స్వల్పంబుగఁ దెల్పెను.

(7) అశోకుఁడు బౌద్ధధర్మవ్యాపకము తనరాజ్యమందుఁ బట్టుదలతో నొనరించుట రాజ్యపరిపాలన కవసరమయ్యెనా? లేక యుపకరించెనా?

మైత్రి, కరుణ, ముదము. ఈమూఁడుసుగుణములను బౌద్ధుఁ డయిన వాఁడు ముఖ్యముగాఁ గలిగియుండవలె నని బౌద్ధధర్మము ఘోషింపుచున్నది. బౌద్ధధర్మమును శుద్ధవిశ్వాసముతో నమ్మి యర్హతపదంబునొంది భిక్షువై యుండినయశోకునియందు మైత్రి మొదలయినసద్గుణంబులు మూర్తీభవించి యుండె ననుట కాయన యొనరించిన యసంఖ్యాతములయిన మహత్కార్య ములె ప్రబలసాక్ష్యములు. అట్టి మహనీయునిహృదయంబు కరుణాసాగ రంబున నోలలాడుచుండె ననుటకు సంశయింపఁగలమా? కావున నట్టికరుణా మయుఁడైన ప్రభువునకుఁ దనప్రజలను నేరములు చేసినప్పుడైన శిక్షించుట యెట్లు హితవగును. కాదు. నేరములు చేసినవారి కనికరించి శిక్షింపని యెడల రాజ్యమునందు నేరంబులు వృద్ధియయి తుదకు రాజ్యమునకే హాని తప్పక కలుగును. కావున రాజ్యపరిపాలనయొక్క మర్యాదప్రకారము తక్కినప్రభువులతోఁబాటుగ నేరస్థుల నశోకుఁడు శిక్షించెను. కాని రోగ నివారణకంటె రోగోత్పత్తినివారణము మేలని సద్వైద్యుఁడు భావించునట్లు జనుల సన్మార్గవంతులనుగఁ జేసినయెడల వా రపరాధంబులఁ జేయ రని

తలఁచి తన్నిమిత్తమయి ధర్మోపదేశంబులఁ జేయించి తానుధర్మాచరణం బొనర్చి వారి కాయనమార్గదర్శి యయ్యెను. ఇందువలన జను లొకరియెడల నొకరు మైత్రి కలవారై యుండుటయేకాక రాజునందు గాఢానురాగము కలవారైయుందురు. రాజ్యమునకుఁ బ్రజానురాగమె మూలము. కనుక ధర్మోదేశ మివ్విధముగ రాజ్యమున కుపకరించియుండును. ప్రజలను శిక్షించు టయను హృదయకంటకవ్యాపార మశోకునకు లేకపోయియుండును. గతంబున లిఖింపఁబడిన బౌద్ధధర్మసారమును బట్టి యీయనుమేయము న్యాయంబుగ నుండవచ్చును.

(3) తనరాజ్యమందె గాక పరరాజ్యములయందుఁ గూడ బౌద్ధధర్మము వ్యాపింపఁజేయుటయం దశోకునియభిలాష యేమి?

సాధారణముగ రాజుల యం దుండుదోషములు.

(1) రాజులు సాధారణముగఁ దాము బుద్ధియందును, వైభవమునను నింత యేల సర్వవిషయములయందును బరుల కంటె నధికుల మని తలఁచి తమయం దంత యోగ్యత లేకున్నను లోకులు సంభావించి తమ్మును గౌరవింపవలెనని కోరుచురు. మఱియు జను లట్లు తమ్ము స్తుతింపుచుండ వారిమాటలు బహుమధురంబులయి యట్టిరాజులవీనులకు విందొనరించును. అట్టిరాజులయం దది యంతయు దంభకృత్యమె యగుచున్నది. (2) ఇది యిటుండఁ గొందఱు మతస్థులు తా మవలంబించినమతము కడమమతములకంటెఁ బ్రశస్త మయిన దని తలఁచి యన్యులు నామతంబు నవలంబింపవలయు నని మేరమీఱినకోరిక చేఁ బ్రేరేపింపఁబడి తుదకు దురభిమానులైపరుల వంచించియొ, పీడించియొ తమ మతవ్యాపకములకై పెనగులాడుదురు. ఇట్టిమతసంబంధ మయినదురభిమానము

సామాన్యులు.

రాజునె చుట్టుకొనినయెడల నతఁ డేమిచేయ లేఁడు? జనుల నెంతహింసింపఁ బూనఁడు?

(3) ఇదిగాక సామాన్యజనులె తమయందుఁ గించిద్విశేషం బున్నయెడల దాని నధికంబుగఁ బ్రకటించి యాత్మస్తుతిఁజేసి కొనుట యెవ రెఱుంగక యుందురు. ప్రభువె యిట్టియాత్మస్తుతి కాశపడినయెడల గిమ్మనఁగలమా. (4) తమయం దేమియు విశేషము లేనప్పుడు విశేషమున్నట్లు నటించి తమ్ముఁ దాము పొగడుకొనుచుఁ బరులచేఁ బొగడ్త నొందఁగోరువారిముచ్చటం జెప్పనేల. పైన నుడువఁబడిన నాల్గుదోషంబు లశోకునియందుఁ గలవాలేవా యని కొంతవిచారంచెదము.

అశోకుఁడు రాజ్యపరిపాలనకొఱకుఁ గాని బౌద్ధధర్మవ్యాపకముకొఱకుఁ గాని, తా నొనరించినసత్కార్యంబులన్నియు శాసనముల యందు ముఖ్యముగా సప్తమ స్తంభశాసనమందుఁ బ్రకటించెను. అన్ని మహత్కార్యముల నొనరించుట మానుష శక్తిని మించియున్న దనియు, యశోకుండు చెప్పినంతఁగఁ జేసియుండఁ డనియు బుద్ధ కాలపు హిందూదేశచరిత్రకారుఁ డాయన యాత్మస్తుతిలోలుఁ డయ్యె ననుటకు సాహసించెను. అయినను ఈసంగతిసందర్భముల మనముకొంచెముపరిశీలింపవచ్చును.

అశోకుడు సత్కార్యముల నొనరించి ప్రకటించెను.

ఒక చరిత్రకారుని దురభిప్రాయము.

(1) అశోకుఁడు కట్టించినయనేకస్తూపంబులును, స్థాపించినశిలాస్తంభములును, బ్రకటించిన శిలాశాసనములును, శాశ్వతకార్యము లయి యశోకునియోగ్యత నాచంద్రార్కంబుగఁ బ్రకాశింపజేయఁగలవు. పరులపొగడ్తల కాశపడి యున్న యద్భుతకార్యంబుల నొనరించె ననుటకు మనము సాహసింపఁగలమా? కాఁబట్టి మొదటిదోషం బైనదంభగుణం బశోకునిహృదయంబును దొంగిచూడనయిన లే దనవలెను.

దంభగుణములేదు.

బౌద్ధధర్మదానము.

(2) బౌద్ధధర్మ మన్యులకుఁ జెప్పి వారిచే నాధర్మము నాచరించు నటులఁ జేయుట ధర్మదాన మగు ననియు, నట్టిధర్మముతో మఱియేధర్మమును సాటికా దనియు బౌద్ధమతసిద్ధాంతమందుఁ బ్రబలంబుగ నుడువఁబడియున్నది. బౌద్ధధర్మ మవలంబింపు మని జనులను బలవంతపఱుపవల దనియు, ధర్మమును విశదంబుగమాత్రము బోధింపవలె ననియు బౌద్ధమతమందు నియమ మున్నది. కావున యశోకుఁ డాధర్మానుకూలంబుగఁ దనదేశమందేమి, యితరదేశములందేమి బలవంత మనుమాట లేకయే ధర్మవ్యాపకమునకై ప్రయత్నించె. ఇదిగాక బౌద్ధధర్మప్రకారము పరమతసహనమును దాను జూపి యటులనె చేయుఁడని తనప్రజలకు శాసనముఖంబున విధించెను. మతవ్యాపకమం దశోకుఁడు లేశమాత్రమయినను దౌర్జన్యముఁ జూపియుండఁ డనుట కిది గొప్పసాక్ష్య మగుచున్నది. కావున మతదురభిమాన మను రెండవదోష మశోకునిహృదయంబును దాకియుండ దని పలుకవచ్చును.

అశోకుఁడుసత్యముగ సత్కార్యములఁజేసెను.

(3) అశోకుఁడు తా నల్పకార్యంబుల నొనరించి యధికంబుగ వర్ణించుకొనలేదు. చేసినసత్కార్యంబులను వాస్తవంబుగఁ బ్రకటించినయెడలఁ బ్రజలును దనవలెనే తమశక్తికొలందిగఁ జేయుదు రని తలఁచెను. ఆయన యొనర్చిన కార్యంబులు వాస్తవంబులే యని చీనాదేశయాత్రికులును వ్రాసియుండిరి కదా. సామాన్యజను లందఱు తాను కావించినమహత్కార్యంబుల నన్నిఁటిని యెఱిఁగియుండ రనియు, ఎఱిఁగియున్నను మఱచెదరేమొ యనియును దనకృత్యంబుల వెల్లడిగ శాసనంబులయందుఁ బ్రచురించియుండును. ఇట్లు సద్విషయంబున స్వకార్యప్రశంస యాత్మస్తుతి యగుననుట కేవలసాహసమే యగును.

కాఁబట్టి యాత్మస్తుతి యనుతృతీయదోష మశోకునిచిత్తమం దుదయించనే లేదు.

(4) అశోకుఁడు తా నొనరింపనికార్యములను జెప్పుకొననే లేదు. అన్నృతస్తుతిఁ జేసికొననులేదు. చండశాసనుఁ డైన అన్నృతస్తుతిఁజేసుకొనలేదు. తనతాతగారివలె నించుమించుగాఁ బరిపాలించినయశోకుని నెవరు ముఖస్తుతిం జేయ సాహసించియుండు రని యనుకొంపము. కావునకపటస్తుతి యనునాల్గవ దోషంబును నశోకుని పరిశుద్ధమనస్సును స్పృశించియె యుండదు.

ఇ ట్లశోకునిమనస్సు దోషరహితం బైయుండె. అశోకుఁడు బౌద్ధధర్మమును శుద్ధవిశ్వాసముతో నమ్మి భిక్షు వయ్యె నని యిదివరలోనె తెలుపఁబడియున్నవి. భిక్షువునకు నిహలోకపరలోకాభిలాషలు లేశమాత్రమయిన నుండఁగిట్ట దని బౌద్ధమతము యొక్క కట్టుబాటు. కావున తనరాజ్యమందుఁగాని, పరరాజ్యమందుఁగాని బౌద్ధధర్మవ్యాపకం బొనర్చుటయం దాయన కేయభిలాషయు లేదు. బౌద్ధధర్మమందు నియమింపఁబడినప్రకారము శుద్ధవిశ్వాసముతోను, శుద్ధసంకల్పముతోను మతవ్యాపకంబుఁ జేసె ననుట న్యాయము. గతంబున లిఖింపఁబడిన బౌద్ధధర్మలక్షణంబు లశోకునియందు సమగ్రంబుగ నున్న ట్లాయన యొనరించినయద్భుతకార్యంబులు నిశ్శంకంబుగ నుడువుచున్నవి. బౌద్ధధర్మసంగ్రహ మింతటితో విరమింపఁబడుచున్నది. అశోకునకు ధర్మాచరణము ప్రధానాంశముగాను, రాజ్యపరిపాలన ద్వితీయాంశముగాను నుండె. కావున నా రెంటిని మిళితంబుచేసి శాసనంబులందుఁ బ్రకటించె. ధర్మాచరణమం దత్యంతాదరము కలవాఁ డగుటం జేసి బౌద్ధధర్మసిద్ధాంతమునకు ఆయన యాచరణముప్రచారణ లెంతపర్యంత మనుకూలించియున్నవో

అశోకునిపరిశుద్ధాంతఃకరణ.

యీ విషయము చదువరులకుఁ దెలియుటకై యీసంగ్రహము వ్రాయఁబడినది దీనిసాహాయ్యముచే నశోకునిహృదయపావనత్వమును జదువరు లెఱుంగుదురుగాక. ఈసంగ్రహ మనవసర మని భావించుచదువరులు నన్ను మన్నించెదరుగాక.

చ. కరుణయు మైత్రియుఁ ముదము శాంతియు మానసశుద్ధి సత్యము
న్నరునకు సంపదల్ ధరను, నాఁగ వచించి, తదీయసత్క్రియా
చరణపరాయణత్వమున శాశ్వతసౌఖ్యము మానవుండు
నిబ్బరముగ నొందు సత్య మని బౌద్ధమతం బనిశంబు తెల్పెడుఁ.

---

# 11-వ అధ్యాయము.

## సింహళపురాణములు.

సింహళ హిందూపురాణములనిచ్చట వ్రాయుటకుఁ గారణములు.

గతాధ్యాయములలో నశోకునిచరిత్ర వ్రాయునప్పుడు సింహళపురాణములలోనుండియు హిందూపురాణములలోనుండియుఁ గొన్ని యంశంబులఁ జర్చించియుండుట కలిగినది. ఆపురాణములయం దశోకునిఁ గూర్చి సమగ్రంబుగ నేమి వ్రాసియుండిరో యని చదువరు లనుకొనవచ్చును. కావున నున్న దున్నటుల నవి యిచట లిఖింపఁబడుచున్నవి. గతంబున నశోకచరిత్ర యందు వ్రాయఁబడినయంశంబుల కివి భేదించియున్న వని శంకింపవలదు. అవియె విశ్వసనీయంబులు. చదువరుల కీబౌద్ధపురాణగ్రంథము లిట్లుండె నని తెలియుటకు మాత్రమె అవి యిచట వ్రాయఁబడుచున్నవి. ఈపురాణంబు లేల విస్రంభపాత్రములు కావో యశోకచరిత్ర * యందుఁ జర్చింపఁబడి యున్నది. కొన్ని విచిత్రాంశంబులును అద్భుతవర్ణనలు నీపురాణములయం దున్నవి.

* మహావీరమతమం దుండుగ్రంథముల ననుసరించి వ్రాయఁబడిన "దీపవంశ" "మహావంశ" పురాణములయం దుండునంశములు మిశ్రము చేయఁబడి యీయధ్యాయములో వ్రాయఁబడుచున్నవి.

## అశోకుఁడు బౌద్ధమత మవలంబించుట.

మగధరాజులు.

మగధదేశపురాజయిన కాలాశోకునకుఁ బదుగురు పుత్రులు కలరు. వా రాయనయనంతర మిరువది రెండువత్సరంబులు న్యాయముగ రాజ్యమును బరిపాలించిరి. వారికిఁ బిమ్మట మఱి తొమ్మండ్రు సోదరులు * "నందులు" అను పేరుఁగలవారు జ్యేష్ఠానుక్రమణికగ నిరువదిరెండువత్సరంబు లారాజ్యమునె పాలించిరి.

చంద్రగుప్తుఁడు ప్రభువగుట.

ఆచెప్పఁబడిన నందరాజులలోఁ గడపటిరా జైనధననందునియందు చాణక్యుఁ డనుబ్రాహ్మణుండు గర్భద్వేషముఁ గలవాఁడై యారాజును దునుమాడి మౌర్యరాజకుటుంబములో నొకఁ డైనచంద్రగుప్తుఁ డను వానిని సింహాసన మెక్కించెను. ఆచంద్రగుప్తుఁడు ప్రతాపముఁ గలవాఁడై యిరువదినాలుగువత్సరంబులు పరిపాలించెను. ఆయన యనంతర మాయనకుమారుఁ డయినబిందుసారుఁ డిరువదియెనిమిదిహాయనంబులు ప్రభుత్వముచేసెను.

అశోకుఁడురాజ్యాధి

బిందుసారునికిఁ గళత్రంబులు పదియాఱుగురు. వారివలన నూటొక్క కుమారు లాయనకుఁ గలిగిరి. ఆకొడుకుల మండలములోఁ బ్రథముఁడు సుమనుఁడు. కడ

---

* దీపవంశగ్రంథమందు కాలాశోకునిస్థానమందు శిశునాగుని వ్రాసిరి. మఱియు శిశునాగునికొడుకశోకుఁ డని వ్రాసిరి. నందు లనఁబడుతొమ్మండ్రు సోదరు లుండి రని కాని వా రిరువదిరెండువత్సరంబులు రాజ్య మేలి రని కాని యాగ్రంథంబున వ్రాయఁబడలేదు. ఈలాగుననె యీపురాణములయందసంగతాంశంబు లున్నవి.

పతియగుట.

గొట్టువాఁడు తిష్యుఁడు. ఈతిష్యునితల్లికి మఱియొక పురుషునివలన నొకకొడుకు కలిగెను. ఆతని పేరు అశోకుఁడు. ఇతఁడు తిష్యునికంటెఁ బెద్దవాఁడు. తండ్రియయిన బింబిసారుఁడు తనపరిపాలనకాలమునం దీభరతఖండముయొక్క పశ్చిమభాగమును బరిపాలించుటకు నశోకుని రాజప్రతినిధిగా నుంచెను. బిందుసారునకు మరణవ్యాధి సంభవించె ననువార్త తనచెవిం జేరఁగానె యశోకుఁడు తానుండు ఉజ్జయినినగరమును విడిచి రాజధానియైన పాటలీపుత్రమునకు వెళ్లెను. అచ్చట నశోకుఁడు జ్యేష్ఠభ్రాతయైనసుమనుని, తిష్యునిఁదప్ప కడమ సోదరుల నందఱిని, దనఖడ్గదేవతకు బలియిచ్చెను. తిష్యునిమాత్రము బ్రదుకనిచ్చెను. అంతట నశోకుఁడు మగధరాజ్యమునకుఁ బ్రభువాయెను. ఇట్లు తిష్యునిఁ దప్ప కడమసోదరుల నందఱిని నూచముట్టుగ గిట్టించుటచే నశోకునకు దుష్టాశోకుఁ డని చెడుపేరు వచ్చెను.

న్యగ్రోధునిజననము.

బిందుసారుని పెద్దకుమారుఁడైనసుమనుడు వధింపఁబడినకాలమున కాతని కళత్రము గర్భవతియైయుండెను. ఆ ఘోరవధ జరుగుచుండఁగా నాచిన్నది తనప్రాణములు దక్కించుకొని పాఱిపోయి నగరముయొక్క తూర్పుద్వారసమీపమున నున్నమాలపల్లెయందు దాఁగికొనెను. ఆమాలకుఁ బెద్ద యయినవాఁ డామె నూరార్చి తనశక్తికొలఁది గౌరవించుచు నేడువత్సరంబు లామెను విశ్వాసముతో రక్షించెను. ఆమె నగరము వెలువడి పోయినదినంబుననే ప్రసవించి పుత్రునిం గనెను. ఆబిడ్డనికి న్యగ్రోధుఁ డని పేరుపెట్టిరి. ఆబాలున కేడు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికె యతఁడు బౌద్ధభిక్షు వయియుండెను. పుట్టుకతోనె మహాత్ముఁడు గాఁ బుట్టె ననందగియున్నది. ఆబాలుఁడు క్షత్రియ

న్యగ్రోధుఁడుభిక్షువగుట.

వంశజాతుఁ డని యెవరికిని దెలియకుండెను. ఇట్లుండఁగా నేడవవత్సరంబున నొకనాఁ డాతఁడు రాజనగరసమీపముగా దారివెంబడిఁ బోవుచుండెను. అపుడు ప్రభు వగునయశోకుఁ డాబాలసన్యాసిం జూచి యాతనియందు దీపించుచున్న పావనత్వాదిదివ్యలక్షణంబులం గ్రహించి విభ్రాంతిం జెందెను. ఆబాలముని నంతటఁ దనయొద్దకుఁ బిలిపించుకొనెను. ఆచిన్న

అశోకుఁడు న్యగ్రోధునిఁ జూచుట.

వాఁడును యథాయోగ్యముగా నశోకుని సమీపించిపోయెను. అశోకుఁడు బాలునిఁ జూచి “నాతండ్రీ! ఈకనఁబడుచున్న పీఠములలో నీకుఁ దగినపీఠముమీఁదఁ గూర్చుండుము” అనెను అంతట మతాచార్యుఁ డెవ్వఁడును రాజసభలోఁ గనుపింపనందునఁ దనకుఁ దగినపీఠము సింహాసనమే యని భావించి యాబాలుఁడు దానిపైఁ గూర్చుండబోయెను. ఈబాలుఁడె

అశోకుఁడుబాలుని గౌరవించుట.

యీసింహాసనముపైఁ గూర్చుండియీరాజ్య మేలుటకై జన్మించినవాఁ డని భావించి వానిం గౌరవించి యశోకుఁడు కైదండయొసఁగి సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. తనకొఱకై సిద్ధపఱుపఁబడియున్న ఫలాహారమును బానీయమును దద్బాలయోగికి నొసంగెను.

ఇట్లాబాలయోగిని సన్మానించి పరమార్థవిషయమై యపేక్షవలనను ఉపేక్షవలనను ఏమి కలుగు నని బౌద్ధధర్మము

అశోకుఁడుబాలయోగి వలనధర్మంబెఱుంగుట.

దెల్పు నని యశోకుఁడు ప్రశ్నింపఁగా నపేక్ష నిర్వాణంబునకు మార్గము చూపు ననియు నుపేక్ష మరణంబునకుఁ ద్రోవజూపు ననియుఁ దెల్పు ననియాబాలుఁడు బోధించెను. ఆబాలుఁడు చేసినబోధ యశోకుని యజ్ఞాన మనుగాఢాంధకారమునకు సూర్యదీప్తి యయ్యెను. అశోకుఁడు

వెంటనే బౌద్ధధర్మమం దాసక్తిఁ గలవాఁడై తన్మతాచార్యుల కనేక దానము లొసంగెను. మఱునాఁడు మతాచార్యులను ముప్పదియిద్దఱిని వెంటఁబెట్టుకొని యాబాలయోగి రాజభవనమునకు వచ్చి బౌద్ధధర్మమును సలక్షణంబుగ బోధింపఁగా నశోకుఁడును బ్రజలును బౌద్ధమతము నవలంబించిరి. తనజనకుఁ డవలంబించియున్న బ్రాహ్మణమతము నశోకుఁ డివ్విధంబుగఁ ద్యజించి బౌద్ధమతమందుఁ బ్రవేశించి సామాన్యోపాసకుఁ డయ్యెను.

ఈచెప్పఁబడిన వన్నియు నశోకుఁడు రాజ్యమునకు వచ్చిననాల్గవవత్సరంబున జరిగినవి. ఆసంవత్సరంబుననే యశోకుఁడు పట్టాభిషిక్తుఁడై తనతమ్ముఁడైన తిష్యునిఁ దనకుఁ బ్రతినిధిగా నియమించెను.

అశోకుని పట్టాభిషేకము.

అశోకుని జనకుఁడు బ్రాహ్మణభక్తిఁ గలవాఁడై నిరంతరము వారి ననేకులను బోషించుచుండెను. బౌద్ధధర్మ మవలంబించువఱ కశోకుండు నవ్విధముగనె 60,000 బ్రాహ్మణ్యమును మూఁడుసంవత్సరములనుండి పోషించుచుండెను. బౌద్ధధర్మోపాసకుఁడు కాఁగానె యశోకుఁడు వారి నందఱను వెడలఁగొట్టి వారిస్థానంబున బౌద్ధులం బ్రవేశపెట్టి యంతసంఖ్యనే పోషించెను. ఈపోషణంబుకొఱకు దినమునకు నాలుగులక్షలరూపాయలు వ్యయపడెను. ఒకనాఁడు బౌద్ధమతాచార్యుల నందఱిని భోజనాదులచే సంతృప్తులంజేసి బౌద్ధధర్మమం దెన్నిప్రకరణములు కలవని యశోకుఁ డడిగెను. ఎనుబదినాలుగువేలప్రకరణములు కలవని వారు నుడువఁగా నెనుబదినాలుగువేలపవిత్రమందిరములఁ గట్టింప నశోకుండు నిశ్చయించుకొనెను. అంతట భరతఖండ మందున్న పెద్దనగరములలో నగరమున కొకభవనము చొప్పున 84,000 భవనములను గట్టింప

అశోకుఁడుపవిత్రమందిరములనుగట్టించుట.

వలెనని యశోకుఁడు తన చేతిక్రింది ప్రదేశపాలకులకు నుత్తరువు చేసెను. తాను స్వనగరమయిన పాటలీపుత్రమందు "అశోకారామమును" గట్టించెను ఆభవనములన్నియు మూఁడుసంవత్సరంబులలోఁ బూర్తియయ్యెను. అశోకుఁడు దైవికమహిమ కలవాఁడగుటచే చెప్పరెత్తఁగానె రాజ్యమందంతట వెద చల్లినట్లున్న యాభవనములన్నియు నొక్కసారిగఁ గనుపట్టెను.

అశోకునియందలి దైవమహిమలు.

బుద్ధముని యంతరించినపిమ్మట 218 సంవత్సరములకు నశోకుఁడు రాజయ్యెను. రాజయినది మొదలుకొని యాయన యందు మానుషాతీతప్రజ్ఞ. లనఁగా దైవమహిమలు ప్రవేశించి భూమిపై నొకయోజనము వఱకును భూమిక్రింద నొకయోజనమువఱకును వ్యాపించెను.

దేవతలాయనకు లోఁబడి యాయనకొఱకుఁ బవిత్రమయిన సరస్సునుండి ప్రతిదిన ముదకంబును బహురుచికరములయి పరిమళించు ఫలంబుల నపరిమితముగ నసంఖ్యముగఁ దెచ్చియిచ్చుచుండిరి.

బుద్ధనిదర్శనము.

బుద్ధముని కనంతరము బహుకాలమునకుఁ దాను జన్మించితి నని యందు వలన బుద్ధునిఁ గన్నులారఁ జూడనైతి నని తనవిచారమును నాగలోకాధిపతికిం దెల్పఁగా నానాగేంద్రుఁడు తనమహిమవలన బుద్ధుఁ డశోకునకు నిజరూపముతో సాక్షాత్కరించునటులఁ జేసెను. మహిమ యను పరివేషంబు (గాలిగుడి) చుట్టుకొన శుచిత్వము ప్రజ్వలింపుచుండ బుద్ధుని దివ్యసుందరవిగ్రహ మశోకుని కట్టెదుటఁ గానంబడెను. అట్టి మహనీయ దర్శనప్రాప్తికి మిగుల సంతసించి యామహాపురుషుని గౌరవార్థంబుగ సప్త దివసంబులు నగరమందఖండోత్సవ మశోకుండు చేయించెను.

---

## (2) మహేంద్రసంఘమిత్రలవృత్తాంతము.

సింహళదేశీయులు బౌద్ధులగుట

అశోకునికి సుంపుడుకత్తెవలనపుత్రపుత్రికా సంతానంబు గల్గుట.

తనజనకుండు మగధరాజ్య మేలుచుండఁగా "అవంతి"దేశమునకు రాజప్రతినిధిగా నశోకుం డుండెనని గతంబున లిఖింపఁబడియున్నది. అటుల నవంతిదేశ మేలుచు నశోకుండు "ఉజ్జయిని" ని రాజధానిఁగాఁ జేసికొనెను. అక్కాలంబున విదిశాగిరి యనునగరమందు దేవి యనుపేరుగల యొక సుందరాంగి యుండెను. ఈమె నశోకు డుంపుడుకత్తెగాఁ జేసికొనెను. కావున నీమెయు నుజ్జయిని యందే యుండెను. వీ రిరువురకు నొక కొమరుండు కలిగెను. అతనికి మహేంద్రుఁ డని పేరుపెట్టిరి. బుద్ధుని కనంతరము 204 సం||ల కీకొమరుఁడు జన్మించెను. పిమ్మట రెం డేండ్లకు సంఘమిత్ర యను పేరు గల కుమార్తె పుట్టెను. అశోకుఁడు మగధరాజ్యాధిపతి యగుటకు పాటలీపుత్రమునకు వెళ్లినప్పు డీదేవి తనస్వస్థానమైనవిదిశాగిరికి వెళ్లి యచ్చట నె నివసించెను. కాని యాపుత్రపుత్రికాద్వయుం బశోకుని వెంబడించి పాటలీపుత్రమునకు వెళ్లెను. అచ్చట నశోకుఁడు తనమేనల్లుఁ డైన "అగ్నిబ్రహ్మ"కు సంఘమిత్రనిచ్చి వివాహముచేసెను. వీరిద్దఱికి నొక పుత్రుండు కలిగెను. వాని పేరు సుమనుఁడు.

అశోకుని పుత్రికా వివాహము.

అశోకుఁడు సింహాసనారూఢుఁ డైననాల్గవవత్సరంబున రాజప్రతినిధియు నశోకునితమ్ముఁడు నైనతిష్యుఁడును మేనల్లుఁ డైన యగ్నిబ్రహ్మయు, మనుమఁ డైన సుమనుఁడును బౌద్ధధర్మస్వీకార మొనరించిరి.

ధర్మసభ.

84,000 పవిత్రభవనములు పూర్తిగఁ గట్టఁబడిన వనుశుభవార్త శ్రవణగో
చరంబు కాఁగానె యశోకుఁడు తోడనే తనరాజ్యమందు లక్షలకొలదిగ
నున్నభిక్షువులను భిక్షునిలను దననగరమునకు రావించి ధర్మసభ యొకటి
కావించి సభామధ్యమందు మహద్వైభవంబుతో నాసీనుం డయ్యె. బౌద్ధ
ధర్మమం దశోకునకుఁ గలనిష్కళంకభక్తిశ్రద్ధలచేఁ దత్పూర్వ మాయన
యం దలముకొనినభ్రాతృహత్యదోషమునుండి విముక్తింగాంచి యాయన
భక్తాశోకుం డని యంతటనుండి కీర్తివహించెను.

తనసోదరుఁ డైనతిష్యుఁడు బౌద్ధధర్మాచరణపరాయణుఁడుగా నుండుటం
జేసి రాజప్రతినిధిగా వ్యవహరింపఁజాల
మహేంద్రుఁడు బౌద్ధ కుండఁగా దన కొడు కయినమహేంద్రునిఁ
సంఘములో జేరుట. బ్రతినిధిగా నియమించుట కశోకుం డభిప్రా
యుఁడై యుండె. అశోకునకు మతగురువును
ముద్గలుని పుత్రుఁడు నైనమతిరియొకతిష్యుఁడు అటులఁ జేయవల దనియు
మహేంద్రుఁడు బౌద్ధధర్మమందుఁ బూర్ణాభిలాషియై యున్నవాఁ డనియు
నశోకునకు నాటునటులఁ జెప్పి యాయుద్యమము నివారించెను. అప్పటికి
మహేంద్రునికి 20వత్సరముల ప్రాయము. కావున నతని బౌద్ధసంఘమందుఁ
బ్రవేశపెట్టిరి. అశోకునిపుత్రిక యయినసంఘమిత్ర పసుపురంగుగల వస్త్ర
ముల ధరించుచుండెను కాని యామెకు సంఘప్రవేశానుకూల మైనప్రా
యము రానందున మహేంద్రునకుఁ బిమ్మట రెండుసంవత్సరములవఱకు సంఘ
ములో నామె చేర్చుకొనఁబడలేదు. అశోకుఁడు పట్టాభిషిక్తుఁ డైనయాఱవ
వత్సరంబున మహేంద్రుఁడు సాంఘికుఁ డయ్యెను.

అశోకుని యేలుబడికాలములలో నెనిమిదవవత్సరంబున సుమిత్రుఁడు,
తిష్యుఁ డనువార లిద్దఱు మును లంతరించిరి.
బౌద్ధసంఘమందు వంచక వారు మరణింపఁగానె బహుజనంబు బౌద్ధ

జనులు ప్రవేశించుట.

ధర్మ మవలంబించుటయు మతాచార్యులకు లాక్ష్య లత్యధికంబుగ దానంబు లొసంగుటయు నిట్టి విపరీతములు కలిగెను. బౌద్ధుల కీర్తిలాభంబులు కలుగుటఁ జూచి దుష్టులు కొందఱు తాము మేలుపొందవచ్చు నని బౌద్ధసంఘములోఁ జేరి బౌద్ధధర్మమె యని తమ కిష్టమగు దుర్విషయములను జెప్పి ప్రజలను వంచింపుచు దురాచారములను గొన్నిటిని గల్పించి యాచరించుచు బ్రాహ్మణు లాచరించు జంతుబలులను గూడఁ జేయసాగిరి. ఇందువలన బౌద్ధసిద్ధాంతమందును దదాచరణయందును సాంకర్య మేర్పడినది. బౌద్ధమతమం దంతట నక్రమము లెంతప్రబలిన వనఁగా కూహకబౌద్ధులసంఖ్య నిజమయిన బౌద్ధులసంఖ్యకంటె మిక్కిలి యెక్కువయ్యెను. మతధర్మాచారములు సప్త హాయనంబులవఱకుఁ బ్రవర్తింపకయె యుండెను. అశోకుని గురువును ముద్గలుని పుత్రుండు నయినతిష్యుఁడు తన శిష్యులను మహేంద్రుని యధీనంబు చేసి తాను గంగానదీజన్మస్థానమం దున్నపర్వతములలో నేకాకిగ నివసించి యుండెను.

తిష్యుఁడు మరల వచ్చుట.

పర్వతనివాసమును విడిచిరమ్మని బహువిధములుగ బౌద్ధులు ప్రార్థింప తిష్యుఁడు మరల వచ్చి కపటబౌద్ధులను వెడలించి "కథావత్తు" అనుగ్రంథమును రచియించి పాటలీపుత్ర మందున్నయశోకారామములో మూఁడవమహాజనసభ చేసెను. ఈవిషయంబు లన్నియు బుద్ధుని మరణానంతరము 236-వ వత్సరంబునను అశోకుఁడు పాలనమునకు వచ్చిన సార్థసప్తదశ ($17\frac{1}{2}$) వత్సరంబునను జరిగినవి.

సింహళరాజు రాయ

ఆసంవత్సరమునందె "దేవానాంప్రియతిష్యుఁడు" అనునాతఁడు సింహళరాజ్యసింహాసన మెక్కెను. ఈయనయు నశోకుండు నన్యోన్యముఖావలోకనము లేని

బారులం బంపుట.

వారయినను గాటమయిన నేస్తంబుఁ గలవారై యుండిరి. అశోకునియందుఁ దనకుఁ గలస్నేహగౌరవములం దెలుపుటకై వెలపొడు గయినయపురూపంబులయినవస్తువులను దనమేనల్లుఁ డయిన "మహాఅరిద్ధ" యనువానిచేఁ గట్నంబుగ నశోకునికిఁ బంపెను. ఆమేనల్లుఁడు తనకుఁ దోడుగఁ బంపఁబడినవారితోఁ గూడ బంగాళదేశములో నున్న తామరలిప్తిని వారముదినములకుఁ జేరెను. అచ్చటనుండి మఱి వారముదినములకుఁ బాటలీపుత్రమును బ్రవేశించి యశోకుని దర్శించి యాయనయా కానుకల సమర్పించెను అశోకుఁ డాకానుకల నందికొని కడు వేడ్క నొంది యారాయబారులకు రాజసన్మానంబు గావించి యాకానుకలకు సమంబు లగునూతనకానుకల నొసంగెను. మఱియు సింహళరాజున కొకలేఖను వారిచేఁ బంపెను. ఆరాయబారు లానగరమం దయిదుమాసంబులు సుఖంబుండి తాము వచ్చినత్రోవనె మరల సింహళముం జేరి యశోకప్రభు వొసంగినలేఖను. సింహళప్రభువున కిచ్చిరి. ఆకమ్మయం దిట్ల శోకుఁడు లిఖించియుండెను. "నేను బుద్ధమహామునియందును, బౌద్ధధర్మ మందునను, బౌద్ధసంఘమందునను శరణంబు నొందితిని. శాక్యవంశజాతుండైనమహాత్మునియొక్కధర్మమును నే నుపాసించెద నని ప్రమాణంబు చేసితిని. ఈధర్మమును మీరును విశ్వసింపుఁడు. ఇది మహోత్కృష్ట మయిన ధర్మము. మహాగురు వైనబుద్ధమునికి శరణార్థి నని యనుఁడు."

పైని నుడువఁబడినమూఁడవధర్మసభ తొమ్మిదిమాసంబులు జరిగి ముగిసెను.

ధర్మోపదేశకులంబంపుట.

అనంతరము మొగ్గలుని సూనుం డైనతిష్యుఁడు బౌద్ధధర్మమును వ్యాపింపఁజేయుటకై యన్యదేశముల కుపదేశకులం బుత్తెంచవలె నని నిశ్చయించుకొని కాశ్మీర గాంధార దేశములకును, మహిషమండలము (మైసూరు) నకును, వనవాసికిని (ఉత్తరకన్నడమునకును) అపరాంతకము (బొంబాయికి

నుత్తరతీరము)నకును, మహారాష్ట్రమునకును, యవనదేశము (భరతఖండము యొక్క వాయవ్యమూలప్రదేశము)నకును, హిమాలయపర్వతప్రదేశముల కును, సువర్ణభూమికిని (పెగోదేశమునకును) సింహళద్వీపమునకును ధర్మోప దేశకులను బంపెను.

సింహళమునకుఁ బంపఁబడిన యుపదేశకసంఘము.

సింహళరాజ్యమునకుఁ బంపఁబడినయుపదేశకసంఘములోఁ బ్రధానుఁడు మహేంద్రుఁడు. శేషించిన యయిదుగురును సహాయోపదేశకులు వీరిలో సుమనుఁ డొకఁడు. ఇతఁడు మహేంద్రునికి భాగినేయుఁడు (చెల్లెలకొడుకు).

మహేంద్రుఁడు తనతండ్రి యయినయశోకుని యనుమతిం బొంది, సింహళమునకుఁ బోవుదారిలోఁ దనజననిని నామెబంధువులను జూడ వెళ్లెను. ఆమె విదిశాగిరియం దుండెను. మహేంద్రునిం జూచి తల్లిమిగుల నానందించి కన్నులం గప్పుకొనెను. ఆమె విదిశాగిరియందుఁ దాను గట్టించి యున్న మనోహరమయినమఠంబునఁ బుత్రునిం బ్రవేశపెట్టెను. తనతల్లికి దూరపుచుట్ట మయిన "బంధు" అనువానిని మహేంద్రుఁడు బౌద్ధసంఘమందుఁ జేర్చుకొనెను. ఇంతవఱ కొలుమాసంబులు జననిసన్నిధానమం దుండెను. పిమ్మట మఱియొకమాస ముండి యాబంధువనువానిని గూడ వెంటఁగొని మహేంద్రుఁడు తనయనుచరులతో విహంగంబులవలె నింగి కెగిరి యాకాశమార్గంబున సింహళంబునకుం బోయి "మిస్సా" యను కొండపై వ్రాలెను.

సంఘాభివృద్ధి.

సింహళమునందు మహేంద్రుఁడు చేసినప్రథమబోధతోనె సింహళరాజు తన40,000 యనుచరులతో బౌద్ధసంఘమందుఁ గలిసెను. ఆరాజుయొక్క పుత్రిక యయిదువందలసేవకజనంబుతో సంఘముం

జేర నుద్యుక్త యయ్యెను. కాని పురుషధర్మోపదేశకులు స్త్రీలను సంఘమందుఁ జేర్చుకొనుటకు బౌద్ధధర్మ మంగీకరింపదనియు, సంఘమిత్ర యనుధర్మోపదేశకురాలు వారిని సంఘమందుఁ బ్రవేశపెట్టుకొనునని యు నామెకు మహేంద్రుఁడు తెల్పెను.

సంఘమిత్ర బోధివృక్ష సహితముగా సింహళమునకు వెడలుట.

పిమ్మట సింహళరాజు కార్యావసరమును యోగ్యంబుగ నాలోచించి సంఘమిత్రను, బవిత్రమయిన బోధివృక్షశాఖను, బంపుమని యశోకునిఁ బ్రార్థించుటకుఁ దనమేనల్లుని మరల రాయబారినిఁగా పాటలీపుత్రమునకుఁ బంపెను. అశోకుఁడు తనపుత్రికయందు గాఢానురాగంబుఁ గలఁవాఁడగుటచేఁ బుత్రీషణపాశంబుఁ ద్రెంచుకొన శక్తుండు గాక యామె నెడఁబాయుటకు మిగులఁ బరితపించెను. బౌద్ధధర్మవ్యాప్తియందుఁ దనకుం గలయధికాభిలాష యనెడుప్రబలఖడ్గంబుచేఁ బుత్రీషణపాశంబు నెట్టకేలకు, ఖండించి కూతుంబంప నియ్యకొనెను. మరియు నశోకుఁడు బోధివృక్షశాఖను గొనుటకై మహోత్సవంబుతో వెడలెను.

అశోకుఁడుతామ్రలిప్తివఱకు గూఁతువెంటజనుట.

ఆశాఖను ఖండించునపు డనేకమహిమలు కన్పట్టెను. అట్లాశాఖాసహితముగా సంఘమిత్రను రాయబారులవెంటఁ బంపుచుఁ, బ్రేమపాశము తన్ను నెట్లయినను విడువక యీడ్చుకొనిపోవుచున్నదో యనునట్లుగ, నశోకుఁడు సేనాసమేతుఁడై సేనను దానుస్వయముగ నడిపించుచు "తామ్రలిప్తి" నగరము వఱకు వారి వెంట నేగెను.

తామ్రలిప్తినుండిసింహళమువఱకుబంగాళాఖాతముమీఁదనావికాయాత్రఁ జేయునపుడు బోధిశాఖ యుంచఁబడినపాత్ర

బోధివృక్షశాఖామహిమ.

నావనుండి చివాలున లేచి సముద్రములోఁ బడెను. అంతట నాపాత్ర చుట్టు నొకయోజనమువఱకు సముద్రము నిస్తరంగమై పళ్లెరములోనినీళ్లవలె శాంతముగ నుండెను ఆపాత్ర పోవునంతవఱకు కటులనే యుండెను. ఆకొమ్మయందుఁ బంచవర్ణములు కలపుష్పంబులు పొడచూపి వికసించెను. ఆకాశమునుండి మధురగానము వినవచ్చెను. ఆపవిత్రశాఖ తనమహిమచే సింహళతీరముఁ జేరెను. అచ్చటివారు దానిని బహుగౌరవముతో నందుకొని యంతకుఁ బూర్వము సింహళరాజు సంఘముకొఱకుఁ గట్టించి సమర్పించిన మహామేఘారామమం దాపవిత్రశాఖను నాటిరి. ఆకొమ్మనుండి యెనిమిదిప్రబలశాఖ లుద్భవించెను. ఆశాఖ లనేకస్థలాంతరములయం దనంతరము నాటఁబడినవి.

మహావిహారమఠము.

ఆకాలమందె సింహళరాజు మహేంద్రునికొఱకు మహావిహార మను మఠముఁ గట్టించియిచ్చెను. సింహళద్వీపములోఁ గట్టఁబడిన మొదటిమఠ మిదియె. పిమ్మట వెంటనె "చిత్రియగిరి, అనులా" అనురాజకుమార్తె 500 మందికన్యలతోను, 500 మందియిల్లాండ్రతోను సంఘమిత్రవలనే సంఘమందుఁ బ్రవేశపెట్టుకొనఁబడెను.

మహేంద్రుఁడు, సంఘమిత్రయు నిర్వాణంబు నొందుట.

రాజపుత్రిక భిక్షునియై యర్హతపదస్థురాలయ్యెను. సింహళరాజు సంఘమిత్రకు మఠమొకటి కట్టించెను. దానిలో నామె నెమ్మదిగాఁ బావనజీవనంబొనరించి యేఁబదితొమ్మిదవవత్సరంబున మరణించెను. "ఉత్తియ" అనుసింహళరాజు పాలనమునకు వచ్చి యప్పటి కెనిమిదివత్సరంబు లయ్యెను. ఆమె సహోదరుఁడైన మహేంద్రుఁ డామెకు వెనుకటిసంవత్సరములో ననఁగా సంఘమందుఁ జేరినయఱువదియవవత్సరంబులో నిర్వాణంబు నొందెను.



బుద్ధుని "బోధివృక్షము"—భారహాటు స్తూపమునందలి చెక్కడపు పని.

అశోకుఁడు బోధివృక్షశాఖను బంపెడియుత్సవములయందు మునిఁగి యుండఁగా సింహళప్రభువు అశోకుని మను

బుద్ధముని యొక్క యస్థికలనుసింహళరాజు తెప్పించుకొనుట.

మఁడైనసుమనుని వెంటఁ గొందఱి నిచ్చి యాయనయొద్దకుఁ బంపుచు బుద్ధమునియొక్క యస్థులలోఁ గొంతభాగమును దనకుఁ బంపు మనియు, వానిని (ఆయస్థులను) దాను స్వయముగా నొకస్తూపమునందుఁ బ్రతిష్ఠించెద ననియు నశోకునిఁ బ్రార్థించెను. అశోకుఁ డాయన కోరినప్రకారము పల్లెమేఁడు అస్థులనుమిగులసంతసంబుతోఁ బంపెను. దానికిఁ దోడుగాఁ శక్రుఁడు (దేవేంద్రుఁడు) బుద్ధునియొక్క జత్రువు ననఁగా గుండెమీఁదను మెడకుఁ గ్రిందుగను నుండెడి యెముక నిచ్చెను. ఆయస్థికలను సింహళప్రభువు బహుభక్తిపూర్వకముగఁ గైకొని థూపారామస్తూపమునందుఁ బ్రతిష్ఠించెను. ప్రతిష్ఠాకాలమందు భయంకర మయినభూకంపము కలిగెను. ఆయద్భుత

భిక్షువుల సంఖ్యాభివృద్ధి యగుట.

మును జూచి జనులు బౌద్ధమతమందు గాఢ విశ్వాసముఁ గలవారై గుంపులుగుంపులుగా బౌద్ధసంఘములోఁ గలిసిరి. సింహళరాజు యొక్క తమ్ముఁడు భిక్షువయ్యెను. అక్కాలంబున బౌద్ధభిక్షువులసంఖ్య 30,000.

## (౩) తృతీయధర్మసభయొక్క వృత్తాంతము.

గతంబున లిఖింపఁబడియున్నప్రకారము ద్రోహబౌద్ధులసంఖ్య ప్రబల మయి యామతాచారములు చెడిపోయి మతస్వీకారము చేయుటకు విధింపఁ బడినయాచారమును కడమ పవిత్రాచారములును సప్తవత్సరంబులవఱకును నిల్చిపోయి యుండఁగాఁ జింతించి యశోకుఁ డాయక్రమమును నివారింప నిశ్చయించుకొనెను. అంతటఁ దమయాచారములను యథావిధిగా నొన

భిక్షువులనుబలవంత పఱుచుట.

ర్చుటకై భిక్షువులను బలవంతపెట్టుమని యశోకుఁడు తనమంత్రిని బంపెను. ఆప్రకారమె మంత్రి వెళ్లి భిక్షువుల నందఱను రావించి యశోకప్రభువు యొక్క యాజ్ఞను శ్రుతపఱచెను. మతద్రోహులను వెడలఁగొట్టువఱకు మతాచారములను నడిపింపలేమని వారు ముక్కరముగా నుడివిరి.

మతాచార్యులను మంత్రివధించుట.

అశోకునియుత్తరువు లేనిదె మంత్రి యామూర్ఖులైనమతాచార్యులశిరంబులను స్వహస్తంబుతోఁ దెగవేసెను. అశోకునిసోదరుఁడైన తిష్యుఁ డడ్డువెట్టి యింక వధింపకుండ నాపెను.

తనమంత్రి కావించినక్రూరకృత్యము విని నిర్వ్యాజగంది తద్దోషవిముక్తి తనకెట్లు కలుగునా యని యశోకుఁడు మిగులఁ బరితపించెను. శేషించిన మతాచార్యులు హితోపదేశము చేయఁగా నశోకుఁడు ముగ్గలునిసుతుఁడైనవృద్ధతిష్యుని నాయన చేయుచున్న బహుదూరప్రవాసము నుండి బయలుదేరఁదీసి గంగానదిమీఁదుగాఁ బడవలలో రావించి యాయనను బహు గౌరవము చేసెను.

అశోకుని పరితాపము.

ఆమునియొక్క యమానుషశక్తిని శోధింపంగోరి యశోకుఁ డాయన నొకమహిమను జూపుమని వేఁడుచుఁ గొంత పరిమితప్రదేశములో భూకంపముఁ గలుగఁజేయుమని ముఖ్యముగాఁ గోరెను. అంతట నాముని యొకగుఱ్ఱపుబండిని, గుఱ్ఱమును, మనుష్యుని, పాత్రను నాసమచతురస్థలముయొక్క నాల్గుదెసలను దిశకు నొకటిచొప్పున నెల్లలయం దుంచి యాముని భూకంపమును గలుగఁజేసెను. ఆభూకంపమువలన నాయెల్లల

తిష్యముని మహిమలు.

లోఁగా నున్న ప్రతివస్తువును సగభాగము కదలి మిగిలినభాగము కదల కుండెను. ఈమహిమావిశేషముచే సంతుష్టుఁడై యశోకుఁ డామునివర్యు నితో నిట్లు ప్రశంసించెను. "అయ్యా! నామంత్రిమతాచార్యులలోఁ గొందఱిని ఘోరంబుగ వధించియుండెను. ఆపాపము నన్నంటు నా?" యని యడిగెను. "అశోకరాజా! ఆవధఁ జేయుటకు నీకు నెంతమాత్రమును సంకల్పమే లేదు. కావున నద్దోషము నీకుం జెందదు" అని యశోకునకుం దెల్పి యాయనను బాపవిముక్తుం జేసి యావిషయమై ధర్మసూక్ష్మమును సమగ్రముగ నమ్ముని బోధించెను.

## మూఁడవ పరిషత్తు.

భరతఖండమం దున్నయన్నిమతములయాచార్యుల నశోకుం డంతట రావించి సభచేసి తనగురు వయినతిష్యముని ప్రక్కగఁ దాను కూర్చుండి ప్రత్యాచార్యుని నీమతమేమి అని యడిగెను. వా రందఱు చెప్పినదంతయు నాకర్ణించి "వైబాధ్యాయవాదినుల" యొక్క మత మొక్కటియె బుద్ధముని సిద్ధాంతముతో యథావిధిగఁ బోలియున్న దని తిష్యముని వాక్రుచ్చెను. అన్యమతాచార్యుల నఱువదివేలమందిని నంతట నశోకుఁడు వెడలఁ గొట్టెను. నిజమయినబౌద్ధమతాచార్యులను వేయిమందిని మాత్ర మంగీకరించి వారిచే నొకసభ నశోకుఁడు జరిపించెను. బౌద్ధధర్మమునందుఁ గలిగిన సందేహములను నివారించుటకై కథావత్తను గ్రంథమును తిష్యముని యాపరిషత్తులోఁ జదివి వినిపించెను. రాజగృహమందు జరిగిన మొదటిపరిషత్తునందునను, వైశాలియందు జరిగిన రెండవ పరిషత్తునందునను నొనర్పఁబడినటుల మతాచార్యులు బౌద్ధమత గ్రంథముల నన్నిటిని సంస్కరించిరి. ఈపరిషత్తు తొమ్మిదిమాసములు జరిగినది. బౌద్ధమతము నిట్లు పునరుద్ధరించుటను జూచి సంతసించి మంచిపని

బౌద్ధమతగ్రంథ సంస్కరణము.

చేయఁబడిన దని భూదేవి తెల్పుచున్నదో యనునట్లుగఁ, బరిషత్తు ముగి యఁగానె భూమి కంపించెను. అప్పటికి తిష్యమునికి డెబ్బదిరెండుసంవత్సర ములవయస్సు.

(4) రాజప్రతినిధియయిన తిష్యునివృత్తాంతము.

అశోకునితమ్ముఁడైన తిష్యునిసందేహము.

రాజప్రతినిధియు నశోకునితమ్ముఁ డైనతిష్యుఁ డొకనాఁడు కొనవనంబులోఁ గణుజుల గుంపు విహరించుచుండఁగాఁ జూచెను. ఆకుఅలము మేయుచుఁ గణుజు లిట్లు వినోదపడు చుండఁగా మఠములయందు సుఖనివాసము కలిగి సుఖముగాఁ బోషింపఁ బడుచున్న భిక్షువు లేల వానివలె (ఆకణుజులవలె) విహరింపఁగూడ దని తలఁచెను. ఆయన యంతటఁ దనతలంపు నశోకునితో విన్నవించెను. అశో కుఁడు విని "తిస్యా! నీ వేడుదివసంబు లీరాజ్యమును బాలింపుము. ఏఁడు దినంబులు కాఁగానె నిన్ను వధించెదను" అని చెప్పెను. ఆప్రకారమె యేడుదివసంబు లును గడిచినతక్షణమె యశోకుఁడు తిష్యునిఁ జూచి నీ వేల యిట్లు కృశించియున్నా వని యడిగెను.

తిష్యునికిమరణ దండనవిధించుట.

సన్నిహితమయి యున్నఘోరమరణమునకు వెఱచి కృశించు చున్నా నని తిష్యుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "తమ్ముఁడా! వారముదిన ములలో మరణము సంభవించు నని కదా నీ విట్లు కృశించుచుంటివి. ఈభి క్షువులును మృత్యువుసన్నిహితముగ నుండు నని యెల్లప్పుడుఁ జింతించు చున్నారు. అట్టివారికిఁ దుచ్ఛవినోదము లెట్లు రుచించును". దీనిభావమును తిష్యుఁడు గ్రహించి వెంటనె బుద్ధమత మవలంబించెను. పదఁపడి కొంతకాలమున కొకప్పుడు తిష్య

తిష్యుఁడు మత మవలంబించుట.

డడవిలో వేఁటాడఁబోయి యచ్చట మహాధర్మరక్షితుఁ డనుమునిని చూచెను. ఆయన మహాభక్తుఁడు, సర్వపాపరహితుఁడు. ఆయన యొకవృక్షచ్ఛాయను గూర్చుండఁగా నొకకుంజరంబు తనతొండమున నొకచెట్టుకొమ్మ దాల్చియాయనకు విసరుచుండెను. తా నెన్న డట్టిమహాత్ముండై యరణ్యమందు శాంతమూర్తి యై యుందునో యని యనుకొనెను. తిష్యునకు బౌద్ధధర్మమందాసక్తియు శ్రద్ధయుఁ గలిగించుటకై యామహాత్ముఁడు గగనంబున కెగిరి యశోకారామ మనుకొలనిపై వ్రాలి తేజలంబున స్నాతుం డయ్యె. ఆయన వస్త్రంబులు బయలిలో నిల్చియుండెను. ఆమహిమను గనుంగొని యద్భుతంబుపడి మతసంస్కారంబు నొందుటకై తిష్యుఁ డశోకుని యంగీకారంబు వేఁడెను.

మహాధర్మరక్షితుఁడను యోగియొక్క మహిమలు.

భిక్షు వగుటకు తిష్యునకుఁ గలిగినయభిలాషను వారింపఁజాలక యశోకుఁ డంగీకరించి యాయనను స్వయముగా మతమునకుం దోడ్కొనిపోయెను. అచ్చట మహాధర్మరక్షితుఁ డాయనకు భిక్షుత్వాధికారమొసంగెను. ఆయన వెంటనే లక్షజనము భిక్షువు లయిరి. తిష్యునితోఁబాటుగ భిక్షువు లయినవా రింద ఱంద ఱని చెప్ప నలవికాదు.

తిష్యుఁడు భిక్షువగుట.

## (5) అశోకుని చివరదినములవృత్తాంతము.

గతంబున లిఖింపఁబడిన ప్రకారము సింహళమునకుఁ గొంపోఁబడిన బోధివృక్షశాఖ యశోకుఁడు పాలనమునకు వచ్చినపదునెనిమిదవయేటఁ బంపఁబడెను. అది సింహళములో మహామేఘవనమందు నాఁటఁబడెను.

పిమ్మటఁ బండ్రెండవవత్సరంబున నశోకునిప్రాణప్రియ యైన "అసంధిమిత్ర" కాలధర్మము నొందెను. ఈమె యశోకునివలెనే బౌద్ధధర్మోపాస

అశోకుఁడుతిష్యనక్షత్రను వివాహమాడుట.

షరా లయియుండెను. ఆమెమరణానంతరము నాల్గవవత్సరంబులో నశోకుఁడు సంసారవాంఛ తీఱక మఱియు మోహపరవశుండై తిష్యరక్షిత యనునామెను రాణిఁగాఁ జేసికొనెను. ఈమె చిన్నదియు డంబముగలదియుఁ గా నుండెను. ఆమె ధ్యానమంతయు సొగసులు చేసికొనుటయందె యుండెను. తన భర్త యయిన యశోకుఁడు బోధివృక్షముకొఱకుఁ బ్రాణములు విడుచును గాని తన సొంపు నింపుఁ జూచి ప్రాణములు విడువఁ డని బోధివృక్షము నెడ నీర్ష్యఁబూనెను. తాను పట్టపుదేవి యయిననాల్గవవత్సరంబునఁ దన యీసు మేరమీఱఁగా మంత్రసామర్థ్యము

ఆమెబోధివృక్షమును నాశముచేయఁబూనుట.

చేత బోధివృక్షమును నశింపఁజేయవలయు నని యత్నించెను. కాని యామె విఫలమనోరథ యయ్యెను. పిమ్మట నాలుగువత్సరంబులకు భక్తాగ్రగణ్యుఁడైనయశోకుఁడు శరీరధారులు పొందవలసిన యంతమును బొందెను. (అనఁగాఁ గాలధర్మమొందెను.) ఈమహాప్రభువు ముప్పదియేడు హాయనంబులు జగద్వినుతంబుగ రాజ్యమేలెను.

అశోకునిమరణము.

---

## 12-వ అధ్యాయము.

## హిందూ దేశమం దున్న బౌద్ధపురాణములు.



(1) అశోకునివంశానుక్రమణికయును గుటుంబమును. బింబిసారుఁడు రాజగృహనగరమందుఁ బరిపాలనచేసెను. (2) అజాతశత్రువు. (3) ఉదయభద్రుఁడు. (4) మందుఁడు. (5) కాకవర్ని. (6) సహాలినుఁడు. (7) తులకుచి. (8) మహామండలుఁడు. (9) ప్రసన్నజిత్తు. (10) నందుఁడు. (11) బిందుసారుఁడు. వీరు బింబిసారుని పుత్రపౌత్రపరంపర అనఁగా మొదటి పేరుగలవానికిఁ దర్వాతి పేరువాఁడు పుత్రుఁ డని యెఱుంగునది. *

**బింబిసారుఁడు సుభద్రాంగిని పెండ్లియాడుట.**

శంపానామధేయుఁ డైనయొకబ్రాహ్మణునకుఁ బ్రాణతుల్య యైనయొక పుత్రిక యుండెను. ఆమెకు నిద్దఱు పుత్రులు కలుగుదు రనియు, వారిలో నొకఁడు భూచక్ర మేలు ననియు, ద్వితీయుఁడు పరమయోగి యగు ననియు, భవిష్యత్తు నెవరో

---

* దివ్యదాన మనుగ్రంథములో వచనరూపముగ నున్న "అశోకావదానము ననుసరించి యీవంశవృక్షము వ్రాయఁబడినది. ఈవంశవృక్షములో చంద్రగుప్తుని పేరు విడువఁబడిన దనియు బింబిసారుఁడు నందుని పుత్రుఁ డని యుదాహరింపఁబడిన దనియు జనువరులకు స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. అశోకావదానము పద్యరూపముగాఁగూడ నున్నది. దానిలో అజాతశత్రునకు మాఱుగ మహీపాలునినామ మున్నది.

చెప్పియుండిరి. ఆమె జనకుం డాభవిష్యత్తున కనుకూలించునటుల నామెను దద్రాజ్యాధిపతికి వివాహారంబుగ నిచ్చి కృతార్థుఁడ నయితిననుకొనియెను. కాని యారాజభార్య లామెయెడల నీర్ష్యం బూని యామెకు రాజాలింగన ప్రాప్తి లేకుండఁజేసి యామెచే మంగలిది చేయుదాస్యముఁ జేయించుచుం డిరి. అట్లాచిన్నది కొంతకాలము నీచదశ ననుభవించి తనది మంగలికులము కాదనియుఁ, దాను బ్రాహ్మణవంశజాత ననియు, రాజున కెట్టులనెం దన్నెఱింగించెను. అంతట నాభూపతియైన బింబిసారుఁ డామె యుత్తమవంశ్య యని నమ్మి యామెం జేపట్టినయెడలఁ దనకు గౌర వంబే యని భావించి చెట్టఁబట్టి తనపట్టపుదేవులలో మొట్టమొదటి దానిం జేసెను. ఆమె పేరు సుభద్రాంగి.

అశోకునిజననము.

బింబిసారుఁ డామెవలనఁ బుత్రద్వయంబుఁ బడసి వారిలోఁ బ్రథమునకు "అశోకుఁ డనియు, ద్వితీయునకు విగతాశోకుఁ డనియు, నామకరణంబుఁ జేసెను.

పదంపడి 'పింగళవత్సజీవుఁడు' అనుయోగిని రావించి యాకొమరుల భవిష్యత్తెట్లుండు నని యాయన నడిగెను.

అశోకుఁడు ప్రభువగునని యొకయోగి తెల్పుట.

అశోకుఁడు నాగరికము లేక మోటుగాఁ గనుపించుటచేఁ దండ్రి కాతనియం దనూయ కల దని యయ్యోగి యెఱింగి నిజంబును బింబిసారునికిం జెప్ప వెఱచి యాపట్టమహిషి యైనసుభద్రాంగితో "నమ్మా నీమొదటిబిడ్డఁ డయినయశోకుఁ డీసింహాసనం బెక్కువాఁడు" అని రహ స్యంబుగఁ జెప్పివెళ్లెను.

ఇట్లుండ నొకప్పుడు తక్షశిలానగరవాసులు బింబిసారునితోఁ గల హించి తిరుగబాటుగా నుండుటచే నాయన తక్షశిలానగర వాసులపై వారి నడంచుటకై యశోకునిఁ బుత్తెంచెను.

యశోకుఁడు దాడివెడలుట. కాని పుత్రునియం దాయనకుం గలయసూయంబట్టి యశోకునకు యుద్ధపరికరంబులనఁగా సేనలను ఆయుధాదులనుఁ దగిన ట్లొసంగఁడయ్యె. శత్రువులతోఁ బోరాడుటకు వలయునట్టిసాధనసామగ్రి లేకున్న నశోకుఁడు జనకు నాజ్ఞానుసారంబుగ దాడివెడలి పోవుచుండ భూదేవి యనుగ్రహించి తనగర్భము నుండి యాయనకు వలసినసేనాదికమంతయు నొసంగెను. అశోకుఁ డంతట "తక్షశిలానగరముచెంత దండు విడియ నన్నగరవాసు లశోకుని దర్శించి" మహాప్రభూ! మాకు రాజునెడలఁ గాని, తత్పుత్రునియెడలఁ గాని, ద్వేషంబు లేదు. మమ్ము మిాక్రూరమంత్రులు హింసింపుచుండిరి. కావున వారితోఁ గలహించితిమి. మేము మిాకు లోఁబడియున్నవారమే యని విన్నవించిరి. తక్షశిలానగరమును "స్వాస" రాజ్యమును లోఁబఱచుకొని యశోకుఁడు మరలి స్వనగరంబునకుం బోయెను.

బింబిసారునకు మఱియొకరాణివలనఁ గలిగినపుత్రుఁ డొకఁ డుండెను. వాని పేరు సుశీముఁడు. అతఁడె జ్యేష్ఠపుత్రుఁడు అశోకునికంటెను బెద్దవాఁడు. ఒకనాఁ డతఁడు ఉద్యానవనమునుండి నగరభవనములోనికిఁ బోవునపుడు తనచేతిమేజోడును దీసి "ఖల్లాతకుఁడు" అను మంత్రిశిరంబున నాట్లాటకు విసిరివేసిపోయెను. ఈయవమానం బామంత్రి హృదయంబున గాటంబుగ నాటుకొనుటచే నాతఁడు ప్రబలద్వేషం బారాజపుత్రునియందు వహించి అయిదువందలమంది ఆలోచనసభికులతోఁ గుట్రచేసి యతనిని రాజ్యంబునుండి వెడలఁగొట్టి యశోకునకురాజ్యం బొసంగఁ దలపెట్టెను.

సుశీముఁడు తక్షశిలా నగరవాసులపై దండెత్తి

ఇట్లుండ తక్షశిలానగరవాసులు మరలఁ గలహించుటంజేసి బింబిసారుఁడు తనజ్యేష్ఠపుత్రుఁ డయినసుశీముని వారిపైఁ బంపెను. కాని యాతఁడు వారిని లోఁబఱచుకొనఁజాలఁడయ్యె. ఆసమయంబు

యోడిపోవుట.

ననే బింబిసారుఁడు వ్యాధిగ్రస్తుఁడై యున్నందున శత్రులపై నశోకునిఁ బంపి సుశీముని రావించి రాజ్యాధిపతిం జేయఁగోరెను.

బింబిసారుఁడు మరణించువఱకు నేదోకారణంబును గల్పించుచు మంత్రి మొదలగువార లశోకుని తక్షశిలానగర

సుశీమునిదుర్మరణము.

మునకుం బంపక సుశీముని రాకుండఁజేసిరి. బింబిసారుఁడు మరణింపఁగానె వా రశోకుని సింహాసనం బెక్కించిరి. దేవతానిర్ణాణము నట్టిదె యగుటచే నశోకుఁడు ప్రభువుకాక తప్ప దనియు వారు భావించిరి. ఈవర్తమాన మంతయుఁ దెలియఁగానె సుశీముఁ డశోకునివెడలఁగొట్టి సింహాసనమును దీసికొనుటకై పాటలీపుత్రమునకు శరవేగంబున వచ్చెను. కాని సుశీముఁడు లోనికి రాకుండ రాజద్వారంబున దిగంబరు లయినరాక్షసుల నశోకుఁడును మంత్రి యగు రాధాగుప్తుఁడును గావలియుంచిరి. మఱియు సుశీముఁ డగ్నికుండము నందుఁ గూలి దుర్మరణముఁ బొందునట్లు లెంతయు మోసము చేయఁబడెను.

## (2) అశోకుని క్రూరప్రభుత్వమును, బౌద్ధమతావలంబనమును.

ఒకానొకదినంబున నశోకునిచిత్తమునకు వ్యతిరేకముగా నయిదువందల మంత్రులు నడచుకొనఁగాఁ బ్రచండకోప

అశోకుఁడు మంత్రులను జంపుట.

వశుండై తనఖడ్గంబు నొఱనుండి దూసి స్వహస్తంబున వారిశిరంబుల నన్నిటిని ఖండించెను.

మఱియొకదివసంబున నంతఃపురస్త్రీ లశోకునియనాగరికలక్షణంబులం జూచి యేవగించి తోటలో నున్నయశోక

అంతఃపురస్త్రీలను

వృక్షపత్రంబులఁ ద్రుంచి పాడువైచుటచే

గాల్పించుట. నశోకుని నపహాసించిరి. స్త్రీ లిట్లు పరిహసించిరే యని కోపోద్దీపితుండై యశోకుఁడు వారలను జీవంబులతోడ నగ్నికి నాహుతియొనర్చి తనకోపాగ్నిం జల్లార్చుకొనెను.

ఈఘోరమయిన క్రూరకృత్యముఁ జూచి మంత్రివర్గంబు బహుభీతిం జెంది యశోకుని సన్నిధికిం బోయి "ఓమహాప్రభూ! మీ గౌరవహస్తంబులను క్రూరరక్తంబుచేత నేలఁ జేవురింపఁజేసెదరు. ఊరిఁదీయుతలారి నొకని నియమించి వానివలన వధరూపశిక్షలఁ జేయింపవచ్చును" అని విన్నవించిరి.

అశోకుని మంత్రుల ప్రార్థన.

ఆవిన్నప మంగీకరించి "చండగిరికుఁడు" అనువాని నొకనిని దేశమంతయు గాలించి తెప్పించి యుఁరిఁదీయు పనికి వాని నశోకుఁడు నియమించెను. క్రూరకృత్యములయందును, ప్రాణిహింసఁ జేయుటయందును వాని కౌకౌలంబున సాటి యగువాఁ డెవ్వండును లేఁడు. వాఁడు తనతల్లిదండ్రులనే వధించెను. పరులఁ జంపుట యట్టివాని కాటయే కదా. వాని యుపయోగముకొఱకు నశోకుఁ డొకచెఱసాలం గట్టించెను. ఆకారాగృహముయొక్క వెలుపలిభాగము మిగుల మనోజ్ఞము గనుండెను. కావునఁ జూచువార లాభవనముయొక్క బహిరాకారంబుఁ జూచి మిగుల సంతసించి లోన నిం కేమి చిత్రంబు లుండునో యని వేడుకపడి లోనికిం బోఁగానె యచ్చట నా క్రూరాత్ముఁడు వారలఁ బలుతెఱంగులఁ బీడించి హింసించి గీటడంచెను. ఇట్లా బాలిశునికిఁ జేతినిండఁ బనిఁగలుగఁజేయుటకై యాకారా

చండగిరికుని కారాగృహాధిపతినిగాఁ జేయుట.

ప్రాణిహింస.

గృహంబు నంతరమణీయముగ నశోకుఁడు కట్టించెను. మఱియు నాచెఱసాలలోపలికిఁ బోయినవారు సజీవులయి బహిర్గతులు కాఁగూడ దనియశోకుఁడు చండగిరికు నాజ్ఞాపించెను.

బాలపండితుఁడు తనమహిమనుజూపుట.

ఒకదినంబున బాలపండితుఁ డనుపావనయోగి ప్రమాదవశంబునఁ దత్కారాగృహాంతర్భాగమందుఁ బ్రవేశింపఁగా నాప్రాణఘాతుకుఁ డాయనను బట్టి బంధించెను. మరణదండనకుఁ బూర్వము సప్తదివసవిశ్రాంతి నేరస్థులకు సాధారణముగ నొసంగఁబడు క్రమంబున నయ్యోగికి నియ్యఁబడెను. అయ్యేడుదివసంబులును గొనముట్టగానె దయారసం బనునది యెట్టిదో యెఱుఁగనియద్దురాత్ముం డాయనను మురుగుడుతో నిండియుండు నొకగూనలోఁ బడవేసెను. ఆబాన క్రింద వహ్ని ప్రజ్వరిల్లుచుండెను. అనంతర మాకారాగృహాధిపతి యాబానను వీక్షింపఁగా నాబాలపండితుఁ డగ్నిస్పర్శయే లేక యొకపద్మమం దాసీనుఁడై యున్నట్లు కనుపించెను. పావనయోగియొక్క యీమహిమను వాఁ డశోకునకుఁ దెలుపఁగానె యాయన స్వయముగాఁ గనుంగొనవచ్చెను. అంతట నమ్మహనీయునిఁ గన్నులారఁ జూచి, యాయన దివ్యబోధను జెవులార విని బౌద్ధధర్మం బవలంబించి దుర్మార్గమును శాశ్వతముగఁ బరిత్యజించెను. ఆకారాగృహమును బడఁగొట్టించి దాని యధికారి యగునమ్మహాపాపిని జీవముతోఁ గాల్పించెను 'అశోకావదానము' అనుగ్రంథమం దున్నదని పైవిషయముతోఁ గొన్నివిశేషాంశములను దాను చేర్చి వ్రాయుచు "హ్యూన్‌సియాంగు" రాయబారి, పైనుదాహరింపఁబడిన కారాగృహ మనెడునారకలోకము రాజధానియైన పాటలీపుత్రమందె యుండె నని తెలిపెను. ఆనగర

అశోకుఁడు బౌద్ధధర్మమునవలంబించి సన్మార్గుఁడగుట.

గృహము మాళవదేశమునం దున్న ఉజ్జయినీనగరములో నున్నట్లు మఱియొక పురాణములో నున్నది. ఆగ్రంథమును హ్యూయెన్ సియాంగు రాయబారి సూచనమాత్రము చేసెను గాని, యాగృహము పాటలీపుత్రమం దుండెనో, ఉజ్జనియం దుండెనో స్పష్టపఱిచియుండలేదు.

అశోకున కుపగుప్తుడు గురు వగుట.

ఆకారాగృహము నాశము చేయఁబడినతర్వాత ఉపగుప్తుఁ డనుముని వచ్చి యశోకుని బౌద్ధమతావలంబునిగ నొనర్చినట్లు హ్యూయెన్ సియాంగు వ్రాసినగ్రంథము వలనఁ గన్పట్టుచున్నవి. బుద్ధుఁడు నిర్వాణంబు నొందినపదంపడి యమ్మహానీయుని దహనము చేసి యాయన యస్థిక లెనిమిదిస్తూపములయందప్పటివారు గుప్తము చేసి యుండగాఁ నశోకుఁడు వానిం దెఱచి యస్థికలను వెలికిఁ దీసి ఉపగుప్తుని సాహాయ్యంబున దేవతాశక్తుల నాకర్షించి రాజ్యమం దచ్చటచ్చట స్తూపంబుల వేలకొలఁదిగ నిర్మింపవలయు నని వాని కాజ్ఞాపించెను. అవి యటులనే చేసెను. పిమ్మట సూర్యోపరాగకాలంబున నయ్యస్థికల నన్నిస్తూపములయందుఁ బ్రతిష్టింపవలయు నని యశోకుఁ డానతీయఁగా నవి యేకముహూర్తంబున నట్లొనర్చినవి.

అశోకుఁడు బుద్ధుని యస్థికలను స్తూపంబుల యందు బ్రతిష్టించుట.

అశోకావదానగ్రంథ మిట్లు నుడువుచున్నది. దహనానంతరము బుద్ధుని యస్థిక లెనిమిదిస్తూపములయందుఁ బ్రతిష్టింపఁబడియుండఁగా అజాతశత్రు వనురాజు సప్తస్తూపములయం దున్నయస్థికలను బయలికిఁ దీసి యొకపాత్రయం దుంచి దానిపై నొకస్తూపంబుఁ గట్టించియుండెను. అష్టమస్తూపము నాగేంద్రపాలితంబై యుండుటంజేసి దానియం దుండునస్థిక లాయన కవశంబులయ్యె. ఇట్లుండ నశోకుఁడు తాను శక్తులచే నిర్మింపఁజేసిన

84,000 స్తూపంబులయందుఁ నయ్యస్థికలం బ్రతిష్ఠింప నభిలషించి నప్పు డయ్యజాతశత్రునిర్మితస్తూపంబు సాటనం బొనర్చి తదంతర్గతాస్థికలం గైకొని శరత్కాలమేఘంబులభాతి భాసిల్లుచుండిన 84,000 స్తూపంబుల యందు నేకదినంబున మౌర్యవంశదీపకుఁ డైనయశోకుఁడు ప్రతిష్ఠించెను. పూజనీయుఁడును భాగ్యశాలియు నైనయీమౌర్యుఁడు జీవకోటి నుద్ధరించు టకై యన్నిస్తూపంబులఁ గట్టించెను. స్తూపనిర్మాణంబునకుఁ బూర్వము దుష్టా శోకుఁ డనియుఁ, దదనంతరము భక్తాశోకుఁ డనియు, లోకంబున నశోకుఁడు విఖ్యాతిఁ జెందెను.

పద్యకావ్యమయిన యశోకావదానము.

"అశోకావదాన" అనుగ్రంథము వచనకావ్యముగాను, బద్యకావ్యము గాను రచింపఁబడియున్నది. ఇంతవఱకు వచనకావ్యము ననుసరించి స్తూపవిషయము లిఖింపఁబడినది. 3510 లక్షల స్తూపములు తక్షశిలానగరవాసులప్రార్థనప్రకారము కట్టఁ బడినట్లును, 1,00,00,000 స్తూపములు సముద్రతీరములయందు యక్షుల వలన నిర్మింపఁబడినట్లును, అత్యద్భుతంబుగఁ బద్యకావ్యములో వర్ణింపఁబడి యున్నది.

## (౩) అశోకుని ధర్మయాత్ర.

ఉపగుప్తుని జన్మవిశేషము ఆయననివాసము.

84,000 స్తూపంబుల నిర్మింపఁజేసినయనంతరము బౌద్ధపుణ్యక్షేత్రంబుల దర్శింప నశోకుఁడు కుతూహలి యయ్యెను. తన సభికులు ప్రోత్సాహపఱుపఁగా సుగంధ ద్రవ్యవిక్రయి యగుగుప్తునియొక్క పుత్రుం డయినయుపగుప్తుఁ డనుముని నశోకుండు రావించెను. బుద్ధుఁడు నిర్వాణంబు నొందినపిమ్మట నొకశతాబ్దమునకు జన్మించు నని మహనీయులు దూరదృష్టిబలంబున వచించియున్నప్రకారము

ఉపగుప్తుఁడు జననంబొందియుండెను. అశోకుఁడు పిలిపించునాటికి మధుర సమీపారణ్యమం దున్న "ఉరుమంద" యనుకొండయం దాయన వసించు చుండెను.

ఉపగుప్తుఁ డశోకుని యొద్దకు వచ్చుట.

అశోకునియాహ్వాన మంగీకరించి యాయన 18,000 భక్తులు వెంటరాఁగ యమునాగంగానదులమీఁద నావలలో బహు వైభవంబుతో యాత్రచేసి పాటలీపుత్రమున కేతెంచెను. అచ్చట వా రందఱును ఉపగుప్తుని జాల బహూకరించిరి.

అశోకుడు పుణ్యయాత్రకై వెడలుట.

మహాత్ముఁ డైనబుద్ధుఁ డేయే స్థలంబులను దనయునికిచేఁ బావనంబు చేసెనో యట్టి పుణ్యక్షేత్రంబుల సందర్శించి వాని నాచంద్రార్కంబుగ వెలయింపఁజేయుటకై యాయా క్షేత్రములయందు శిలాదుల స్థాపింప నిశ్చయించుకొంటి నని యశోకుఁడు ఉపగుప్తునితో విన్నవించెను. ఉపగుప్తుఁ డంగీకరించి యాయనకుఁ దాను మార్గదర్శిగ నుందు నని వచించెను. ప్రబలసేనాసమేతుం డై యశోకుఁడు సక్రమంబుగ నాయాపావనక్షేత్రంబులను బ్రహ్మానందంబుతో వీక్షించెను.

లంబినీవనమును దర్శించుట.

అశోకుఁడు ప్రప్రథమమున లంబినీవనమును దర్శించెను. దర్శించుచుండగాఁ నుపగుప్తుఁ డశోకునిం జూచి "వింటివా యిచ్చట గొప్పప్రభువును సర్వపూజ్యుఁడు నయినబుద్ధముని జన్మించెను. అమ్మహనీయుని గౌరవార్థంబుగ నిర్మింపఁబడినప్రథమభవన మిదియే కనుము. దీనిని జూచుటచే నమ్మహానుభావుని దర్శించినట్లే నేత్రము లానందమందుచున్నవి. అమ్మహాముని తాను జన్మించినక్షణముననె యేడడుగులు భూమిపై నడిచెను" అని శ్రుతపఱచెను. అంతటఁ దత్రత్యజనంబులకు లక్షబంగారు

నాణెంబుల ధర్మంబుచేసి యొకస్తూపంబును నిర్మింపఁజేసి కపిలవస్తునగరమున కశోకుఁడు వెడలెను.

పదఁపడి యశోకుఁడు బోధివృక్షమును సేవించి యచ్చట సువర్ణవర్షముం గురిపించినటుల నపరిమితదానంబు లొసంగి యొకయారామముఁ గట్టించెను. ఎచ్చోట బౌద్ధధర్మమును బ్రథమమున బుద్ధుఁడు సలక్షణంబుగఁ బ్రకాశింపజేసెను యట్టి "ఋషిపట్టణము" ను, (సారనాథము. ఇది కాశీనగరమునకుఁ జేరువనున్నది.) బుద్ధుఁడు నిర్వాణముఁ జెందినకుశినగరము నశోకుఁడు దర్శించి యటులనే యధిక దానంబు లొసంగెను. బుద్ధముని యెచ్చట బహుకాలము నివసించి తన బోధరసంబుచే శిష్యులచిత్తంబులఁ బల్లవింపఁజేసెను యట్టిజేతవనాశ్రమమును బుద్ధుని ప్రియశిష్యు లయినశారిపుత్రుఁడు, మౌద్గలాయనుఁడు, మహాకస్యపుఁడువీరలయొక్క సమాధులను నీయాత్రికులు గౌరవించిరి. తరువాత వక్కులమునిస్తూపముం జూచిరి. అచ్చట నశోకుఁ డొకరాగినాణెమును మాత్రము ధర్మము చేసెను. అశోకుఁ డట్లు చేయుటకుఁ గారణ మేమనఁగా బౌద్ధధర్మవ్యాపకమునకొఱకాముని శ్రమపడలే దనుటయు ఆయన లోకోపకారి కాఁ డనుటయుఁ గారణములు. బుద్ధుని నిత్యానుచరుఁడైనయానందునిస్తూపమునకుఁ బ్రణమిల్లి యాఱుకోట్లబంగారునాణెముల నశోకుఁడు దానం బొసంగెను.

బోధివృక్షమును సేవించుట.

ఋషిపట్టణముంజూచుట.

జేతవనాశ్రమమును దర్శించుట.

వక్కులమునిస్తూపమునుగనుంగొనుట.

ఆనందునిస్తూపము వీక్షించుట.

## (4) వీతశోకుని వృత్తాంతము.

*వీతాశోకుఁడు బౌద్ధమతమును ద్వేషించుట.*

అశోకుని తమ్ముఁడైనవీతశోకుఁడు జైనసిద్ధాంతముప్రకారము తీర్థంకరు లనఁబడుగురువులను సేవించుచుండి బౌద్ధసన్యాసులు సుఖాపేక్షఁ గలవా రనియు, శ్రమకు వెఱచువా రనియు నిందించుచుండెను. అతనిని బౌద్ధమతావలంబునిగఁ జేయవలె నని యశోకుఁ డధికప్రయత్నములు చేయఁగా నాయన బౌద్ధసన్యాసుల కశోకుఁ డెత్తువారిచేతిబిడ్డగా నున్నాఁ డని వీతాశోకుఁ డుల్లంఘించెను. కాఁబట్టి తనతమ్మునిఁ గపటోపాయము చేత బౌద్ధసంఘములోఁ జేర్పవలె నని యశోకుఁడు ద్యమించెను.

*వీతాశోకుఁడు బౌద్ధుఁడగుటకుఁజేయఁబడిన కపటోపాయము.*

ప్రభుచిహ్నములను ధరించునట్లు మంత్రులు వీతశోకుని మోసము చేసిరి. అటుల మోసముచేయుట కశోకుఁడు తాను మంత్రులను ప్రేరేపించియు వీతాశోకుఁడు లేని యధికారము వహించి రాజచిహ్నంబు లేల ధరింపవలె నని యాయనపైఁ బ్రచండకోపముఁ జూపి యతనికి నురిదండన తత్క్షణమె విధించి మంత్రులు వేడుకొనఁగా నాచారము చొప్పున సప్తదివసవిశ్రాంతి నొసఁగుచు నాయేడుదినములు రాజ్యమేలుట కంగీకరించెను. వీతాశోకుఁడు మరణదండనకు వెఱచి బౌద్ధధర్మ మవలంబించినయెడల నది తొలఁగిపోవు నని యెట్టకేలకు గ్రహించి తన్మతమును స్వీకరించెను. * స్థవిర

* కాలాశోకు డనఁగాఁ బ్రథమాశోకుఁడు పాలించుచుండఁగా జరిగిన ద్వితీయధర్మసభయం దీస్థవిరన్యాసుఁడు ముఖ్యాచార్యుఁడుగ వర్తించె నని సింహళదేశపుమహావంశపురాణమం దున్నది. కాలాశోకుఁడు కల్పితప్రభు వనియు, దీనిం బట్టి యె గతంబున విశదీకరింపఁబడిన మూఁడు

వ్యాసులు అను నాచార్యు లాయనకు మతదీక్ష నొసంగెను. వీతాశోకుఁడు భిక్షువగుట కంగీకరింపుఁ డని మతాచార్యుఁడు నొక్కి చెప్పఁగా నశోకుఁ డెట్టకేలకు సమ్మతించి యాయనకొఱకు రాజనగరమందే యొక యాశ్రమమును గట్టించెను.

వీతాశోకుఁడు భిక్షువగుట.

అయ్యాశ్రమమునుండి వీతాశోకుఁడు నిర్గమించి కుక్కుటారామపురమునకుం బోయి పిమ్మట విదేహనగరమును జేరి యచ్చట ముని యయ్యెను. కతిపయదినంబులకు వీతశోకుఁడు జీర్ణవస్త్రధారియై రాజనగరమునకు మరల రాఁగ నాతని నశోకుండు మిగుల గౌరవించి మహిమలను జూపుమని యాయనను బ్రార్థించెను. కాని యాయన చూపలేను. పిమ్మట రాజ్యప్రాంతములకు బహుదూరముగ నేగి వీతాశోకుఁ డచ్చట నేకాంతవాసిగానుండఁగా రోగపీడితుం డయ్యెను. అప్పు డశోకుఁ డాయనకు నౌషధములఁబంపి యారోగ్యవంతునిగాఁ జేసెను.

అశోకుఁడు పుండ్రవర్ధననగర వాసుల నురిదీయించుట.

అక్కాలంబుననె బంగాళీదేశమందలి పుండ్రవర్ధన నగరములో నుండు బ్రాహ్మణసన్యాసులశిష్యుఁ డొకఁడు బుద్ధస్వరూపశిలావిగ్రహోన్మూలనంబు గావించి నేలం బడవైచెను. అట్టిఘోరాపచారము నొనరించినందున నశోకుఁడు తన్నగరవాస్తవ్యులఁ బదునెనిమిదివేలమందిని నేకదివసంబున నురిదీయ నాజ్ఞాపించెను. అనంతరము కొన్ని దినంబులకుఁ బాటలీపుత్రమం దున్న యొక మాధుఁడు బుద్ధరూపవిగ్రహము నేలం గూల్చెను.

---

ధర్మసభలు జరిగియుండెననుట పుక్కిటిపురాణ మనియు, గ్రహింపందగి యున్నది.

ఆయపరాధిని వాని బంధుమిత్రవర్గంబును సజీవంబుగ నశోకుఁడు వీతి హోత్రున కాహుతిచేసెను. మఱియు బ్రాహ్మణసన్యాసిని బట్టియిచ్చినవానికి బహుమాన మిచ్చెద నని యశోకుఁడు ప్రకటించెను.

వీతాశోకుని దుర్మరణము.

అటులఁ బ్రకటింపఁగా నొకదినంబున రాత్రివేళ భిక్షువేషధారి యయిన వీతాశోకుఁ డొకగొల్లకొట్టములో నుండుట సంభవించెను. జడలు విరియఁబోసికొని మడ్డి వానివలెఁ గన్పట్టుచున్న యాభిక్షువును బ్రాహ్మణసన్యాసి యనుకొని యాయనను దెగటార్చి, యాయనశిరంబుఁ జూపి బహుమతిం బొందెద మని, యాయింటిభాగ్యశాలి తనభర్తకుం దెల్పెను. ఆయాలఁగాపరి యాలిమాటకుం జవదాటక వీతాశోకుని శిరంబు ఖండించి దాని నశోకుని సన్నిధిం బెట్టెను. అశోకుఁడు దానిం జూచి మిగుల వగచి నిశ్చేష్టుఁ డయ్యె.

అశోకుడు మరణదండనను గొట్టివేయుట.

అంతట మంత్రులు ప్రార్థింపఁగా నాప్రకటనను గొట్టివేసెను. మఱియుఁ దనరాజ్యమం దంతటనుండి మరణదండనయె లేకుండఁ జేసెను.*

ఫాహియాన్ యాత్రికుఁడు వ్రాసినపాఠాంతరము.

ఈపురాణమునకు "ఫాహియాన్" యాత్రికుఁడు వ్రాసిన పాఠాంతర మొకటి యున్నది. దానియం దాయన లిఖించిన దేమనఁగా—అశోకునితమ్ముని పేరు తెలియదు.' రాజగృహనగరపరిసరమందు "రాబందుగుట్ట" మీఁద నశోకుని తమ్ముఁడు సన్యాసిగ నివసించి యచ్చటనె ముని యయ్యెను.

పాటలీపుత్రమం దశోకుఁడుభూతములచే

అశోకుఁ డాయనను దననగరికి రమ్మనుమని

* మరణదండన నశోకుఁ డూచముట్టుగ నివారింపనటుల శాసనములు దెల్పుచున్నవి.

శిలాభవనంబుగట్టించుట. కోరఁగా ఆయన యంగీకరింపనందునఁ దన నగరమందె యాయనకొఱకు కొలగుట్ట నిర్మింపఁజేసెద నని వాగ్దాన మొసంగెను. ఆప్రకారమే తనవశమం దున్న దేవతాశక్తులకొఱకు నాహారపానీయముల నాయత్తంబుచేసి వాని నాకర్షించి "రేపటిదినంబున మీకు విం దొనర్చెదను. మీ రిచ్చటఁ గూర్చుండుటకుఁ బీఠంబులు లేవు. కావున మీరు వానినిఁ దెచ్చుకొనుఁ డని యశోకుఁడు వాని కానతిచ్చెను." అట్లనె మరుదినమునఁ బ్రతిశక్తియు నాలుగయి దడుగుల చదరముఁ గల యొకశిలను దెచ్చుకొనఁగా వానిని గూర్చుండ నియమించి తృప్తిగ విందొనరించెను. పదంపడి "మీరు మీమీపీఠములను గుట్టగా నిచ్చటఁ బెట్టుఁ డనియు నాగుట్ట కడుగుభాగమున 35 అడుగుల పొడవును, 22 అడుగుల వెడల్పును 71 అడుగుల యెత్తును గల శిలాభవనమును నిర్మింపుఁడు" అని యాశక్తుల కశోకుం డాజ్ఞాపింపఁగా నవి యటులనే యొనర్చెను.

హ్యూయాన్‌సియాంగు వీతాశోకునికి మారుగ మహేంద్రునివ్రాయుట. క్రీ.శ 7-వ శతాబ్దమందు పాటలీపుత్రనగరములోఁ దనకుఁ గన్పడినశిలాభవనమును గుఱించి విశదీకరించుటకొఱకుఁ బైనఁజెప్పినకథనే హ్యూయాన్‌సియాంగు "అను చీనాదేశయాత్రికుఁడు లిఖించెను. కాని యారాజసన్యాసి పేరు మహేంద్రుఁ డని వ్రాయుచు వీతాశోకునివిషయమై పైని లిఖింపఁబడినవృత్తాంతమునె తెలియపఱచెను రెండుకథలు నించుమించుగా నొకటిగానె యున్నవి.

---

## (5) మహేంద్రుని వృత్తాంతము, సింహళదేశీయులు బౌద్ధు లగుట.

అశోకరాజుయొక్క పాలనారంభమం దాయనతల్లికి వేఱొకపురుషుని వలనఁ గుమారుఁడు కలిగెను. ఆకుమారుఁడును గొప్పయింటివాఁడె. అతనిపేరు మహేంద్రుఁడు. అతఁడు దుర్వ్యయశాలి యై యమితంబుగ ధనమును వెచ్చించుచుఁ గ్రూరస్వభావుఁడై యుండెను. మఱియు రాజు నెగతాళిచేయునట్లు రాజవేషమును ధరించుచుండెను.

మహేంద్రునినడత

అంతట నాతనిచర్య ప్రజలకు మిక్కిలి వెక్కసంబుగ నుండెను. అశోకునితో మంత్రులు మందలింపుగ నిట్లు విన్నవించిరి. "దేవా! ఏలినవారితమ్ముఁడు తనకుం దగనివేషంబు ధరించి యతిగర్వియై ప్రవర్తించుచున్నాఁడు. రాజ్యపరిపాలన నిష్పక్షపాతంబుగ నున్నయెడలఁ బ్రజలు తృప్తిం జెంది రాజునం దనురాగముఁ గలిగియుందురు ప్రజానురాగంబువలన రాజునకు నెమ్మది దొరకును. పరిపాలనచట్టము లివి యని మాపూర్వులు మా కేమేమి తెల్పిరో వానిని భంగపఱచవలదనియుఁ జట్టములకు విరోధముగ నడచిన వారలను న్యాయదేవతకు బలియివ్వవలయు ననియు మాప్రార్థన".

మహేంద్రుని దుర్నడతనుమంత్రు లశోకునకుం దెల్పుట.

ఆవచనములను విని బహుదుఃఖితుండై సోదరుఁ డగుమహేంద్రునితో అశోకుఁ డిట్లనియె. "సోదరుఁడా! జనసంరక్షణ చేయుటకు వారసత్వము నాపూర్వులనుండి నా కాగతమయియున్నది. నీయందు నా కెంతప్రేమ, యెంతదయ కలదో నీ వెఱుంగవా? అది యంతయు నెట్లు మఱచితివి? నేను పాలనమునకు

అశోకుఁడు మహేంద్రుని గఠినముగ మందలించుట.

వచ్చి స్వల్పకాల మయినది. ఇప్పుడె చట్టముల నిర్లక్ష్యము చేసి వానిపట్టు నెట్టు సడలించెదను. నిను శిక్షింతు నేని మనపూర్వులను దుఃఖపెట్టిన వాఁడ నగుదును. శిక్షింపకుందు నేని జనులు నాపరిపాలనయెడల దురభిప్రాయపడుదురు. దానికి నేను వెఱచితీరవలెను.''

మహేంద్రుఁడు మహావిరాగియై యోగియగుట.

ఆమాటలు తనగర్వవ్యాధికి దివ్యౌషధంబు కాఁగా మహేంద్రుఁడు శిరంబు వంచుకొని యపరాధి నని యశోకునకు ప్రణమిల్లి యేడుదినములవఱకు శిక్షింపక విశ్రాంతియొసంగుమని యాయనను వేడెను. మహేంద్రునకు రుచ్యము లగు భోజనపదార్థములను, నితరసౌఖ్యములను గలుగఁజేయుచు నాయనను గటికి చీఁకటికొట్టులో నశోకుఁడు పెట్టించెను. మొదటిదినము కాఁగానె ''యొకదినంబు గడచినది యిఁక నాఱుదినంబు లున్నవి'' అని కావలివాఁ డఱచెను. ఇట్లాఱుదినంబులును వాఁడు కేక వేయుచువచ్చెను. ఏడవదివసంబున గతంబునకుఁ బశ్చాత్తాపంబును, ముందునకు మనశ్శుద్ధియు, మహేంద్రునకుఁ బూర్తియయ్యెను. ఇంతయేల యతఁడు యోగి యయ్యెను.

మహేంద్రునిమహిమ.

తనయందణిమాదిసిద్ధు లుండుటంజేసి గగనమార్గమున కెగసెను. అశోకుఁడు స్వయముగాఁ జీఁకటికొట్టు నొద్దకుఁ బోయి ''తమ్ముఁడా నీ వింతశీఘ్రముగ మహాత్ముండ వగుదు వని యూహింపఁజాలనైతిని. మహనీయుండవైనను నీవు నగరమందె యుండవచ్చును. కొండలకుం గుట్టలకుం బోవ నేల?'' యని వచించెను.

అశోకుడు శిలాభవనమును పాటలీపుత్రమందు నిర్మింపఁజేయుట.

అశోకునివచనంబులు విని మహేంద్రుఁడు ప్రాపంచకసుఖములు తనకు రుచింపవనియు, వాని యెడల విరక్తిం జెందితి ననియు, నేకాంత

వాసము నె తాను గోరుదు ననియుఁ బ్రత్యుత్తర మిచ్చెను. అశోకుఁ డందున కంగీకరించుచు నగరమందె యాశ్రమము కట్టించెద ననియు, రాజవంశ్యుఁడు పర్వతనివాసం బొనరించుట యుచితము కా దనియు, నశోకుఁడు మరలఁ జెప్పెను. అందున కాయన సమ్మతింపఁగా నశోకుఁడు భూతాకర్షణం బొనర్చి శిలాగృహంబు నిర్మింపఁజేసెను. గతంబున లిఖింపఁబడిన దీశిలాగృహమె.

కావేరి నదియం దుండు డెల్టాలో మహేంద్రుఁడు మఠము కట్టించుకొనుట.

తాను బౌద్ధుం డయినపిమ్మట మహేంద్రుఁడు దక్షిణహిందూస్థానమునకుం బోయి కావేరీనదియొక్క డెల్టా (రెండునీటిపాయలకును సముద్రమునకును నడుమనుండు భూమి) యందు మఠముకట్టించుకొని యందుండెను. పాడుపడియున్న యామఠము వేయిసంవత్సరములు కడచినపిమ్మటయును గనఁబడెను.

మహేంద్రుఁడు సింహళ దేశమునకుం బోవుట.

మహేంద్రుఁ డణిమాదిసిద్ధులు కలవాఁ డైనందున గగనమార్గంబున సింహళదేశమునకుం బోయి బౌద్ధధర్మము నచ్చటివారికిఁ జక్కఁగ బోధించె నఁట. సింహళదేశీయులమత సిద్ధాంతములు దూషితముగ నుండుటంజేసి మహేంద్రునిబోధ విన్నప్పటినుండి తమపూర్వదురాచారంబులను మాని బౌద్ధమతమును భక్తియుక్తులై యవలంబించిరి.

* బుద్ధుని నిర్వాణానంతర మొకశతాబ్దమునకు సింహళదేశీయులు బౌద్ధులయి రని హ్యూయాన్సియాంగు వ్రాసెను.

---

* అశోకావదానగ్రంథమం దున్నట్లె హ్యూయాన్సియాంగు యాత్రికుఁడు బుద్ధునియనంతర మొకశతాబ్దమున నశోకుండు వచ్చె నని లిఖించెను. సింహళపురాణముప్రకార మాకాలమునకు కాలాశోకుఁడు వచ్చె నని చెప్పవలెను. కాలాశోకుఁడు కల్పితప్రభు వని గతంబున లిఖింపఁబడియున్నది.

## (6) అశోకుని పుత్రుండైన కునాలుని వృత్తాంతము.

కునాలుని గ్రుడ్లుతోడంబడిన యీచోట నశోకుడు జ్ఞాపకార్థము కట్టించిన దని యొక స్తూపమును క్రీ. శ. ఏడవ శతాబ్దమందు యాత్రికుల కాప్రదేశవాసులు చూపిరి. కునాలునివృత్తాంత మీక్రింద లిఖింపఁబడుచున్నది.

స్తూపము

తనప్రాణప్రియయుఁ బతివ్రతయు నైన "యసంధిమిత్ర" యనుభార్య గతించినపిమ్మట వయోవృద్ధుఁ డయ్యు నశోకుఁడు తిష్యనక్షత్ర యనునామెను బెండ్లియాడెను. ఆమె చంచలస్వభావము కలదియు, వ్యభిచారిణియు నయియుండెను. తనసవతి (అసంధిమిత్ర)యొక్క పుత్రుఁ డైనకునాలుని నేత్రసౌకర్యముం జూచి వలచి యామె యతనిపైఁ గన్నువేసెను. ఆమె తనకుం జూపుమహాభావవిలాసంబులను, విరహవేదనను గనుఁగొని కటకటంబడి పుత్రుఁడైన తను నట్లు వలచుట బహుపాపం బని తెల్పి కునాలుఁ డామెను నిరాకరించెను. తన చక్కఁదనమును, మక్కువను లెక్క సేయక యక్కునాలుఁడు ద్రుక్కఁజేసెనని మిక్కిలిగ నక్కాంత రోసంబూని యతనియెడల మోహంబు మాని ద్రోహంబుఁ బూనెను. కునాలుఁడు తన యోగ్యతచే నామె యయోగ్యత నణఁచినందున కామె యతని ప్రాణంబుఁ దీయుటకై గాఢగూఢాలోచనపరాయణియై బహుదూరమందున్నతక్షశిలానగరమునకు రాజప్రతినిధిగాఁ బంపుమని యశోకునితోఁ దీనియలోలుకుపలుకులం బల్కెను. అశోకు డామెమాటలఁ బాటించి కునాలుని రాజప్రతినిధిగాఁ బంపుచు "ఏయుత్తరువులమీఁద నాదంతచిహ్నములు కల ముద్రయుండునో

తిష్యనక్షత్ర తనసవతి పుత్రుని మోహించుట.

ఆమెద్రోహచింతన

యవియే నాయుత్తరువు లని నమ్ముము" అనిని పుత్రునకుం జెప్పెను. తిష్యరక్షిత మట్టుమీఱినపగ దిట్టంబుగఁ దనమనంబున నెట్టుకొన కునాలునిఁ జంపుటకు సమయము చూచుచుండెను. కొన్ని నెల లయినతర్వాత తక్షశిలయం దున్న మంత్రివర్గంబునకు తిష్యరక్షిత, యశోకుఁడు పంపినట్లుగ లిఖితరూప మయినయొకయుత్తరువును బంపెను; దానిమీఁద రాజకీయమైన యెఱ్ఱనైనపుముద్ర వేసెను; మఱియు నశోకుఁడు నిద్రించుచున్నప్పుడు రహస్యముగా దానిపై నశోకునియొక్క దంతచిహ్నములతో ముద్ర వేసెను. ఆలిఖిత మేమనఁగా "మంత్రులారా! యీనా యాజ్ఞ మీకు. అందఁగానె నాపుత్రుఁ డైనకునాలునియొక్క నేత్రంబులఁ బెకలించి మరణించుటకై యాతని, నాతనిభార్యను పర్వతములకుం దోడ్కొని పోయి విడువుఁడు." ఆలిఖితము తమకుఁ జేరఁగానె మంత్రులు విభ్రాంతినొంది నిశ్చేష్టులై కొంతసే పేమియుఁ దోఁచకయుండిరి. వారి తొట్రుపాటుం జూచి కారణ మేమని రాజపుత్రుండు వారి నడుగఁగా వారులిఖితం బంతయుఁ దెల్పి. "దేవా! ఈలిఖితంబునకుఁ గారణంబు కానరాదు. ఇది ద్రోహకృత్యంబుగ మాకుం దోఁచుచున్నది. ప్రభువునకుఁ దెలియపఱచి వారియుత్తరువు మరలవచ్చునంతవఱకు మిమ్మునఁ జెఱసాలయం దుంచెదము. అని విన్నవించిరి." అంతట "మంత్రులారా! జాగుసేయవలదు. రాజాజ్ఞ చెల్లితీరవలెను. ఇది నాజనకుండు పంపినయుత్తరువె యయినందు కాయన దంతచిహ్నంబు లీలిఖితంబుపై నుండుటయె ప్రబలసాక్ష్యము. ఇది ద్రోహకృత్యము కాదు." అని రాజపుత్రుండు పలికి దుర్మార్గుఁడైన చండాలు నొకనిఁ బిలిపించుకొని గ్రుడ్లుతోడించుకొనెను. రాజాజ్ఞ నిట్లు చెల్లించి భార్యాసమేతుఁడై యంధుఁడై

తిష్యనక్షత్రయొక్క ద్రోహకృత్యము.

కునాలుఁడు రాజాజ్ఞ ప్రకారము కన్నులఁ దోడించుకొనుట.

రాజకుమారుఁడు భిక్ష మెత్తుకొనుచు దేశములోఁ దిరుగుచుండెను అటుల సంచరించుచు బహుప్రయాసలు పడుచుఁ బాటలీపుత్రము వా రిరువురు చేరిరి. అచ్చట రాజపుత్రుఁ డిట్లు విలపించెను. “అయ్యో! చలియు నాకలియు న న్నెంతపీడించుచున్నవి. గతకాలంబున రాజపుత్రుండనై యుంటిని. ఇప్పుడు భిక్షాపాత్రుండనైతిని. నన్నుం బ్రకటించుకొని నాకు ద్రోహం బొనరించినవారలు తగుశిక్షం బొందునట్లు చేసెదను.” ఎట్టులనె యా రాజన్యుఁడు నగరాంతఃపురములోనికిఁ బోయి యెలుఁగెత్తి యేడ్చి మనసునీరుచేయఁజాలు దుఃఖకరమయిన యొకపాటను బాడెను.

కునాలుఁడు భిక్షుకుఁడై పాటలీపుత్రముం జేరుట.

అశోకుఁడు మేడపై నొకగదిలో నుండి యా పాటను విని యా యొద్దికయు, గంఠస్వరమును, దనతనయునిదిగ నూహించి యా గాయకునిఁ బిలిపించెను. అతనిం జూడఁగానె తనపుత్రుం డని యెఱింగి నేత్రవిహీనుండై, భిక్షుకుఁడై యుండుటఁ గనుంగొని దుఃఖసాగరంబున మునింగి “తండ్రీ, ని న్నిట్టి దురవస్థపా లెవరు చేసిరి” అని యశోకుఁ డడిగెను. రాజపుత్రుఁడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. “జనకా! తల్లిదండ్రులయందు నే నేమొ భక్తిలోపంబుఁ జేసితిని. దానం జేసి నా కిట్టి దురవస్థ దైవికంబుగ సంభవించెను. నాయందుఁ గలదయచేత గతకాలంబున నొకయుత్తరువు తమరు పంపితిరి. ఆయాజ్ఞను మీఱుటకు శక్తుండను గాఁజాలక విధించినశిక్ష ననుభవించితిని.”

అశోకుఁడు కునాలునిం జూచి దుఃఖించుట.

అదియంతయు తిష్యరక్షిత చేసినమోసకృత్యమును, ద్రోహమునుఁగా గ్రహించి యశోకుఁ డామెను జీవసహితంబుగనె కాల్పించెను. మఱియు నాద్రోహ

తిష్యరక్షితను

గాల్పించుట. కృత్యముతో సంబంధించినవారి నందఱిని కొద్దివారిని, గొప్పవారినిఁ దగినశిక్ష నాయన చేసెను. దోషు లయిన సామాన్యజనులను వధించె నని యొకగ్రంథమును హిమాలయ పర్వతములమార్గమున ఖోటెన (Khoten) ఎడారులకు వారు బంపివేయఁబడినట్లు మఱియొక గ్రంథమువల్లను దెలియుచున్నది.

ఘోషనామధేయుఁడగు మునిని నశోకుఁడుదర్శించుట.

మహాబోధివృక్షసమీపమం దున్నమఠములో నివసించుచున్న "ఘోష" నామధేయుం డగుమహాయోగియొద్దకు కునాలుని వెంటఁబెట్టుకొని వెళ్లి యశోకుఁడు తనకొడుకునకు నయనంబు లొసంగు మని ప్రార్థించెను. బౌద్ధు లందఱు తన సన్నిధికి రావలె ననియు, వచ్చునపుడు ప్రతిమనుష్యుఁడు నొకపాత్రను దేవలయు ననియు బౌద్ధధర్మబోధను దనవలన వినవలె ననియు నయ్యోగిపుంగవుం డశోకునితోఁ బల్కెను. పురుషులు, స్త్రీలు, బహుజను లటులసమకూడిరి, వా రాబౌద్ధయోగి చేసినధర్మబోధను శ్రవణంబు చేయఁగా వారి నేత్రములనుండి నిర్గమించిన యానందబాష్పముల నాయన యాజ్ఞప్రకారము తమహస్తంబుల నున్నపాత్రముల నింపిరి.

కునాలునికి మరల నేత్రంబులు లభించుట.

ఆపాత్రలలో నున్నబాష్పజలం బంతయు నొకసువర్ణపాత్రలోఁ బోసి యయ్యోగి యిట్లు వచించెను: "నేను బోధించినదంతయు బుద్ధముని చేసియున్న బోధలలో నత్యద్భుతమైనది గాదేని, నేను బోధించినదానిలో దోష ముండెనేని యిప్పుడున్నట్లె యీరాజపుత్రుం డంధుండై యుండుగాక లేనియెడల నీరాజపుత్రుఁ డీయుదకంబుతో నేత్రములఁ గడిగికొనినతోడనే యాతనికి నేత్ర

దృష్టి లభించుగాక" రాజపుత్రుం డంతట నాయుదకంబుచే నేత్రక్షాళనం బొనర్పఁగా దృష్టి కలవాఁడయ్యెను.

## (7) తిష్యనక్షత్రను గుఱించిన కథ.

అశోకునిభార్య యయినతిష్యనక్షత్ర తనసవతికొమారునితో నగమ్యాగమనం బొనరింపఁగోరి తనవలపు నాతఁడు నిరాకరింపగా నతనియెడలఁ గ్రోధంబుఁ బూని పగదీర్చుకొనఁ దఱివేచియుండె. అట్లుండ నశోకుం డక్కాలంబునఁ బ్రబలరోగపీడితుండై జీవించునటులఁ గనుపట్టకుండెను. ఆసమయంబున నశోకుఁ డస్వస్థచిత్తుఁ డైయుండుటంజూచి రాజాధికారము నామెయె వహించెను. అశోకుండును గొన్నిదినంబులవఱకు కామెకు సర్వాధికార మిచ్చెను.

తిష్యనక్షత్ర రాజ్యాధికారము చేయుట.

తనజాడ్య మనివార్యమనియు, దాను జీవింపననియుఁ దలఁచి తనపుత్రుఁ డయినకునాలునికిఁ బట్టాభిషేకముఁ జేయఁ గోరితి ననియు, నతని శీఘ్రముగఁ బిలిపింపు మనియు, తిష్యరక్షితతో నశోకుఁడు చెప్పెను. ఆమాటలు వినినతోడనే కునాలుఁడు సింహాసన మెక్కినయెడలఁ దా నెందునకును గాకుండఁ బోదు నని యామె తలఁచెను. కావున నశోకునితో నామె యి ట్లనియె! "ప్రాణనాథా! మీజాడ్యనివారణం బొనర్పఁగలను. కాని మీసన్నిధికి వైద్యు లెవ్వరును రాకుండునటుల నాజ్ఞాపింపవలెను." అశోకుఁ డట్లానతీయఁగా నీనగరమందు ప్రభువుయొక్క జాడ్యముం బోలు జాడ్యముచే బాధపడుచుండు పురుషునిఁ గాని, స్త్రీని గాని తనయొద్దకుఁ దీసికొనిరావలయు నని యామె ప్రచురపఱిచెను.

అశోకుఁడు వ్యాధిగ్రస్తుఁడగుట.

తిష్యరక్షితయశోకుని జాడ్యనివారణచేయుట.

అట్టిరోగముచే గొల్లఁ డొకఁడు శ్రమపడుచుండుట సంభవించెను. ఆగొల్లనిభార్య తనమగనితెగులు నొకవైద్యునికి సవిస్తరంబుగఁ దెల్పి వ్యాధిం దీర్పు మని ప్రార్థింపఁగా నాతఁడు రోగినిం జూచి జాడ్యము విమర్శించెద నని వాక్రుచ్చి పిమ్మట వానిం బరిశీలించి తిష్యరక్షితకడకుం గొంపోయెను. ఆమె వానిని రహస్యస్థలంబునఁ జంపించి వానిగర్భకోశమును శోధింపఁజేయఁగా నన్నకోశములో నొకకీటకము కాన్పించెను. ఆమె యంతట దానిపై మిరియము, అల్లము వీనిరసముఁ బోయఁగా నది చావదయ్యెను. పిమ్మట నుల్లిరసమును దానిపైఁ బోయఁగా నది చచ్చెను. ఉల్లిగడ్డ తినినయెడల జాడ్యనివారణ మగునని యామె యశోకునికిం జెప్పఁగా క్షత్రియుఁడనైయుండి యుల్లి నెట్లు తిందు నని యశోకుఁడు చింతించెను. ఔషధముగాఁ దినుమని యామె చెప్పెను. అశోకుఁ డటులనెఁ జేసి యారోగ్యముం జెందెను. *

## (8) అశోకుని వార్ధక్యము.

బౌద్ధసంఘముకొఱ కశోకుఁ డమితవ్యయము

బౌద్ధకైంకర్యమునకు శతకోటిసువర్ణనాణెముల నొసంగ నిశ్చయించుకొన్నవాఁడై యశోకుఁడు తనకు వృద్ధత్వము వచ్చునప్పటికిఁ దొంబదియాఱుకోట్ల నాణెముల సమర్పించియుండెను. తనమరణము

---

* గంగానది ప్రవహించుప్రదేశమం దుండువార లుల్లిని గాని, వెల్లుల్లిని గాని దిన రనియు, చండాలులు మాత్రము తినెద రనియు "ఫాహియాన్" యాత్రికుఁడు వ్రాసియుండెను. ఆయాచార మిప్పటికినిఁ గలదు. గొప్పకులములవారు వానిలోనిపదార్థము మాంసముం బోలు నని తలఁచెదరు.

చేయుట.

నకుఁ బూర్వము తనప్రతిజ్ఞను నెఱవేర్చుకొన వలెనని తా నింక సమర్పింపవలసిననాలుగు కోట్లను జెల్లించుటకై తననగరమం దున్న "కుక్కుటారామ" మనుమఠమున కనుదినమును వెండిబంగారముల నమితముగఁ బంపుచుండెను. ఆకాలంబున కునాలునికొడు కనఁగా నశోకునిమనుమఁ డయిన "సంపాది" యువరాజుగా నుండెను. * అశోకుఁ డమితధనవ్యయమువలన క్షీణించుచున్నాఁడనియు, నింక నిట్టులనే చేయుచుండినయెడలఁ బరరాజుల నెదిరించుటకుఁ గాని, తనరాజ్యమును రక్షించుకొనుటకుఁ గాని, శక్తుఁడుగా నుండఁడనియు, మంత్రులాయువరాజునకుఁ దెలియఁజేసిరి.

అశోకుఁడు మృణ్మయపాత్ర యందు భుజించుట.

కాఁబట్టి యాయువరా జశోకుని కిఁక మీఁదట ధనం బీవల దని కోశాధికారి (ఖజాన్జీ) కాజ్ఞాపించెను. ఇట్లు ద్రవ్యాభావంబునకు మిగుల వగచి తనప్రసాద పాత్రలను మొదట స్వర్ణపాత్రను, బిమ్మట రజతపాత్రను బదఁపడి యయోమాయ (ఇనుప) పాత్రను, గ్రమంబుగ మఠంబున కిచ్చివేసెను. తుదకు మృణ్మయపాత్రలో నశోకుఁడు భుజింపవలసివచ్చెను.

అశోకుఁడు కుక్కుటారామమఠమున కామలకంబుబంపుట.

అశోకుఁ డంతట జింతాక్రాంతుఁడై తనపరిజనంబు చేయు నగౌరవంబునకు మిగులఁ గినిసి యీరాజ్యమునకుఁ బ్రభు వెవ్వఁ డని తనమంత్రుల నడిగెను. "మహా రాజా! మీరె ప్రభువులు" అని వారు విన యవిధేయతలతోఁ బ్రత్యుత్తర మిచ్చిరి. అశోకుఁడు తనకన్నీరు మున్నీరుగాఁగ దుఃఖిం

---

* సంపాది జైనమతాభిమాని యయినట్లు జైనపురాణములయం దున్నది కాని తగుసాక్ష్యము దొరకలేదు.

చుము “మంత్రులారా! ముఖస్తుతిగ మీ రేల యసత్య మాడెదరు. నేను రాజ్యభ్రష్టుఁడ నయియున్నాను. నా కిప్పుడు నీచదశ వచ్చినది. నా చేత నున్న యీ యామలకఫలము (ఉసిరికాయ) తప్ప నాసొత్తని నే నెరుల కియ్యఁగలిగిన దెద్దియు లేదు.” అని పలికెను. పిమ్మట నశోకుఁడు తనచేత నున్నయీయామలకఫలమును “కుక్కుటారామ” మఠమునకుఁ బంపి మఠస్థుల కిట్లు తెలియఁజేసెను. “మఠస్థులారా! మీకు నేను పంపఁగల కడపటివస్తు విదియే. భరతఖండాధీశుని గతి యిటుల నున్నది. నారాజత్వమును, నాయధికారము నన్ను విడిచిపోయినవి. నన్ను వ్యాధి యాశ్రయించినది. ఔషధము లేదు. వైద్యులు లేరు. మఠాచార్యసంఘము తప్ప నాకు వేఱు దిక్కు లేదు. నే నర్పించినయీఫలంబు నాకడపటిదానంబు కావున మీ రందఱును దానిని బంచుకొని యనుభవింపవేఁడెద.”

అశోకరా జింకొకసారి తనమంత్రి యయినరాధాగుప్తు నిట్లడిగెను: “మంత్రీ! యీదేశ మేలురా జెవఁడు?” “తండ్రీ! తమరె ప్రభువు లయియున్నారు” అని మంత్రి ప్రత్యుత్తర మిచ్చెను.

అశోకుఁడు మనస్సును నిబ్బరించుకొని యిట్లు వచించెను.

అశోకుడుమఠస్థులకుతనభూమి నంతయు ధారవోయుట.

(1) “ఇంద్రనీలమణులకాంతులను బ్రోవుపోసినట్లు ఈమున్నీరును మొలనూలుగఁ గలయీసాగరమేఖలను నానావిధభూషణంబులకు మూలంబులైనలోహగనులచే నలంకరింపఁబడినయుపరిభాగంబు గల యీరత్నగర్భను సమస్తజీవాధారకమయినయీసర్వంసహను నేను బౌద్ధసంఘమునకు ధారాదత్తంబుఁ జేసితిని.

(2) ఈమహాదానఫలంబుగ నే నింద్రపదవిం గోరను, బ్రహ్మపదంబుఁ గోరను. నదీవేగంబును మించి నశించునట్టి యీరాజ్యవైభవంబును గలనైనను గోరను.

(3) పరిపూర్ణమైన బౌద్ధధర్మమును విశ్వసించి నే నొసంగిన యీ దానమువలన నే నపేక్షించు ప్రతిఫల మెద్దియనఁ బరమమునులు కోరు జితేంద్రియత్వమే. దీనికి నాశం బుండను. *

అశోకుని నిర్యాణము.

అశోకుఁ డిట్లు వచించి దానపత్రమును లిఖింపఁజేసి ముద్రించి నిర్యాణంబు నొందెను.

బౌద్ధసంఘమువారివలన భూమి నంతయు మంత్రులు మరలఁ బడయుట.

బౌద్ధసంఘమునకు శతకోటి సువర్ణ నాణెముల నొసంగెద నని యశోకుండు చేసి యున్నవాగ్దానములో నాలుగు కోట్లింక నియ్యవలసియుండినందున మంత్రు లానాణెంబులను సంఘమున కిచ్చి భూమిని సంఘమువలన మరలఁ బడిసి యశోకునిపౌత్రుం

సంపాదిరాజగుట

డయినసంపాదిని సింహాసన మెక్కించిరి. అనంతర మాయనకుమారుఁ డయినబృహస్పతి రాజ్య మేలెను.

శా. హిందూసింహళబౌద్ధగ్రంథములు ధాత్రీశుం డశోకుండు భ
క్తిం దాతృత్వము సత్యశీలమును బ్రోదింగల్గి, భూతాళిచే
తం దాస్యంబును గొన్నవాఁ డనుచుఁ జిత్రం బౌగతిం దెల్పి, యా
నందం బిచ్చుఁ; జరిత్రకుం దగక యున్న న్నేటికాలంబునన్.

సింహళహిందూపురాణములయం దున్నవి యున్నట్లుగా విషయంబులిందు వ్రాయఁబడినవి. ఆ రెండుపురాణములే యొండొంటితో ననేక విషయములయందు భేదించుచునున్నవి. శాసనాదిగ్రంథములకు బొత్తిగ నను

---

* పాటలీపుత్రమునకు దక్షిణముగ నున్నయొక శిలాస్తంభము మీఁద నీభూదానము లిఖింపఁబడియున్న దని ఫాహియాన్ యాత్రికుఁడు వ్రాసెను. కాని యా స్తంభప్రదేశము కానరాలేదు.



ఏడు అంతస్తులమేడ - చాల్డియాలోని జిగ్గరటు ఇట్లుండును.

కూలింపవు. కాఁబట్టియే వానిని జరిత్రకారులు గ్రహింపరైరి. ఆపురాణములయినను అశోకుఁడు మహాశక్తిసంపన్నుఁడనియు, బౌద్ధధర్మాచరణమందు బహుపరాకాష్టఁ గలవాఁడనియు, విపక్షశిక్షాదక్షుండనియు, సాధుసజ్జనపక్షుండనియు, ఘోషించుచుండును. కడమయసంగతాంశములను జనువరలుపేక్షింపనగును.

———

# 13-వ అధ్యాయము.

## ఉపసంహారము.



అశోకుఁడు సహజముగ సుగుణకలితుఁడు.

బౌద్ధమతావలంబనమునకుఁ బూర్వ మశోకచక్రవర్తి యితరరాజులవలె రాజవినోదములయం దాసక్తిఁ గలిగి యనేకులయినతనసోదరులను వధించునంతటి క్రూరహంకారియై యుండె నని బౌద్ధపురాణములయం దుండెను. అశోకుఁడు బౌద్ధమత మవలంబించినపిమ్మట నట్టిదుర్గుణము లాయనయం దంతరించె ననియు, ఆపురాణములే తెల్పును. బౌద్ధమతముయొక్క ప్రాశస్త్యమును దదోపదేశకులయొక్క సామర్థ్యమును నిరూపించుటకై యట్టివ్రాఁతలను బురాణములయందు వ్రాసి రని యశోకచరిత్రకారుఁడు దృఢంబుగఁ బ్రతిపాదించెను. కావున అశోకుఁడు సహజముగ భూతదయాదిసుగుణములు కలవాఁడనియే చదువరులు గ్రహింపందగియున్నది.

బౌద్ధమతముచే అశోకునిసుగుణములు పెంపొందుట.

అశోకునియందు భూతదయాదిసుగుణబీజములు కళింగరాజ్యజయానంతర మాయనకుఁ గలిగినవిచారమువలన నంకురించినవి. అయ్యంకురములే యాయన బౌద్ధమత మవలంబించుటకుఁ గారణములై యుండును. బౌద్ధమతమును భూతదయాది సుగుణములనే మూలంబుగఁ గలదగుటచేఁ దదోపదేశంబువలనఁ బైనఁ జెప్పినభూతదయాద్యంకురములు అశోకునియందు ప్రబలి వృక్షంబులై సత్కార్యరూపఫలంబుల ననేకంబుగ ఫలించినవి.

అశోకునియందు భూతదయాది సుగుణములుండుటను నిరూపించుట.

అశోకునియందుఁ బ్రకాశించిన భూతదయాదిసుగుణములు చదువరులకుఁ గన్నులఁ గట్టినట్లగపడుటకై యీక్రింద విశదీకరింపఁబడుచున్నవి.

(1) భూతదయ—నరులకే కాక పశువులకును వైద్యశాలల నేర్పఱచి తన్నిమిత్తమై విదేశములనుండియు నౌషధులం దెప్పించి యీదేశమందు నాటింపంజేసెను. బాటసారులకు విశ్రాంతిభవనాదుల నమర్చెను. గొడవంబడియున్న బడుగులు బెడిదపు నేరములఁ జేసియున్నను వారల మన్నించెను. జీవహింసకు వెఱచి యుద్ధముల మానెను. జీవహింసను నిషేధించుచట్టముల ననేకములఁ జేసి తనసువారములలోఁ బెక్కు జంతువులఁ జంపనీఁ డయ్యెను. ఈమొదలయినవి అశోకునికిఁ గలభూతదయకుఁ బ్రబలసాక్ష్యంబులు.

(2) దాతృత్వము—పవిత్రక్షేత్రదర్శనకాలములయందును, ఇతరపుణ్యాదివసములయందును, అశోకునిచే నొసంగఁబడినయమితదానంబులే తార్కాణంబులు.

(8) పరమతసహనము—తా నవలంబించినమతము నే యితరమతములవారవలంబింపవలె నని పట్టుదలలేక వారలు తమతమమతధర్మములఁ జక్కఁగ ననుష్ఠించి తత్సారానుభవముకలవారైనచో నది చాలు నని తెల్పెను. తనమత మవలంబింపనివారలయెడ దౌర్జన్యముఁ జూపలేదు. మఱియు ఆర్యమతస్థు లయినబ్రాహ్మణసన్యాసులకును జైనమతశాఖవా రయినయజీవకులకును గుహాగృహదానములను జేసెను. అశోకునిపరమతసహనమున కివియే యనివార్యదృష్టాంతములు.

(4) బౌద్ధ ధర్మాచరణము—పైన నుడువఁబడినసుగుణములు బౌద్ధధర్మానుకూలములే యయియున్నవి. ఇవి గాక బౌద్ధధర్మమం దింక నేనిబంధనలు కలవో యవి యన్నియు యథావిధిగఁ బరమోత్సాహంబుతో నాచరిం

చెను. వానిలో ముఖ్యమయినవి పరిగణింపఁబడును. (1) పెద్దలను బ్రాహ్మణులను గౌరవించుట, (2) పుణ్యతీర్థయాత్రఁ జేయుట, (3) విరాగి యగుట, (4) మనశ్శుద్ధిఁ గలిగియుండుట, (5) సత్యముఁ బల్కుట, (6) బౌద్ధధర్మమును బరులకు బోధించి వార లాచరించునటులఁ బ్రోత్సాహపఱచుటయు, ఈకడపటిదానినే ధర్మదాన మనియు, దీనిని మించినదానంబు లేదనియు, బౌద్ధమత మెంతయుఁ దెల్పును. ఈధర్మదాన మశోకుఁడు విపులంబుగఁ జేసి యది దుర్వినియోగము కాకుండుటకై ధర్మాధికారుల నియమించెను. శాసనములఁ బ్రకటించెను. ఇంతయేల యశోకుఁడు దైవమహిమలు కలఁవాఁడని ప్రజలు భావించునంతటి వేగముగ నద్భుతకార్యము లనఁగాఁ జిత్రవిచిత్రస్తూపాదులను నిర్మింపఁజేసెను. శాసనములను బ్రహ్మాండములైనశిలలపైనను, శిలాస్తంభములపైనను జెక్కించెను. తాను భిక్షువయ్యెను. ధర్మోపదేశకులను బరదేశములకుఁ గూడఁ బంపెను. ఇ వన్నియు అశోకుఁడు నిజమయినబౌద్ధుఁ డనుటకు నిర్వివాదచిహ్నములు.

(5) నిరుపమానపాలనాపాండిత్యము—బౌద్ధధర్మమును దానాచరించుట యందుఁ బరులచే నాచరింపఁజేయుటయందును అశోకునియుద్యములకు దివారాత్రములు చాలెనా యనుటకుం దగియుండఁగ నించుమించుగ నాసేతుహిమాచలపర్యంతమహీమండలంబును జండశాసనుండై సర్వజనానురంజకంబుగఁ బరిపాలించుచు సైన్యత్వవస్థ, రాజ్యవ్యవస్థ, వ్యవసాయాభివృద్ధి కోశవృద్ధి యీవిషయంబులయందుఁ బాలుమాలిక లేక ప్రవర్తింపుచుండె. కావుననే స్వరాజ్యమం దంతఃకలహంబులు గాని పరరాజులు దండెత్తి వచ్చుట గానిసంభవింపదయ్యె. ఈమొదలగునవి యశోకునిపాలనాసామర్థ్యంబునకు నతర్క్యలక్ష్యంబు లయ్యె.

(6) శిల్పవిద్యాభిలాష—ఇలఁ గలసకలకళలకు నెల వనందగినయీభరతఖండంబునం దుండుశిల్పవిద్యాకౌశల్యమునకుం దోడుగఁ బరరాజ్యవిశే

షంబుల గ్రహించి శిల్పకారుల మఱియుఁ బ్రవీణులఁ జేసి జగన్మోహనములైన శిల్పకృత్యంబుల వెలయింపఁ జేసె. చూపఱకు నవి దేవతాకృత్యంబులుగఁ దోఁచె. ఈకృత్యంబులే యశోకుని శిల్పవిద్యాభిలాషకుఁ బ్రబల నిదర్శనంబులు.

పైన నుడువఁబడిన భూతదయాదిసుగుణము విశేషంబులంబట్టి యశోకుని బుద్ధివైభవంబు వేనోళ్లం బొగడఁదగియున్నది.

అశోకుడెల్లప్పుడు స్మరణీయుఁడనుట.

కనుక నే యొకగ్రంథకర్త యిట్లు వ్రాసెను. "అశోకుఁడు భరతఖండమునకుఁ జేసిన మేలు నేరాజును దనదేశమునకుఁ జేసియుండలేదు. యూరోపుఖండమం దుండు వాల్గానది మొదలుఁకొని ఆసియాఖండమందలి జపాను వఱకును సయాందేశము మొదలుకొని సైబీరియాదేశమం దుండు బెయికలుసరస్సువఱకును అశోకుని పేరు గౌరవింపఁబడుచుండుట యబ్బురముకాను. బహుజను లెవ్వనిని జ్ఞప్తియం దుంచుకొందురో యెవ్వని నామమును గౌరవంబుగ స్మరింపుచుందురో వాఁడె మహనీయుఁడైనచో అశోకుఁడు మహనీయుఁడె యగును. మఱియు నశోకుఁని రోమకచక్రవర్తియైన మహాశీజరు (Caesar) కంటెను, ఇంగ్లాండుదేశపు రాజయిన మహాచార్లెసు కంటెను ఘనుఁ డని తప్పక చెప్పవలెను" ఇట్లశోకుఁడు తా నానందహృదయుఁడై తనప్రజలనుగూడ నానందహృదయులం జేసెఁ గానఁ దననామంబును సార్థకపఱచుకొని తనప్రజలనుగూడ అశోకులఁ జేసె ననందగియున్నది. కావున నశోకుఁడు మన కెల్లప్పుడును స్మరణీయుఁ డైయున్నాఁడు.

అశోకునిచరిత్రనుండి కుటుంబపాలనధర్మం

బహుకుటుంబపాలనంబె రాష్ట్రపాలనం బగుం గావున రాష్ట్రపాలన ధర్మంబులు వ్యష్టికుటుంబములకు లఘుతరంబుగ ననుకూలించును. కావున ఈ చరిత్రం జదువుప్రతికుటుంబాధిపతియు అశోకునిధర్మం

మెఱుంగుట. బుల గ్రహించి యథాయోగ్యంబుగఁ గుటుంబ పాలనఁ జేసికొనఁ దగియున్నది.

పరమతగుణవిశేషంబుల బోధించుగ్రంథములఁ జదువువారును, ఉపన్యాసంబుల వినువారును, స్వమతమందు దురభిమానముఁ గలవా రయి రేని ఆవిశేషంబుల గ్రహింపక యామతముల నిరసించుటయు తమమత ముత్కృష్టమయిన దని చెప్పుకొనుటయుఁ దటస్థించుచుండును. ఇట్టు దురభిమానముచే సంభవించునట్టియీ బుద్ధిజాడ్యమునకు దివ్యౌషధప్రాయ మగు నొక్క ధర్మం బీయశోకునిచరిత్ర నుండి చదువరులు గ్రహింపవలయును. అ దెద్దియన పరమతసహిష్ణుతయే. ఏమతమందుఁ గాని కడ తేరుత్రోవలు లేక పోలేదు. నీతులు బోధింపఁబడక పోలేదు. కావునఁ దనమతమే యుత్కృష్టమైన దని యనుకొనుట గొప్ప ప్రమాదము. అన్యమతస్థు లధోగతిపా లగుదు రనుట కేవల సాహసమె యగును.

పరమతనిరసనము కూడ దనుట.

ప్రతిమతమందును ప్రాముఖ్యముగఁ జెప్పఁబడినకొన్ని ధర్మవిశేషంబు లుండును. అట్టివిశేషంబులు పరమతమందున్నమాత్రమున వానిని నిరసింపకూడునా? సుగుణ మేమతమందున్నను సుగుణమే యగును. దుర్గణము కానేరదు. కావున నట్టి సుగుణములు గ్రహించుట యెవనికైనను శ్రేయస్కరంబే. మఱియుఁ దా మెఱింగిన ధర్మంబును బరులకు బోధించుట యుత్తమమానవధర్మంబు. అట్టిబోధను బరుఁడు గ్రహింపలేకుండినను గ్రహించి యాచరింపకుండినను వానియెడలఁ గోపద్వేషా

అన్యమతధర్మవిశేషంబుల గ్రహింపవలెను.

ధర్మమును బరులకు బోధింపవలెను.

ములు వహించుట యనుచితంబు. వానియసమర్థతకును, నిర్గత్యమునకును, విచారపడి తగురీతిని వానికి మరల బోధించి వానిని బ్రోత్సాహపఱుపవల యును. ఇట్లొనర్చి తనవిధిని దాను నెఱవేర్చితి నని మాత్రము తుదకు సంతుష్టిం జెందవలెను. ఈచెప్పఁబడిన లక్షణంబు లన్నియు అశోకునియం దున్నవి. కావున భూతదయ పరమతసహనాద్యుత్కృష్టలక్షణబోధకం బయినయీ యశోకచరిత్రనుండి చదువరులు గుణవిశేషంబులను గ్రహించి మేలు వడయుదురుగాక.

చ. మతములు ధర్మసూక్ష్మముల మానుగఁ దెల్పును గాని వానికిన్
జతపడ దైకమత్యము విచక్షణఁ జేయఁగలేనివారు దు
ర్మత మని యందు రన్యము సమంజసధర్మము లెందునున్న సం
తత గ్రహణార్హములు బుధజనంబులు వాని గ్రహింతు రిందునన్.



# అశోకచరిత్రయొక్క తప్పొప్పుల పట్టిక.

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 7 | వంశంబు | వశంబు |
| 7 | 1 | ఇప్పటికి | ఇప్పటి |
| ,, | ,, | పారిశుద్ధ | పారిశుద్ధ్య |
| 9 | 17 | పేరుచే | పేరిచే |
| 12 | 17 | భరతఖండాదీశ్వరుండు | భరతఖండాధీశ్వరుండు |
| 14 | 5 | జ్యేష్ఠునిమీఁద | జ్యేష్ఠుఁడైన "సుమను"ని [మీఁద |
| 15 | 1 | విశేషంబులును | విశేషంబులను |
| 16 | 23 | భేదంబులు | ఖేదంబు |
| 17 | 2 | ఏలనన | ఏలయన |
| 18 | 14 | కలిగినజ్ఞానము | అశోకునికిఁగలిగినజ్ఞానము |
| 20 | 15 | బౌద్ధమతాంగమార్గము | బౌద్ధమతాష్టాంగమార్గం |
| 21 | 1 | సార్థద్వయ | సార్ధద్వయ |
| ,, | 14 | చేసియిుండపచ్చును | చేసియుండవచ్చును |
| ,, | 20 | అనివార్యములను | అనివార్యములును |
| 25 | 3 | కావించెను | కాపించెను |
| 27 | 16 | చలివేంద్రల | చలిపందిళ్ల |
| 29 | 13 | జేడకుండ | జెడకుండ |
| 36 | 9 | సంపత్తు | సంపద |
| 38 | 2 | త్రాళ్లు | త్రాళ్ల |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 44 | 8 | అశోకుండు | అశోకుండును |
| 45 | 3 | అభిప్రాయంబు | అభిప్రాయభేదంబుల |
| 48 | 15 | మంచూరియూ | మంచూరియా |
| 49 | 10 | ఇట్లుమతసిహనము లె | ఇట్టిమతసహనము నె |
| 51 | 4 | ననియించుమించుగ | ననియునించుమించుగ |
| 52 | 7 | ప్రసిద్ధి | ప్రసిద్ధ |
| 53 | 12 | వృతాంతము | వృత్తాంతము |
| 54 | 10 | ప్రదేశ | ప్రవేశ |
| 56 | 12 | తెలిపెడి | తెలివిడి |
| 59 | 4 | ఏలనో | ఏలయొ |
| ,, | 8 | పషరిత్తు | పరిషత్తు |
| 67 | 1 | 7 రునంము | నం 7 రు |
| ,, | 7 | సత్వము | సత్యము |
| 68 | 2 | వృత్తాంతము | వృత్తాంతము.— |
| 71 | 1 | తత్వ | తత్త్వ |
| ,, | 7 | పరిణియంబు | పరిణయంబు |
| 73 | 8 | వాయువ్య | వాయవ్య |
| ,, | 18 | ప్రసిద్ధములయిన | ప్రసిద్ధములయినవి |
| 75 | 9 | ఒసంగమని | ఒసంగుమని |
| ,, | 18 | కలుగఁజేసిరి | కలుగఁజేయఁబడెను |
| 76 | 5 | మాట్లాడు | మాటలాడు |
| 77 | 17 | దుర్ఘ | దుర్ఘట |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 78 | 12 | రాజ్యాధీనమయి | రాజ్యాధీనమయిన |
| ,, | ,, | సభయందు | మందిరమందు |
| 79 | 1 | విస్థానము | విస్థానమైన |
| ,, | 10 | భక్తుఁడే | భక్తుఁడీ |
| ,, | 17 | ఉన్నటు | ఉన్నట్లు |
| 80 | 13 | వాయవ్వ | వాయవ్య |
| ,, | 17 | ఇప్పటి | ఇప్పటి |
| 83 | 17 | తమ | తన |
| 90 | 21 | త్రోవ | త్రోవ. |
| 92 | 8 | అతిశంబు | అతిశయంబు |
| 95 | 12 | మైళ్లు | మైళ్లదూరమున |
| 96 | 1 | దక్షణ | దక్షిణ |
| 98 | 2 | ఇదివఱకె | ఈవఱకె |
| 107 | 14 | మహమ్ముదీయ | మహమ్మదీయ |
| 108 | 2 | వ ్ల | వల్ల |
| 109 | 12 | ఉపరి | పైగ |
| 110 | 9 | కనుపింవ | కనుపింప |
| 113 | 13 | కించిన్యానము | కించిన్న్యూనము |
| 115 | 4 | శత్రృ | శత్రు |
| 116 | 7-12 | ఇట్లే—దగియున్నది | (ఇట్లే—దగియున్నది.)[I] |

I ఈ 6 పఙ్క్తులలోని మాటలీ గ్రంథకర్తవి.

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 117 | 1-4 | శంకరారార్యులు— జాలఁడయ్యె. | [2](శంకరాచార్యులు— జాలఁడయ్యె.) |
| 118 | 17 | సత్య | సత్త్వ |
| 119 | 8 | దుర్యల | దుర్వల |
| 121 | 6 | నిర్మాణకులు | నిర్మాతలు |
| 121 | 9 | సిల్పులు | శిల్పులు |
| ,, | 10 | శాస్వతము | శాశ్వతము |
| 124 | 17 | ఉండును | ఉండెను. |
| 125 | 13 | సుబ్బ | సబ్బ |
| ,, | 22 | కనుగొనెను | కనుఁగొనెను. |
| 127 | 7 | తత్కాలిక | తాత్కాలిక |
| 130 | 7 | కనుపడి | కనఁబడి |
| ,, | 19 | పైనఁజెప్పిన | పైనిఁజెప్పిన |
| 134 | 7 | పరఱపు | పఱపు |
| 135 | 5 | చూపఱునకు | చూపఱకు |
| 136 | 19 | కోసరము | కోసము |
| 143 | 9 | ఉన్నది | ఉన్నవి |
| 143 | 24 | సిద్ధాపురయందు | సిద్ధాపురమందు |
| 146 | 7 | శాసనసంఖ్య | శాసనములసంఖ్య |
| 150 | 1 | కూలముగాఁకను | కనుకూలముగ |

[2] ఈ 4 పఙ్క్తులలోని మాటలీ గ్రంథకర్తవి.

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 150 | 10 | సవాత | సహిత |
| 152 | 9 | వం(డంగ | వ(డంగ |
| ,, | 22 | క్రీ-పూ 16, 17 | క్రీ-త 16, 17 |
| | | గంటము. | గంటము, |
| 157 | 8 | వారట్ల పేక్షించి | వారట్లు పేక్షించి |
| ,, | 11 | విషయమునందునవసరం | విషయమునందనవసరము |
| 158 | 9 | 1000, 500 | 1000—500 |
| ,, | 11 | 14000, 1000 | 1400—1000 |
| ,, | 23 | ఏర్పర్చుకొనెను | అశోకుఁడేర్పఱచుకొనెను |
| 159 | 2 | ఉండిరని | ఉండెనని |
| ,, | 16 | ఖండమును. | ఖండమునందు |
| ,, | 17 | ఉండిరి | ఉండెను |
| 165 | 3 | యరశం | యంశం |
| ,, | 7 | అనుక్రమణికగ | అనుక్రమముగ |
| ,, | 22 | దశ్శి | దర్శి |
| 167 | 2 | వానిని దెప్పించి | దెప్పింపఁబడి |
| ,, | 4 | రాజ | రాచే |
| 170 | 4 | ఫీనిని | దీనిని |
| | | యందును. | యందును, |
| 171 | 16& 17 | చిరకాలమంతరా యంబునొందకుండు గాత | యంతరాయంబునొం దకుండచిరకాలముం డుగాత |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 172 | 16 | తగినవారల | తగినవారలును |
| | | విచారించుటకు | విచారించుటకును |
| 173 | 5 | అయినది. | అయినది |
| 174 | 2 | వేటి | వేఁట |
| 175 | 21 | సత్తి | సత్త |
| 177 | 6 | నత్కృత్య | సత్కృత్య |
| 178 | 11 | మతమునకునుప | మతమునకనుప |
| 179 | 9 | జయమును | జయము |
| 180 | 2 | రాజ్య | రాజ్యప్రాంత |
| 181 | 1 | కనుపడదు | అగపడదు |
| 184 | 9 | విధులు | విధులనుగూర్చి |
| 185 | 4 | చేయుట | హెచ్చరించుట |
| 186 | 12 | పిలిపించెను | పిలిపించెదను |
| 183 | 2 | సం॥లు గడచినవి | (సం॥లు గడచినవి) |
| ,, | 22 | గుండవకరణము | గుండలీకరణము |
| 192 | 1 | గుహీ | గుహా |
| ,, | 2 | ఒసంగుట | ఒసంగుటను దెల్పును. |
| 195 | 21 | అసహాష్ణుకత | అసహిష్ణుత |
| ,, | 23 | నేయధోగతి | నేనధోగతి |
| 201 | 4 | ఉద్యమనములు | ఉద్యమములు |
| ,, | 7 | నటుల | నట్లు |
| 211 | 1 | నతంరము | నంతరము |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 211 | 7 | జౌద్ధ | బౌద్ధ |
| ,, | 8 | జగద్వితంబు | జగద్విదితంబు |
| 213 | 13 | శ్యాక | శాక్య |
| 214 | 14 | రాలం | రాలు |
| ,, | 15 | కండ్లపడ | కండ్లఁబడ |
| 217 | 16 | అశ్వర్థ | అశ్వద్ధ |
| ,, | 22 | వలవను | వలనను |
| ,, | 22 | కన్పెట్టెను | కనిపెట్టెను |
| 218 | 6 | డనునాయన | డునుఆయన |
| ,, | 10 | సత్కార్యంబు | సత్కారంబు |
| ,, | 11 | జేనెను | జేసెను |
| 221 | 7 | తాళజాఁలక | తాళఁజాలక |
| ,, | 24 | గత్యధీనయున్న | గత్యధీనమైయున్న |
| 222 | 2 | జన్మలెత్తఁగా | జన్మములెత్తఁగా |
| 223 | 5 | జగంబు | జగంబున |
| ,, | 7 | బుద్ధులును | బుద్ధులను |
| 225 | 6 | లిచ్ఛిరి | లిచ్ఛివి |
| 230 | 16 | కర్మ | కర్మము |
| 231 | 4 | కునుగుణముగా | కనుగుణముగా |
| ,, | 10 | వృష్ఠి | వ్యష్టి |
| 232 | 18 | మిన్మట | పిమ్మట |
| ,, | 20 | కనుపట్టును | కనుపట్టదు. |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 233 | 7 | సమ్యత్సంకల్పము | సమ్యక్సంకల్పము. |
| ,, | 17 | సమగ స్మృతి | సమ్యక్స్మృతి |
| 235 | 17 | వాచరించు | నాచరించు |
| 236 | 8 | వీట | వీటి |
| ,, | 21 | సద్యృత్తుల | సద్వృత్తుల |
| ,, | 22 | ఇంద్రియత్యము | ఇంద్రియత్వము |
| 239 | 16 | కొనినను. | కొనినను, |
| 240 | 19 | పరిమిత | పరిమితి |
| 242 | 20 | దర్పణము | దర్పము |
| ,, | 22 | బోధింపఁబడును | బోధింపవలయు |
| 243 | 11 | మెఱియు | మఱియు |
| ,, | 15 | వ్రయంబు | వ్యయంబు |
| 246 | 2 | సత్వము | సత్యము |
| ,, | 5 | ద్వేషికి | ద్వేషి |
| 249 | 18 | జన్మయంతయు | జన్మమంతయు |
| ,, | 23 | గల | గుల |
| ,, | ,, | వ్యక్తి | వృత్తి |
| 250 | 16 | కలదని | కలవని |
| 251 | 23 | న్యాయంబుగ్య | న్యాయ్యంబుగ |
| 253 | 10 | ఉండిరని | ఉండరని |
| ,, | 24 | పరాభిపా | పరాభిలాషా |
| 254 | 19 | వారికనికరించి | వారిఁగనికరించి |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 257 | 19 | కార్యంబు | కార్యంబులు |
| 260 | 10 | అవి | ఇవి |
| ,, | 12 | వర్ణనలు. | వర్ణనలు |
| 262 | 12 | చెడు | చెడ్డ |
| 263 | | కనుపింప | కనిపింప |
| 265 | 8 | ప్రజ్ఞ. | ప్రజ్ఞ |
| 266 | 12 | కుమార్తె | కుమారిక |
| 267 | 4 | మహద్వైభవము | మహావైభవము |
| 268 | 9 | నిజమయన | నిజమయిన |
| ,, | 23 | సింహాన | సింహాసన |
| 269 | 13 | లేఖను. | లేఖను |
| 270 | 9 | చెల్లెల | చెల్లెలి |
| 272 | 15 | కుమార్తె | కుమారి |
| 273 | 10 | జత్రువు | జత్రువ |
| ,, | 12 | ప్రతిష్టించెను | ప్రతిష్ఠించెను |
| 277 | 4 | కొమ్ము | కొమ్మ |
| 278 | 5 | ఈమె | ఆమె |
| 280 | 2 | వివాహారంబుగ | వివాహార్థంబుగ |
| ,, | 13 | విగతాశోకుండు | వీతశోకుండు |
| 288 | 15 | మహ | మహా |
| 189 | 7 | వీతాశోకుడు | వీతశోకుండు |
| 296 | 12 | మహాభావ | హావభావ |

| పుట సంఖ్య. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 297 | 1 | అనిని | అని |
| ,, | 15 | తెల్పి. | తెల్పి, |
| ,, | 20 | చిహ్మాంబు | చిహ్నాంబు |
| 299 | 3 | గ్రంథమును | గ్రంథమువల్లను, |
| ,, | 14 | అటుల | అటులు |
| 303 | 11 | దానిని | దీనిని |
| ,, | 16 | అట్లు-ఈ | అట్లుండీ |
| 306 | 3 | క్రూర | క్రూరా |
| ,, | 7 | ప్రాశస్త్వము | ప్రాశస్త్యము |
| 307 | 6 | నిమిత్తమ్మె | నిమిత్తమై |
| ,, | 24 | యధా | యథా |
| 308 | 18 | సైన్యత్వవస్థ | సైన్యవ్యవస్థ |
| 309 | 5 | సుగుణము | సుగుణ |
| 310 | 10 | సహిష్టత | సహిష్ణుత |
| 311 | 5 | దయ | దయా |

---

ఈ గ్రంథములోని సాధారణలోపములు సవరణచేయఁబడినవి. ఒకలోపమె పలుసార్లు కనఁబడినప్పు డొక్కసారియే సవరింపఁబడినది.

# ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురములు.

దేశాభ్యుదయమున కావశ్యకమగు విషయములందెల్లఁ బరిశ్రమజరుగుచున్న యిక్కాలమున భాషాభివృద్ధి కగ్రస్థాన మిచ్చుట ప్రధానమైయున్నది. సంఘముయొక్క సర్వావస్థల యందును, దేశముయొక్క అన్నిభాగములయందును, విజ్ఞానము ప్రచురింపఁ జేయుటకు భాషాసేవయే ముఖ్యసాధనము. సనాతనాఘుని కేతిహాసములు, ప్రకృతిశాస్త్రములు, అన్యదేశా దర్శనికగ్రంథములు, మహాపురుషుల జీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, ఆర్థిక శాస్త్రములు, వృత్తులును, పరిశ్రమలును, వాణిజ్యమును నడుపు విధమును దెల్పుగ్రంథములు, నవలలు, లేనిలోపమును ఆంధ్రభాషాభివర్ధనీసంఘము నివారింపఁ బ్రయత్నించుచున్నది.

ఈ కంపెనీ మూలధనము రు. 10,000.

## 1. భారతధర్మదర్శనము.

నిర్మలదేశాను రాగమునుఁ బ్రబోధించు పద్యకావ్యము. సుప్రసిద్ధుండగు నొకయాధునిక కవివరునిచే మృదుమధురముగ గానముచేయబడిన 109 పద్యము లిందుఁగలవు. వెల రు. 0-2-0 శాశ్వత చందాదారులకు. రు. 0-1-6 మాత్రమే.

ఈ క్రింది పద్యమునుబట్టి శైలియును, భావములును, గ్రహింపనగును.

చ॥ మతములుసొచ్చినిల్లు, జనమాన్యచరిత్రులు పుట్టినిల్లు, న
ప్రతిమ దయాశమాది గుణరత్నసమృద్ధికి రోహణాద్రి, శా
శ్వతనిరపాయ మోక్షఫల భాసురవల్లికి నాలవాలమయి
యతులవిభూతిఁబొల్తు విల నంబరొ! నీ సరిధన్యు లుందు రే?

1. విద్యాసాగరుని చారిత్రము.

గ్రంథకర్త - చెరుకువాడ వేంకటనరసింహారావు పంతులుగారు.

నిర్మలవిజ్ఞాన విశారదుండును, ననిర్వాచనీయ కళ్యాణ గుణాకరుండును, నార్తజనసంత్రాణ పరాయణుండునగు నిట్టి మహనీయుండు త్రికాలంబులం గలుగఁడంచు విబుధప్రపంచంబు సంభావింపం జెన్నారిన పుణ్యపురుషుని చారిత్రంబు. ఆంధ్ర భాషం జదువనేర్చినందుల కీపొత్తమొక్కండ సంపూర్ణ ప్రతి ఫలం బొసంగుటకుం జాలియుండు. 150 పుటల గ్రంథము. పట ముతో వెల రు. 0-9-0, చందాదారులకు రు. 0-6-0.

ఉ॥ కోపము లేదు, దీనజనకోటికిఁగొంగుపసిండి, యల్ల
లక్ష్మీపతి యార్తరక్షణ, నశేషకళాపరిపూర్ణబుద్ధి వా
ణీపతి, మానపౌరుష తృణీకృత వాసవు, డర్థికల్పకం
బీపురుషావతంసునకు నీశ్వరచంద్రున కెవ్వరీడిలన్॥

7. రామమోహనరాయల చారిత్రము.

గ్రంథకర్త - కొణకంచి చక్రధరరావు పంతులుగారు

నిర్మల బ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబుఁ గావించి, అనా

ధలగు యువతులనుబట్టి బలవంతముగఁ గాల్చివేయు సతియను భయంకరాచారంబు నడంచి తనమాతృభూమియగు భరత వర్షంబు నుద్ధరింపఁదత్పూర్వమెన్నఁడు హిందువులెవ్వరును వెళ్లుటకు సాహసింపని ఖండాంతరమున కనేక మాసములు మహార్ణవముపైఁ బయనమొనర్చి, యచట మనకొఱ కనేకోపన్యాసములిచ్చి, కార్యవిజయము నొందువఱకుఁ బట్టువిడువక తన దేశమాతకొఱకు పాటుపడుచుండిన మహాపురుషుని పూజ్యాచారిత్రము. 200 పుటల గ్రంథము. పటములతో వెల రు. 0-12-0, చందాదారులకు రు. 0-8-0.

## 8. స్వాతంత్ర్యదర్శనము.

గ్రంథకర్త - దుగ్గిరాల రామమూర్తి పంతులుగారు, బి.ఏ., ఎల్.టి.

జాన్ స్టూఆర్టు మిల్లు అను ఆంగ్లేయ పండితోత్తముని, "లిబర్టీ" అను సుప్రసిద్ధ గ్రంథముయొక్క భాషాంతరీకరణము. మనోవాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము, స్వాతంత్ర్య పరిమితి మొదలగు సాంఘిక శాస్త్రసిద్ధాంతము లీగ్రంథమునందు చరిత్రోదంతములతోడ విమర్శింపఁబడినవి. పాశ్చాత్యవాఙ్మయమునం దుత్కృష్టగ్రంథముగఁ బరిగణింపఁబడుచున్న యీ గ్రంథము సుబోధకముగఁ దెనిగింపఁబడినది. కాలికో కవరు 175 పుటలు. వెల రు. 0-12-0, చందాదారులకు రు. 0-7-0.

9. మహారాష్ట్రచరిత్ర.

గ్రంథకర్త - చిల్లరిగె శ్రీనివాసరావు పంతులుగారు.

ఒకప్పుడు భరతఖండమున కాభరణముగానుండిన మహారాష్ట్ర సామ్రాజ్య సంపాదకులైన శివాజీ మహారాజుమున్నగు వీరుల సచ్చరిత్రము, ప్రశస్తమైన యీరాష్ట్రనిర్మాణముయొక్కయు, ప్రవర్తనముయొక్కయు, దక్షిణదశయొక్కయు, కారణములు సహేతుకములుగ చర్చింపఁబడియున్నవి. శైలిసుబోధకమై ప్రస్తుతము మన దేశీయచరిత్ర పాఠకార్థులైన వారికి మహారాష్ట్రచరిత్ర సప్రమాణమైనదిగ నున్నది.

మహారాష్ట్రనిర్మాణకర్తల దివ్యచరిత్రములెగాక, శివాజీ, శంభాజీ, రామదాసుస్వామి, అహల్యాబాయి, తారాబాయి, బాజీరావు, పీష్వానారాయణరావు, మొదలగువారి 22 చిత్రపటములతోడను, భరతవర్షపు పెద్ద పటముతోడను, అనేక కథా విశేషములతోడను, రాజనీతి విచారణలతోడను, నీ గ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్య చదువరులకు రంజకముగను; విమర్శకులకు కావలసినంత చరిత్ర సామగ్రియు బొందుపరుపబడియున్నది. 500 పుటలు ప్రశస్తమగు కాలికోబైండు వెల రు. 1-12-0 చందాదారులకు రు. 1-4-0 మాత్రమే.

10. ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణ చరిత్ర.

గ్రంథకర్త.

మద్రాసు గవర్నమెంటు తెలుగు ట్రాంసులేటరు గారగు
గోటేటి కనకరాజు పంతులుగారు బి.ఎ., బి.ఎల్.

ఇంగ్లండు దేశీయుల రాజ్యపరిపాలన, నాగరికతయు, విపులముగ నిందు వర్ణింపఁబడియున్నది.

ప్రాచీన వృత్తాంతము, విదేశ రాజుల పరిపాలనము, స్వాతంత్ర్య నిర్ణయ మహాశాసనము, నిరంకుశ ప్రభుత్వమునకు పార్లమెంటునకు పోరాటము, ప్రజా ప్రభుత్వము, అమెరికా యుద్ధము, శిల్పకళల ప్రాభవము, పార్లమెంటు సంస్కారము, విక్టోరియా మహారాజ్ఞీ, కాలనీలు, హిందూదేశము స్వరాజ్యము మొదలగు విషయములు గలిగి సుబోధకమై యున్నది.

శైలి మృదుమధురముగను, వర్ణనలు మిగుల రసవంతముగను, కథాక్రమణిక హృద్యమముగను నుండి చరిత్ర కథనము కావ్యములకంటె నుత్కృష్టముగ చేయబడినది.

ఇందు 6 చిత్రపటములు 2 దేశపటములును గలవు. 300 పుటలు ప్రశస్తమగు కాలికో బైండు వెల రు. 1-4-0 చందాదారులకు రు. 0-12-0 మాత్రమే.

## ఆరోగ్య శాస్త్రము.

గ్రంథకర్త.

డాక్టరు - భో. పట్టాభి సీతారామయ్యగారు

బి.ఏ., యం.బి., సి.యం.

ఈ క్రింది సూత్రములను గమనింపుడు.

(1) ఆరోగ్యమును గాపాడుటకు వ్యాధి చికిత్సకన్న వ్యాధి నివారణమే శ్రేష్టతరమగు పరమసాధనము.

(2) దేహము వ్యాధులకు లోనగుటకు రెండు లోపము లుండవలెను.

(i) దేహ దౌర్బల్యము.

(ii) వ్యాధి కారణములగు సూక్ష్మజీవులను, విషకర పదార్థములను స్వారోగ్యరక్షణ విధానమును, గృహారోగ్య నిర్మాణమును, జక్కగ గమనించిన దేహ దారుఢ్యమును నిలు పుకొన గలము.

(iii) సూక్ష్మజీవు లాహార జలవాయువుల గుండా దేహ ములోనికి ప్రవేశించి సాంక్రామిక వ్యాధుల నుత్పన్నము సేయును.

4. ఆరోగ్య శాస్త్రమున నీ యంశములన్నియు చర్చిం పబడినవి.

'వాయువను' శీర్షిక క్రింద వాయువునందుండు కల్మషములును వాయువు ప్రచారమును దానివలని ప్రయోజనముల ను, వాయువును శోధించు విధమును, వివరింపబడినవి.

'జలమను' శీర్షిక క్రింద పానీయ జలమునకు మూలాధారము లును, వాని తారతమ్యములును జలమునందుండు రసాయన కల్మషములును సూక్ష్మజీవులును, జలమును శుభ్రపఱచు పద్ధతులను, శోధించు విధానమును, తెలియజేయబడినవి.

‘ఆహారమను’ శీర్షిక క్రింద ఆహార విధానము ఆహారాంశ
ములు, దేహమునకు వానివలని ప్రయోజనములు, వానియందుండు కల్మషములును, కల్మషములును నివారించు విధమును, ఆహార ద్రవ్యములును శోధించు నిర్ణయము విరళింపబడినవి.

‘గృహములను’ శీర్షిక క్రింద గృహముల నెట్టి స్థలములయందును, నెవ్విధమునను నేయే సూత్రములను గమనించియు గట్టవలెనో యవన్నియు వర్ణింపబడినవి.

మఱియు చెత్త మొదలగు వ్యర్థ పదార్థముల నెట్లు పరిష్కరింపవలసినదియు సాంక్రామిక వ్యాధులను అనగా మశూచి విశూచి జాడ్యములు తాపజ్వరము, బొబ్బ తెగులు, వాని కారణములు, వానిని నివారించు పద్ధతులును, అనుదిన మారోగ్య రక్షణమునకు మనము గమనింపవలసిన సూత్రములను ప్రజాసంఖ్య ప్రతిసంవత్సరము నెట్లు హెచ్చునదియు, భీమాకంపెనీలే నియామకములపై నాధారపడి యున్నదియు, ఇంకను దినదినము నాచరింపవలసిన యనేక ధర్మములును, సులభశైలిని సవిస్తరముగ రచింపబడిన ఈ గ్రంథము వెల రు. 1-4-0 చందాదారులకు రు. 0-12-0 మాత్రమే.

పునర్ముద్రణమందున్న గ్రంథములు.

(2) అగ్బరు చరిత్ర (3) పీష్వా నారాయణరావు (4) వివేకానందస్వామి జీవితము (5) సిక్కుల చరిత్ర.

ముద్రణమందున్న గ్రంథములు.

(13) చీనా చరిత్ర (14) ఔరంగజేబు చరిత్ర (15) పశుశాస్త్రము.

ముద్రింపబడవలసిన గ్రంథములు.

ఆంధ్ర చరిత్ర, అమెరికా చరిత్ర, జపాన్ చరిత్ర, మహారాష్ట్ర చరిత్ర 2వ భాగము, జ్యోతిశ్శాస్త్రము మొదలగునవి.

N. B. మా శాశ్వత చందాదారులకు 100 పుట పోస్టేజి గాక రు. 0-4-0 చొప్పున నిచ్చుచుందుము. రు. 0-4-0 ప్రవేశకట్నము చెల్లించవలయును. దరఖాస్తులు చేయువారు వివరముగ విలాసము వ్రాయవలయును. చందాదారులను చేర్చు యేజంట్లకు మంచి కమీషన్ యీయబడును.

మేనేజరు,
ఆంధ్రభాషాభి వర్ధనీ సంఘము, (లిమిటెడ్)
మచిలీపట్నం.

---

# అమృతాంజనము.

వెల సీసా 1 కి రు. 0-8-0, వి. పి. రు. 0-12-0.

నాగపురం వస్తుప్రదర్శన సభలో నొక పతకము బహుమానముగ నీయబడినది.

అమృతాంజనము:—తలనొప్పుల మాన్పును.

అమృతాంజనము:—వాయువుపోట్ల బాపును.

అమృతాంజనము:—పార్శ్వపు నొప్పుల బారదోలును.

అమృతాంజనము:—పోట్ల పోగొట్టును.

అమృతాంజనము:—బెణుకుల ఛేదించును.

అమృతాంజనము:—ఎమిడికల వెడలగొట్టును.

అమృతాంజనము:—వాపుల రూపుమాపును.

అమృతాంజనము:—దగ్గును తగ్గించును.

అమృతాంజనము:—దురదను తొలగించును.

అమృతాంజనము:— తేలుబాధను తీసివేయును.

అమృతాంజనము:—ధర తక్కువ లాభము మెండు.

లాభించకున్న సొమ్ము తిరిగి యివ్వబడును.

ప్రతి గృహమున యుండతగినది. వేల సీసాల విక్రయము.

అమృతాంజనము డిపో, ఫోర్టు, బొంబాయి.



# కేశవర్ధని.

ఇది మనోపరిశ్రమము జేయు విద్యార్థులు, ప్లీడర్లు, ఉద్యోగస్థులు, మొదలగువారికి సుఖనిద్ర విశ్రాంతినిచ్చును. మోహాలావణ్యములకు ప్రాపగుకురులను మనోహరముగ బెంచి కాపాడును. స్త్రీ పురుషులు వాడి తీరవలయును. 8 తు॥ నూనెగల సీసా 1 కి రు. 1-0-0.

## తామరతయిలము.

అన్ని విధములయిన తామరలను మాన్పును. అనేక వేలు విక్రయము. తామర నయముగాకున్న సొమ్ము తిరిగి యివ్వబడును. వెల డబ్బి 1 కి రు. 0-6-0.

### దంతచూర్ణము.

దుర్గంధములను బోగొట్టి పండ్లును ముత్యములవలె తెల్లగానుంచి గట్టిపరచును. వెల అతిచౌక బుడ్డి 1 కి రు. 0-2-0.

చిరునామా:—అమృతాంజనము డిపో
ఫోర్టు, బొంబాయి.

## ఆంధ్రపత్రిక.

ఈ పత్రిక ఆంధ్రి స్త్రీ పురుషులు చదివి తీరవలయును. ఒక్కసారి చదివినవారికి ఎల్లప్పుడు చదువ వలయునను గోరిక పుట్టక తప్పదు. చక్కని వ్యాసములతోను, వార్తలతోను, హాస్యములతోను, వినోదములతోను నిండియుండి చదువరులకు విందొనరించుచుండును. ఆంధ్రిపత్రిక అన్నింటిలో చవుకయిన పత్రికయే కాక ఎక్కువ వార్తలతో నిండియుండును. ఆంధ్రిభాషలో దేశభక్తుల పటములను బ్రకటించు పత్రిక ఆంధ్రిపత్రిక యొక్కటియే. ఒక్క పత్రికను ఉచితముగ తెప్పించుకొని చదువుడు ఆ పయిన మీరే చందాదారులు కాగలరు.

చందా సం॥ ౧ కి ౨-౨-౦ ఆరుమాసములకు ౧-3-౦ లు

చిరునామా:—ఆంధ్రపత్రిక మేనేజరు గారు

ఫోర్టు, బొంబాయి.

## హిందూ సుందరి.

ఇది ప్రత్యేకము స్త్రీల ఉపయోగార్థము ప్రచురింపు చుండిన మాసపత్రిక. ఇందు ప్రతి మాసమునను విద్యావంతుల చిత్రపటములతో అనేకమంది స్త్రీలవలన వ్రాయబడిన చక్కని విషయములతో నెలకొకసారి ప్రచురింపబడుచుండును. చందా సం॥నకు రు. 2-0-0 మాత్రమే. కోరినవారి కుచితముగా మాదిరి పత్రిక పంపబడును. అది చూచిన అందలివిషయంచి మీకె దెలియ గలదు.

వలయువారు,

మానేజరు, హిందూ సుందరి

కంతేరు, కృష్ణాజిల్లా.

అని వ్రాయవలెను.

## స్వధర్మ ప్రకాశిని.

ఈ పత్రిక ప్రతిమాసము శుద్ధనవమియందు ప్రకటింపబడుచుండును. ఇందు ప్రధానముగ మత విషయములును, భాషా విషయికములగు సంస్కృతన్యాయములును, సుభాషితములు

ను, సంస్కృత కవుల చరిత్రలును, మొదలగునవి ప్రకటింప బడు చుండును. చందా సం॥కు రు. 1-8-0.

మానేజరు "స్వధర్మ ప్రకాశిని"

౬, సుంకువారి అగ్రహారం, S. C, మదరాసు.

---

ప్రఫుల్లముఖి (దేవీ చౌధురాణి).

ఇది గుణవతియగు నొక సతీమణి యొక్క పవిత్ర చరిత్రము. బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, వేదం వేంకటరాయ శాస్త్రిగారు మున్నగు పండితోత్తములు దీనిఁగూర్చి మిగుల పొగడి వ్రాసిరి. తీయని తేటమాటలతో మిక్కిలి సొగసుగా వ్రాయఁబడినందున ఇది చదువను చదువను ఇంకను చదువవలయుననియే యుండును. ఇందలి కథ అరేబియన్ నైట్సు కథలకంటె చమత్కారముగా నుండును. ఇది చక్కని నీతులను మిక్కిలి యింపుగా బోధించును కావున ప్రతి బాలికయును దీనిం దప్పక చదువవలయును. ఇందలి పరమాత్మ తత్వచర్చ ముముక్షువులకు కొంగు బంగారమువంటి దగును. దీనివెల పోస్టు కర్చులుచేరి ర్పా. 1-0-0, స్త్రీలకు 12 అణాలకే యీయబడును. వలయువారు "క. భాస్కరరావు, బీ.ఏ., రాజమండ్రి" అని వ్రాయనగును.

## సంగీతమఁట! రాదఁట!

సంగీతము ప్రతివానికిని వచ్చు విద్య కాదనియు, అందరికిని దెలియదనియు కొందఱనుకొనుచుందురు. ఇది శుద్ధాబద్ధము. ఇపుడు నూతనముగఁ బ్రచురింపఁబడిన 'గానసారము' అను గ్రంథముం జదువుఁడు. దాని సత్యము మీకే యెఱుకపడును. ఈ గ్రంథమును బోధించుటకు గురు వక్కఱలేదు. ఎవరికి వారే సులభముగ గ్రహింపఁగలరు. ఈ మార్గము అతి సులభము. అతి సులభము. వందల కొలఁది ప్రతులు విక్రయమగుచున్నవి. త్వరపడుఁడు. దీని వెల ఒక్క రూపాయ మాత్రమే.

### వి ష య సూ చి క.



బేతపూడి భగవంతరావు, బెజవాడ.

# ఆంధ్ర వచన భాగవతము.

శ్రీమన్నారాయణాంశ సంభూతుఁడైన వేదవ్యాస మహాముని సంస్కృతభాషను రచించిన శ్రీమద్భాగవతమును బమ్మెరపోతనామాత్యుఁడు గద్యపద్యాత్మకముగా రచియించుట లోకప్రసిద్ధంబుగదా. అయ్యది పద్యబహుళము గావున నందఱకును దానియర్థము గోచరింపకుండుటవలనను, మూలముకంటెఁ గొన్నివిషయము లధికముగాఁ జేర్పఁబడి యుండుటవలనను సులభశైలిని దెనుఁగున వచనకావ్యముగ సంస్కృతానుసారముగా రచియింపఁ జేసి ముద్రించి ప్రచురించుట యీకాలమున నవశ్య మని తలఁచి శ్రీకాళహస్తిలో నుండు బ్రహ్మశ్రీ, శతఘంటము వేంకటరంగ శాస్త్రులుగారిచే మూలమునకుఁ గొంచెమేనియు భేదము లేకుండ సులభశైలిని వచనముగాఁ దెనిఁగింపఁజేసి ముద్రించి ప్రచురింపఁ బూనితిమి.

గ్రంథమంతయు ముద్రించి కడపట నొక్కతూరిగాఁ బ్రకటించుటకంటె నవమస్కంధమువఱకు రెండు సంపుటములుగను, దశమైకాదశ ద్వాదశస్కంధము లొక్క సంపుటముగను మూఁడు సంపుటములుగా 1911 సంవత్సరము జనవరి, మే, సెప్టెంబరు నెలల కడపట మూఁడు పర్యాయములుగాఁ బ్రకటించినచో గ్రంథముఁ జదువువారికి శీఘ్రముగ గ్రంథావలోకనసౌకర్య

మును, గొంతవఱకైనను మాకు ముద్రించుటకు వలయు ద్రవ్య సహాయమును గలుగునని తలఁచి యీలాగుచేయఁబూనితిమి. డెమ్మి 8 పుటలసైజున మేలైన కాకితములమీఁద మంచి యక్షరములతో ముద్రించి దృఢమగు కాలికోబైండు కట్టించి చందాదారులు మున్నగువారికిఁ బంపుదుము. ఆంధ్రభాషాభిమానులగు సజ్జను లీగొప్పపనికిఁ బోషకులుగను జందాదారులుగను దోడ్పడి మాసదుద్యమము నెఱవేర్పఁ బ్రార్థించుచున్నాము.

చందా నిబంధనలు.

| | | |
|---|---|---|
| పోషకులకు | ... | రు. 12-0-0 |
| చందాదారులకు | ... | ,, 6-0-0 |

1910 సం॥రం డిశంబరులోపల మూల్యమంతయుఁ బంపువారు పోస్టేజి ప్రత్యేకమియ్య నక్కఱలేదు. పుస్తకమంతయు ముద్రించిన పిమ్మట వెల సుమారు రు. 7-8-0 కాఁగలదు గావునఁ జందాదారులకును నందు ముందు ద్రవ్యమంపువారికిని బైరీతి సౌలభ్యము గలిగింపఁబడినది. పోషకుల నామధేయములు మాత్రము పుస్తకములఁ బ్రకటింపఁబడును.

ఇట్లు,

వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్.

323, తండియార్పేట.

బ్రాంచీ:—ఉల్లితోట, రాజమంద్రి. 192, ఎస్ప్లనేడ్, చెన్నపురి.